భాగవతదర్శనము

# భాగవత కథ





: లేఖకులు :

శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి మహరాజు

భాగము 4

సాధన గ్రంథమండలి, తెనాలి

సాధన గ్రంథ మండలి, ౬౨.

శ్రీ భాగవత దర్శనము

# భాగవత కథ

(చతుర్థ ఖండము)

శ్లో॥ వ్యాసశాస్త్రోప వనతః సుమనాంసి విచిన్వతా।
కృతా వై ప్రభుదత్తేన మాలా 'భాగవతీ కథా'॥

గ్రంథకర్త:
శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారిగారు

అనువాదకుఁడు:
శ్రీరామశరణ్ కుందుర్తి వేంకటనరసయ్య



ప్రకాశకులు:
సాధన గ్రంథ మండలి, తెనాలి.

  [వెల రు. 2_0_0

ముద్రణ

దుర్ముఖి - విజయదశమి



**1956**

జానకిరాం ప్రెస్, తెనాలి.



---

## మహదవకాశము

"భాగవతకథా గ్రంథమాల" చందాదారులకు శ్రీరామశరణ్ కుందుర్తి వేంకటనరసయ్యగారి గ్రంథములు రు. 1-0-0 కు 0-4-0 లు తగ్గించి యీయబడును. వ్రాయునపుడు చందాదారు, నెంబరు నుదాహ పవలయును.



# అర్ధనారీశ్వర స్తోత్రమ్

శ్రీమచ్ఛంకరాచార్య విరచితమ్.

శ్లో॥ చామ్పేయ గౌరార్ధ శరీరకాయై
కర్పూర గౌరార్ధ శరీరకాయ,
ధమ్మిల్లకాయై చ జటాధరాయ
నమః శివాయై చ నమః శివాయ. ౧

శ్లో॥ కస్తూరికా కుంకుమచర్చితాయై
చితారజః పుఞ్జ విచర్చితాయ,
కృతస్మరాయై వికృతస్మరాయ
నమః శివాయై చ నమః శివాయ. ౨.

శ్లో॥ ఝణత్క్వణత్కంకణనూపురాయై
పాదాబ్జరాజత్ఫణినూపురాయ,
హేమాంగదాయై భుజగాంగదాయ
నమః శివాయై చ నమః శివాయ, ౩

శ్లో|| విశాల నీలోత్పలలోచనాయై
వికాసి పంకేరుహలోచనాయ,
సమేక్షణాయై విషమేక్షణాయ
నమః శివాయై చ నమః శివాయ. ౪

శ్లో|| మన్దారమాలా కలితాలకాయై
కపాలమాలాంకిత కన్ధరాయ,
దివ్యామ్బరాయై చ దిగమ్బరాయ
నమః శివాయై చ నమః శివాయ. ౫

శ్లో|| అమ్భోధరశ్యామల కున్తలాయై
తటిత్ప్రభాతామ్ర జటాధరాయ,
నిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ
నమః శివాయై చ నమః శివాయ. ౬

శ్లో|| ప్రపంచసృష్ట్యున్ముఖలాస్యకాయై
సమస్తసంహారక తాండవాయ,
జగజ్జనన్యై జగదేకపిత్రే
నమః శివాయై చ నమః శివాయ. ౭

శ్లో|| ప్రదీప్త రత్నోజ్జ్వలకుండలాయై
స్ఫురన్మహాపన్నగభూషణాయ,
శివాన్వితాయై చ శివాన్వితాయ
నమః శివాయై చ నమః శివాయ. ౮

శ్లో|| ఏతత్పఠేదష్టకమిష్టదం యో
భక్త్యా స మాన్యో భువిదీర్ఘజీవీ,
ప్రాప్నోతి సౌభాగ్య మనన్తకాలం
భూయాత్సదాస్య సమస్తసిద్ధిః. ౯




అనువాదకులు : లేఖకులు

# ఒక్క మాట

శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త జీబ్రహ్మచారిగారు రచించిన భాగవత కథా సంవిధానము భారతదేశములోని పండితులందరిచేతను ప్రశంసింపబడినది. ఉత్తరభారతమున విశ్వవిద్యాలయములును, ప్రభుత్వమును దానినంగీకరించి సమస్త గ్రంథాలయములచే కొనిపించినవి. అష్టాదశపురాణములలోఁగల సుత్కృష్టములు, నపురూపములుగనున్న భక్త, భాగవత, భగవత్కథలును, సాధనవిషయములును, అనేక యుత్కృష్టధర్మములు నిందు సవిమర్శముగను, సాకల్యముగను బొందుపఱుపఁబడినవి. ఇవి హిందీభాషలో నుండుటచే మన ఆంధ్రులకైనఁ దత్కథారసము నందఁజేయు సంకల్పముతో శ్రీ బ్రహ్మచారిగారి యాజ్ఞచేఁ దెనుగున ననువదింపఁబడు చున్నది. ఇప్పటికి సుమారు పదునాఱుభాగము లనువదింపఁబడినవి. కాని ఇంత వరకు నాల్గవభాగమువరకు మాత్రమే ముద్రింపగల్గితిమి.

ఇట్టి గ్రంథములను భక్తులును, భాషాభిమానులును మాత్రమే ఆదరించుచుందురు. కాని వీనిని సాధారణ బాల బాలికలును విద్యావంతులును, స్త్రీలును అర్థముచేసుకొను తేలికభాషలో వ్రాసినాము. గడచిన నిమిషము మరల మనకు రాదు. ప్రతినిమిషమును భక్త భాగవతకథాశ్రవణమున సార్థక మొనర్చుకొనుటపరమార్థము. అట్టి సత్కథాప్రచారమునుజేసి మేము తరించి యితరులకు తరణోపాయమును జూపించు నుద్దేశ్యముతోడనే యీ భాగవతకథ అనువదింపఁబడుచున్నది.

అయితే మనఆంధ్రులు దీనికి తగినప్రోత్సాహమొసంగుట లేదు. విద్వాన్ శ్రీబులుసు సూర్యప్రకాశశాస్త్రిగారును, మేమును

సాధనగ్రంథమండలిని స్థాపించి అనేక ఆధ్యాత్మికగ్రంథములను ప్రచురించుచున్నాము. దానికి తగినంత ప్రోత్సాహ మొసంగిన నెన్నిగ్రంథములనైన ప్రచురింపవచ్చును. మాప్రార్థనమేమనఁగా మీరు మాకు ఊరక ద్రవ్యమొసంగవలసిన పనిలేదు. పుస్తకమును దీసికొని ద్రవ్యసహాయము చేయుఁడు.

| | | |
|---|---|---|
| 1. సంస్థాపకులు | (శాశ్వతము) | 300-0-0 |
| 2. మహారాజపోషకులు | ,, | 116-0-0 |
| 3. రాజపోషకులు | ,, | 58-0-0 |
| 4. పోషకులు | (ప్రతి సంవత్సరము) | 25-0-0 |
| 5. సభ్యులు | ,, | 10-0-0 |

కావున మహాశయులును, ఉదారులును తగినంత మందిని చందాదారులుగఁ జేర్పించియు, జేరియు మాయీ సత్కార్యమునకుఁ జేయూత నొసంగుఁడు. ఆంధ్రలోకము తగిన ప్రోత్సాహమొసంగి మిగిలిన భాగములనుగూడ ప్రచురించుట కవకాశ మొసంగెదరని యాశించుచున్నాము. గ్రంథాలయములన్నియు వీటిని తప్పక కొని భక్తిప్రచారము చేయవలయునని ప్రార్థన. సంస్థాపకుల ఫొటో ఒకభాగమున మాత్రము ముద్రింపబడును. ప్రతిభాగమున పైతరగతుల వారి నామములు ముద్రించి, గ్రంథము లుచితముగ పంపబడును. సాధనగ్రంథమండలి ప్రచురణలుకూడా నుచితముగ పైతరగతులవారి కందరకు పంపబడును.

ఇట్లు
భగవద్భక్త చరణపరిచరణులు

దుర్మ్ముఖి
విజయదశమి

శ్రీరామశరణ్ కుందుర్తి వేంకటనరసయ్య
బులుసు సూర్యప్రకాశశాస్త్రి

# విషయసూచిక



---*---

శ్రీరామ

# భాగవతకథ

## అడవిగొల్లల కోడునట్లు శాపము

### ౬౦

శ్లో॥ సోఽహం నృపేంద్ర! రహితః పురుషోత్తమేన,
సఖ్యా ప్రియేణ సుహృదా హృదయేన శూన్యః।
అధ్వన్యురుక్రమ పరిగ్రహమంగ రక్షన్
గోపైరసద్భిరబలేవ వినిర్జితోఽస్మి॥

— శ్రీభాగ. ౧ స్కం. ౧౫ అ. ౨౦ శ్లో.

శా. కాంతారంబుననొంటిఁ దోడుకొనిరాఁగాఁ జూచి గోవిందు శు
ద్ధాంతస్త్రీలఁ బదాఱువేల మదరాగాయత్తులై తాఁకి నా
చెంతన్ బోయలు మూఁగి పట్టుకొన నాసీమంతినీసంఘమున్
భ్రాంతిన్ భామినిభంగి నుంటి విడిపింపన్ లేక ధాత్రీశ్వరా!

— శ్రీ మదాంధ్ర భాగవతము

ఛప్పయ.

రాజన్! హరినే తగ్యో ఘుట్యో బల మేరో సబరో।
గయే సుదినవే బీతి అంత అబ ఆయో హామరో॥
అస్త్ర న ఆవేఁ యాద శస్త్ర సబ భూల్యో అబ ఈ
పురుషోత్తమ తేఁ రహిత భయో గుణ గమనే సబ ఈ॥
గంగా తటపై తాపసీ, శాప క్రోధ కరి జో దయో!
సమ్ముఖ ఆయో ఆజు వో, అబలా సమ మైఁ లుటి గయో॥

అర్థము.

ధర్మరాజా! హరి నా బలము నంతను హరించెను. ఆ సుదినములు గడచిపోయినవి. మన కిపు డంత్యకాలము సమీపించినది. అస్త్రములు జ్ఞాపకము లేవు. శస్త్రము లన్నిటిని మఱచిపోయితిని. పురుషోత్తముఁడు లేకపోవునప్పటికి సమస్తగుణములు పోయినవి.

వెనుక ఒక తాపసి గంగాతటమున క్రోధవశమున నాకు శాపమొసంగెను. అది నేఁడు అనుభవమునకు వచ్చినది. నేను అబలవలెనై ఆటవికులచేఁ గొల్లగొట్టఁబడితిని.



విధి విడంబన మెంతటిది? కాలముయొక్కఁ కుటిలగతి యెట్టిది? లోకములో నన్ని వస్తువులు ఉన్నప్పటికిని మానవుఁడు దుఃఖముగఁ గనఁబడుచుండును. కొందఱు కేమియు లేకపోయినప్పటికిని సుఖులుగ నుందురు. యథార్థమునకు వస్తువులో సుఖము లేదు. అది సమయమునుబట్టి యుండును. ఒకప్పుడు సుఖకరముగనున్న వస్తువే మఱొకప్పుడు దుఃఖములకు ఉత్పత్తిస్థాన మగుచుండును. ఒకప్పుడు దేనిమూలమున విజయమును బొందెదరో, వేఱొకసమయమున దాని మూలముననే పరాజయమును బొందఁగలరు. అర్జునుఁడు గోప భిల్లులచే నోడిపోయిన సంగతిని విని ధర్మరా జాశ్చర్యచకితుఁడై అర్జునునితో నిట్లనెను:— "అర్జునా! దస్యులు నన్ను దోచుకొనిరనియు, వారిచేఁ బరాజితుడనైతి ననియుఁ జాలసారు లంటివి. ఇది యెప్పుడు జఱిగిన విషయము? ఇదివఱకీ విషయ

మును మాతోఁ జెప్పలేదే? ద్వారకానగరమునుండి వచ్చు నప్పుడు జరిగినదా యీ విషయము? నిన్ను ఆటవిక గోపకు లెట్లు జయింపఁగలిగిరి? ఆ భీరులు నిన్నెట్లు ఎదుర్కొనఁగలిగిరి? నీవద్ద గాండీవము లేకపోయినదా? నీ కే తాపసివలన శాపము కలిగినది? అది సత్యమే అయినదంటివికదా! సమస్త వృత్తాంతమును నాకు జెప్పి నా శంకల నన్నిటిని బాఱఁద్రోలుము.''

ధర్మరా జిట్లడుగఁగా నర్జునుఁడు దుఃఖించుచు నిట్లనెను:-
''రాజా! ఏమి చెప్పుదును? చెప్పలేను. చెప్పుటకు సిగ్గగుచున్నది. బాధకూడ కలుగుచున్నది. నా యీపరివర్తనమునకు నాహృదయము బ్రద్దలగుచున్నది. మాటిమాటికి ఘనశ్యాముని అహైతుకకృప స్మరణకు వచ్చుచున్నది. ఆతఁడు ప్రేమామృతమును వర్షింపజేసి వెళ్లిపోయెను. మరల వఱపు కలుగుటచే నంకురించిన అంకురము ఎండిపోయినది. ఏలతను ప్రేమజలమును జల్లి పోషించెనో, దానిని దుష్కాలమను గ్రీష్మముచే జీవనహీనమును గావించి యెటులో పోయినాఁడు. ఈ గోపకులు దోఁచుకొనిన సంఘటన ఇప్పుడు జరిగినదియే. ద్వారకనుండి తిరిగి వచ్చునప్పుడే యీ హృదయవిదారకమగు సంఘటనము జరిగినది. ఇట్లు జరుగునని ఆభాసమాత్రముగ భగవానుఁడే నాసమ్ముఖమునఁ దెలియఁజేసెనుగాని నేను దానినంతగా లక్ష్యపెట్టలేదు. ఆ సమయమున నాకు నాగాండీవ ధనుస్సు ఉన్నదనియు, బలపౌరుషములు కలవనియు, దివ్యాస్త్రము లున్నవనియు గర్వము కలదు. నేనిట్లను కొంటిని:-
'నన్నెవరేమి చేయఁగలరు? ఎవఁడు దివ్యాస్త్రములచే

భీష్మ, ద్రోణ, కర్ణాదులవంటి మహారథులను జయించెనో వానినీలోకమున నెవఁ డెదుర్కొనఁ గలఁడు ? నన్ను బాహుబలముచే బరాజితునిఁ గావించు సాహస మెవనికి గలదు ?'' అన్నా! అది నాబలము కాదనియు, బలరాము సోదరుని బలమనియు నాకిప్పుడు రూఢిగాఁ దెలిసినది.

మహారాజా! ఒక దినమున శ్యామసుందరుఁడు నన్ను వెంటఁబెట్టుకొని గంగకు చాల దూరమునఁగల ఒక ఘోర వనమునకుఁ జేరెను. అచ్చట మేమనేక భృత్యసేవకులతోఁ దిరుగఁ బోయితిమి. అనుచరుల నందఱను శ్యామసుందరుఁడు శిబిర సమీపముననే వదలెను. కేవలము నన్నొక్కనినే రథముమీఁద వెంటఁబెట్టుకొని పోయెను. చాల దట్టమగు నరణ్యమునకుఁ బోఁగానే అతఁడు రథమునుగూడ వదలిపెట్టి, మేమిద్దరమును నడిచి పోవుచుంటిమి. ఆ సమయమున వేసవి యగుటచే మాకు చాలదాహమయ్యెను. నోరెండెను. శరీరము చెమటచే తడిసిపోయెను. వెళ్లుచు నలసి పోయితిమి. ఆఁకలి కూడ వేయుచుండెను. ముండ్లు తీసివేసికొనుచుఁ బోవుచు శ్రీకృష్ణుఁడు భయపడి యాబాధలు నివారించుట కేమైన నుపాయమున్నఁ జెప్పుమనుచుండెను. అతఁడు నాతో నిట్లనెను:- ''అర్జునా! చాల దాహము వేయుచున్నది. ఎక్కడనైన నీరు సంపాదించి ప్రాణముల నిలుపుము,''

నేను విసుగుకొని యిట్లంటిని:— ''నీకీ పొంగేల లేచినది ? సేవకుని నెవనిని వెంటగొనిరాలేదు. గంగాతీర్థము

తెచ్చుకొనకయే వచ్చితివి. నీ వేమన్నను ఇక్కడికి గంగ చాలదూరమున నున్నది.''

''ఆదినమున శ్యామసుందరుఁడు చాల భయపడుచుండెను. వ్యగ్రతను నటించుచుండెను. నిజమున కాతనికి ఆఁకలిదప్పు లెక్కడివి? త్వరత్వరగా నొక చెట్టునెక్కి, యిటు నటుఁజూచి, అక్కడనుండియే సంతోషమును బ్రకటించుచుఁ బిల్లవానివలె నెగురుచు నిట్లనెను:- ''అర్జునా! అర్జునా! ప్రియుఁడా! పనియైనది. ఇచ్చట దగ్గఱలో నొకతపస్వి యుండు స్థానముకలదు. నాకు పొగ కనఁబడుచున్నది. వృక్షముల చాటున నొక కుటీరముకూడ కనబడు చున్నది. తప్పక దానిలో నొక మహాత్ముఁడు నివసించుచుండ వచ్చును. పోదము పద; అచ్చట జలము లభింపఁగలదు; కొంచెము ప్రసాదము కూడ దొరకవచ్చును. మునులదగ్గఱ కందమూల ఫలములకుఁ గొదువేమి?'' ఇట్లనుచు నాతఁడు త్వరత్వరగ చెట్టుదిగెను. కొంచెముదూరము పోగానే నిజముగ బాగుగ నలికిన చక్కని కుటీరము కనఁబడెను. దానికి నలువైపులను మంచి ఫలపుష్ప సమన్వితములగు వృక్షములుండెను. చాల దట్టముగ నరఁటిచెట్లుండెను. గ్రీష్మతాపముచే నలసి సొలసియున్న మాకు ఆ ఆశ్రమమును జూచుటతోడనే ఆనందము కలిగెను. ఆ యాశ్రమము లోపలికి వెళ్లి చూచునప్పటికి దానిలో నొక తపస్విని తేజఃపుంజమువలెఁ గూర్చుండి యుండెను. మేమిద్దరమును భక్తిశ్రద్ధలతో నామెకు నమస్కరించితిమి. ఆమె చాలప్రేమతో మాకు స్వాగత సత్కార

ములు కావించెను. మమ్ములను జూడఁగానే ఆమె లేచెను. వెంటనే ఆమె నీరునుదెచ్చి మాకర్ఘ్యపాద్యముల నొసంగెను. అడుగకయే బాగుగా పండిన మంచి ఫలములనుదెచ్చి మా ముందుంచెను. రెండు పాత్రలతో శీతల స్వచ్ఛజలములను దీసికొనివచ్చెను. మాకు బాగుగా దప్పిక వేయుటచే కడుపు నిండ నీరు త్రాగితిమి. నీరు త్రాగఁగానే చిత్తస్వాస్థ్యము చిక్కె, మనస్సున కుల్లాసము కలిగెను. అప్పుడు మెల్ల మెల్లగా కమ్మని ఫలములను దింటిమి. ఆఫలము లమృతోపమాన ములుగ నుండెను. వానినుండి దివ్యగంధము వెలువడుచుండెను. అన్నియు రసయుక్తములుగను, మధురముగను, హృదయా నందకరముగ నుండెను. మేము ఫలహారము చేయుచుండఁగా మాదృష్టి తపస్విని యొక్క పూజాసింహాసనమందు పడెను. దానిమీఁద సుందరపుష్పములచే నలంకరింపఁబడిన భగవ న్మూర్తి యుండెను. దానిమీఁద మంజరీసహితముగ సుందర తులసీదళములు వేయఁబడి యుండెను. వికసించిన సుందర పుష్పములచే నది కప్పఁబడి యుండెను. ఇట్టి భగవ త్పూజను గనఁగానే మాకత్యంతానందము కలిగినది. కాని దగ్గఱలోనే మేమత్యాశ్చర్యకరమగు కార్యమును గాంచితిమి. దానిని గాంచఁగానే మాకు భయమును, కుతూహలమును గలిగినది. భగవంతుని సింహాసనము దగ్గఱ మూఁడుఖడ్గములు వ్రేలాడు చుండెను. ఇంతటి పెద్దఖడ్గములను మేమరుదుగఁ జూచితిమి. ఆ మూఁడును గంధ పుష్పాక్షత ధూప దీపాదులచేఁ బూజింపఁ బడుచుండెను. భగవత్పూజతోఁ బాటుగా వీటికిఁ గూడ పూజచేయుచున్నట్లు తోఁచుచుండెను. ఇంతటి

సాధ్వియు, శాంతస్వభావురాలును, తపస్వియు నీవిధముగ నీఖడ్గములను బూజించుచున్న దేలకో నాకు తోఁచుటలేదు. నా విస్మయమును గాంచి, నా యుత్సుకతను గ్రహించి శ్యామసుందరుఁ డిట్లడిగెను:— "దేవీ! మేము మిమ్మొక ప్రశ్న నడుగఁ దలఁచితిమి. మాకు భయ సంకోచములు రెండును గలుగుచున్నవి. మీ రనుచితమని భావింపనిచో మా యశిష్టతను క్షమించినచో మాత్రము మేము మిమ్మడిగెదము."

మిక్కిలి ప్రీతితో నా తపస్విని యిట్లనెను:— "బిడ్డలారా! ఎక్కడనైనఁ దపస్వులతో నిట్టి శిష్టాచారమును బాటింతురా? తపస్వు లందఱకు నభయదాన మొసంగియే తపోదీక్షను గొందురు. వారి వలన నెవరికిని భయ ముండదు. మీరు నాకు బిడ్డల వంటివారు. కావున మీ రడుగఁ దలఁచి నది నిర్భయముగ నడుగుఁడు."

శ్రీకృష్ణుఁ డిట్లనెను:— "అట్లైన తల్లీ! ఆశ్చర్య మగుచున్నది. మీకు లోకములో నందఱు సమానులే. మీకు శత్రువు లుండరు. అందఱు మీ వలన నభయమును బొందిరి. అట్టియెడ మీరు తపస్వులయ్యు — ఒకటి కాదు — రెండు కాదు — మూఁడు తీక్ష్ణ ఖడ్గములనుంచి పూజించెద రేల? మాకీ రహస్యమును దెలిసికొనవలయునను కోరిక కలదు. తపస్సులో మూఁడు కత్తుల నుంచుకొనుట పాయసములో నుప్పు, కారము, ఇంగువ వేసినట్లును, చక్కని చానకు గడ్డములు మీసము లతికించి వాటిని మెలిత్రిప్పి అలంకారము

చేసినట్లును, వివాహసమయమున "రామనామము సత్యము, రామనామము సత్యము, నిజమున కదియే గతి" యను చావు సమయమునఁ బలుకు శబ్దములు పలికినట్లున్నది. మాకీ రహస్యమును దెలుపుఁడు. మీరు తపస్వినులయ్యు ఖడ్గముల నేల నుంచుకొంటిరి ?"

ఇది విని ముసలిది కొంచెము నవ్వి యిట్లనెను:— "బిడ్డలారా! నా కీ లోకములో నందఱు సమానులే. కాని నాకు ముగ్గురు శత్రువులు కలరు. ఆ ముగ్గురినిఁ జంపుటకే నేనీ మూఁడుఖడ్గముల నుంచుకొంటిని. నాతపస్సునకు ప్రసన్నుఁడై నందనందనుఁడు నా శత్రువులను జూపునెడల వారి నీ ఖడ్గములతోఁ దెగవేసెదను."

ఆ తేజస్విని యగు తపస్వినీముఖము మెఱయుచు, క్రోధముతో నుండెను. దానిని జూడఁగానే నాకు భయము కలిగెను. కాని శ్రీకృష్ణుఁడట్లే నవ్వుచు నామె నిట్లడిగెను:— "అమ్మా! మాకు మీ శత్రువుల పేరులు తెలియవు. సన్న్యాసినివయ్యు నపరాధమును క్షమింపఁజాలనంతటి ఘోరాపరాధములను వా రేమి చేసిరి ? దాఁచవలసిన విషయము కాకున్న మాకు చెప్పుఁడు. మీ శత్రువు లెవరో తెలుపుఁడు."

వృద్ధ యిట్లనెను:— "బిడ్డలారా! నా శత్రువులను జగమెఱుఁగును. రహస్యము లేదు. వారిలో నిద్దఱు స్త్రీలు, ఒక్క పురుషుఁడు. మీకు వారిపేరులు కావలయునా? అయితే వినుఁడు— మొదటి శత్రువు యశోదాదేవి. రెండవది ద్రౌపది. మూఁడవశత్రువు అర్జునుఁడు."

ఆ వృద్ధ నోటినుండి నా పేరు వెలువడఁగానే నా నోరెండిపోయెను. శరీరము చెమటలు పోసెను. దేవేంద్రునకుఁ గూడ భయపడని నాకు భయము కలిగెను. నాస్థితిని దాచుటకు నేను కృష్ణుని చాటునకుఁ బోయితిని కాని యాతఁడు నవ్వుచుండెను. నవ్వుచు నాతఁ డిట్లనెను:— "తల్లీ! వీరు నీకేమి హానిచేసిరి? ఏమి అపరాధము కావించిరి? వీరి ముగ్గురిపై నింతగాఁ గుపితులగుటకు వీరు నీకేమి యపకార మొనర్చిరి? వీరు ముగ్గురును జేసిన అపరాధమును మీరు నాతో నిజము పలుకుఁడు."

శ్రీకృష్ణుఁ డిట్లడుగఁగానే ముసలిదాని ముఖము క్రోధమున నెఱ్ఱనాయెను. కొంచెము సేపాగి ఆమె యిట్లనెను:— "బిడ్డా! అడిగి నీవేమి చేయఁగలవు? విషయము చాల రహస్యకరమైనది. ఈ ముగ్గురును క్షమింపరానంతటి అపరాధమును జేసినారు. వీరిని జంపుటకే నాతపస్సు."

భగవానుఁడు మిక్కిలి ప్రేమతో నిట్లనెను:—"అమ్మా! మీరు మావద్ద నేమియు దాఁచవలదు. మాకు యథార్థ విషయమును జెప్పుడు. మీకు మాచేతనైన సహాయము కావించెదము."

వృద్ధ యిట్లనెను:— "మంచిది. బిడ్డా! నీకు వినవలెనని యుండిన వినుము. అందఱికంటె గొప్ప అపరాధము మా యశోద చేసినది. మా నవనీల కమల సమాన సుందరుని, నవనీతముకంటెఁ గోమలముగనుండు పరమ సుకుమారుఁడగు శ్యామసుందరుని వెధవ వెన్నకొఱకు ముంజ త్రాటితో బంధిం

చినది. అయ్యో! ఆ గొల్లపడుచుకు దయయైన లేదు. నా మనోహరుఁడగు శ్యామసుందరుఁ డెట్టి మనోహరుఁడు! వెన్న యేమంత చేయును? అన్నియు శ్యామసుందరుని ప్రసన్నత కొఱకే కదా! ఆతఁడు తినినాఁడు, తినినాఁడని అల్లరిపెట్టినారు కాని, ఎక్కడనైనఁ దన వస్తువు తినిన దొంగతనమగునా? ఒకవేళ దొంగతనము చేసినను ఇట్లు కట్టుదురా?''

శ్రీకృష్ణుఁ డిట్లనెను:– "అమ్మా! యశోదాదేవి యెల్లప్పుడును శ్రీకృష్ణునకు వెన్న పెట్టవలెననియే కోరుచుండెడిది. కాని కృష్ణునకు దొంగతన మలవాటుపడినది. యశోదకు క్రోధము వెన్న దినుటచే రాలేదు. దొంగతనము చేయుటచేఁ గోపము వచ్చినది. పిల్లవాఁడుగా నుండఁగానే దొంగతనము నేర్చుకొనినఁ జెడ్డవాడు పడునని ఆమె భయము. ఇంతకంటె నెక్కువ కోపము అత్తమామల కాలమునుండియు నున్న యమళార్జున తరువులను విఱుగఁగొట్టుటచేఁ గలిగినది. పోనిండు. వెన్నఁదిని శ్రీకృష్ణుఁడు వెళ్లిపోయియుండిన నామె త్రాటితోఁ గట్టియుండెడిది కాదు.''

ఇది విని వృద్ధతపస్విని కుపితురాలై భగవానుని గద్దించుచు నిట్లనెను:– "ఛీ! ఛీ!! నీవేటి మాటలాడుచున్నావు? పృథ్వీపదార్థము మీఁద నింతటి మమత్వమా? మా మదన మోహనునిమీఁద నింతటి క్రూరతయా? మట్టికుండ పగిలిపోయినది. ఎప్పటికైనను బగిలిపోవును. ఒక శేరు నేయిని ద్రాగిన పిడత నునుపెక్కును. మట్టిపిడత పగిలిపోయినదని ముద్దులొలుకు మన మోహన మదనగోపాలుని నడుమునకు

త్రాటిని గట్టుట మఱెంత యన్యాయము. ఈ చేసినపని మంచి పనియేనా ? నీవే తెలుపుము. లోకమంతయు నా గొల్లభామను క్షమించునేమోకాని నేనుమాత్రము క్షమింపఁజాలను. ఈ మొదటికత్తిని ఆమె తల నఱకుటకే ఇక్కడ నుంచితిని. ప్రతి దినము దానిని బూజించుచుందును.''

మాటను దాటవేయుచు వాసుదేవుఁ డిట్లనెను:— మంచిది. అమ్మా! యశోదాదేవి యపరాధమును వింటిమి. ఇప్పుడిఁక ద్రౌపదీయపరాధమును విననలెను. ఆమె మీ కేమి యపరాధ మొనర్చినది ?

వృద్ధ తపస్విని యావేశముతో నిట్లనెను:—'' ద్రౌపదీ విషయమును అడుగవలదు. ఆమె చాల గొప్ప అపరాధము కావించినది. ఒకవేళ యశోదాదేవిని క్షమించిన క్షమింతు నేమో కాని ఆమెను మాత్ర మెట్టిస్థితిలోను విడువను. మా శ్యామసుందరుఁడు ద్వారకలో రుక్మిణీ భవనమునఁ గూర్చుండి భోజనము చేయుచుండెను. ఆ సమయమున నీబేల దుశ్శాస నుఁడు చీరెలు వలుచుచుండ నిట్లు కేకవేసి పిలిచినది:— '' ఓ శ్యామసుందరా! నామానమును గాపాడుము. నన్ను నగ్నను గానీయకుము.'' మా మదనమోహనుఁడీ పిలుపును విని చేతిలో ముద్ద చేతిలోనే, నోటిలో ముద్ద నోటిలో నుండఁ గానే ఆదరబాదర అచ్చటికి పరువిడి, కౌరవ సభలో వస్త్ర ములు కావలసి వచ్చినది. పోనిండు వస్త్రములగుట ఏదైన మగవానివా ? కాదు. ఆడుదానివి. అదియు సామాన్యపు స్త్రీ కాదు. అప్పుడామె రజస్వల యైనది. అట్టి దానిని శాస్త్ర

శాస్త్రములు — తాఁకుట అట్లుంచుఁడు, చూడనైనఁ జూడరాదని శాసించిరి. మూఁడు దినముల వఱకట్టిది బ్రహ్మహత్యతో సమానమైన దనిరి. అట్టిదాని చీరలోఁ దాఁగవలసి వచ్చినది."

శ్రీకృష్ణుఁ డిట్లనను:— "అమ్మా! స్త్రీలకు లజ్జయే సర్వస్వము. మానము పోయినఁ బ్రాణ మెందులకు? ఒక కులస్త్రీ తన పెద్దమామగారి ఎదుట అనావృతగా నెట్లుండఁ గలదు? ఆమె వివశురాలై అట్లు చేసియుండ వచ్చును."

కసరికొట్టి యావృద్ధ తపస్విని యిట్లనెను:— "నీవేమి అట్లు మాటలాడుచున్నావు? ఓరీ! కుబ్జా! లజ్జ, లజ్జ అందువు. ఎక్కడి లజ్జ? ఎముకలు, చర్మముతోఁ జేయఁబడిన యీశరీరములో లజ్జించుట కేమి వస్తువు కలదు? ఏయంగములోనైన పంచభూతములు కాక ఇంకేమైన నున్నదేమో చెప్పుము చూతము. రస, రక్త, మాంస, మజ్జా, మేదాస్థి, రజ, వీర్యా, మూత్ర, విష్ఠా, కేశ, రోమ, శిరానాడులు తప్పితే యీశరీరములో నింకేమున్నది? అంగము లన్నియు నీవస్తువులతోఁ జేయఁబడి నవియే. ఏయంగములోను విశేషత యేమియును లేదు. చేతులు, కాళ్లు, ముఖము ఏవస్తువులతోఁ జేయఁబడినవో గుప్తావయవములుకూడ వాటితోఁ జేయఁబడినవియే. దీనికి లజ్జింపవలసిన పనియేమి యున్నది? మొండిమొఱ్ఱయైన వచ్చిన చెఱుపేమి కలదు? కలదనుకొనుము! మాశ్యాముఁ డుందరుఁ డింతటి కష్టము సహింపవలసిన పనిలేదు కదా! ఆతని సుఖమునకు విఘ్నము కలుగదు కదా!"

భగవానుఁ డిట్లనెను:— "తల్లీ! భక్తుఁడు భగవంతుని దుఃఖములో నన్నియుఁ జెప్పుకొనును."

వృద్ధ తపస్విని యిట్లనెను:— "ఇదేమి భక్తి? తన సుఖముకొఱకు తన యిష్టదైవమునకుఁ కష్టము కలిగించుటా? తన పనికొఱకు భగవత్కార్యములకు విక్షేపము కలిగించుటా? దీనిని నేను భక్తియనను. అందువలననే పాండవపత్నిని జూచిన నాకు చాలకోపము. ఈ మధ్యనున్న కత్తి ఆమె కొఱకు జాగ్రత్తచేసి యుంచితిని. ఆమె నా కెక్కడ దొఱకిన అక్కడ ఆమె తలఁ దెగఁ గొట్టెదను. ఆమె చేసిన యపరాధము జ్ఞాపకమునకు వచ్చెనా నా వృద్ధశరీరమునకు బలము వచ్చు చున్నది. ప్రతి నరమునకు రక్తము ప్రవహించు చున్నది."

• భగవానుఁడు నవ్వుచు నిట్లనెను:— "మంచిది. ఇఁక నర్జునుని అపరాధమును గూర్చి వినఁగోరు చున్నాను. ఆతని మీఁద మీకింత కోప మెందులకు?"

పండ్లు పటపట కొఱుకుచు నా వృద్ధ తపస్విని కోప స్వరమున నిట్లనెను. అపుడు నేను నా మనమున నిట్లు చింతించితిని:— 'ఈ ముసలిదానిని నే నెప్పుడును జూడనే లేదు. మాట్లాడను లేదు. అయినప్పటికిని నా మీఁద నింత కోపము కలిగి యున్న దేలకో యని నేను భయపడుచు నుంటిని. ఆలోచించు చుంటిని. నేనేమి యపరాధము చేసి యుందును? శ్యామసుందరుని నేను నా ప్రాణములకంటె నధికముగఁ బ్రేమించుకొనుచుందునే! అతని యాజ్ఞల నన్నిటిని ఉచితములు కానిండు, అనుచితములు కానిండు వాటిని పాలించు

చుందును. ఈమె నాపై నేదోషము మోపునో తెలియదు. శ్రీకృష్ణుని వెనుక నక్కి నే నిది యంతయు నాలోచించు చుంటిని. ఒకవేళ నా మనోభావములను పసిపట్టి యా ఖడ్గముతో నిప్పుడే ఖండించునేమో నని నేను ఆమె వైపు చూడనైనఁ జూచుటలేదు. నే నామె యాకృతిచే భయభీతుఁడ నైతిని.

ఆమె అదే ఆవేగమున నిండి యిట్లనెను:— "బిడ్డా! మీ రిద్దఱికి మించిన అపరాధి అర్జునుఁడు. ఆతఁడనిన నాకు మంటిపోవు చున్నది. గెలిచిన పొగ డ్తకొఱకు మా శ్యామసుందరునిచే రథము తోలించెను. అరే మందమతీ! జయాపజయములు బాలక్రీడల వంటివి. ఓడిపోయిన మునుచుకొని పోవునదేమి కలదు? అట్లయిన మా మదనమోహన శ్యామసుందరుఁడు కష్టపడవలసిన పని లేకపోయెడిదే కదా! ఆతని సుస్నిగ్ధ కోమల శ్రీ యంగములందు నిరంతరము బాణములు గ్రుచ్చు కొనక పోయెడివే. ఆతని నీల జలధర సదృశములగు అంగములనుండి రక్తధారలు ప్రవహింపకుండెడివే. హా! ఆ కుంతి కొడుకెంతటి క్రూరకార్య మొనర్చినాఁడు!"

ఇట్లనుచు వృద్ధతపస్విని వెక్కి వెక్కి యేడ్వసాగెను. ముసలిది అన్నది నిజమేనని నా మనస్సునకుఁగూడ తట్టినది. నేను కేవలము విజయలోభముచేతనే శ్యామసుందరుని సారథి కావించితిని. ఇట్లనుకొంటిని:— "శ్యామసుందరుఁ డుండఁగా నన్నెవరేమియుఁ జేయలేరు. ఆతఁడుండిన నాకు పరాజయము లేదు. ఆతఁడు రథారూఢుఁడై యుండిన నా విజయములో సందేహము లేదు. నిజముగ నేను వధింపఁబడఁదగినవాఁడను." నా కన్నులనుండి అశ్రువులు వెడలెను. కాని ముసలితపస్విని

వైపు చూడలేదు. శ్యామసుందరుఁ డామెతో స్నేహావశమున నిట్లనెను:— "అమ్మా! మీరు శోకింపవలదు. శ్యామసుందరునకు బాణములు గ్రుచ్చుకొననేలేదు."

వృద్ధతపస్విని వెక్కి-వెక్కి యేడ్చుచు నిట్లనెను:— "ద్రోణభీష్మాదులు యుద్ధముచేయుచు బాణములువదలఁగా, వాటినుండి రథసారథి తప్పించుకొనెననుట అసంభవము. నీవు నన్ను మఱపింపవలదు. అర్జునుఁడు దొరకలేదు. దొరికినచో వాని నవశ్యము నీ చివరఖడ్గముచే ఖండించెదను."

ఇది విని అత్యంత మధురస్వరమున భక్తవత్సలుఁడగు వాసుదేవభగవానుఁ డిట్లనెను:— "అమ్మా! తపస్సు చేయునపు డిట్టి కోపము చెందరాదు. అది తపస్సునకు విఘ్నము. మీరు ముగ్గురును శత్రుత్వముచేఁ జేయలేదు. ప్రేమవశీభూతులై యిట్టి కార్యములు చేసినారు. ప్రేమలో విధి నిషేధములు మర్యాద లుండవు. అచ్చట శిష్టాచారవ్యవహారము అడుగిడదు. ప్రేమచేఁ జేయఁబడినదంతయు నుచితమే కాఁగలదు. అచ్చట అనుచితమను మాట యుండదు. యశోద ఊరక పైకి అట్లు శ్యామసుందరుని గట్టివేసినది కాని, ఆమె హృదయములో నపారమగు ప్రేమ కలదు. ఆమె శ్యామసుందరుని పైకి కసరుచుండెడిది. లోపల ఆమె హృదయము కరగి పోయెడిది. 'భావగ్రాహీ జనార్దనః' జనార్దనుఁడు భావమును గ్రహించును. ఆమె ఆంతరంగికభావమును గ్రహించి శ్యామసుందరుఁ డామెపైఁ బ్రసన్నతనేచూపెను. త్రాటిచే నాతనికి కలిగిన కష్టమేమున్నది? త్రాడు ఆతనికి అతిరిక్తమైనది కాదుగదా!

ఇఁక ద్రౌపదీ విషయము. ఆమె యభిప్రాయము లోక
ములో శ్రీకృష్ణునికంటె నామెకు నిజమగు హితైషు లెవరును
లేరనియు. ప్రేమించెడువారు, రక్షించువారు లేరనియు
నమ్మికము. అందువలన నామె భగవంతుని బిలిచినది. భగవం
తుఁడు వస్త్రములలోఁ జేరుటచేఁ గష్టమేమియు లేనే లేదు.
ఆతనికి ఉచ్చనీచములు లేనే లేవు. ఆతనికి ఉచ్చనీచముల
దృష్టియే యున్నచో, లోకనిందితములగు శూకర, మత్స్య,
కచ్ఛప మొదలగు నవతారము లేల యెత్తును? ఆతఁడు
వస్త్రములలో నిదివఱకు లేకపోలేదు. అయితే అప్పుడు తన
రూప విస్తారమును గావించినాఁడు. ద్రౌపదియొక్క యొక
విషచే నాతఁడు ప్రసన్నుఁడయ్యెను. కాని ఆతని కేమియు
బాధ కలుగలేదు!

ఇఁక నిప్పుడు అర్జునుఁ డాతనిని సారథి కావించి
యెందులకు కష్టపెట్టినాఁడో ఆ కారణమును గూడ వినుము.
భూమి మీఁద రాక్షసులు రాజులై వృద్ధిపొందిరి. వారందఱు
రాజచిహ్నములు ధరించిన మహాబలులగు దైత్యులు; ధర్మ
కర్మానుష్ఠానమును జేయుచుందురు. దానికి తోడుగా క్రూర
కార్యములును జేయుచుందురు. పాపులను వారి పాపమే
వధింపఁజేయును. కాని తమ తపోబలముచే నజరామరులై,
ధర్మకర్మానుష్ఠానములను జేయుచు, సాధువులను బాధించు
వారిని స్వయముగ భగవంతుఁడు తప్ప యింకెవరును జేయఁ
జాలరు. కావున వారినందఱను వధించుటకు స్వయముగ
శ్యామసుందరుఁడు బుద్ధిపూర్వకముగ సారథి యయ్యెను.
అతనిచే రథము తోలించుటకు నర్జునున కేమి శక్తి కలదు?

భగవంతుఁడు దుష్టసంహారము చేయవలసియున్నది. అర్జునుని ఆతఁడు నిమిత్తమాత్రము చేసికొనెను. కావున నోదేవీ! నీవీ యభిప్రాయమును మార్చుకొనుము. ఈ ముగ్గురిమీఁదఁ గల కోపము నుపసంహరించుకొనుము. ఈ మూఁడు ఖడ్గములను విసరి పాఱవేయుము. నిశ్చింతతో భజన మొనర్పుము.''

ఇట్లు శ్రీకృష్ణుఁడు చెప్పఁగా విని యత్యంతాశ్చర్యముతో నా వృద్ధ తపస్విని యిట్లడిగెను:— '' ఇట్టి రహస్యమయములగు హృద్గత విషయములను జెప్పుచున్నావు. నీ వెవఁడవు ? ''

ఇది విని భగవానుఁ డిట్లనెను:— '' నేనే వసుదేవ పుత్రుఁడనగు శ్యామసుందర శ్రీకృష్ణుఁడను. దేవీ! అత్యంత మాధుర్యరస నిష్ఠతో నీవుండుటను గాంచి యాకర్షింపబడియే నేను నీకు దర్శన మీయ వచ్చితిని. ఇదుగో నా వెంటనున్న యీతఁడు గాండీవధారియగు అర్జునుఁడు. నేనింతగాఁ జెప్పినను నీకు సంతుష్టి కలుగకున్న నర్జునుఁడు నీ సమ్ముఖముననున్నాఁడు. ఈతనికై యుంచిన కత్తితో నీతని శిరస్సు నిప్పుడే ఖండించుము. మిగిలిన శత్రువుల నిద్దరిని గూడ నీదగ్గఱకు నేను బిలిపించెదను.''

ఇది వినఁగానే వృద్ధ తపస్విని లేచి, భగవానుని విధ్యుక్తముగఁ బూజించి, అశ్రుబిందువులచే భగవచ్చరణములను దడుపుచు, గద్గదకంఠముతో నాతని స్తుతించి, ప్రణామము చేసి యిట్లనెను:— '' శ్యామసుందరా! నేఁడు నా తపస్సు పండినది. నా సమస్త మనోరథములు నెఱవేరినవి.

వీరి ముగ్గురిని వధించుటకు నిశ్చయపరుచుకొన్నప్పటికిని, నీవు వలదనుచున్నావు, కావున నీ ఖడ్గములను బారవేయుచున్నాను. వీరిని జంపను. కాని నా కోపము చల్లారలేదు. కావున నేనే ముగ్గురకు శాపము నొసంగెదను. యశోదకు గోపాల ప్రేమ యున్నప్పటికిని బాహ్యకోపముచే శ్యామసుందరుని పసి శరీరమును గట్టినది కావున నామెకు శ్యామసుందరుని శరీరముతో సదా వియోగము ననుభవించి తీరవలసినదే. ద్రౌపదీదేవి తన భర్తల బలమును జూచుకొని గర్వించి వారు మొదలగ తలలు వంచుకొని యుండుటను గాంచి, తన సౌందర్యపు మిడిసిపాటుతనమున ఈశరీర లజ్జను లజ్జగా భావించి నిన్నుఁబిలిచినది. ఆమెకు నాశాప మేమనఁగా, నంత్యకాలమున నామెకు శరీరసంస్కారము కూడ లేకుండఁబోవుఁగాక! ఆమె మంచులో నల్లే పడియుండఁగలదు. ఏ తన భర్తలను జూచుకొని ఆమె యింత గర్వముతో నున్నదో, వారంత్యకాలమున నామెవైపునఁ గన్నులెత్తియైనఁ జూడకుందురు గాక! ఏ యర్జునుఁడు తాను త్రైలోక్య విజయుఁడు కావలెనను నభిమానమున – తన విజయజనిత కీర్తిలోభముచే – నీచే నిందిత కార్యమును జేయించినాఁడో, ఆతఁడు చివరకు ఆటవిక గోపభిల్లులచేఁ బరాజితుఁడు అగుగాక! చివరకు ఆతఁడు తన యస్త్రశస్త్రము లన్నియు మఱచిపోవును గాక!" ఇట్లని ఆ తపస్విని అచ్చట అప్పుడే తన శరీరమును విడిచెను. మేమిద్దరము గంగాతీరమునకుఁ గొనిపోయి దానికి సంస్కారము చేసితిమి.

ఆ సమయమున నా మనస్సు చింతతో నిండిపోయెను. వృద్ధ తపస్విని వాక్యములు నాకు వ్యధ కలుగఁ జేసినవి. అందుకు భగవానుఁడు వాటిని మఱపించుటకు నవ్వుచు నిట్లనెను:— "ఈ ముసలిదాని మెదడు కొంచెము చెడినట్లున్నది. అందుకనియే తల తోఁక లేని వాగుడు వాగినది." ఇట్లనేక వాక్యములు పలికి కృష్ణుఁడు నన్నోదార్చెను. కాని రాజా! నేఁడా తపస్విని శాపము తప్పలేదు. నిజముగ నన్ను ఆటవిక గోపకులు జయించిరి. నా తేజము, బలము, అస్త్రములు, పరాక్రమము దేనికిని పనికిరాలేదు. నేనట్లు చూచుచునే యుంటిని."

ధర్మరా జిట్లనెను:— "సోదరా! గోపకులు నిన్నేల దోచుకొనిరి? ఎక్కడ దోఁచుకొనిరి? ఎట్లు దోఁచుకొనిరి? ఇవన్నియుఁ జెప్పవలయును. సంక్షేపముగ నీ దుఃఖ సంఘటనమును గూర్చి చెప్పుము."

ధర్మరా జిట్లడుగఁగా నర్జునుఁడు ఇంద్రప్రస్థమునకు వచ్చునపుడెట్లు దోచుకొనినది చెప్పఁదొడఁగెను.

ఛప్పయ.

ఏక దినా బన మాహిఁ తాపసీ తీని ఖడ్గ ధరి।
బైరీ మేరే తీన బతావే జబ పూఛీ హరి॥
బాఁధే మాఖన హేతు యశోదా తాకూఁ మారూఁ।
దీన్హోఁ కృష్ణా కష్ట పార్థ హిత తీసరి ధారూఁ॥
తీన శాప క్రమశః దయే, బహు సముఝాయే శ్యామ జబ।
సుత వియోగ, పతి ఉపేక్షా, దస్యు పరాజిత కరహిఁ తబ॥

అర్థము.

ఒక దినమున కృష్ణార్జునులు వనమున వెళ్లఁగా నొక తపస్విని మూఁడు ఖడ్గములను బెట్టుకొని పూజించుచుండెను. ఈ ఖడ్గము లెందుకని కృష్ణుఁ డడుగఁగా నామె యిట్లనెను:— "నాకు ముగ్గురు వైరు లున్నారు. ఇవి వారిని జంపుటకు. ఒకతె యశోద. ఆమె కృష్ణుఁడు వెన్నతిన్నాఁడని రోటికిఁగట్టి బాధించెను. ఆమెనుజంపవలెను. రెండవది ద్రౌపది. శ్రీకృష్ణుని బిలిచి యాతని బాధించినది. రెండవ దానిచే నామెను ఖండించెదను. మూఁడవ వాఁడర్జునుఁడు. ఆతఁడు కృష్ణునిఁ బార్థసారథిని జావించుకొని కష్టపెట్టినాఁడు. మూఁడవ దానిచే నాతని జంపెదను." అనఁగా కృష్ణుఁడు సమాధానముచెప్పెను. అయినను ముగ్గురకు శాపము లొసంగెను. యశోదకు సుతవియోగము, ద్రౌపదికి పతుల యుపేక్ష, అర్జునునకు దస్యులచేఁ బరాజితుఁడగు నట్లును శాపము లొసంగెను.



## అడవి గొల్లలచేఁ బరాజయము

### ౭౧

శ్లో॥ తద్వై ధనుస్త ఇషవః సరథో హయాస్తే,
సోఽహం రథీ నృపతయో యత ఆనమంతి।
సర్వం క్షణేన తదభూదసదీశరిక్తం,
భస్మన్ హుతం కుహకరాద్ధ మివోప్తమూష్యామ్॥

— శ్రీభాగ. ౧ స్కం. ౧౫ అ. ౨౧ శ్లో.

"శా॥ ఆతేరారథికుండ నాహయము లా యస్త్రాసనం బా శర
వ్రాతంబన్యులఁ దోల్లి చంపును దుదిన్ వ్యర్థంబులై పోయె మ
చ్చేతోధీశుఁడు చక్రి లేమి భసితక్షిప్తాజ్యమాయావిమా
యాతంత్రోషరభూమిబీజములమర్యాదన్ నిమేషంబునన్."
—శ్రీమదాంధ్రభాగవతము

ఛ ప్ప య.

హరి ఆజ్ఞా సిర ధరి నారి లై కేఁ మైఁ ఆయో।
డాఁకూ మగమేఁ మిలే మోఇ మిలికేఁ ధమకాయో॥
అపనో పరిచయ దయో నాము అరజున బతలాయో।
కింతు నమానే దుష్టనారి లఖి చిత్త చలాయో॥
హరికీ సోలహ సహస ప్రియ, పత్నీ తినఘాండస దయో।
తడూ లూటిలై భగేమైఁ, దేఖతకో దేఖత రహ్యో॥

అ ర్థ ము

"శ్రీకృష్ణునియాజ్ఞను శిరసావహించి యాతని భార్యల నందఱను దీసికొని వచ్చుచుంటిని. దారిలో దొంగలెదురుపడి మమ్ములను నదలించెను. నే నర్జునుఁడనని వారికి నాపరిచయమును గావించితిని. కాని యాదుష్టులు నామాటలు వినక, స్త్రీలను జూడఁగానే చిత్తము చలించుటచే శ్రీకృష్ణుని పదునాఱువేల ప్రియపత్నులను దోఁచుకొని పోవుచుండ నేను దేబెవలె నట్టే చూచుచుంటిని."



ఎట్లు జరుగవలసియున్నదో, దాని ననుసరించియే సంఘటనలు జరుగుచుండును. మానవుఁడు బలవంతుఁడునను

గాఁడు, బలహీనుఁడును గాఁడు. కాలమే వానినొక్కొక్కప్పుడు బలవంతుని జేయును. ఒక్కొక్కప్పుడు నిర్బలుని గావించును. సౌందర్యముకాని, అసౌందర్యముకాని వస్తువులలో లేదు. ఇవన్నియుఁ గాలకృతములగు గుణదోషములు.

నేఁడు పరమస్వరూపవంతుఁడైనవాఁడు, కాలాంతరమున వాఁడే కురూపియగును. నేఁడెవనిసి నల్లని మసిముక్కని యెగతాళి చేయుదుమో కాలాంతరమున నాతఁడే సుందరుఁడగును. కావునఁ గాలములోనే ప్రాధాన్యత కలదు. ఇట్లాలోచించి దుఃఖితమనస్కుఁడై అర్జునుడిట్లు చెప్పఁదొడఁగెను:—
"రాజా! నా పురుషార్థమంతయు కాలస్వరూపుఁడగు కృష్ణుని తోడనే పోయినది. ఇప్పుడు నేను బలహీనుఁడను. పురుషార్థరహితుఁడను. అస్త్రశస్త్రములను మఱచిపోయితిని. సామాన్యమానవునివలె నైతిని. మహాభారతయుద్ధములోఁ బ్రదర్శింపఁబడిన యా పరాక్రమము శ్రీకృష్ణుని తోడనే పోయినది. అవన్నియు నిప్పుడు స్వప్నతుల్యములైనవి. నీవు గోపకులచే నెట్లోడిపోయితివో చెప్పవలసినదని మీరు నన్నడిగితిరి. యథార్థమున కిది చెప్పఁదగని సంఘటన యైనప్పటికిని, నేను నీయాజ్ఞచేఁ జెప్పుచున్నాను. మీరిప్పుడు కఠోర హృదయమును గావించుకొని వినవలయును.'

భగవానుఁడు స్వధామమునకుఁ బోయెనను వార్త నాతో శ్రీకృష్ణ సారథియగు దారుకుఁడు చెప్పెను. అంత్యకాలమున శ్రీకృష్ణుఁడు నాకిట్లాజ్ఞాపించినట్లు దారుకుఁడు నాతోఁ జెప్పెను. ఆతని ఆజ్ఞ యిది:— 'నేఁటికి ఏడవ దినమున

ద్వారకా పట్టణమునంతయును సముద్రము తనలోఁ గలుపుకొనఁగలదు. ఒక్క నా భవనము తప్ప ద్వారకా పట్టణమంతయు నీటిలో మునిఁగి పోఁగలదు. కావున నర్జునుఁడు స్త్రీలనందఱను, పిల్లలను పాపలను, నౌకరులను మొదలగు వారినందఱను దీసికొని ఇంద్రప్రస్థమునకుఁ బోవలయును. నేను సమస్త యాదవ వంశములోని స్త్రీలయొక్కయు, పిల్లల పాపలయొక్కయు భారమాతనిపై నిడినాను. అతఁడు నా మోహములోఁబడి ప్రమాద మొనర్పరాదు — ఈ విధముగఁ జెప్పి శ్రీకృష్ణుఁడు స్వధామమునకుఁ బోయెను. ఇప్పుడు మీరేది ఉచితమనుకొనిన దానిని జేయుఁడు.'

ఇట్లు దారుకుఁడు చెప్పఁగా భగవదాజ్ఞను వినఁగానే నాకు దుఃఖము కలిగెను. భగవంతుఁడు లేక ఒక్కనిమిషమైన నుండ నాకిష్టము లేదు; కాని ఆతని యాజ్ఞ నెట్లు కాదనఁగలను? నేను శాస్త్రవిధి ననుసరించి చచ్చినవారందఱలో ముఖ్యులగు వారలకు పితృకార్యములు, శ్రాద్ధ, తర్పణాదులు కావించితిని. త్వరత్వరగా సర్వకార్యములను ముగించుకొని, నేను స్త్రీలను, పిల్లలను, సేవకులను దీసికొని బయలుదేరితిని. వచ్చుచుండఁగా నేను పంచనద (పంజాబు) సమీపమునకుఁ బ్రవేశించి అక్కడొక నదీతీరమున నేను శ్రీకృష్ణపత్నులందఱతో విశ్రమించితిని. రాజా! అచ్చట చాలమంది ఆటవికజాతి గొల్లలు దస్యులుండిరి. నాదగ్గఱ చాలధనము కలదు. స్త్రీలు కలరు. ఆ దుష్టులు దుష్టభావముచే మమ్ముల దోఁచుకొనుటకు కఱ్ఱలు తీసికొని మామీఁదఁబడిరి. వారి యీ దుస్సాహసమును గాంచి నేను నవ్వి యిట్లంటిని:— "ఓరీ! దుష్టులారా!

పతంగములు తెలిసితెలిసి అగ్నిలోఁబడినట్లు మీరు కాల కరాళగళమున నేలఁబడెదరు? చేప యెఱ్ఱ నాశించి గాల మునఁ బడి తన ప్రాణములను గోల్పోయినట్లు ధనలోభముచే మీప్రాణముల నేలఁ బోఁగొట్టుకొనెదరు? అబోధబాలకుఁడు తెలియక సర్పమును బట్టుకొని దానిచేఁ జచ్చునట్లు మీరు నాబాణములచే నేలఁ జచ్చెదరు? ఓరీ! మీరు నన్ను సాధా రణ పథికునిఁగఁ దలఁపకుఁడు. నాపేరు వినిన మీరు గడగడ వణఁకఁగలరు. నేను మహాభారతయుద్ధములో జయించిన వాఁడను — ద్రోణ, భీష్మ, కర్ణాది త్రైలోక్యవిజయులగు వీరు లను జయించిన పాండునందనుఁడగు నర్జునుఁడను. మీకింత వఱకు చెప్పినఁ జాలును. జగత్ప్రసిద్ధమగు నాగాండీవ ధనుస్సు పేరును వినని వాఁడీ లోకమున నెవఁడు కలఁడు? మీకు మీ ప్రాణములందు తీపియున్నయెడల నీదుర్విచారమును వీడుఁడు. వెంటనే యిచ్చటనుండి పారిపొండు. నేను మిమ్ముల నకారణ ముగఁ జంపను.”

రాజా! నేనిట్లు చెప్పి, మాటిమాటికి నాపేరు చెప్పితిని. అయినను ఆ దుష్టులు పారిపోలేదు. వారు మమ్ములను దోఁచు కొనుటకే నిశ్చయించుకొని, పెద్దపెద్ద కఱ్ఱలను దీసికొని మా మీఁద విరుచుకొని పడిరి. అప్పుడు నాకు చాల కోపము వచ్చెను. నేను నాగాండీవమునకు నారి తగిలింపఁ దలఁచితిని. కాని అట్లు తగిలింపలేకపోయితిని. నేను మంత్రముగ్ధునివలె నట్లే నిలుచుంటిని. ధనుస్సునకు నారి తగిలింపలేకపోవునప్పటికి నా కాశ్చర్యమయ్యెను. దొంగలు మా గుంపుమీఁదఁ బడిరి. సేవకులు చూచుచుండఁగనే ధనరత్నములను దోఁచుకొనిరి.

నేను దివ్యాస్త్రసహాయమున వారిని జంపఁదలఁచితిని. కాని యెంత జ్ఞాపకము చేసికొన్నను ఒక్క మంత్రమైన జ్ఞాపకము నకు రాలేదు. నేను వాటి సంహారోపసంహారముల విధినే మఱచితిని. దొంగలు నేను చూచుచుండఁగనే శ్రీకృష్ణపత్నులను బట్టుకొని పోయిరి. స్త్రీలు భయపడి అటునిటు పరువిడిరి. పిల్లలు భయముచే నేడ్చుచుండిరి. ముసలిసేవకులు, ఇతర నౌకరులు అఱచి గగ్గోలు పెట్టుచుండిరి. సర్వత్ర హాహా కారము వ్యాపించెను. స్త్రీలకు తలలన్నియు విఱియఁ బడెను. దొంగలు వారిని బలవంతముగ నీడ్చుకొని పోవుచుండిరి. ఈ విధముగ బలాత్కారము చేయుటను గాంచి చాలమంది స్త్రీలు తమకు తామే దస్యుల వెంటఁ బోయిరి.

మహారాజా! నే నేమి చెప్పుదును? అప్పుడు నా హృదయములో నేయే భావములు రేఁగినవో, నా హృదయ మెట్లు మండిపోయినదో యేమి చెప్పుదును? సింహమునకు గోళ్లు, దంతములు పెఱికిన నెట్లుండునో నా స్థితి అట్లుండెను. నేను ధనుస్సునకు నారిని దగిలించలేకపోతిని. దివ్యాస్త్రములు జ్ఞాపకమునకు రాలేదు. నేను చాల భయపడితిని. దగ్గఱనున్న సైనికుల సహాయమున నెట్లో విల్లుకు నారిని దగిలించి బాణ మును సంధించితిని. కాని అది దస్యుల నేమియుఁ జేయఁజాలక పోయెను. అది వ్యర్థమే అయిపోయెను. కొంచెముసేపు బాణ ములను వదలఁగానే నా బాణము లన్నియు సమాప్త మయ్యెను.''

ధర్మరా జిట్లనెను:– ''అర్జునా! నీ తూణీర మక్షయము గదా! దానిలోని బాణములు తరిగిపోవుగదా!''

అర్జునుఁ డేడ్చుచు నిట్లనెను:— "మహారాజా! ఆ అక్షయత తూణీరములో లేదు. అది వాసుదేవునిలోఁ గలదు. ఆతని తోడనే నా బాణముల అక్షయత పోయినది. నా ఎదుట నిట్టి క్రూరకార్యము చేయుటకు ఆటవిక గొల్లలకు సామర్థ్య మెక్కడిది? బాణము లన్నియు సమాప్తమై, ఏడ్చుచున్న రాణులను బట్టుకొని పోవుటను గాంచి, నేను వారిని విల్లు కొనతో బాదితిని. కాని బాణములే వ్యర్థములు కాఁగా ధను స్సేమి చేయఁ గలదు? ఆరిపోవనున్న హోమాగ్నిలో హవ నము విఫలమైనట్లు నేను చేసిన శ్రమ యంతయు విఫలమైనది. ఊసరభూమిపైనను, వంధ్యాగర్భమందును బడిన బీజము లెట్లు వ్యర్థము లగునో, అట్లే నా పరాక్రమము నిర్వీర్యమై విఫలమై పోయినది.

రాజా! భూమి పండిన తర్వాత మరల భూమిలో చెట్లు పెరిగినట్లును, ఱెక్కలు నఱకఁగా పక్షి యెగురఁజాల నట్లును ఆ రథమే, ఆ గుఱ్ఱములే, అదియే ధనుస్సు, అవే బాణము లైనప్పటికిని నేను నా సారథియగు శ్యామసుంద రుఁడు లేకపోవుటప్పటికి దేనికిని బనికిరానివాఁడ నైతిని. నా బల, పౌరుష, సాహసోత్సాహ, శౌర్య, తేజః ప్రభావము లన్నియు నశించిపోయినవి. విజయము నన్ను వదలి పోయినది. అది నన్నుఁ బరిత్యజించినది. కోరకపోయినప్పటికిని పరాజ యము నన్ను వరించినది. అది నన్ను బలవంతముగ వరించి నది. అభాగిని యగు నా పరాజయమునుబొంది సర్వస్వమును గోల్పోయిన వ్యాపారివలె నేడ్చుచు నచ్చటనుండి వచ్చితిని. ఆహా! ఏ శ్రీకృష్ణుని భార్యలు వాసుదేవుని కృపచే ద్వారకా

పురిలో సువర్ణసౌధాంతరములందు నివసించుచు రత్నసింహాస
నముల మీఁదఁ గూర్చుండి వివిధ దివ్యభోగము లనుభవించు
చుండిరో, ఎంత ప్రయత్నము చేసినప్పటికిని ఆకాశచారులగు
జంతువులుకూడ చూడఁజాలవో, ఎవరి భాగ్యమునకు స్వర్గము
లోని దేవాంగనలు, దేవేంద్రుని భార్యలుకూడ యీర్ష్యను
జెందుచున్నారో, నేఁడు వారు ఆటవిక భిల్లులచే బలాత్కార
ముగఁ గొనిపోఁబడిరి. ఆ దుష్టులా సుకుమారుల నే మే
దుర్దశలపాలు చేసిరోకదా! లోకమునకు అభయదానము
నొసంగు నేను అభాగ్యుఁడనై దేబెవలె నిలుచుండి యీ
దృశ్యమునంతను నా కన్నులారఁ జూచుచుంటిని. వారెంతో
ఏడ్చినను, అరచినను కూడ వారిని రక్షింపఁ జాలకపోతిని.
కాలగతి యెంత క్రూరమైనది? ఈ యదృష్టము ఎక్కడికి తీసి
కొనివెళ్లి పారవేయునో, ఏ దృశ్యమును జూపించునో మనకు
తెలియదు. చరాచర విశ్వప్రపంచమునకు స్వామియగు
శ్రీకృష్ణుని పరిణీతపత్నులకు — ఆతఁడు లేనిసమయమున — నిట్టి
దుర్దశ కలుగునని యెవరైన స్వప్నమందైన నూహింపఁగలరా?
వారి యదృష్టము వారి కిట్టి సంఘటన కలుగఁజేసినది.

ఈవిధముగ, రాజా! నేను లోలోన దుఃఖించుచు
నచ్చటనుండి వచ్చితిని. మిగిలిన స్త్రీలను, పిల్లలను, సేవకు
లను దీసికొని ఇంద్రప్రస్థమునకు వచ్చితిని. సమృద్ధశాలినియగు
నా యింద్రప్రస్థనగరమిపుడు శూన్యముగఁ గనఁబడుచున్నది.
నగరశ్రీ నష్టమైనది. ఇది నాదృష్టిభ్రమయో, యథార్థ
ముగ వెనుకటి శ్రీ, సమృద్ధి, కాంతి, ప్రభలు ఇప్పుడు లేనే
లేవో నేను నిశ్చయింపలేకున్నాను. వాటినన్నిటిని అక్కడనే

నేఁడు మీ దర్శనము కొఱకు హస్తినాపురమునకు వచ్చితిని. రాజా! ఇప్పుడు మనకుఁగూడ అంత్యకాలము సమీపించినది. కాఁ స్వామాపుఁడగు భగవంతుఁడు మనలనుగూడ తనలో లీనము చేసికొనుట కుత్సహించుచున్నాఁడు. ఇఁకఁ గృష్ణవిహీన మగు నీజగత్తులో నొక క్షణమైన నుండరాదు. ఇప్పుడు మనము కూడ మహాప్రస్థానమునకు సిద్ధపడవలయును. మహారాజా! ఇప్పుడు కలియుగమువచ్చినది. లేకున్న నే బుద్ధిమంతులగు యాదవులకు రక్షకుఁడు, శిక్షకుఁడు, ప్రతిపాలకుఁడు శ్రీకృష్ణుఁడో — అట్టివారు పరస్పరము కొట్టుకొని చత్తురా? ఇదంతయు శ్రీకృష్ణ క్రీడఁగాఁ దలఁచుచున్నాను. ఇట్లు జరుగుట ఆతని కిష్టమైనది. నిజమున కాతనికి చుట్టములు పక్కములు లేరు. అందఱు ఆయనకు ఆటవస్తువులు. పాలపిడతతో పాలు త్రాగఁగానే విసరి పారవేసి పగులఁ గొట్టినట్లు ఆతఁడు చేయు చుండును. మహారాజా! ఇఁక మీరు విలంబము కావింపకుఁడు.''

ఇట్లనుచు నర్జునుఁడు దుఃఖించుచుఁ గన్నుల నీరు కార్చుచు మెదలకుండెను.

ఛ ప్ప య.

జీత్యో భారత యుద్ధ దివ్య రథ ఘోడే వే ఈ।
ధనుష వహీ గాండీవ సమర విజయీ సర వే ఈ॥
విశ్వ విదిత హాఁ రథీ సాజ సమాన వహీ హైఁ।
కింతు నహీఁ హైఁ శ్యామ సారథీ వ్యర్థ సభీ హైఁ॥
బుఝీ ఆగి మహాఁ హావన జిమి, ఊసర బోయో బీజ జ్యోఁ।
జిమి సేవా కంజూస కీ, వ్యర్థ హోఇ, హ్వై గయో త్యోఁ॥

అర్థము.

భారతయుద్ధములో జయించితిని. సమరవిజయములగు దివ్యరథము, గుఱ్ఱములు, ధనస్సగు గాండీవము అన్నియు నవియే. విశ్వవిదితుఁడ నగు రథిని ఆ అర్జునుఁడనే. సర్వము నవియే. కాని సారథియగు నా శ్యామసుందరుఁడు లేకపోవు నప్పటికి అన్నియు వ్యర్థములైనవి.

ఆతఁడు వెళ్లిపోఁగానే అగ్ని ఆరిన బూడిదలో హావనము చేసినట్లును, ఊసరక్షేత్రములో బీజములు చల్లినట్లును, లోభివానికి సేవచేసినట్లును అన్నియు వ్యర్థములైనవి.



# యదువంశ వినాశ వార్త

ఉ_ఐ

శ్లో॥ రాజ_స్త్వయాభి పృష్టానాం సుహృదాం నః సుహృత్పురం।
విప్రశాప విమూఢానాం నిఘ్నతాం ముష్టిభిర్మిథః॥

వారుణీం మదిరాం పీత్వా మదోన్మథిత చేతసామ్।
అజానతా మివాన్యోన్యం చతుః పంచావశేషితాః॥

— శ్రీభాగ. ౧ స్కం. ౧౫ అ. ౨౨, ౨౩ శ్లో.

'మ॥ యదువీరుల్ మునినాథు శాపమునఁగాలాధీనులై యందఱుగా
మదిరాపాన వివర్థమాన మద సమ్మర్థోగ్ర రోషాంధులై
కదనంబుల్ దమలోన ముష్టిహతులం గావించి నీఱైరి న
ష్టదశం జిక్కిరి నల్వురేవురచటన్ సర్వంసహా వల్లభా॥'

— శ్రీమదాంధ్ర భాగవతము

ఛప్పయ.

[illegible] బతాఈ సబరీ హామనే।
[illegible] శల నాహీ తేరే కేం తుమనే॥
[illegible] మూఢ పరస్పర లరే బిచారే।
[illegible] మది స్వర్గ సిధారే।
[illegible] లఘు, [illegible] బలీ నిరబలని కూం।
[illegible] మరవాయే హరి సబని కూం॥

అర్థము.

రాజా! నీకు దారిలో జరిగిన దుఃఖవృత్తాంతము నం[illegible] జెప్పితిని. నీవు పేరు వరుసలను ఎవరి కుశలమును [illegible]. వారందఱును మూఢమానవులై పరస్ప[illegible] కొనిరి. బాగుగా సారాయమును ద్రావి మదో[illegible] చచ్చి స్వర్గమునకుం బోయిరి.

పెద్ద జలచరములు చిన్న జలచరముల నెట్లు తినునో, బలవంతులు నిర్బలుల నెట్లు పీకుకొని తిందురో అట్లే యదువం[illegible] కొట్టుకొని చచ్చిరి. ఇంతకు వీరందఱు చచ్చు[illegible] శ్రీకృష్ణుం డొనర్చెను.



అత్యంత దుఃఖకరమగు విషయమును వినఁగానే దానికి సంబంధించిన విషయమును మాటిమాటికి అడుగుటయు, దానికి సంబంధించిన సమస్తకారణమును దెలిసికొనవలయు ననియు జిజ్ఞాస స్వాభావికముగఁ గలుగును. అర్జునుఁడు తన

మార్గవ్యథను గూర్చి చెప్పఁగానే ధర్మరాజు మరల వానితో నిట్లనెను:- "సోదరా! నీవిన్ని విషయములు చెప్పినావు. కాని భగవానుఁడు స్వధామమున కెట్లువెళ్లెనో చెప్పవైతివి. ఆతఁ డొంటరిగా వెళ్లినాడా? ఆతనితోఁగూడ బలరాముఁడుకూడ వెళ్లినాఁడా? మన మామయగు వసుదేవుని గతి యేమైనది? దేవకీ మొదలగు మన యేడ్గురు అత్తల విషయమును జెప్పుము. సమస్త యాదవుల కుశల సమాచారమును గూర్చియుఁ జెప్పుము."

ఇదివిని అర్జునుఁడు పెద్దపెట్టున నేడ్వఁ బ్రారంభించెను. ఆతఁడేడ్చుచు నిట్లనెను:- "రాజా! ఇప్పుడీ విషయము లన్నియు నెట్లు చెప్పుదును? భగవంతుఁడు తన లీల జరుప వలసి యుండును. ఆతఁడూరక పెరిగిపోవుచున్న యాదవ బల పరాక్రమమును హరింపఁదలఁచెను. మహాభారతయుద్ధములో రాజులందఱు పరస్పరము పోరాడుకొనునట్లుచేసి అందఱను జంపెను. ఇఁక మిగిలినది కేవలము యాదవులే. తన భుజబల ముచే రక్షింపఁబడుచున్న యాదవుల నింకెవరును జంపలేరని ఆయనకుఁ దెలియును. అందువలన వారలబుద్ధి భ్రష్టమగునట్లు చేసెను. వారందఱును బరస్పరము పోట్లాడుకొని చచ్చిరి.

ధర్మరాజత్యంతాశ్చర్యముతో నిట్లనెను:- "సోదరా! అర్జునా! నీవిట్లు పలుకుచున్నావేల? యాదవులలోఁ బరస్పరము గొప్పస్నేహము కలదు. వారందఱు శ్రీకృష్ణుని ఆజ్ఞలో నెల్లప్పుడుందురు. వారు పరస్పరమేల పోట్లాడుకొనిరి? నీవు చాల విచిత్ర విషయమును జెప్పుచున్నావే?"

అర్జునుఁ డిట్లనెను:— "విచిత్రము ప్రాపంచికులగు మన కుంకును. భగవంతునకు విచిత్రమేమియును లేదు. అసంభవ కార్యమును లేదు. ఎప్పు డెవరిచే నేమి చేయింపఁ దలఁచి నాఁడో అప్పుడు వారికట్టి బుద్ధిని బుట్టించుచుండును. యాదవు లందఱును స్వాభావికముగ బ్రాహ్మణ భక్తులు. యాదవ బాలకులు తమ బాల్య చేష్టలచే బ్రాహ్మణుఁడు కుపితుడగు నట్లు చేయు బుద్ధిని బుట్టించెను? అతఁడు కోపముచే మండి పోయి యదుకులనాశ మగునట్లు శాపమొసంగెను. బ్రాహ్మ ణుఁడు శాపము పెట్టిన దేమున్నది? భగవంతుఁ డాతని నోట అట్లు పలికించెను. లేకున్న శ్రీకృష్ణునిచే రక్షింపఁబడు యాద వులను శపించుట కాతనికి శక్తి యెక్కడిది? విప్రశాపగ్రస్తు లగు యాదవులు శ్రీకృష్ణునితోఁ బ్రభాసక్షేత్రమునకు వెడలిరి. భగవానుఁడే వారిని బలవంతముగఁ గొనిపోయెను. అక్కడ వారందఱును వరుణలోకమునుండి వరుణునిచేఁ బంపఁబడిన వారుణిని ద్రావి మదోన్మత్తులైరి. ఇప్పుడు వారికి తనవారని, పరాయివారని కర్తవ్యాకర్తవ్యతా జ్ఞానము బొత్తుగాఁ బోయెను. [illegible]లోఁ బరస్పరము ఆక్షేపించుకొనిరి. అందఱును క్రోధమున బూతులు బండెములు తిట్టుకొనిరి. ఇంక కావలసిన దేమున్నది? పోట్లాట ముదిరి ముదిరి పరస్పరము దెబ్బలాటల లోనికి దిగెను. అందఱును తమ సౌహార్ద్ర, సంబంధములను మఱచి ఒకరి నొకరు కొట్టుకొనిరి. అన్నదమ్ములు కొట్టుకొనిరి. తండ్రి కొడుకులు బాదుకొనిరి, మామలు అల్లుండ్రను జంపిరి. బావలు బావమఱఁదులను బొలియించిరి. ఈ విధముగఁ బర స్పరము కొట్టుకొని అందఱును జచ్చిరి. భూభారమంతయుఁ

దీరినదని భగవంతునకుఁ దోఁచఁగానే ఆయనకూడ యోగ సమాధిద్వారా తన శరీరమును గూడ పరిత్యజించెను. బల రాముఁ డంతకు పూర్వమే వెళ్లిపోయెను. రాజా! ఈవిధముగ భగవంతుఁడు తన సమస్త కుల పరివారమును సంహారము కావించి యీ ధరాధామమును వీడిపోయెను. ఇప్పుడు యాద వులలో నలుగురైదుగురు పిల్లలు మాత్రము మిగిలిరి. మిగిలిన వారందఱు స్వర్గస్థులైరి. శ్రీకృష్ణుని వంశములోఁ గేవలము అనిరుద్ధుని పుత్రుఁడగు వజ్రుఁడు మాత్రము మిగిలెను.''

ధర్మరా జిట్లనెను:— ''అర్జునా! ఇట్లైన దేమి? తన వారు పరాయివారని తెలియని యిదేమి మదాంధత! భగవా నుఁడు వీరికి రాజీ చేయలేదా? ఆతఁ డనుగ్రహ నిగ్రహము లలో సమర్థుఁడే. ఆతఁడుండఁగా యాదవులు పరస్పర మెట్లు పోరాడి చచ్చిరి?''

అర్జునుఁ డేడ్చుచు నిట్లనెను:— ''మహారాజా! మీ కన్నియును దెలిసియు నిట్లడుగు చున్నారేల? మనము కౌరవ పాండవులము అన్నదమ్ములము కాదా? మనకు రెండువైపుల నందఱు బంధులే కదా! శ్యామసుందరుఁడు మనకు మధ్య లేఁడా? ఆతని కిష్టములేకున్న మహాభారతయుద్ధము జరిగి యుండునా? ఆతని కిష్టము లేకున్న పదునెనిమిది అక్షౌహిణీసేన యేల? ఒక్క చీమైనఁ జావదు. ఆతఁడు భూభార మడంపవలసి యున్నది. బలవంతుల నందఱను జంపవలసి యున్నది. తాను నేర్పిన నటనను నటకులు ఈ ప్రకృతి రంగమున నాతఁడు చెప్పినట్లాడుచు, నేడ్చుచు, నవ్వుచు, పోట్లాడుకొనుచు,

యుద్ధము చేసికొనుచు నుండఁ దాను సూత్రధారుఁడై ప్రేక్షకులలోఁ గూర్చుండి తాను దెలియని వానివలె నిర్లేపుఁడై యుండును. నాటకము పూర్తి కాఁగానే, నటకులు నిష్క్రమించఁగానే తానును లేచి తన యింటికిఁ బోవును. నాటకమంతయుఁ బ్రారంభము మొదలు చివర వఱకు ఆతని ప్రేరణచే నాడఁబడు చున్నప్పటికిని, ఏ పాత్రను ఏ విధముగ నటింపవలయునని నిర్దేశించెనో ఆ విధముగ నా పాత్ర నటించి నప్పుడు అజ్ఞుఁడగు దర్శకుఁడు దాని మర్మమును గ్రహింపఁ జాలఁడు. ఫలాని పాత్ర బాగుగాఁ గరుణారసమును జూపించినాఁడు, ఫలానివాఁడు తన అభినయమును మిక్కిలి బాగుగఁ బ్రదర్శించినాఁడని తలఁచునట్లు ప్రతివారి హృదయములలోఁ బ్రేరణ చేయువాఁడు కూడ ఆ శ్యామసుందరుఁడే. మహాభారత యుద్ధములో బంధువులందఱు ఎట్లు కొట్టుకొని చచ్చిరో, యాదవుల స్థితియు నట్లే యైనది. చేయించువాఁడు భగవంతుఁడే. వారందఱు పోరాటమునకు సిద్ధపడినప్పుడు భగవానుఁడు వారిలో మధ్యకు పోయి యిట్లు చెప్పినాఁడు:—

"సోదరులారా! ఇదేమి పని? ఎందులకు పోట్లాడుకొను చున్నారు? మనలో మనము పోట్లాడుకొనుట తగదు. తీర్థములో నిట్లు బూతులు, తిట్లు తిట్టుకొనకుఁడు" ఇట్లు భగవానుఁడు చెప్పి, యెట్లైనఁ బోరాటము మాన్పింపఁ బూనఁగా, వారు మదోన్మత్తులై మహామూఢులై అందఱును గలిసి భగవంతునే కొట్టవచ్చిరి. భగవానుఁడు వారి బుద్ధిని భ్రష్టము కావించెను. "వినాశ కాలే విపరీత బుద్ధిః" వినాశకాలమున విపరీత బుద్ధులు పుట్టుచుండును. వారు భగవన్మహిమమును

మఱచిరి. అప్పుడు భగవానుఁడుకూడ కొట్టఁ బ్రారంభించెను. మన గతి యెట్లైనదో యాదవుల గతియు నట్లేయైనది."

ధర్మరాజిట్లనెను:— "సోదరా! మనము రాజ్యము కొఱకు పోరాడితిమి. అదియునుగాక విశేషించి ద్రౌపదికి అవమానము చేయుటచే మన మత్యంత కుపితుల మైతిమి. పోరాటమునకు కారణములు ముఖ్యముగ మూఁడే యుండును. ధనము, ధరణి, ధర్మపత్ని. యాదవులు కొట్టుకొని చచ్చుట కీ కారణ లేవియును లేవు. వారందఱు సమృద్ధిశాలురు. ధన ధాన్యములకు వారికి కొదువలేదు. అందఱును ఉగ్రసేనుని శాసనమున నున్నారు. అందఱుఁ దమ తమ పత్నులందు సంతుష్టులు. అట్టి యెడ నందఱుఁ గొట్టుకొని చచ్చునంతటి కలహమేల కలుగ వలయును?"

అర్జునుఁ డత్యంత దుఃఖముతో నిట్లనెను:- "మహా రాజా! ఇవన్నియు బాహ్యకారణములు. ఇవన్నియు నిమిత్త ములు. కాలమాసన్నము కాఁగానే వీటిని నిమిత్తముగాఁ జేసికొని ప్రజలు పోరాడుకొను చుందురు. ఇంతకు వాస్తవిక విషయమేమనఁగా వాసుదేవుఁడు కాలరూపుఁడై అందఱకు కాలము నిశ్చితము కావించినాఁడు. ఆసమయము రాఁగానే జీవుల నేదో విధమునఁ జంపును. కాలమాసన్నమైనప్పుడే సర్ప, చోర, విషాగ్ని, శస్త్రములు నానావిధములను రోగ ములు జీవులను జంప సమర్థము లగుచుండును. భగవంతుఁడు మొట్టమొదట జీవులద్వారా జీవులను బుట్టించును. సూర్య చంద్రులయొక్క రజోవీర్యముల సంయోగముచే భగవంతుఁడే

జీవులను బుట్టించును. మరల నాజీవుల మూలముననే కాల మాసన్నము కాఁగానే వారిని నాశము కావించు చుండును. ఆఁడు పాము గ్రుడ్లనుబెట్టి పిల్లలను జేసి మరల వాటినే తిను చుండును. అట్లైనను అన్నిటిని దినదు. వాటిలో వేటికి కాల మాసన్నమైనదో వాటిని దినును. వేటికి కాలేదో అవి తప్పించుకొనిపోయి బ్రతుకును. నీటిలోని చేఁపలు చిన్న చిన్న చేఁపలను దినును. ఆపెద్ద చేఁపలను అంతకంటెఁ బెద్దచేప యగు తిమి అను చేఁప తినును. ఆ తిమిని దిను ఒక పెద్ద ద్వీపమంత చేఁపకు తిమింగిలమని పేరు. చిన్న చిన్న పతంగములను కప్ప తినును. కప్పను పాము తినును. పామును నెమలి తినును. నెలిమిని ప్రజలు చంపుదురు. ఎలుకను పిల్లి తినును. పిల్లిని కుక్క చంపును. దుర్బలమగు కుక్కను బలము గల కుక్క ఓడించును. ఈ విధముగనే అల్పులధికులచేఁ జత్తురు. నిర్బలులను బలవంతులు బాధించి చంపుదురు. దీనికి దోషమెవరిది? ఆ భగవంతుఁడే బలము నొసంగి అందఱకు శక్తి నొసంగును. ఒకరివలన నొకరిని బుట్టించి, మఱియొకనిచే జంపించును. రాజా! ఇదియంతయు నాతనికి బొమ్మలాట. ఇది యాతని వినోదము. ఇందు యాదవుల దోషమును లేదు. కౌరవుల దోషమును లేదు. విచారింపఁగా పాంచభౌతిక పిండము ప్రభుప్రేరణ లేక నేమియుఁ జేయఁజాలదు.

రాజా! మనము భగవల్లీలను అప్పుడు తెలిసికొనఁజాలక పోయితిమి. చివరకిట్టి దుర్దశ కలుగునని మన కేమి తెలియును! మనకు శ్రీకృష్ణుని అనుపమ కృప కలదను గర్వము కలదు. మన కాతని పునీతప్రేమ ప్రాప్తించినది.

ఆతఁడు మనతో నెంత కలసిమెలసి మాట్లాడెడువాఁడు! ఎంత స్నేహమును జూపెడువాఁడు! మన కార్యములలోఁ బ్రతి కార్యమునకు ముందుగా నెట్లుండెడువాఁడు! నా కాతఁడు తన ప్రేమనంతను అర్పించెను. స్నేహ భరితమగు హృదయమును ఆతఁ డుదారతతో నామీఁద విసరివేసెను. ఏసమయమున నేప్రదేశమున నెట్లు మాట్లాడవలయునో అట్లు మాట్లాడెడు వాఁడు. నేను కడుపు చెక్కలగునట్లు నవ్వునట్లు అంతఃపుర ములో స్త్రీల సమ్ముఖమున వినోదములు కావించెడు వాఁడు. రాణులు సిగ్గుపడి కోపమును జెంది కనుబొమ్మలు ముడిచి ప్రణయకోపమును బ్రకటించెడువారు. అడవులకు వెళ్లిన నచ్చట దానికి సంబంధించిన పలుకులు పలికెడు వాఁడు. యుద్ధములందు నన్ను వీరరసమున ముంచి తేల్చుచుండును. ఆతఁడెన్నడును అసామయిక వాక్కులు పలుకలేదు. ఏమాట ఎప్పుడు మాటాడుటకు సమయము చిక్కునో అప్పుడు దానిని మాట్లాడును. ఆతఁడెంతో దేశ కాల పాత్ర మర్మము లెఱిఁగినవాఁడు. ఏపని చేసిన మన ప్రయోజనము సిద్ధించునో ఆకార్యమునే చేయుమనును. ఆతఁడు దానినే చేయును. ఆతఁడు ప్రయోజనము లేని వాక్కులు పలుకుట నేర్వనే లేదు. వ్యర్థకార్యము లనిన నాతనికి మంట. అట్టి పనులు నన్నుఁ గూడ చేయవలదను చుండును.

నే నేదైన కారణమునఁ జింతించితినా, అప్పుడతఁడు మధుర స్వరమున నోదార్చును. నే నేవిషయముననైన విమూఢుఁడనైతినా, అప్పుడు అనేకములగు ఉత్తమ యుక్తులను జెప్పి, యా మోహమును ఛిన్నభిన్నము చేయును.

నేను దుఃఖించుట ఆతఁ డెన్నడును జూడఁ జాలఁడు. మ్లాన మగు నా ముఖమును నాతఁ డెన్నడును జూడఁ దలఁపఁడు. నేను నేఁడు దుఃఖితుఁడను కాఁగా నేల రాఁడు? ఏల వచ్చి నాకు ధైర్యము చెప్పఁడు? నా శోకము నేల శాంతింపఁ జేయఁడు?"

ఈ విధముగ శ్రీకృష్ణవిరహముచే విరహితుఁడైన అర్జునుఁడు నిరంతరము శ్రీకృష్ణచరణారవిందములను ధ్యానించుచు తల్లీనుఁ డయ్యెను. ఆ తల్లీనతాకారణమున నతిశయించిన భగవద్భక్తి అర్జునుని అఖిలాశుభములను నాశము చేసి అతని బుద్ధిని నిర్మలముగను శాంతముగను నొనర్చెను. అత్యంత వేగవతి యగు భక్తి అర్జునుని కామ, క్రోధ, మద, మత్సరాది మలములను నాశము చేయఁగా, మహాభారత యుద్ధములో శ్రీకృష్ణుఁడొసంగిన గీతాజ్ఞానమును అర్జునుఁడు కాల కర్మ జన్య తమోగుణముచే విస్మృతి చెందెను. అది మరల నిప్పుడు జ్ఞాపకమునకు వచ్చెను. వర్షముచేఁ గ్రిందపడిపోయిన యింటిలోఁ బాతిపెట్టఁబడిన సువర్ణరాశి మరల త్రవ్వఁగాఁ గనఁబడినట్లు, విరహజనితాశ్రువులు ప్రవహించుటచే నిర్మలమైన అంతఃకరణమునందు, ఆ దివ్యజ్ఞానము మరల సమస్త విధముల నట్లే తోఁచెను.

ఈ విధముగ నజ్ఞాననాశనము కాఁగా — తమోగుణము పోఁగా — నాతనికి బ్రహ్మజ్ఞానప్రాప్తి కలిగెను. ఆతఁ డంతటను శ్యామసుందరునే చూచుచుండెను. సర్వత్ర తన యిష్టదైవము కనఁబడఁగానే తనలోఁగూడ ఆతఁడు కనఁబడెను.

అప్పుడాతనికి సమస్త శోకమోహములు పోయెను. ఇప్పుడాతనికి మాయావరణ తొలఁగుటచే నాతనికి భేద భ్రమ తొలఁగెను. ఆతఁడు గుణాతీతుఁ డయ్యెను. తాను అర్జునుఁడను సంగతిని ఆతఁడు మఱచెను. ఆతఁడు స్థూల, సూక్ష్మ, కారణశరీరములు తన కన్యముగా నున్నవని తెలిసికొనెను.

ఈ విధముగ ధర్మరాజు యదుకుల సంహార వృత్తాంతమును విని, ముందు తన కర్తవ్యమును నిశ్చయించుకొనెను.

ఛప్పయ.

కైసీ క్రీడా కరేఁ కౌతుకీ శ్యామ ఖిలారీ!
విషయవాసనా బద్ధన సముఝతి బుద్ధి బిచారీ॥
జీవ జీవ సోఁ కరేఁ జీవ తేఁ పుని మరవావేఁ।
కరహిఁ పరస్పర ప్యార శత్రుతా పుని కరవావేఁ॥
మహారాజ! సబ కాజ తజి, చలో విజయ వన తనుతజో।
రాజపాట ధనధాన గృహా, ఛోరి మోరి ముఖ హరి భజో॥

అర్థము.

జగన్నాటక సూత్రధారుఁడగు శ్యామసుందరుఁడు ఎట్టి కౌతుక క్రీడను గావించుచున్నాఁడు! విషయ వాసనాబద్ధులగు జీవులు దీనిని దెలిసికొనలేక పోవుచున్నారు కదా! జీవుల సంయోగముచేతనే జీవులను సృష్టించుచున్నాఁడు. మరల జీవులచేతనే చంపించుచున్నాఁడు. పరస్పర ప్రేమ కలుగునట్లు చేయుచున్నాఁడు. మరల శత్రుత్వమును కలుగఁజేయుచున్నాఁ .

మహారాజా! సమస్త కార్యములను త్యజించి విజయ వనమునకుఁబోయి శరీరమును జాలింతము. రాజ్యమును, ధన ధాన్యములను, గృహమును వదలి నాసమ్ముఖమున హరిని భజించుము.



# శ్రీకృష్ణ వియోగమున కుంతీ దేహత్యాగము

## ౬_౩

శ్లో॥ పృథాప్యనుశ్రుత్య ధనంజయోదితమ్
నాశం యదూనాం భగవద్గతిం చ తామ్।
ఏకాంత భక్త్యా భగవత్యధోక్షజే
నివేశి తాత్మోపరరామ సంసృతేః॥

—శ్రీభాగ. ౧ స్కం. ౧౫ అ. 33 శ్లో.

"కం. యదువుల నాశము మాధవు
పదవియు విని కుంతి విమలభక్తిఁ భగవ
త్పద చింతాతత్పరయై
ముదమున సంసారమార్గమునకుం బాసెఁ."

—శ్రీమదాంధ్ర భాగవతము

ఛప్పయ.

భయో ఘోర సబ ఓర శోక ఘర-ఘర మేఁ ఛాయో।
కుంతీమాతా సునీ ద్వారకా తేఁ సుత ఆయో॥

స్వామీ సరబస సగే బాహిరీ ప్రాణ హమారే॥
వే హరి హమకూఁ త్యాగి హాయ్! వైకుంఠపధారే॥
నాశ భయో యదువంశ కో, లరి భిరి కేఁ సబ మరిగయే।
తను త్యాగో తత్కాల మాఁ, శోకాకుల సుత సబ భయే॥

అర్థము

తెల్లవారినది. ఇంతలో నలుదిక్కుల నీసంగతి తెలిసి యింటింట శోకము వ్యాపించెను. ద్వారకనుండి తన కుమారుఁడు అర్జునుఁడు వచ్చినాఁడని తెలిసికొని కుంతివిని, శ్రీకృష్ణుఁడు మనకు సర్వస్వము, బాహ్యప్రాణము, స్వామి అట్టివాఁడు మనలను వీడి వైకుంఠమునకుఁ బోయెను. యదువంశమంతయును బరస్పరము కొట్లాడుకొని చచ్చి నాశనమైరని తెలిసికొని కుంతి ఆక్షణమునే ప్రాణములు విడిచెను. తల్లి చావఁగానే కొడుకులగు పాండవు లందఱును శోకాకులులైరి.



సుఖ సమయము నిమిషములో గడచిపోవును; కాని దుఃఖసమయము ఎంతకును గడవదు. అది పర్వతమువలె నగమ్యముగను, క్షణక్షణము కల్పముగను దోఁచును. రాత్రి ప్రళయరాత్రికి అతిశయించును; కాని ఆ సమయమున భగవచ్చర్చతోను, కృష్ణగుణ నామ కీర్తనములతోను కాలము గడుపునెడల దుఃఖము కూడ సుఖముగ మారును. శోకమానందముగ మారును. కాలము సుఖముగ గడుచును.

అర్జునుఁడు ద్వారకనుండి ఇంద్రప్రస్థమునకు వచ్చెను. ధర్మరాజు రాజధాని ఇదివఱకు ఇంద్రప్రస్థమే. కాని మహా

భారత యుద్ధములోఁ గౌరవులందఱు చచ్చిన తర్వాత, తన [illegible] సింహాసనమును హస్తినాపురమందే నిలిపెను. కొన్నాళ్లు ఇంద్రప్రస్థములోను, కొన్నాళ్లు హస్తినాపురమందును ఉండెడువాఁడు. అర్జునుఁడందఱను దీసికొని ఇంద్రప్రస్థమునకే వచ్చెను. అక్కడికి రాఁగానే ధర్మరాజాదులు, [illegible] హస్తినాపురమందున్నారని తెలియఁగా, ద్వారకనుండి వచ్చినవారి నందఱ నచ్చటనే దిగవిడిచి, కృష్ణపౌత్రుఁడగు వజ్రుని వెంటఁబెట్టుకొని హస్తినాపురమునకు వచ్చెను. అర్జునుఁడు చాల దుఃఖించుచుండెను. అడవి గొల్లలచే నోడింపఁబడుటచే నాతనికి మానసిక గ్లానికూడ సంభవించెను. ఆతఁడు తన ముఖము నెవరికిని జూపించుట లేదు. ఎవరైన నెదురు పడితా అతనికి సిగ్గువేయుచుండెను. ధర్మరాజు సమక్షమునకుఁ దప్పక వెళ్లవలసియే యుండును; ఈ సమాచారమును జెప్పవలసియే యుండును. కావున నాతఁడు నగరసమీపమున నొకచోట దాగియుండి చీకటిపడిన తర్వాత నెవరికిని దెలియకుండ వచ్చెను. అతఁడు వజ్రుని ఒక సురక్షితస్థానమున దిగవిడచెను. అతఁడు హంతకునివలె ముఖమున గుడ్డ కప్పుకొని యొక్కఁడు యుధిష్ఠిరుని దగ్గఱకుఁ బోయెను. కావలివాఁడు లోపలికిఁబోవ నడ్డగించెను. కాని యాతఁడు వాని చెవిలో నెవరితోఁ జెప్పవలదని చెప్పెను. తమ ప్రభువున కిట్టిదశ కలుగుటను గాంచి భయపడి, పాదముల మీఁదఁబడెను. అర్జునుఁడు సభాభవనము లోనికి వెళ్లిపోయెను. ఆసమయమున ధర్మరాజు తన ప్రధాన మంత్రులతోడను, సోదరులతోడను, అంతరంగ స్నేహితులతోడను గూర్చుండి భగవత్సంబంధమైన యాలో

చనయే చేయుచుండిరి. అదే సమయమున నర్జునుఁ డీ వేష ముతోఁ గనఁబడుటను గాంచి, ఆతఁ డొక్కసారిగా ననేక ప్రశ్నలను గురిపించెను. అర్జునుఁ డందులో నొక్కదానికిని ప్రత్యుత్తర మీయ లేదు సరిగదా, ఊరక యేడ్చుచుండెను.

యదుకుల సంహారము విషయమును, భగవానుఁడగు శ్రీకృష్ణ నిర్యాణ వృత్తాంతము జెప్పఁగానే అందఱును శోక సాగరములో మగ్నులైరి. బుద్ధిమంతుఁడగు ఒక వృద్ధమంత్రి, ఆరాత్రి యీసమాచారమంతయు నంతఃపురములోఁ గాని, నగరములోఁగాని ప్రాకకుండునట్లు బయటవారు లోపలకు రాకుండునట్లును, లోపలివారు బయటకు పోకుండునట్లును ద్వారములను బంధింపఁజేసెను. ధర్మరాజున కేమియును దెలియకుండెను. ఆతనికి తన శరీరజ్ఞానమే లేదు. ఆతఁడు ప్రాణములుకూడ ధరింపలేకుండెను; కాని యాతఁని ప్రాణ ములు నిలుపుకొనుట కొక్కటియే ఆధారము. అది శ్రీకృష్ణ కథ. శ్రీకృష్ణ కథను వినుచుండఁగా నాతఁడు భావములో శ్రీకృష్ణ సంయోగ సుఖానుభవమును జెంది, వియోగజన్య దుఃఖమును మఱచెను. ఆతఁ డర్జునుని నోట శ్రీకృష్ణకథను విని తల్లీనుఁడై పోయెను. అందుచే నారాత్రియంతయు నొక్క క్షణముగ గడచిపోయెను.

ఈ విధముగా నర్జునుఁడు సమస్త యాదవ సంహార వృత్తాంతమును వినిపింపఁగా ధర్మరాజు చాల దుఃఖము చెందెను. ఇఁక నిప్పు డీ భూమి భగవత్పాదపద్మ శూన్యమగు టచే దానిమీఁద నుండుట ఆతని కిష్టము లేకుండెను. ఆతఁడు

తన శోకాతిశయమును ఆత్మజ్ఞానముచే నాపుకొనెను. చిత్తమును స్థిరము కావించి సోదరు లందఱితో నాలోచించెను. ఆతఁడు సోదరులతో నిట్లనెను:— "భగవత్పాదపద్మ రహితమైన యీ భూమియం దిప్పుడు ధర్మముండదు. సద్గుణము లన్నియు భగవంతునితోఁగూడ స్వధామమునకుఁ బోయినవి. ఇప్పు డంతటను ఈ భూమియందు అధర్మ సామ్రాజ్యము వ్యాపించును. ఎక్కడ చూచినను కలహమే. కావున మన మందఱ మేమి చేయవలసి యున్నది? నాకుమాత్ర మింక నొక్క క్షణమైన జీవింప నిష్టము లేదు. నేను త్తరఖండము నకు వెళ్లి యీ శరీరమును వదలవలె ననుకొనుచున్నాను. చెప్పుడు. మీ యందఱ యభిప్రాయ మేమి?"

ఏడ్చుచు భీమసేనుఁ డిట్లనెను:— "రాజా! మాకు వేరుగా వ్యక్తిత్వములేదు. శరీరమందు చేతులు, పాదములు, ముక్కు, చెవులు, నోరు మొదలగు అంగము లెట్లో, అట్లే శరీరరూపమగు నీకు మేము సోదరులందఱము అంగములము. శరీర మెచ్చటకుఁ బోయిన, శరీరముతోఁ గూడ స్వతః అన్నియు వెళ్లవలసినదే. కావున ప్రభూ! మమ్ముల నడుగు టెందులకు? మీ కేది గతియో మాకు నదియే గతి. మేము మా యింద్రియములను, అంతఃకరణమును, అన్నిటిని మీతోఁ గలిపితిమి. మేము మీరు చేయుపనితో నెన్నడు జోక్యము కలుగఁజేసికొనలేదు. మీరు మమ్ముల జూదములో పణముగఁ బెట్టితిరి. దుర్యోధనునకు దాసులమైతిమి. ఆతని కధీనుల మైతిమి. మహారాజా! మాకు ప్రత్యేకము వ్యక్తిత్వమే యుండునెడల, దుర్యోధనుఁ డిన్నాళ్లు బ్రదికి యుండునా?

ద్రౌపదియొక్క అలినీలాలక సమానమగు వెండ్రుకలను బట్టుకొని దుష్టుఁడగు దుశ్శాసనుఁడు పట్టిలాగునపుడు మాకు ప్రత్యేకము వ్యక్తిత్వముండి, ఏమైనఁ జేయఁగలుగు స్వతంత్రమే యుండు నెడల వాని శరీరమునఁ జేతులుండఁ గలవా? మహారాజా! మేము మీ కధీనులమైతిమి. మీ రేది నిశ్చయము కావించిన, మాకు నదియే మంగళప్రదము కాఁగలదు.''

ధర్మరాజు గంభీరస్వరమున నిట్లనెను:— '' నిజమే. ఇఁక నిప్పుడు మీ రన్నిటిని వదలుఁడు. పరీక్షిత్తు ఇప్పుడు సర్వసమర్థుఁ డైనాఁడు. వానికి నేఁడే రాజ్యాభిషేకము చేయవలయును. వజ్రునకుఁగూడ ఇంద్రప్రస్థములో సమస్తమాథుర మండల సింహాసనము మీఁద నిచ్చుటనే అభిషేకము కావింపవలయును.'' అంత సహదేవుని వైపునకుఁ దిరిగి యిట్లనెను:— '' సహదేవా! వెంటనే వెడలి సమస్త యేర్పాటులను గావింపుము.''

చేతులు జోడించి సహదేవుఁ డిట్లనెను:— '' మహారాజా! ఏమి యేర్పాట్లు చేయవలయును?''

సహదేవుఁ డిట్లు సంభ్రాంతుఁడై ప్రశ్నించుటనుగాంచి, అధికారస్వరమున ధర్మరాజాతని కిట్లనెను:— '' సహదేవా! నీ వింతటి బుద్ధిమంతుఁడవు, జ్ఞానివి, ధ్యానివి, పండితుఁడవయ్యు నిట్టి మోహజనితవాక్యములను బలికెద వేల? సోదరా! కావలసిన దేమో అయినది. భగవానుని విధి విధానము నెవరును దాఁటఁజాలరు. కావున నీవు ధైర్యమును వహించుము.

వీరుగో మన పూజ్య పురోహితులు ధౌమ్యులవారున్నారు, కృపాచార్యులున్నారు. చేయుటకుఁ జేయించుటకు వీరంద ఱున్నారు. నేఁడు సాధారణపద్ధతిని నియమానుసారముగఁ బరీక్షిత్తును రాజ్యసింహాసనమునఁ గూర్చుండఁ బెట్టుఁడు. విశేషోత్సవములను వీరందఱుఁ జేయుచుండఁగలరు. వానిలో రాజకార్యములను జేయు బుద్ధివిశేషము లింకను లేవు. రాజ్య శాసనము లన్నియు మనవంశమునకు మాననీయులగు విప్ర బృందము చేయఁగలరు. కేవలము వీరి యాజ్ఞానుసారము జరుగుచుఁ బేరున కాతఁడుండఁ గలఁడు. వీరి నడిగి, వీ రెట్లు శలవొసంగిన నా యీ సామగ్రి యంతయు దొరకినంతవఱకు సమకూర్చి, నేఁడే నా యీ ఛత్రము పరీక్షిత్తు శిరస్సున నుంచవలయును. ఆతనిని ఛత్రపతిని గావించి నాకర్తవ్యము నుండి ముక్తుఁడ నయ్యెదను. భరతవంశ పరంపర అక్షుణ్ణ మగుఁగాక! అంత మనమందఱమును మహాప్రస్థాన పథమున నగ్రేసరుల మగుదుము.''

సహదేవుఁడు చేతులు జోడించి యిట్లనెను:— ''చిత్తము. ఆజ్ఞానుసారము!'' అని సహదేవుఁడు లేవఁగా నంత నర్జునుఁ డిట్లనెను.— ''మహారాజా! నేను అంతఃపుర ములో తల్లినిగూడ దర్శించి రాఁగలను. నేను వచ్చిన సమా చార మామెకు తెలిసియుండవచ్చును. ఈతఁడు నాదగ్గఱ కేల రాలేదని యామె చింతిల్లుచుండవచ్చును.''

ధర్మరా జిట్లనెను:— ''నిజమే. నీ వంతఃపురమునకుఁ బొమ్ము. భీముఁడచ్చటకు వెళ్లి సేనలను దయారు చేయుఁగాక!

పురవాసు లందఱును పరీక్షిద్రాజ్యాభిషేక ప్రయత్నము చేయ వలసినదిగఁ జేయవలయునని నకులునితోఁ జెప్పెను.'' ఈ విధముగ నందఱ కాజ్ఞలనొసంగి ధర్మరాజు నిత్యానుష్ఠానమునకు లేచెను. ఆతఁడు లేవఁగానే మంత్రులందఱును, బురోహితులును, రాజ్యాధికారులును లేచిరి.

అర్జునుఁడు నమస్కరించి యంతఃపురము వైపున కొక్కఁడే వెడలెను. చేతులు జోడించుకొని యాతని వెంట వచ్చు నౌకరులను ఆపి యిట్లనెను:— ''నా వెంట నెవరును రావలసిన పనిలేదు. మీ రందఱు మీ మీ పనులను జూచుకొనుఁడు. నాకంతఃపురమార్గము తెలియును.''

నేఁడు తమ ప్రభువిట్లు రూక్ష ఉత్తరువు నొసంగుట గాంచి సేవకులందఱును జింతించి, దుఃఖమనస్కులై తిరిగి పోయిరి.

కుంతీదేవి ఒక వృద్ధదాసీ మూలమున ద్వారకనుండి అర్జునుఁడు వచ్చినాఁడను సంగతి సందిగ్ధముగ వినెను. ఎంతో సేపు రాత్రి మేల్కొన్నప్పటికిని అర్జునుఁ .. రాకపోవునప్పటికి, ఆమె ఆ దాసీతో మాటిమాటికి ఇట్లడుగుట ప్రారంభించెను:— ''ఏమే! నీవు అర్జునుఁడు వచ్చినాఁ డనుచున్నావు. ఒకవేళ వచ్చిన మొట్టమొదట నాకు పాదాభివందనము చేయుటకు వచ్చియుండును. నీవు వెళ్లి, సభలో నెవ్వైనఁ గూర్చుండె నేమో చూచిరమ్ము'' విచారముతో దాసి వెడలి, తిరిగివచ్చి యిట్లు చెప్పెను:— ''మహారాణీ! నేఁడు సభాద్వారము బంధింపఁబడి యున్నది. కావలివాఁడు నన్ను పోనీయ లేదు.

[illegible] నేఁ [illegible] తన భవనమునకుఁ బోలేదు. [illegible] రాజ్యకార్యము లుండి యుండవచ్చును. నాకు [illegible] దేమో! పాండవమధ్యముఁడు ద్వారకనుండి [illegible] లేదేమో?"

[illegible] దేవికి ఈ సందిగ్ధ వాక్యములచేఁ జాల వికలత [illegible]. "[illegible]లిన నలుగురిలో నొక్కరైనను నాకు ప్రణా[illegible]ము చేయరాలేదు. వీరిలో నెవరును రాత్రి భోజనము చేయ లేదు. సభాద్వార మేల మూయఁబడి యున్నది. అట్టి రాజ కార్యము లేమి సంభవించినవి? దాసి నేను పాండవమధ్యముని పోవుచుండఁగాఁ జూచితినని చెప్పినదే. ద్వారకనుండి అర్జు నుఁడు వచ్చెనా? ద్వారకలో నశుభసంఘటన మేమియు జరుగలేదు కదా! శ్యామసుందరున కేమియు ననిష్టము జరుగలేదు కదా!" ఇట్లు తలఁచుచు కుంతీదేవి యధీర [illegible]య్యెను. ఆమెకు రాత్రి నిద్రపట్టలేదు. ఆమె రాత్రియం [illegible] తర్కవితర్కములు చేసికొనుచు, గడి [illegible]లు లెక్కించుకొను చుండెను. ప్రాతఃకాలమున సూత, [illegible] మాగధు [illegible] ప్రాతఃకాలపు స్తుతులను ప్రారంభించు [illegible] ప్రబ్దలు కాఁజొచ్చెను. ఆమె [illegible] గూర్చిన శంకయే ఉండి ఉండి [illegible] ననిష్టమే తోఁచు [illegible]. ప్రేమ హృదయము శంకలతో నిండియుండును.

[illegible]దయము కాఁగానే దాసీలు వచ్చి అర్జునుఁడు [illegible] చెప్పఁగానే స్వాభావికముగఁ జిరకాలము

పుత్రవియోగము కలిగిన తర్వాత చూచినపుడు కలుగవలసిన అనుపమాహ్లాదము ఆమె కేలనో కలుగలేదు. ఆమెకు మాటి మాటికి ద్వారకా సమాచారము విషయమున ననేక శంకలు కలుగుచుండెను. అర్జునుఁడు వచ్చి తన వృద్ధమాతకు నమస్కరించెను. ఆతఁడామె అరుణచరణములపై శిరమునిడి ప్రణమిల్లెను. తల్లికి ప్రణమిల్లు కుమారుని తల్లి ప్రేమతోఁ గౌఁగిలించుకొనెను. శిరము మూర్కొని, కరమున నిమిరి వివిధములగు నాశీర్వాదము లొసంగెను. ఆమె కుశలప్రశ్నమడుగక యే యిట్లనుట కారంభించెను:— "నాయనా! నీవు నిన్ననే వచ్చితివని వింటిని. ఇది నిజమేనా? నిజమైనచో నీవు నిన్ననే నావద్ద కేల రాలేదు? మీరు ద్వారమును బంధించి సోదరులతో నేమి యాలోచనము చేయుచున్నారు? ఇదివఱకు నీవెక్కడికి వెళ్లివచ్చినను రాఁగానే మొట్టమొదటగా నావద్దకు ప్రణమిల్లుటకు వచ్చెడివాఁడవు. నేఁడు ద్వారకనుండి రాఁగానే నీవు విపరీతముగ వర్తించితివేల? ఇన్ని దినములకు నన్నుఁ జూచియు నీవు సంతోషముతో లేవేల? నీముఖము మలినముగ నున్నదేల? నీకాంతి తగ్గినదేల? ద్వారకలో నందఱును కుశలమేనా? మా అన్న వసుదేవుఁడును, ఆతని పుత్ర పౌత్రులందఱును బాగున్నారా? అందఱి విషయము తర్వాత చెప్పవచ్చునుగాని, నాహృదయ ధనము, జీవన సర్వస్వము నగు శ్యామసుందరుని సమాచారమును జెప్పుము. ఆతని కుశలవార్తను చెప్పుము. ఆతని కుశలము మీఁదనే సమస్త విశ్వప్రపంచ కుశల మాధారపడి యున్నది."

ఒక్కనాఁడిగా తల్లి యిన్ని ప్రశ్నలు వేయుటను విని
యర్జునుఁ డేడ్వఁ బ్రారంభించెను. ఏడ్చుచు నాతఁ డిట్లనెను:-
"అమ్మా! కుశలమేమో శ్యామసుందరునితోనే పోయినది.
యాదవులందఱు పరస్పరము పోరాడుకొని స్వర్గమునకుఁ
బోయిరి. బలరామునితో వాసుదేవభగవానుఁడుకూడ స్వధా
మమునకుఁ బోయెను. ఇప్పుడు మీ వంశమున నొక్క అనిరుద్ధ
కుమారుఁడగు వజ్రుఁడు మాత్రము మిగిలెను."

సంభ్రమముతో తల్లి యిట్లడిగెను:—"ఏమీ! శ్యామ
సుందరుఁడీ ధరాధామమును వీడి పోయెనా?"

ఏడ్చుచు నర్జునుఁ డిట్లనెను:— "అవునమ్మా! ఈ
పృథివి విధవ అయినది; మన మనాథులమైతిమి. శ్యామసుంద
రుఁడు మనలను వీడి పోయెను."

ఇది వినఁగానే శ్రీకృష్ణునే సర్వస్వమని తలఁచు కుంతీ
దేవి హృదయము బ్రద్దలయ్యెను. గుండ్లు నిలిచిపోయెను.
ఆ క్షణముననే ఆమె శరీరమునుండి ప్రాణములు లేచి శ్యామ
సుందరుని వెదుకఁ బోయెను. ఇఁక నిప్పుడు కుంతిలేదు.
ఆమెయు శ్యామసుందరుని పథము ననుగమించెను. అక్కడ
మిగిలినది ఆమెయొక్క నిర్జీవశరీరము. మహారాణి యిట్లగు
టను గాంచి దాసీలు పరువిడిరి. క్షణములో నీ సమాచారము
విద్యుత్తువలె నంతఃపురమంతటను వ్యాపించెను. అంతఃపుర
రాణులందఱును వచ్చి అమ్మొఅమ్మొ బాదుకొని వివిధ విధ
ముల విలాపము చేయుచుండిరి. వెంటనే యీ సమాచార
మును ధర్మరాజునకుఁ దెలిపిరి. వినఁగానే యాతఁడు తల్లి

శవము దగ్గఱకు వచ్చెను. ఆతఁడు భగవానుఁడు స్వధామమును జేరినవార్తను వినఁగానే సమస్త సంసార సంబంధముల యెడల నుదాసీనుఁడై యుండుటచే నాతఁడేడ్వలేదు. ఆతఁడు శోకమునైనఁ బ్రకటింపలేదు. కాని తనతల్లికి గలిగిన యీ యద్భుత మృత్యువువలన నాతనికి ఈర్ష్య కలిగెను. హాహా! మా అమ్మ ప్రభువు స్వధామమునకు పోవుటను వినఁగానే ప్రాణములు విడిచెను. భగవానుఁడులేని పృథ్వియందామె ఒక్కక్షణమైన బ్రదుకఁ దలఁపలేదు. ఈ సమాచారమును వినియు మేమింకను బ్రదికియుండి మేమును భక్తులమని చెప్పుకొనుచున్నాము. సాంసారిక కార్యము లొనర్చుచున్నాము. భగవంతుని వియోగమును వినియు బ్రద్దలుకాని నాయీ హృదయము వజ్రముతోఁ జేయఁబడినదై యుండవచ్చును.

ఏడ్చుచున్న స్త్రీలను వారించి ధర్మరాజిట్లనెను:— "మీరు తల్లికొఱకు ఏడ్వరాదు. ఆమె మృత్యువు పరమ ప్రశంసనీయమైనది." అప్పుడాతఁ డర్జునునితో నిట్లనెను:— "సోదరా! అర్జునా! ఇఁక విలంబము చేయవలసిన పనిలేదు. అందఱను బిలువుము. అమ్మ కిప్పుడే దాహసంస్కారము లొనర్పవలయును. నేఁడే పరీక్షిత్తునకు రాజ్యాభిషేక మొనర్పవలయును. మన మీదినముననే ఇచ్చటనుండి వెళ్లిపోవలెను. ఒక్కక్షణమైనను భారముగఁ దోఁచఁగలదు."

అర్జునుఁడేడ్చుచు యుధిష్ఠిరుని యాజ్ఞలను బాలించెను. ఆతఁడు లేచి స్వయముగ నందఱను బిలువఁబోయెను. సహదేవుఁడు, నకులుఁడు, భీముఁడు మొదలగు వారందఱును పరీక్షిత్తునకు రాజ్యాభిషేకము చేయుటకు సిద్ధపడుచుండిరి.

ఆహా! ఈ రాజకార్య మెంత కఠోరమైనది? ఈ రాజ భవనములలో నెట్టి విపరీత సంఘటనలు ఒక్కసారిగా జరుగు చుండును! ఒక ప్రక్కన తండ్రి చచ్చిన శోకమఖ్లేయున్నది. వారను అతని శవమును దీయనే లేదు. వేఱొక ప్రక్కన రాజ్యాభిషేక ప్రయత్నము జరుగుచున్నది. ఇంకొక రాణి చావఁబోవుచున్నది. వేఱొకరికి పిల్లవాఁడు పుట్టుచున్నాఁడు. ఇట్లే ధర్మరాజు రాజభవనమున నెన్నియో విపరీత సంఘట నలు జరుగు చున్నవి. ఒక ప్రక్కన వృద్ధురాలగు తల్లి చని పోయినది. వేఱొక ప్రక్కన మనుమని పట్టాభిషేకమునకు ప్రయత్నము జరుగుచున్నది. ఇంకొక దిక్కున చక్రవర్తి తన సర్వస్వమును త్యజించి సోదరులతో వనమునకుఁ బోవ చున్నాఁడు. ఈ సంఘటన లన్నియు ధర్మరాజున కనుకూల ములు. అతఁడు ధైర్యమును వహించి వీటినన్నిటిని నిర్వ హించు చుండెను. అతఁడొక్కఁడే వ్యగ్రతను జెందక సమస్త కార్యములను యథారీతిగఁ నిర్వహించు చుండెను.

మునుముందుగా నాతఁడు తన తల్లికి గంగాతీరమున విస్తృతముగ దాహ సంస్కారము కావించెను. ఏడ్చుచు సోదరులందఱు నామెకు జలాంజలుల నొసంగిరి. వచ్చిన తర్వాత పరీక్షిత్తునకు రాజ్యాభిషేకప్రయత్నమున మునిఁగి పోయిరి.

ఛప్పయ.

స్వర్గ పిధారీఁ మాతు ధర్మసుత నహిఁ ఘబరాయే ।
ధన్య ధన్య మమ మాతు విరహ - హరి ప్రాన గఁవాయే ॥

అజ్ఞ అభాగే హమిాఁ వ్రజ సమ హియే హమారే।
సునత శ్యామ సంవాద ప్రాన హరి సంగ న సిధారే॥
జలజ మిాన ఫణి-వారి మణి, బిను న రహే జీవిత అధిక।
మాతు నిబాహ్యో ప్రేమ భల, హమ జీవిత అస నేహ ధిక॥

అర్థము.

తల్లి స్వర్గస్థురాలు కాఁగా ధర్మసుతుఁడు దుఃఖింపలేదు. పైఁగా నాతఁ డిట్లనుకొనెను:— "నా తల్లి ధన్యురాలు. ఆమె హరి విరహమున ప్రాణములను బాసినది. మే మజ్ఞులము. అభాగ్యులము. మా హృదయములు వజ్రసమానములు. శ్రీహరి స్వధామమునకు వెళ్లిన సంగతి విని హరికడకు వెళ్ల లేక పోతిమిగదా!

జలజ మిానములు జలములేక జీవింపనట్లును, మణిలేక ఫణి బ్రదుకఁజాలనట్లును మన మధికకాల మిచ్చట నుండఁజాలము. తల్లి ప్రేమను నిర్వహించుకొనినది. మన జీవిము లెందులకు ఛీ ఛీ!"



# పరీక్షిత్తుని రాజ్యాభిషేకము

## ౬౪

శ్లో॥ స్వరాట్ పౌత్రం వినయినమాత్మనః సుసమం గుణైః।
తోయనీవ్యాః పతిం భూమే రభ్యషించ ద్గజాహ్వయే।
మథురాయాం తథా వజ్రం శూరసేన పతిం తతః॥

— శ్రీభాగ. ౧ స్కం. ౧౫ అ. ౩౮ శ్లో.

"సీ. కలివర్తనంబునఁ గ్రౌర్య హింసా సత్య
దంభ కౌటిల్యాద్య ధర్మచయము
పురముల గృహముల భూములఁ దమలోనఁ
గలుగుటఁ దలపోసి కరిపురమున
మనుమని రాజువై మను మని దీవించి
సింధు తోయ కణాభిషిక్తుఁ జేసి
యనిరుద్ధ నందనుండైన వజ్రునిఁ దెచ్చి
మధురఁ బట్టముఁ గట్టి మమతఁ బాసి
గీ. కరుల హరుల భటులఁ గంకణాదికముల
మంత్రి జనుల బుధుల మానవతుల
నఖిలమయిన ధనము నభిమన్యు సుతునకు
నప్పగించి బుద్ధి నాశ్రయించి." —శ్రీమదాంధ్ర భాగవతము

ఛప్పయ.

ధర్మరాజ నే లఖ్యో, రాష్ట్ర మహఁ దంభ కపట అతి।
కలి కూఁ ఆయో జాని, కీన్హా పరలోక గమనమతి॥
వన పర్వత నదనదీ, సహాగర సబకీ పృథ్వీ—
కే కీన్హేఁ సమ్రాట్ పరీక్షిత్ పరమ యశస్వీ॥
హస్తినాపుర మహఁ పరీక్షిత, వజ్ర వ్రజేంద్ర బనాఇ కేఁ।
గుణీ పౌత్ర లఖి ముకుట నిజ, సిర ధరి దయో సిహాఇ కేఁ॥

అర్థము

ధర్మరాజు తనరాజ్యమందు మిక్కిలిగా దంభము, కపటము మొదలగునవి అతిశయింపఁగాఁ గలియుగము వచ్చినదని తెలిసికొని పరలోకమునకు వెళ్లవలెనని తలఁచెను. వన,

పర్వత, నదీనదములు, సాగరములతోఁ గూడిన ఈ పృథ్వికి పరమ యశస్వియగు పరీక్షిత్తును జక్రవర్తిఁగాఁ జేసి హస్తినాపురమునఁ బట్టాభిషేకము కావించెను. వజ్రుని యాదవేంద్రునిఁగాఁ జేసెను. గుణవంతుఁడగు పౌత్రుని గాంచి తన శిరస్సు మీఁది కిరీటమును దీసి ప్రేమతో నాతని శిరస్సున ధరింపఁ జేసెను.



త్యాగ, గ్రహణములును, శ్రేష్ఠ హేయపదార్థములును బుద్ధినిబట్టి యుండును. మన కనుకూలములైన వాటిని గ్రహింతుము; ప్రతికూలములైన వాటిని బరిత్యజింతుము. కాని ఎచ్చట యీ ప్రతికూల బుద్ధి లేదో, ఎచ్చట అన్నియుఁ ద్యాజ్యములో, అన్నియు గ్రహణీయములో అచ్చట అనుకూలతయును లేదు, ప్రతికూలతయును లేదు; గ్రహణము లేదు, త్యాగమును లేదు; హర్షము లేదు, శోకమును లేదు. భగవానుఁడు ధరించిన మత్స్య, కచ్ఛప, వారాహ, నృసింహాది రూపములందాతనికి మోహమును లేదు, ఆసక్తియును లేదు. కేవలము భూభార హరణార్థము, తన భక్తుల కానందము కలిగించుట కొఱకాతఁడీ శరీరములతోఁ బ్రకటమైనట్లు కనఁబడినాఁడు. ఆశరీరముతో జరుగవలసిన పని పూర్తి కాఁగానే, అన్నమును దిని విస్తరిని పాఱవేసినట్లును, పాలు ద్రావి పాత్ర నావల ద్రోచినట్లులను, తమలమును నమలి తమ్మను ఉమియునట్లును, యాలకాయ నమలి దాని తొక్కను ఉమియునట్లును, చెఱకును నమలి రసమును గ్రహించి పిప్పిని వదలినట్లును, రేగుపండ్లను మామిడిపండ్లను దిని వాటి గింజ

లను టెంకలను వదలినట్లును, యజ్ఞము నొనర్చి కుశలను విడిచిపోయి ఏమియు కష్టములేక, మోహమమతలు లేక యుందుమో, అట్లే భగవదవతార ప్రయోజనము పూర్తి కాఁగానే తన శరీరమును వదలిపెట్టి స్వధామమునకుఁ జేరు చుండును. మార్గమున నడుచుచుండఁగా ముల్లుగ్రుచ్చుకొని బాధపెట్టుచుండ వేఱొక ముల్లుతో దానిని దీసి, అప్పు రెండును వ్యర్థమగుటచే రెంటిని పాఱవేయుదుమో అట్లే భూమికి కంటక రూపులగు నృపు లుత్పన్నము కాఁగా వారిని భగవంతుఁడు క్షత్రియ రూపమును ధరించి చంపెను, చంపించెను. దుర్మార్గులందఱునుజావఁగా నప్పుడు భగవంతుఁడు తన మానుషశ్రీ విగ్రహమునుగూడ అంతర్హితము కావించెను.

మహాభారతయుద్ధమునకుఁ బూర్వమే కలియుగము వచ్చినది. కాని భగవంతుఁడీ భూమిమీఁద నుండుటచే నది వ్యాపించుటకు సాహసింపలేదు. ఆటలాడుకొను పిల్లలు నియతసమయమునకు ఇతర బాలురను బిలిచి యిష్టము వచ్చిన ట్లాడుకొను చుందురు. ఒక దినమున నియతసమయమున, నిశ్చితస్థానమునకు రాఁగా నచ్చట వృద్ధగురువు కూర్చుండి యుండెను. పిల్లవాఁడు వచ్చి చాల బుద్ధిమంతుఁడగు బాలుని వలె వచ్చి మెదలకుండ కూర్చుండును. వీఁ డమాయకుఁడను నట్లు తోఁపఁ జేయును. జగడమాడుట మొదలగు నుపద్రవము లేమియును జేయఁడు. గురువుగారు తన అనుచరులతో నచ్చటనుండి లేచి పోఁగానే అప్పుడు చూడవలెను వాని యాడంబరము. అప్పుడు దుముకును, ఎగురును. పిల్లలలో నొకరొకరికి పోట్లాటలు పెట్టును, ఏడ్పించును, కొట్టును,

బాదును, పోరాడును, జగడములాడును. ఊఁ! ఆఁ! అని అందఱ నెత్తిన యెక్కి కూర్చుండును. కలియుగము స్థితియు నింతే. కలి నియతసమయమునకే తన పరివారమగు నధర్మ, అసత్య, దంభ, మాయా, లోభ, శఠ, క్రోధ, హింసా, భయ, మృత్యు, యాతనా, నిరయాదులతో భూమిమీఁదకు అప్పటికి చాల దినముల క్రిందటనే వచ్చెను; కాని యచ్చట వాని యబ్బకు యబ్బైన శ్రీకృష్ణునిగాంచి నీటఁ దడిసిన పిల్లివలె ముడుచుకొని కూర్చుండెను. భగవానుఁడీ పృథివిని వీడి వైకుంఠమునకు పోవునప్పటికి ఆతని వెంటనే సత్య, శౌచ, దయా, క్షమా, త్యాగ, సంతోష, కోమలతా, శమ, దమ, తప, సమతా, తితిక్షా, ఉపరతి, శాస్త్రవిచార, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్య, శూరతా, తేజో, బల, స్మృతి, స్వాతంత్రతా, కుశలతా, కాంతి, ధైర్య, మృదుతా, నిర్భికతా, వినయ, శీల, సాహస, ఉత్సాహ, మానసిక బల, సౌభాగ్య, గంభీరతా, స్థిరతా, ఆస్తికతా, కీర్తి, మాన, నిరహంకారతాది దివ్యగుణములుకూడ పోయినవి.

ఈ గుణము లన్నిటితో భగవంతుఁడీ లోకమును వదలిపెట్టి పోఁగానే, కలికి తన యిష్టము వచ్చినట్లాడుట కవకాశము చిక్కెను. ఆతఁడు ధర్మరాజును జూచియు భయపడలేదు. ఉద్దండుఁడగు తనయునిగాంచి తెలిసినవాఁ డుపేక్షించును. వాని యెదుట నుండరు. ఈ దుష్టకలియుగము తన సమక్షమునఁగూడ కుత్సితక్రీడలు చేయుచున్న సంగతిని దెలిసికొని ధర్మరాజు, ఇఁక నీ భూమియందుండుట ఉచితము కాదని

తలంచెను. ఆ దినముననే మహాప్రస్థానమునకు లగ్న నిశ్చయము గావించెను.

ఒకచోట మాతృశవ సంస్కారమునకు ప్రయత్నమును, నింకొకచోట పరీక్షిన్మహారాజ రాజ్యాభిషేక ప్రయత్నమును జరుగుచుండెను. ధర్మరాజు త్వరత్వరగా సాధారణ విధుల చేతనే బ్రాహ్మణుల యాజ్ఞను గైకొని పరీక్షిన్మహారాజును భరతవంశ సింహాసనమునఁ జక్రవర్తి పదమున నభిషిక్తుని గావించెను. పరీక్షిత్తు ధర్మాత్ముఁడనియు, ఆతఁడు తన కేమియును యోగ్యతలోఁ దీసిపోఁడనియు, ప్రజల కీతనియందు ప్రేమ కలదనియు, మంత్రి, పురోహిత, బ్రాహ్మణులు ఈతని గుణములకు సంతుష్టిని జెందినారనియు నాతనికి బాగుగాఁ దెలియును. అందువలన నాతఁడు బాలకుఁడైనప్పటికిని ఆతనిని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి, తన చేతులతో నాతని శిరమున సువర్ణ రత్నమండితమగు తన దివ్యముకుటమును బెట్టుచుండ పరీక్షిత్తు ఏడ్చుచు ధర్మరాజుపాదములను బట్టుకొని యిట్లనెను:— "ప్రభూ! మీరు మమ్ములను వదలి వెళ్లకుఁడు. మహారాజా! నేనింకను బాలుఁడను. నా బుద్ధి మలినమైనది. నేనింత రాజ్యమును బాలింప నసమర్థుఁడను. లోకనాథా! మీరు నాపైఁ గృప చూపుఁడు. నా నిర్బల స్కంధములం దింతటి భారమును బెట్టకుఁడు. నే నెన్నఁడును దీనిని భరింపఁజాలను."

ధర్మరాజు కన్నుల నీరునించి మిక్కిలి స్నేహముతో బుజ్జగించుచు నిట్లనెను:— "నాయనా! ఇంతగా నధీరుఁడవు కారాదు. నీవు భరతవంశములోఁ బుట్టితివి. నీ వన్నియును

జేయ సమర్థుఁడవు. నేఁటినుండి నీకు తల్లి, తండ్రి, గురువు, రక్షకు లీ బ్రాహ్మణులే. వీరి నడిగి నీవు రాజ్యకార్యముల నన్నిటిని జరుపుకొనుము.''

మిక్కిలి ప్రేమతో హాతపూర్వకముగఁ బరీక్షిత్తు యిట్లనెను — '' లేదు మహారాజా ! నాలో నంతటి యోగ్యత లేదు. మీరు వెళ్లిపోఁగానే నేను నిరాశ్రితుఁడను కాఁగలను. నాకు పైన నెవరు కలరు ? మీరు కొన్ని దినములుండి నాకు శిక్షణనొసంగి, రాజ్యము చేయుటను నేర్పుఁడు. ఇప్పటికి నాకు ఆడుకొనుట తప్ప యింకేమియును తెలియదు. మీరు నా దుర్బల హస్తముల నింతటి మహత్వపూర్ణ మగు కార్యమును వప్పగించునెడల, దానిని సరిగా నేను నిర్వహింపఁ జాల కున్నచో, లోకములో మీకును, మీ వంశమునకును అప కీర్తి కలుగును. కావున, ప్రభూ! మీరిప్పుడే నన్ను వీడ కుడు. నన్నసహాయునిగను అనాథునిఁగను, ఆశ్రయహీనుని గను జేయకుఁడు. నేను నా తండ్రి నెఱుఁగను. నాకు తండ్రి, గురు, దైవము అన్నియు మీరే అనుకొనుచున్నాను.''

తన మనుమఁడిట్లు ప్రేమపూర్ణ వాక్యములు పలుకఁగా విని ధర్మరాజు హృదయము కరిగిపోయెను. ఆతని కన్నుల నుండి ప్రేమాశ్రువులు ప్రవహించెను. వాటిని దుడిచికొని కుదటపడి యిట్లనెను:— ''నాయనా! అందఱకు తల్లి, దండ్రి, గురువు, దైవము, ప్రభువు ఆవాసుదేవ భగవానుఁడే. నిన్నా తఁడు గర్భములో నుండఁగానే రక్షించినాఁడు. తల్లి గర్భ ములో— మూవిలో తలక్రిందుగా నుండఁగా రక్షించినవాఁడు

ఇప్పుడు రక్షింపలేఁడా? భగవానుఁడు నీకు మేలుచేయును గాక! నీవు సమస్త కార్యములు ఆతని ప్రసన్నత కొఱకు, ఆతనికి సమర్పించి చేయవలయును.''

పరీక్షిత్తు దుఃఖముతో నిట్లనెను:— ''ప్రభూ! మీరి ట్లాజ్ఞాపింపకుఁడు. మీ యిష్టము వచ్చినవారి నింకెవరినైన నీ రాజ్యపీఠమునఁ గూర్చుండఁ బెట్టవచ్చును. నేను మీ సేవ చేయుచు మీ వెంట వనమునకు వచ్చెదను. నే నింతవఱకు మీ కేమియు సేవ చేయనేలేదు.''

ధర్మరాజత్యంత మమకారస్వరముతో నిట్లనెను:— ''నాయనా! పరీక్షిత్తూ! నీవు పిచ్చివాఁడవా యేమి? ఇట్టి వికలతను బొందరాదు. నీవు మనపూర్వుల రాజ్యమును ధర్మముగఁ బరిపాలింపుము. ఇదియే నీవు నాకు చేయవలసిన ముఖ్యమగు సేవ. నేనేదైనఁ గ్రొత్తవిషయమును జెప్పుచున్నా నేమో చెప్పుము. పుత్రుఁడు సమర్థుఁడు కాఁగానే తండ్రి రాజ్యమును వాని కొసంగి వనములకుఁబోవుట మనకు పూర్వమునుండియు వచ్చుచున్న యాచారమే. మన పూర్వులందఱు నిట్లే యొనర్చిరి. నీవలనఁగూడ మేమిదే ఆశించుచున్నాము.''

పరీక్షిత్తు అధీరతతో నిట్లనెను:— ''మహారాజా! ఇదంతయు నిజమే. నేనొక్కఁడను ఏమి చేయఁగలుగుదును? మీరందఱు నన్నునాథుని గావించి పోవుచున్నారు. మీరు దయాళురు. అట్టిది నాయందేల దయఁజూపరు? నా యెడల నిట్టి కఠోరవ్యవహారము నేల చేయుచున్నారు?''

ధర్మరాజు మిక్కిలి స్నేహముతో నాతని శరీరమును నిమిరెను. పరీక్షిత్తు యొక్క రెండు కమలనేత్రములనుండి ముత్యములవలె నశ్రువులు రాలుచుండెను. ఆతని హృదయము బ్రద్దలగుచుండెను. తన తాత లైదుగురు నేడాతనిని బరిత్యజించి వెళ్లుచున్నారను సంగతిని దలంచుకొనంగానే వికలుండగుచుండెను. పసివాండగు తన మనుమండిట్లు అధీరుండగుటను గాంచి ధర్మరాజాపుకొనలేకపోయెను. కన్నుల నీరు దుడుచుచు నాతండు దగ్గఱ కూర్చుండి, ధౌమ్య, కృపాచార్యాది కులపురోహితులగు బ్రాహ్మణులతో నిట్లనెను:— "మీరీ పరీక్షిత్తున కేల తెలియంజెప్పరు? ఇంక మేమెల్లప్పుడు రాజ్యభారమును వహింపలేము. పిల్లలు పెద్దల భారమును తేలిక యొనర్పవలయును."

కన్నుల నీరు నించుచుం గృపాచార్యుం డిట్లనెను:— "ఏమి చెప్పగలము మహారాజా! మాకును ఏమియుం దోంచుట లేదు. ఏ రాజ్యముకొఱకు ఇంత పోరాటము జరిగినదో, లక్షలు కోట్లకొలంది ప్రాణిహింస జరిగినదో, ఇంత రక్తపాతము జరిగినదో, అట్టిదానిని నేడు తృణప్రాయముగం బరిత్యజించుచున్నారు. వేయి, రెండువేలు గాని, నూఱు, రెండు వందల సంవత్సరములు గాని దాని ననుభవింపలేదు. వీటిని జూడంగా మాబుద్ధి విమూఢమై పోవుచున్నది. కాలగతి తెలియదు. మహాపురుషుల చేష్టలను దెలిసికొనంజాలము."

అత్యంత గంభీరముతో ధర్మరాజిట్లనెను:—"ఆచార్యా! నేను చేసిన దంతయు శ్రీకృష్ణభగవానుని ఆజ్ఞచే జేసితిని.

నా కార్యము లన్నియు నాతని ప్రీతికొఱకే. నేను చేసిన దంతయు నాతనికి సమర్పించు చుంటిని. ఆతఁడు సూత్రధారుఁడు. ఆతఁడెట్లాడించిన నట్లాడుదును. నాకు ప్రత్యేక వ్యక్తిత్వ మేమియును లేదు. ఆతఁ డీ ధరాధామమును వదలి పోయిన తర్వాత నింక మేముండుట వ్యర్థము. ఇఁక మే మెంత మాత్రము ఆగఁజాలము. ధర్మము భగవానునితోడనే పోయినది. సర్వత్ర అధర్మము తన అధికారమును స్థాపించుట ఆరంభించినది. కలియుగము నారాష్ట్రములోనికి, నగరములోనికి, వేయేల నా రాజభవనములోనికిఁగూడ ప్రవేశించుటకు నిశ్చయించినది. ఇఁక మేమిచ్చటనుండి వెళ్లుటయే శ్రేయస్కరమని తోఁచుచున్నది. మీరందఱును గలిసి యీ పిల్లవానిని రక్షించు చుండవలెను. ఈతఁడు కుమార్గగామి కాకుండునట్లును, పథభ్రష్టుఁడు కాకుండు నట్లును, ఉచిత శిక్షణమును, దీక్షను ఈతని కొసంగుచుండ వలయును. ధర్మాచరణము చేయునట్లును, వంశ మర్యాదను నిల్పునట్లును, కులకళంకము కాకుండునట్లును, సమస్త ప్రజలను పుత్రులవలెఁ బాలించి, పోషించునట్లు మీరు చూడవలసి యున్నది.''

ఇట్లు చెప్పి ధర్మరాజు తన ప్రియపౌత్రుఁడగు పరీక్షిత్తును చక్రవర్తిగా నభిషేకించెను. ఆతఁడు తన దివ్యముకుటమును శిరస్సునఁ బెట్టెను. సమస్త సైనికులు, సామంతులు, మంత్రులు, మాండలికాధిపతులగు రాజులు అందఱును సాష్టాంగ భావముతో వందనము చేసిరి. ప్రజలందఱును ఆతని యభిషేకమునకు అభినందించిరి.

ఆ సమయముననే ధర్మరాజు యదువంశాధారుఁడగు వజ్రుని బిలిచి మాథుర, శూరసేన దేశములకు రాజుగా రాజ్యాభిషేకము చేసెను. విధ్యుక్తముగ నాతని నచ్చట రాజుగాఁ జేసి, పరీక్షిత్తుతో నిట్లనెను:— "నాయనా! ఈ వజ్రుని నీవు సమస్త విధముల రక్షింపవలయును. వీనికి శత్రుపీడ కలుగకుండఁ జేయవలయును. మీ రిద్దరును గలిసి ధర్మముగ నీ ధరణిని శాసింపవలయును. ఈతఁడు మన సర్వస్వమగు శ్రీకృష్ణుని వంశాధారము. శ్రీకృష్ణ కృపవలననే మనము రాజ్యము, సుఖ సమృద్ధిని, నిన్నును బొందితిమి. నీవు పొరపాటుననైన వీని యెడలఁ గుటిలతావ్యవహారము చేయరాదు. వీనిని నీ పుత్రునికంటెను మిక్కిలి ప్రీతితోఁ బ్రేమింపవలయును." ఇట్లు పరీక్షిత్తునకుఁ జెప్పి వజ్రునితో నిట్లనెను:— "ఈ పరీక్షిత్తు నీకు బాబాయి. వీనిని నీవు అనిరుద్ధునివలెఁ జూడవలెను. సర్వదా ఈతని నాదరింపవలయును. ఈతని చెప్పుచేతలలో నుండవలయును. ఎవఁడైన శత్రువు నిన్ను బాధించెనా, అప్పుడు వీని సహాయమును గొనవలయును. మీ రెండువంశము లొక్కటే. ఇద్దరును బరస్పర ప్రేమతో మెలఁగవలయును." ఈ విధముగ ధర్మరాజు ఇద్దరకు పట్టాభిషేకమును గావించి వివిధోపదేశముల నొసంగెను. ఇద్దరు నేస్చుచు శిరమువంచి, చేతులు జోడించుచు ధర్మరాజోపదేశములను శిరసావహించిరి. వా రిద్దరు అభిషిక్తజలములచేఁ దడిసిన వెంట్రుకలతోడను, దివ్యముకుటములతోడను ధర్మరాజాది పాండవుల పాదపద్మములకుఁ బ్రణమిల్లిరి. అందఱును బుత్రస్నేహముచే నిండిన హృదయము

లతో నిద్దరను కౌఁగిలించుకొని, వారిని ముద్దుపెట్టుకొని లాలించి, ఆశీర్వదించిరి. వారు బ్రాహ్మణులకుఁ బ్రణామము కావించి ఆ సమయముననే మహాప్రస్థానమునకై లేచి నిలుచుండిరి.

ఛప్పయ.

కహేఁ పరీక్షిత్ ప్రభో! ప్రజా పాలన అతి దుష్కర ।
హమఁ మతి మంద మలీన అజ్ఞ అతిశయ హే నృపవర ॥
కృపాసింధు! కరికృపా కాజ సబ మోహి సిఖావేఁ ।
ఆశ్రయహీన అనాథనాథ! అబహీఁ న బనావేఁ ॥
కహు పిపీలికా హిమాలయా, కైసే నిజ సిర పర ధరే ।
కస కపోత నిజ పంఖ పై, ధరణీధర ధారణ కరే ॥

అర్థము.

పరీక్షిత్తు ధర్మరాజుతో నిట్లనెను:— "ప్రభూ! ప్రజాపాలన మతిదుష్కరము. నేను మందమతిని. మలినబుద్ధిగలవాఁడను. మిక్కిలి అజ్ఞుఁడను. మహారాజా! కృపాసింధూ! మీ రిప్పటినుండి కృపతో రాజ్యకార్యము లన్నిటిని నేర్పుఁడు. అనాథనాథా! ఇప్పుడే ఆశ్రయహీనుని గావింపవలదు.

ఎక్కడనైన చీమ హిమాలయమును శిరముపై నిడుకొనఁగలదా? కపోతము తన ఱెక్కలపై పెద్దకొండను మోయఁగలదా? అట్లే నేను నీ రాజ్యభారమును వహింప సమర్థుఁడను గాను."

—♦—

# పాండవుల పరలోక ప్రయాణము

ఉ॥

శ్లో॥ ఉదీచీం ప్రవేశాశాం గతపూర్వాం మహాత్మభిః।
హృది బ్రహ్మపరం ధ్యాయ న్నావర్తేత యతోగతః॥
సర్వే తమను నిర్జగ్ము ర్భ్రాతరః కృతనిశ్చయాః।
కలినా ధర్మమిత్రేణ దృష్ట్వా స్పృష్టాః ప్రజాభువి॥
— శ్రీభాగ. ౧ స్కం. ౧౫ అ. ౪౪, ౪౫ శ్లో.

కం. చిత్తంబున బ్రహ్మము నా
వృత్తముఁ గావించుకొనుచు విజ్ఞాన ధనా
యత్తులు దొల్లి వెలింగెడి
యుత్తర దిశకేగె నిర్మలోద్యోగమునన్.

సీ. అంత నాతని తమ్ము లనిలపుత్రాదులు
కలిరాకచేఁ బాపకర్ములగుచుఁ
జరియించు ప్రజల సంచారంబు వీక్షించి
యఖిల ధర్మంబుల నాచరించి
వైకుంఠ చరణాబ్జ వర్తితహృదయులై
తద్భక్తి నిర్మలత్వమును జెంది
విషయ యుక్తులకుఁ బ్రవేశింపఁగా రాక
నిర్ధూత కల్మష నిపుణమతుల

గీ. బహుళ విజ్ఞాన దావాగ్ని భసితకర్ము
లైన యేకాంతులకు లక్ష్యమై వెలుంగు
ముఖ్య నారాయణ స్థానమునకుఁ జనిరి
విగతరజమైన యాత్మల విప్రముఖ్య. — శ్రీమదాంధ్రభాగవతము

ఛప్పయ.

కియే పరీక్షిత్ నృపతి చలే సబ పాండవ బన కూం।
రాజపాట పరివార సభీ తేఁ ఖేంచ్యో మన కూం॥
చీర వసన ఆహార-తజే, కచ కుంచిత ఖోలేఁ।
జడ ఉన్మత్త సమాన నకాహూ తేఁ కఛు బోలేఁ॥
జైసే బీతీ జామినీ, నహిఁ లౌటతి పుని జాఇకేఁ।
ఉత్తర దిశికూఁ చల దియే, హరిపద హియ మేఁ లాఇకేఁ॥

అర్థము.

పరీక్షిత్తును రాజుగాఁజేసి పాండవు లందఱును వనము నకుఁ బోయిరి. రాజ్యమును, పరివారమును మనస్సులోనికైన తేకుండ, మంచి వస్త్రములను. ఆహారమును ద్యజించి తల విఱబోసికొని, జడుని వలెను, ఉన్మత్తుని వలెను ఎవరి తోడను మాటలాడక, గడచిన రాత్రి మరల నెట్లురాదో, అట్లే మరల రాకుండ, హృదయమున శ్రీకృష్ణ పదారవింద ములను ధరించి, ఉత్తర దిశకు పోయిరి.



ధర్మగతి యెంతటి సూక్ష్మమో విషయోపభోగమే జీవనమునకుఁ జరమ లక్ష్యముగఁ గల విషయవాసనా బద్ధజీవి యెట్లు తెలిసికొనఁగలుగును? కార్యము లన్నియు సమయాను సారముగ శోభనొసంగుచున్నవి. ఒకనికి ఒకానొకప్పుడు అధర్మముగఁ దోఁచిన కార్యము ఇంకొకప్పుడు ధర్మమగును. గురుకులములో నుండఁగా బ్రహ్మచారికి స్త్రీని తాఁకుటయుఁ, జూచుటయునేల—జింతించుటయుఁగూడ అధర్మమగుచున్నది.

సమావర్తనము, స్నాతకమైపోయి గురు గృహమును వీడఁగానే భార్య వెంట లేక ఒక్కదినమున్నను అధర్మమగుచున్నది. ఆసమయమున నాతనికి అగ్నిహోత్రముతోఁ బాటుగా దారను గ్రహించుట పరమ ధర్మమగుచున్నది. దారను, అగ్నిహోత్రమును వీడి ఆతఁ డొక్కదినమైన నుండరాదు.

మనము కార్యముల నన్నిటిని ఇంద్రియసుఖముల కొఱకు గాక, ధర్మము కొఱకును, కర్తవ్యపాలన దృష్టితో డను గ్రహించినచో మన మనేక విధములగు పాప, తాప, దుఃఖ, శోకములనుండి రక్షింపఁబడఁ గలము. ధర్మము ఈ లోకమందును బరలోకమందును సుఖము నొసంగు బంధువు. ధర్మము వలనఁ గొంతకాల మీలోకములోఁ గష్టపడవలసి వచ్చినట్లు తోఁచును; కాని ధర్మము కొఱకు పడిన కష్టములోఁ గూడ ఒకవిధమగు సుఖసంతోషము లనుభవమునకువచ్చును. పరలోకములో దాని ఫలమంతయు సుఖమే. దీనికి విపరీత ముగా నధర్మము వలనఁ గొంతకాలము ఐశ్వర్యవృద్ధి అయి నట్లు కూడ కనఁబడుచుండును. ఇంద్రియజన్య సుఖసామగ్రి కూడ బహుళముగా నుండును. కాని అధర్మమువలన సంపాదించిన ధనవంతులకు సర్వదా మానసిక చింతలుండును. మెత్తని పరుపుల మీఁదఁ బరుండినప్పటికిని వాని మనస్సు వ్యాకులముగానే యుండును. వానికి నిద్ర పట్టదు. స్వాదిష్ట పదార్థములలో నాతనికి స్వాదువు తోఁచదు. కొందఱు అజ్ఞులు వారి పైపైఁగల పూలరంగని వేషముచే సుఖవంతులుగఁ గనఁబడుదురు, కాని వారికి హృదయము కుమిలిపోవు

చుండును. సంతాప, శోకజ్వాల ప్రజ్వలించుచుండును. ఈ లోకమున వాఁడెల్లప్పుడు నుద్విగ్నుఁడై యుండి, చచ్చిన తర్వాత వాఁడు భీషణ నరకముల ననుభవింపవలసి యుండును.

దుర్యోధనుఁ డన్యాయముగ పాండవుల రాజ్యమును లాగుకొనెను. కాని రాజ్యమునుబొంది యు నాతఁడు సుఖపడ లేదు. పాండవులభయముచే నాతఁడు సదా భయభీతుఁడుగానే యుండెను. వానికిన్ని సుఖసామగ్రు లున్నప్పటికిని ఆనందమును గలిగింపలేక పోయెను. ఆతఁడెల్లప్పుడు చింతితుఁడై, శోకాకులుఁడై, దుఃఖియై, వికలుఁడై యుండెను. రాత్రింబవళ్లాతఁడు పాండవ నాశనమునకే ఉపాయము లాలోచించుచుండెను. కాని చివరకు ఆతఁడే తన బంధు, మిత్ర, కుటుంబ, పరివారములతో నాశనమయ్యెను. ఆతఁడు మోసముచేసి, అధర్మముచేఁ బెంచిన రాజ్య మిచ్చటనే యుండెను. చివరకాతఁడు నరకయాతన ననుభవింపవలసి వచ్చెను.

పాండవులు విరాట్‌నగరములో యుద్ధోద్యోగమును జేయుటను గాంచినచో వారు రాజ్యముకొఱ కత్యంతోత్సాహముతో నున్నారని తోఁచఁగలదు. రాజ్యప్రాప్తికొఱకు వారు కర్తవ్యముల నకర్తవ్యములుగఁ జేయునంతటి అధిక లోభులుగ నున్నారనియుఁ దోఁచఁ గలదు. యుద్ధములో భీష్మ, ద్రోణ, కర్ణ, శల్యాది పరమపూజనీయ, మాననీయ గురుజనములను శ్రీకృష్ణసహాయముతో వివిధములగు కుట్రలను బన్ని, అనీతి ఉపాయములచేఁ జంపుటను గాంచిన, పాండవులు ఆఁకలిగొన్న పులులవలె సింహాసనము కొఱకు

సమస్త దుర్మార్గములను జేయుచున్నారని మనకు నిశ్చయ మగును. వీరు తమ ప్రతిపక్షులను, ప్రతిద్వంద్వులను జంపి సమస్త వసుంధరాచక్రమును సదా నిష్కంటకముగ రాజ్యము చేయవలెనని తలంచిరి. వీరికి రాజ్యము లభించిన జీవనపర్యం తము నిర్ద్వంద్వులై యనుభవింపఁ గలుగుదురు. కాని శ్రీకృ ష్ణుఁడు స్వధామమునకుఁ బోఁగానే, వారే సమస్త రాజ్య మును తృణమువలెఁ ద్యజించి ఉన్మత్త వేషములతో వనము నకు వెళ్లుటను గాంచిన వీరికి రాజ్యలోభము లేదని తోఁచఁ గలదు. రాజ్య, సాంసారికాది సుఖభోగముల కొఱకే వీరు సంహారాది కార్యములు చేసియుండిన యెడల, నింత సమృద్ధి శాలిని యగు రాజ్యమును స్వయముగ స్వేచ్ఛగఁ ద్యజించి యేల పోవుదురు? వీ రేది చేసినను ధర్మముకొఱకు చేసిరి. శ్రీకృష్ణుని ప్రసన్నత కొఱకు ఆతని ఆజ్ఞ యను భావముతోఁ జేసిరి. వాసుదేవభగవానుఁడు స్వధామమునకుఁ బోఁగానే వీరీ తుచ్ఛ, అనిత్య, నాశవంతములగు భోగముల నన్నిటిని ద్యజించి, సర్పము తన కుబుసమును వీడి వెళ్లినట్లు వెళ్లిరి.

ధర్మరాజు అందఱును జేయ యోగ్యమైన కార్యము నొనర్చెను. ఆతని తల్లికి గల శ్రీకృష్ణప్రేమను జూచు నప్పటికి ఆతని వైరాగ్య మతిశయించినది. ఆతఁడు సమస్తా గ్నులను తనలోనికి లీనము చేసికొనెను. ఇప్పుడాతఁడు అగ్ని హోత్ర హీనుఁడై దాని బంధమునుండి విముక్తుఁడయ్యెను. అగ్నులను శరీరమున ధరియించి యాతఁడు తన సమస్త బహుమూల్యములగు వస్త్రాభూషణములను దీసి పాఱవైచెను. గృహ, కుటుంబ, రాజ్య, పరివారములందు గల అహంకార

మమకారముల నాతఁడు పరిత్యజించెను. అతఁ డాతని వాణిని ప్రాణమందును, ప్రాణము నపానమందును, అపానమును మృత్యువాసఁగు సమానమందును, సమానమును పంచభూతాత్మక శరీరమందును లీనము గావించెను. ఇప్పు డాతనికి తన ప్రాణములకును విశ్వమందున్న ప్రాణములకును భేద మేమియును గనఁబడుట లేదు. ఆతఁడు తన శరీరమును అనిత్యముగను, నాశవంతముగను దెలిసికొనెను.

శరీరమునకు మూలకారణము సాత్త్విక, రాజసిక, తామసిక గుణములు. కావున శరీరమును నా త్రిగుణములలో లీనము కావించెను. త్రిగుణములు మూలప్రకృతిచేతనే విషమమై యీ సృష్టి సంఘాతము నుత్పన్నము చేయును. కావునఁ త్రిగుణముల నాతఁడు మూల ప్రకృతిలోఁ గలిపి, ప్రకృతిని శరీరాభిమాని ఆత్మయందు లీనము కావించి, ఆత్మను సమాన రూపముగ విశ్వమందు వ్యాపించిన సర్వాంతర్యామి అవినాశి పరబ్రహ్మయందు లీనము గావించెను. ఇప్పుడాతని దృష్టిలో తన యిష్టదైవము తప్ప వేఱొకటి లేనేలేదు. ఈ నామ రూపాత్మకమగు జగత్తంతయు నాతని ముందే విలీనమయ్యెను.

ఆతఁడొక్క వస్త్రమునే ధరించెను. శ్రీకృష్ణుఁడు స్వధామమునకుఁ జేరెనను వార్త వినినప్పటినుండి ఆతఁ డాహారమును బరిత్యజించెను. శరీరశృంగారమును వదలెను. నేఁ డాతని ముకుటమును బరీక్షిత్తుని శిరస్సుపై నుంచి, యాతఁ డున్మత్తునివలె నయ్యెను. ఆతఁడు తల వెండ్రుకలను విఱియఁ బోసికొనెను. శరీరమంతటను ధూళి పూసికొనెను.

ఆతని యీ స్థితినిగాంచి సమస్త పురజనులు, పరిజనులు, బంధు బాంధవులు, సంబంధులు, అంతఃపుర రాణులు పెద్దపెట్టున నేడ్చిరి. మహాభారత యుద్ధము తర్వాత కలిగిన కరుణాదృశ్యము నేఁడు మరల కనఁబడినది. ప్రజ లేడ్చుచు నిట్లనిరి:— "మహారాజా! మీరు మమ్ములను వీడి యెచ్చటకు వెళ్లుచున్నారు? ప్రభూ! మేము మీరులేక యెట్లు జీవింపఁగలము?" అంతఃపురములోని స్త్రీలు ఏడ్చుచు, అఱచుచు, విలపించుచు మహారాజు వెంట బయలుదేరిరి. ధర్మరాజెవరి వైపును జూచుటలేదు; ఎవ్వరి మాటలను వినుటలేదు. ఎవ్వరి నమస్కారమునకును బ్రణామమునకును బ్రత్యుత్తర మిచ్చుట లేదు. ఎవ్వరి నేదియు నడుగుటలేదు. ఆతనికిఁ గన్నులున్నను గ్రుడ్డివానివలె నయ్యెను. వీనులున్నను వినుటలేదు. బుద్ధియున్నను ఉన్మత్తునివలెఁ జేష్ట లొనర్చుచుండెను. ఇప్పు డాతనికి స్వపర భేదములేదు. స్త్రీలు ఱొమ్ము బాదుకొనుచుండిరి. మంత్రు లేడ్చు చుండిరి. పరీక్షిన్మహారాజు బాలునివలె విలపించు చుండెను. సోదరులందఱు నాతని వెంట వెళ్లుచుండిరి. నగరములోని, రాజ్యములోని స్త్రీ పురుషులాతని ననుగమించు చుండిరి; కాని యాతఁ డే దిక్కును జూచుటయును లేదు. ఎవ్వరిని దన వెంట రా వలదని చెప్పుటయును లేదు. అందఱు నగరము దాటి చాలదూరము బయలుదేఱి వచ్చిరి. సుకుమార స్త్రీల ముఖము ఎండచే వాడి, నడచు అభ్యాసము లేకపోవుటచే వారలసిపోయిరి. అప్పుడు వారందఱితోఁ గృపాచార్యుఁ డిట్లనెను:— "యుధిష్ఠిర మహారాజిప్పుడు పరమహంస అయినాఁడు. ఆతఁడు మనస్సుతో సమస్త

కార్యములను, సమస్త సంబంధములను బరిత్యజించెను. ఇఁక నాతఁడు నగరమునకుఁ దిరిగి వచ్చునని యాశించుట వ్యర్థము. ఇప్పుడు వీరిని సుఖముగఁ బోనీయుఁడు. వీరికి మార్గమున విఘ్నము కావింపకుఁడు.''

ఇది విని ప్రజలందఱును నిలిచిపోయిరి. స్త్రీలు అలసి కూలఁబడిరి. ముందుకు వెళ్లి యేడ్చుచు నేలమీఁదఁబడి దుఃఖిత చిత్తముతో పరీక్షిన్మహారాజు ధర్మరాజునకు సాష్టాంగ ప్రణామము కావించెను. ఆతని పదధూళిని దీసికొని శరీరమునకుఁ బూసికొని, విలపించుచు భూమిమీఁదనే పడి యుండెను. ధర్మరాజాతని వైపు చూడనేలేదు. ఆతఁడట్లే నిరపేక్ష భావముతో ముందుకు పోవుచుండెను.

తన చిన్నతాతలు నల్గురు తనదగ్గఱ ఉందురని పరీక్షిన్మహారాజు ఆశించెను; కాని వారుకూడ ఆతనివెంటఁ బోవుచుండఁ గాంచి, మిక్కిలి వేగముతోఁ బరువిడి, వారి దారి నడ్డగించి యేడ్చుచు నిట్లనెను:— ''మహారాజా! మీరందఱెచ్చటకుఁ బోవుచున్నారు? మీరు తిరిగి నగరమునకు రండు.''

అర్జునుని హృదయము కరఁగిపోయెను. తన సుందర సుకుమార బాలుఁడు ఈ విధముగ నేడ్చుటను గాంచి యర్జునుఁడు కంటఁదడి పెట్టెను. తన ప్రేమ వేగము నడ్డగించి యాతఁడిట్లనెను:— ''నాయనా! ఇఁక నీవు వెనుతిరిగిపొమ్ము. మేమెల్లప్పుడును మాయన్న ననుసరించితిమి. అంత్య సమయమున నాతని నొంటరిగా మేమెట్లు వదలఁగలము? నీవు సుఖముగ రాజ్యమును బాలింపుము.''

అత్యంత కాతరస్వరమున నేడ్చుచుఁ బరీక్షిన్మహారా జిట్లనెను:— "మహారాజా! మీరందఱును నన్ననాథుని గావించి వెళ్లిపోవుచో నాకు శిక్షణ నెవరీయఁగలరు? నన్నెవరు కనిపెట్టి యుండఁగలరు?"

అర్జునుఁడిట్లనెను:— "నీకు నాథుఁడు శ్రీద్వారకానాథుఁడు. ఆ సర్వాంతర్యామి ప్రభువే నిన్ను రక్షింపఁగలఁడు. నీవు వెళ్లుము. ఆలస్యమగుచున్నది." ఇట్లని నల్గురు సోదరులును త్వరత్వరగాఁ బోయిరి. ద్రౌపదికూడ వారి నందఱ ననుసరించెను. నగర వాసులతోఁ గూడి పరీక్షిత్తు కొంచెముసేపు వఱకు నిలుచుండి తన పితామహులను గాంచుచుండెను. చెట్లు చాటుకాఁగానే వారాతనికి గనఁబడలేదు. అప్పుడాతఁడు తన పూర్వజులు పోయిన ఆ ఉత్తరదిశకు నమస్కరించి వెనుదిరిగి పోయెను. అంతఃపుర స్త్రీల నందఱను వాహనముల మీఁదఁ గూర్చుండఁబెట్టి, తాను, కృపాచార్యులు, యుయుత్సుఁడు రథము మీఁదఁ గూర్చుండి హస్తినాపురమునకు వచ్చి ధర్మముగ రాజ్యపాలనము చేయుచుండెను.

పాండవులు మహాప్రస్థానమును నిశ్చయించి నగరము నుండి బయలుదేరిరి. మహాప్రస్థాన మనఁగా నేమియుఁ దినకయే, విశ్రాంతిని గొనకయే ఉత్తరదిక్కునకు వెడలుచుండుటయే. శరీరము పడిపోనంతవఱకు ఏదిక్కునకును జూడకయే, ఏ శారీరక క్రియను జేయకయే ముందుకు వెళ్లుచుండవలెను. పాండవు లందఱు ధర్మాత్ములు. వారు వారి బుద్ధిలోఁ బాపమునకుఁ జోటీయలేదు. ఇంకొక గొప్ప విశేష మేమనఁగా వారు వాసుదేవునకు అనన్యభక్తులు. వారికి ఆనంద ఘన నంద

నందన శ్యామసుందరుని చరణారవిందములందు అనపాయిని యగు నహైతుక భక్తి కలదు. అందువలన వారికి మహాప్రస్థానమందు శారీరక కష్టము కలుగ లేదు, మానసిక కష్టమును గలుగ లేదు. వారు సంసారము యెడల నుదాసీనులై, మఱియొక దిక్కు చూడక ముందుకు పోవుచుండిరి. వారిలో నెవ్వరికిని సుఖదుఃఖముల చింతయే లేదు. ఎవరితో నేమియు మాటలాడుటయును లేదు. అందఱు తనయెడల నుదాసీనులైరనియుఁ, దనమీఁద నపేక్ష లేదనియు, వీరిని వెంటాడుట వ్యర్థమనియు ద్రౌపది తెలిసికొని, యొకచోట కూలఁబడెను. ఆమె తన చిత్తములో, తనకు సర్వస్వ పరమారాధ్యుఁడగు వాసుదేవ భగవానుని ధ్యానించుచు నాతనిలో లీనమయ్యెను.

పాండవులు శాస్త్రాజ్ఞానుసారముగ విధ్యుక్తముగ సమస్తధర్మముల ననుష్ఠించిరి. వారికి అంతిమ శరణము శ్యామసుందరుఁడే. కావున వారు హృదయముతో సమస్త ప్రపంచమును బరిత్యజించిరి; కాని హృదయధనమగు శ్యామసుందరుని వారు తమ చిత్తములో ధరించిరి. నిరంతరము భగవద్ధ్యానము చేయుటచే వారి హృదయములందు అహైతుక పరాభక్తి యుత్పన్నమయ్యెను. అత్యంత వేగముగ వృద్ధిపొందుచున్న భక్తివలన వారి యంతఃకరణములు నిర్మలము లయ్యెను. ఈ విధముగ సమస్త మలములు తొలఁగుటచే నిష్పాపులగు నా పాండవులందఱును బరమ గతికి పోయిరి. విషయాసక్తులే సాధనముల చేతను ప్రాప్తింపఁ

జాలని భగవద్ధామమును వారు పొందిరి. వారు భగవంతుని లోకమునకుఁ బోయిరి.

ఈవిధముగ భగవంతుఁడు స్వధామమును జేరిన తర్వాత ధృతరాష్ట్ర గాంధారులు దావాగ్నిలో దగ్ధమయ్యె, భగవద్వియోగమునఁ గుంతీదేవి అంతఃపురములోను, విదురుఁడు ప్రభాసక్షేత్రమందును, ద్రౌపదీ సహితముగాఁ బాండవులు ఉత్తర ఖండములోను దమతమ పాంచభౌతిక శరీరములను దృజించిరి. వీరందఱును తీవ్రభక్తిచే శుద్ధాత్మస్వరూపులై భగవద్గతిని బొందిరి.

అంత శౌనకుఁ డిట్లడిగెను:— "సూతా! పాండవులు తమ తమ కర్మానుసారముగ స్వర్గమునకుఁ బోయిరనియు, వారు భావముతో నరకమునుగూడ చూడవలసివచ్చినదనియు వింటిమి; కాని వారీ శరీరములను వదలఁగానే భగవత్ప్రాప్తిని జెందిరని చెప్పుచున్నావే. అసలు విషయమేమి? మా యీ శంకకు సమాధానమిమ్ము."

శౌనకుని ప్రశ్నను విని సూతుఁడు నవ్వి యిట్లనెను:— "బ్రాహ్మణోత్తమా! మహాభారత ప్రసంగములో నేను నిట్లే వినియుంటిని. ఇవన్నియుఁ గర్మమార్గ గతులు. వీనిలోఁ గామ్యకర్మలకే ప్రాధాన్య మీయఁబడినది. అచ్చట కర్మానుసారముగ స్వర్గనరకము లనుభవింపవలసి యుండును. ఒక కల్పములోఁ బాండవు లిట్లు కర్మగతిని జెంది యుండవచ్చును. కాని యీ 'భాగవత కథా' ప్రసంగమున నట్లు జరుగలేదు. ఈమార్గములోఁ గర్మలకు ప్రాధాన్యత లేదు. ఇచ్చట సమస్త

కర్మలు బ్రహ్మార్పణ బుద్ధిచే వాసుదేవుని ప్రీత్యర్థముగఁ జేయఁబడును. స్వాయముగఁ బురుషార్థము లొనర్చుటకు తమ సర్వస్వము కృష్ణార్పణము చేసినట్టియు, మనోవాక్కాయ ముల భగవచ్ఛరణాగతి చేసినట్టియు భక్తులకు వీలులేదు. ప్రపన్నులైనవారు స్వతంత్రించి కర్మానుష్ఠానము నెట్లు చేయఁగలఁడు? ఆతఁడేది చేసినను తన ప్రభువగు నందనంద నుని ప్రేరణచేతనే చేయుచుండును. ఆతఁడు తన అహంభావ మును తన యిష్టదైవము యొక్క చరణకమలములం దిది వరకే సమర్పించి యున్నాఁడు. ప్రారబ్ధానుసారముగ భగవ త్ప్రేరణచే నేదైన కార్యము వానిద్వారా జరిగిన యెడల నాతఁడు వెంటనే "శ్రీకృష్ణార్పణమస్తు" అని భగవంతునకు సమర్పించి యిట్లు ప్రార్థించును:— "ఓ నాథా! నా ద్వారా ఏ కార్యము చేయఁబడి యుండినను, చేయుచుండినను, చేయ నున్నను అవన్నియు నేను చేయలేదు. నీవే నా చేత చేయిం చితివి. దానికి కర్తను నేను గానప్పుడు, నీవే కర్త. ప్రేర కుఁడ వైనప్పుడు దాని ఫలమును గూడ నీవు భోగించుము. సేవకుఁడు పనిచేయఁగా, నా వ్యాపారములోఁ గలుఁగు లాభ నష్టములు యజమానివే కాఁగలవు. వానికి మాత్రము వాని జీతము ముట్టును. కావున నేను నీ జీతమును దిను దాసుఁ డను. కర్తయు, భోక్తయు నీవే."

మన యీ 'భాగవత కథ' లోని పాండవు లీ బుద్ధి చేతనే కార్యము లొనర్చిరి. కావున మీరే యాలోచిం చుఁడు — వారు స్వర్గనరకములకు సంబంధించిన సుఖదుఃఖముల నేల యనుభవింపవలయునో? వారు సుఖదుఃఖములను దాటి

నిర్ద్వంద్వులై భగవద్ధామమునకుఁ జేరిరి. పాండవుల సంగతి చెప్పవలసినదే మున్నది? వారు భగవంతునకుఁ బరమప్రియులగు పార్షదులు. వారు వారిస్వరూపులగుటచే వారికట్టిస్థితియే కలుగవలెను. నా గురువునకుఁగూడ గురువగు వ్యాసభగవానుఁడు మిక్కిలి దృఢముగా స్పష్టశబ్దములతో నేమియు ననుమానము లేకుండ నిట్లు చెప్పెను:—

శ్లో॥ యః శ్రద్ధయైత ద్భగవత్ప్రియాణామ్,
పాండోః సుతానామితి సంప్రయాణమ్ ।
శృణోత్యలం స్వస్త్యయనం పవిత్రమ్,
లబ్ధ్వా హరౌ భక్తిముపైతి సిద్ధిమ్ ॥
— శ్రీభాగ. ౧ స్కం. ౧౫ అ. ౫౧ శ్లో.

"ఏ మానవులు భగవంతుని పరమప్రియ పార్షదులగు నీ పాండవుల మహాప్రయాణమునకు సంబంధించిన యీ పరమపవిత్రమును, అత్యంత కల్యాణకారిణి యగు కథను శ్రద్ధాపూర్వకముగ వినెదరో, వారు కూడ భగవంతుని అహైతుక భక్తిని బొంది పరమసిద్ధిని బొందుదురు." వారి కథను వినుటచేతనే సిద్ధికలుగుచుండఁగా వారికి సిద్ధి కలుగుటలో ననుమాన మేముండును? చెప్పవలసిన దేమున్నది?

సూతుని ముఖమునఁ దన శంకకు సమాధానమును ఈ విధముగ విని శౌనకాది మునులు పరమసంతుష్టులై యిట్లనిరి:— "సూతా! నీవు చాల తెలివిగా మా శంకకు సమాధానము చెప్పితివి. ఇఁక నిప్పుడు మాకు పరీక్షిన్మహారాజు యొక్క తర్వాత చరిత్రను జెప్పుము."

ఋషు లిట్లడుగఁగా సూతుఁ డిప్పు పరీక్షిన్మహా రాజు చరిత్రను చెప్పుట కుద్యుక్తుఁ డయ్యెను.

ఛప్పయ.

గాంధారీ ధృతరాష్ట్రీ విదుర కుంతీ హరి హియ ధరి।
పాండవ పత్నీ సహిత గయే పరివార దుఖీ కరి॥
తను త్యాగో యశ ఛాడి ధామ వైకుంఠ సిధారే।
సబకే సుఖ కర మధుర చరిత హైఁ అతిశయప్యారే॥
జే శ్రద్ధా తేఁ సునహిఁ నర, పఢహిఁ ప్రేమ తేఁ గాయంగే।
పుణ్య పరమ పద పాయంగే, భవసాగర తరజాయంగే॥

అర్థము

గాంధారి, ధృతరాష్ట్రుఁడు,కుంతి, ద్రౌపది వీరందఱును శ్రీకృష్ణుని హృదయమున ధరించి పరివారమునంతను దుఃఖమున ముంచి వెడలిపోయిరి. శరీరమును విడిచి యశమును బొంది వైకుంఠమునకుఁ బోయిరి. ఇది అందఱకును సుఖము నొసంగునదియై, మధురమై, అతిశయ ప్రీతి గల చరిత్రము.

ఎవరీ చరిత్రమును శ్రద్ధతో వినెదరో, పఠించెదరో, ప్రేమతో గానము చేసెదరో వారందఱును పరమ పుణ్య పదమును బొందెదరు. భవసాగరమును దరించెదరు.



# పరీక్షిన్మహారాజు

౧౬

శ్లో॥ తతః పరీక్షి ద్ద్విజవర్య శిక్షయా,
మహీం మహాభాగవతః శశాస హ
యథా హి సూత్యామభిజాత కోవిదాః,
సమాదిశ న్విప్ర మహద్గుణ స్తథా॥
— శ్రీభాగ. ౧ స్కం. ౧౬ అ. ౧ శ్లో.

"వ. అంతటం బరీక్షిత్కుమారుండు జాతకర్మవిదులైన కోవిదులు చెప్పిన చందంబున భూసురోత్తమ శిక్షావశంబున మహాభాగవత శేఖరుండై ధరణీపాలనంబు సేయుచు...
.................."
—శ్రీమదాంధ్ర భాగవతము

ఛప్పయ.

పూజ్య పితామహ పరమపుణ్య పరలోక పధారే।
భయే పరీక్షిత్ నృపతి సునత సబ సంత సుఖారే॥

యజ్ఞయాగ బహు కరే దాన దుఖియని కూఁ దీన్హేఁ।
ఇరావతీ మేఁ చారి గుణీ సుత పైదా కీన్హేఁ॥

కృపాచార్య కీ కృపా తేఁ, అశ్వమేధ త్రై ఈ కరే।
యోఁ ఋషిఋణ సురపితరఋణ, తీనోఁ ఋణ తేఁ నృపతే॥

అర్థము.

పూజ్యులగు ధర్మరాజాది పితామహులు పరలోకము నలంకరించిరి. పరీక్షిత్తు రాజగుటను విని సమస్త సాధు సత్పు

రుషులు సంతసించిరి. యజ్ఞయాగాదు లెన్నిటినో చేసి దుఃఖుల కెన్నో దానములను గావించెను. ఇరావతీ యను తన భార్య యందు గుణవంతులగు పుత్రులను నలుగురను గనెను.

కృపాచార్యుని కృపచే నశ్వమేధము లనేకములుచేసి దేవర్షి పితౄబుుణములనుండి విముక్తిఁ జెందెను.



లోకపరంపర అవిచ్ఛిన్నము. ఒకఁడు వచ్చుచుండును, మఱియొకఁడు పోవుచుండును. కొందఱు చచ్చుచుందురు, కొందఱు పుట్టుచుందురు. చాల పురాతనస్థానములు నశించి పోవును, కొన్ని క్రొత్తవి ఏర్పడుచుండును. ఖాళీగా నున్న స్థానములు సమయానుసారముగఁ బూర్తియగు చుండును. ఈ విధముగా నీ విశ్వప్రపంచము సర్వదా జరుగుచున్నది. అట్లే జరుగుచుండును. లోకములోని వస్తువులన్నియు ననిత్యములు, నాశవంతములు. శ్రీకృష్ణ సంబంధము కలిగినట్టియు నాతని యశగుణకీర్తనముతోఁ గూడినట్టి వారెన్నడును నాశముకారు. వారు సర్వదా ఏకరసులై యుందురు. మిగిలిన వారందఱును జలబుద్బుదములవలెఁ బుట్టుచుండును, చచ్చుచుండును. కావున శ్రీకృష్ణుయశమును గూర్చియు, నాతని భక్తుల యశమును గూర్చియు నిరంతరము శ్రవణము చేయ వలసియున్నది.

పాండవులు మహాప్రస్థానము కావించి పరలోకము నలంకరించిరి. ఇప్పుడు భరతవంశ సింహాసనమున పరీక్షిత్తు కూర్చుండెను. పరీక్షిత్తు సింహాసనమెక్కఁగానే అందఱకు

పరమానందమయ్యెను. ఆతఁడు ధర్మాత్ముఁడు, న్యాయ పరాయణుఁడు, ప్రజావత్సలుఁడు. ఆతని రాజ్యమున సింహము మేక ఒక్క రేవులో నీరుత్రాగెడివి. బలవంతులు బలహీనులను బాధించెడివారు కారు. ఆతని రాజ్యములో వాయువే యెవరి వస్తువును ఎత్తుకొనిపోదన నింక దొంగల విషయము చెప్పవలసినదేది కలదు? పరస్త్రీని దుర్భావముతో నెవడైనఁ జూచినాఁడని తెలిసెనా వానిని గఠినముగ శిక్షించెడువాఁడు. కాలమున వర్షములు కురిసెడివి. భూమిని బాగుగా పంటలు పండెడివి. ప్రజలందఱు సుఖులు. కేవలము దుష్టదుర్జన పురుషులే ఆతని రాజ్యమున భయభీతు లగుచుండెడువారు.

పరీక్షిత్తు తన మామయగు నుత్తరుని కూఁతురను ఇరావతియను దానిని విధిపూర్వకముగ వివాహము చేసికొనెను. ఇది విని శౌనకుఁ డిట్లడిగెను:– "సూతా! ధర్మాత్ముఁడగు పరీక్షిత్తు ఇట్టి యధర్మ సంబంధము నెట్లు చేసికొనెను? మేనమామకూఁతురు చెల్లెలుతో సమానము. శాస్త్రమును బట్టి యిట్టి సంబంధము నిందనీయము, గర్హ్యముగ నెన్నఁబడుచున్నదే. అట్టియెడ ధర్మాత్ముఁడగు మహారాజిట్టి లోకనిందిత శాస్త్రగర్హిత వివాహము నేల చేసికొనెను?"

శౌనకుని శంకను విని సూతుఁ డిట్లనెను:– "మహాభాగా! ఏమి చెప్పుదును? సంసర్గముచే మంచివారికిఁగూడ గుణదోషములు కలుగుచుండును. అందుకనియే ఆర్యసంస్కృతిలో వనార్య సంసర్గము గొప్ప పాపమని చెప్పబడియున్నది.

సమాజము వైదికపురుషులను, వేదము నొప్పుకొనకున్న వర్ణాశ్రమాచారపరుఁడు దానిని సహింపఁగలఁడు. దేవుఁడు లేఁడనిన క్షమింపఁగలఁడు. ఈశ్వరుని నిరాకారుఁడన్నను, సాకారుఁడన్నను, అద్వైతమన్నను, ద్వైతమన్నను ఎట్లైనఁ బూజించుము సమాజ మందు జోక్యము కలుగఁజేసికొనదు; కాని యెవఁడైన ననార్య సంసర్గముచేసి, సమాజముయొక్క పరంపరాగతమగు నాచారములను ఛిన్నభిన్న మొనర్చినచో, సమాజము వానిని తననుండి దూరముచేయును. కాని సమాజమంతయు నేదైన దురాచారమును స్వీకరించినచో నది లోకరీతి యగును. తండ్రియాజ్ఞ నుల్లంఘించుటచే యయాతిమహారాజు తన పుత్రుడగు యదువునకు 'నీవంశములో మేనమామకూఁతురినుగూడ పెండ్లి చేసికొందు'రని శాప మొసంగెను. యాదవులు బ్రహ్మర్షులతో నీ బ్రహ్మావర్తమున నున్నంతవఱకు ఈ యాచారము సాగలేదు. ఈ పుణ్యభూమిని వీడి దక్షిణముగా ద్వారకకు వెళ్ళఁగానే దేశాచారమని యీ దురాచారము ప్రబలెను. దక్షిణదేశమున ననార్యసంసర్గముచే నీ యాచారము చాల దినములనుండి యున్నది. ఆశ్చర్యకర విషయ మేమనఁగా నీ యాచారము బ్రాహ్మణులలోఁగూడ నున్నది. అచ్చట మేనమామకూఁతురను, మేనత్తకూఁతురను గూడ పెండ్లి చేసికొందురు. శ్రీకృష్ణుఁడు మేనత్తకూతుండ్రను జేసికొనెను. అతని కొడుకులుకూడ ఆతని ననుసరించిరి. ఆతని నుండి అర్జునుఁడు నేర్చుకొనెను. ఆతనిద్వారా యీ యాచారము వీరిలోఁగూడ వ్యాపించెను. లేకపోయిన మీరు చెప్పినట్లు అట్టిసంబంధము శాస్త్రానుసారముగ సర్వథా విరుద్ధము; కాని

పరంపరాచారమును ప్రజలు తెలిసి కాని తెలియక కాని యంగీకరించుచుందురు. కావున పరీక్షిన్మహారాజు కూడ దీని నంగీకరించెను.

ఇరావతీమహారాణి గొప్పసతీసాధ్వి. సర్వలక్షణసంపన్న. పతిపరాయణ. ఆమెగర్భమునుండి జనమేజయాది నలుగురు పుత్రు లుదయించిరి. వారందఱును అశ్వమేధాది యజ్ఞము లను జేసినవారును, కులకీర్తిని నిలుపు రాజర్షులవంటి రాజు లైరి. జనమేజయుఁడు ధర్మస్వరూపుఁడు. ఆతనివలననే ఈ లోకమున పురాణేతిహాసములు, మహాభారతాదులు ప్రచార ప్రసారము లయ్యెను.

ధర్మరాజు మహాప్రస్థానమునకు వెళ్ళునప్పుడు పరీక్షి త్తును దమ కులపురోహితుఁడగు కృపాచార్యులకు వప్పగించెను. మహారాజాతనిని చాల సమ్మానించెను. ఆతఁ డేకార్య మును జేసినప్పటికిని ఆచార్యుఁడగు కృపుని అడిగికాని చేయఁడు. వేదజ్ఞులగు బ్రాహ్మణుల సమ్మతిలేక యాతఁ డేకార్యమును జేసెడువాఁడు కాఁడు. కావున మునులు, ఋషులందఱును, ధర్మమర్మము నెఱిఁగిన విద్వాంసులగు బ్రాహ్మ ణులును ఆతని నాదరించెడువారు. అతఁడు తన కులరీతి ననుస రించి భూమిలోని సమస్తరాజులను జయించి గంగాతీరమున మూఁ డశ్వమేధయాగము లొనర్చెను. ఆ యజ్ఞములలో బ్రాహ్మణులకు గొప్ప దక్షిణ లీయఁబడినవి. ఆ యజ్ఞముల నన్నిటిని తన కుల గురువగు కృపాచార్యులే విధ్యుక్తముగఁ జేయించెను. దీనివలన నాతనిఖ్యాతి సమస్తభూమండలమునను స్వర్గమువఱకును వ్యాపించెను. అందఱు ఇట్లనిరి:— 'ఈ మహా

రాజు భరతవంశ తిలకుఁడు. ఈతఁడు పాండవుల కీర్తిని అక్షుణ్ణము చేయుటయే కాదు, దాని నింకను విస్తృతము కావించెను.'

పరీక్షిన్మహారాజుసమయమున నాతని కధీనుఁడు కాని రాజొక్కఁడును లేఁడు. అందఱు ఆతని యాజ్ఞలను యథారీతిగఁ బాలించిరి. సమస్త భూమండలమున నాతని ఆజ్ఞలను మన్నించెడువారు. అందువలన నాతఁడెవరితోడను యుద్ధము చేయవలసిన అవసరముకాని, జయించవలసిన అవసరముగాని లేకుండఁబోయెను. అతఁడు తనరథము నెక్కి అవని యంతటను పరిభ్రమించెడువాఁడు, కాని యాతని నొక్కఁడు నెదుర్కొన లేదు. ఒక్కసారి మాత్రము కలిని ప్రయాగలో నిగ్రహింప వలసివచ్చినది. ఆతనిని మొత్తముమీఁద నెదుర్కొన వలసి వచ్చినది కాని యాతఁడీ ధర్మాత్మునితో యుద్ధము చేయఁ జాలక పోయెను. ఆతఁడు దీనతతో శరణు వేఁడి, భిక్షుకునివలెఁ జేతులు జోడించి, యెక్కడనైన నిలుచుటకు స్థానమడిగెను. రాజా! ఈ విధర్మియులు మొట్టమొదట గోవులవలె నమ్రయులైనట్లు వచ్చుచుందురు. కొంచెము కాలు నిలువఁగానే సింహము లగుదురు. పరీక్షిన్మహారాజు, ఆతఁడు దీనుఁడని, శరణ హీనుఁడని గ్రహించి, యాతఁడుండుటకు స్థానము లొసంగెను. ఇంకేమున్నది? మెల్ల మెల్లగా నీకలి కాలు నిలువఁద్రొక్కుకొనెను. అంత కాళ్లుజాపెను. ధర్మరాజిచ్చిన వరముచే నైదువేల సంవత్సరములు మాత్రము లోలోపల బలపడుచుండెను. అయిదువేల సంవత్సరములు కాఁగానే యాతఁడు విచ్చలవిడిగ నాడఁజొచ్చెను. తన యథార్థ స్వరూ

పము నిప్పుడు బయటపెట్టెను. ఇదేవిధముగ వీఁడు వృద్ధిపొంది ధర్మనాశనమును సమస్తవిధములఁ జేయఁగానే భగవానుఁడు కల్కిరూపమును ధరించి వీనిని నాశనముచేసి మరల కృత యుగమును స్థాపించును.

కలి, యాతని నడుగకయే వాని రాజ్యములో నుంపుటకు సాహసింపలేనంతటి ధర్మాత్ముఁడు పరీక్షిన్మహారాజు. మహారాజు ఆజ్ఞను బొందుట కాతఁ డొక యుపాయమును బన్నెను. ఆతఁడు శూద్రరాజువేషమును ధరించి కఱ్ఱతో నొక యెద్దును, ఆవును గొట్టుచుండెను. సాక్షాత్తుగ ధర్మము ఎద్దురూపమును ధరించెను. పృథివి గోరూపమును ధరించెను. గోవృషభము లెల్లప్పుడు నవధ్యములు. వర్ణాశ్రమాచార తత్పరుఁ డెవఁడును వీటిని వధింపఁడు, శారీరక దండము నొసంగఁడు. గోవును లోకమాతగ భావించి పూజించుచుందురు. కలి ముందుగా వానినే ప్రహరించుచుండెను. ఈ విపరీతాచారమును గాంచి ధర్మావతారుఁడగు పరీక్షిత్తు దానిని నిగ్రహించెను.''

సూతుని ముఖమున నీ విషయమును విని సమస్త మునుల తరఫున శౌనకుఁ డిట్లనెను:— ''సూతా! నీవు మిక్కిలి యద్భుత విషయమును జెప్పుచున్నావు. కలి, దేవ యోనియందు జనించిన దివ్యపురుషుఁడు. మానవుఁడైన పరీక్షిన్మహారాజు వాని నెట్లు నిగ్రహించెను? ఇంకొక సందేహము కూడ మమ్ములను బాధించుచున్నది. కలి పాపమునకు, అధర్మమునకు స్వరూపము. దుర్గుణ సాగరము. దిగ్విజయ సమయమున మహారాజునకు వాఁడు దొరకిన నేల చంపలేదు?

ఆ కన్నులకుని శాశ్వతముగ లోకములో లేకుండ యేల ... ? వానినేల బ్రదుక నిచ్చెను? రాజ చిహ్నములను ధరించిన యా శూద్రుఁ డెవఁడు? కలియే యిట్టిరూపమును ధరించెనా? లేక సూక్ష్మరూపమున నొకానొక శూద్రుని శరీరములోఁ బ్రవేశించెనా? నీవు చెప్పిన గో వృషభము లెవరు? ఈ సమస్త విషయములను మాకు నీవు విస్తారముగఁ జెప్పవలయును.

'ఆవశ్యమైన మీరీ కలి విషయము లేల యడుగ వలయు' నని నీవడుగ వచ్చును. సూతా! మా యభిప్రాయము కలి చరిత్రను వినవలయునని కాదు. ఈ ప్రశ్నను వేసిన కారణ మేమనఁగా:–పరీక్షిన్మహారాజు భగవద్భక్తుఁడు. గర్భములో నుండఁగానే భగవంతుఁ డాతనిఁ గృపఁజూచెను. బాల్యకాలము నుండియే యాతఁడు శ్రీకృష్ణచరణారవిందములం దనురాగము కలవాఁడు. ఆతని జీవితమంతయు భక్తిమయమై యుండవలయును. ఆతని చరిత్రను వినుటచే స్వతః భగవత్సంబంధమైనట్టియు, భక్తుల పావనచరిత్రమునకు సంబంధించినట్టి కథనము కాఁగలదు. అందువలననే మేమా ప్రశ్న నడుగవలసి వచ్చినది. ఇందులో నేమైన శ్రీకృష్ణకథాశ్రయము న్నప్పటికిని, ఆయన దివ్య చరణారవింద మకరంద పాన లోలుపులగు భక్తుల ప్రసంగ ముండినను మాకీ విషయమును వినిపింపుము. అట్టిది లేకున్న దీనిని వదలి తర్వాత కథను జెప్పుము. మేము వ్యర్థములగు సాంసారిక విషయములను వినఁగోరుట లేదు. సాంసారికులు ప్రోగైనచోట వారి కామిని కాంచన చర్చయే జరుగుచుండును. 'మేమచ్చటికి వెళ్లితిమి.

అచ్చట దేవతలకుఁ గూడ దుర్లభములగు వస్తువుల ననుభ వించితిమి. మా కచ్చట బాగుగా సమ్మానము జరిగినది. ఫలానివాఁడు మమ్ము జూచి యెగతాళి చేసెను. అప్పుడు నేను వాఁడు నోరు మూయునట్లు జాడించి జవాబు చెప్పితిని. అప్పు డాతఁ డేమియు మాటలాడఁజాలక పోయెను. ఒకా నొక భాగ్యవంతుఁడు తన పెత్తనము సాగింపఁ జూచెను. తన ధనవైభవమును బ్రదర్శింపఁ దలఁచెను. నేను స్పష్టముగ నిట్లంటిని:— 'ఒకవేళ నీవు భాగ్యవంతుఁడవైనచో నీయింటికి భాగ్యవంతుఁడవు. నేను నిన్నేమియు నడుగలేదే. నేను నీదగ్గఱ నప్పైనఁ దీసికొనను.' ఇట్లనునప్పటికి వానిముఖము మాడిపోయినది. నీవే చెప్పుము నే నేమైన తీసివేసిన వాఁడ నేమో!' వారిట్టి కామినీ, కాంచన, కీర్తి కథలను జెప్పు కొనుచు కాలయాపన చేయుచుందురు. దీనికి విపరీతముగ సాధు సత్పురుషులు సమావేశమయ్యేనేని పరస్పరము దేహ సంబంధమగు ప్రశ్న లడుగుకొనరు. విషయ సంబంధముగా చర్చ చేయరు. వారు పరస్పరము చూచుకొని "జయ శ్రీకృష్ణ జయ శ్రీకృష్ణ" "జయ జయ శ్రీ సీతారామ, జయ జయ శ్రీ రాధేశ్యామ" యనుచుఁ గౌఁగిలించుకొందురు. తర్వాత భగవచ్చర్చను బ్రారంభించెదరు. బాగుగా పక్వమై సుందర సుగంధితమైన మామిడిపండును జనులు కమ్మదనముచే మెల్ల మెల్లగా చీకెదరో, సత్పతియగువాడు సతీసాధ్వియు, పతి పరాయణయు నగు తన పత్నితోఁ బ్రేమపూర్వకముగఁ గలిసి మెలసి యేకాంతమునఁ దన్మయుడై సంభాషించునో అట్లే భక్తులుకూడ భగవత్కథలతోఁ దన్మయులగుచుందురు.

వారికి బాహ్యజ్ఞానముండదు. ప్రేమియగువాఁడు తన ప్రేయసి యొక్క ప్రియవార్తలను వినుటచేఁ దృప్తిని జెందఁడు. కాని యింకను నధికోత్సాహము ప్రబలును. అట్లే భక్తుఁడు మాటిమాటికి వినఁగా వినఁగా భగవచ్చరిత్రలచేఁ దృప్తినిఁ జెందఁడు. విషయము లవియే. మాట లవియే. ఆ రామ-రావణ కథయే. ధ్రువ, ప్రహ్లాద, విభీషణాదుల విషయములే, గ్రాహమునుండి గజేంద్రుని రక్షించుట, విదురుని ఇంట విందారగించుట, సుగ్రీవునకు రాజ్యమిచ్చుట, విభీషణుని రాక్షసేంద్రునిఁగఁ జేయుట, పూతనను జంపుట, కంసుని బడఁగొట్టుట అన్నియు నిట్టి విషయములే. శ్రీకృష్ణ గోపికల విషయములో నెంతటి శృంగారవిషయము లున్నవో మీరే యూహించుఁడు. ఈ విషయమున శ్రీకృష్ణ గోపికల నామములను దొలగించి, ప్రాకృత స్త్రీ పురుషుల నామముల నుంచి ఈ శృంగారవిషయము-లనే వారి విషయములోఁ జెప్పిన ఏ స్త్రీ పురుషునికైన మనస్సు వశమందుండునా? ఎవఁడైనఁ దన చిత్తమును స్థిరముగ నుంచుకొనఁగలఁడా? కాని నాయక స్థానమున శ్రీకృష్ణుఁడే వచ్చినచో మిక్కిలి శృంగారమయములగు వార్తలు కరుణారస పరిపూర్ణములగును. భక్తుల మనస్సులలో వీనిశ్రవణముచే విషయ వికారవిషయ మట్లుంచుము. కరుణాస్రోత ప్రవహించును. హృదయము గద్గదమగును. కన్నులనుండి అశ్రుధారాప్రవాహ మారంభము కాఁగానే హృదయము బద్దలగునట్లుండును. ఈ స్థితియొక్క అనుభవమును ఈ మాంసాస్థితోఁగూడిన శరీరమందే సుఖ మనుకొనువారును. మలమూత్రములతో నిండి మాంసచర్మములచేఁ

జేయఁబడి రక్తము మొదలగు నశ్లీల వస్తువులతో నిండిన అపవిత్రస్థానములలో నే ఆనంద మున్నదనుకొను విషయాసక్తు లగువా రెట్లు తెలిసికొనఁగలరు? కావున సూతా! మాకు నీవు భగవంతుని యొక్కయు, భక్తులయొక్కయు చరిత్రలనే వినిపింపవలయును. ఇతర విషయములవలన మా కేమి ప్రయోజనము? అన్యవిషయములను జెప్పుటచేతను, వినుటచేతను ఆయువులో నమూల్యమగు కాలము వ్యర్థముగ నష్టమైపోవుచున్నది.

'మీరు ప్రతివిషయమును విస్తారముగ నడుగుచున్నారు, కాని మానవుని ఆయువునకు నిలకడ యేమున్నది? మృత్యువు ఎప్పుడో వచ్చి కబళించుకొని పోఁగలదు. కావున మృత్యువునకు భయపడుచు మీరు ప్రశ్నించుచుండుఁడు. కాలము సంబంధమున శంకించుచుఁ గథాశ్రవణము చేయుఁడు' అని నీ వనవచ్చును. చెప్పుట విషయములో శంకింపవచ్చును. సూతా! నీ వీ విషయమునఁ జింతింపవలదు. మా తపఃప్రభావముచే మృత్యువును మేము స్వాధీనము చేసికొని యున్నాము. మేము చచ్చెడువారము కాము. మేమే కాదు, ఇచ్చటికి వచ్చి కథను ఎవరు వినుచున్నారో మా యీ యజ్ఞము పూర్తి యగువఱకు వారికిఁగూడ మృత్యువు కలుగదు.''

సూతుఁడు మిక్కిలి యాశ్చర్యమును జెంది యిట్లనెను:- 'మహారాజా! యిట్లు పలికెద రేల? మృత్యుదేవత దాని పని నిది యెట్లు మాని వేయఁగలదు? ఎవరిని లక్ష్యపెట్టని కాలుఁడు మిమ్ముల నెట్లు మన్నింపఁగలఁడు? ఆతఁడు తన లోకములోఁ

గూర్చుండి ప్రాణుల దినములను లెక్కపెట్టుచుండును. ఆతనికి మా ప్రశ్నమువలన ప్రయోజన మేమి?''

సూతుని వాక్యములను విని శౌనకుఁడు నవ్వుచు నిట్లనెను:— "సూతా! భగవత్కృప ముందు మృత్యుదేవుఁ డేపాటి? పరమ భక్తాగ్రేసరుఁడగు ధ్రువుఁ డీలోకమును వదలి పరలోకమునకుఁ బోవునపుడు మృత్యుదేవుఁడు భయపడుచు నాతని సమ్ముఖమునకు వచ్చి యిట్లనెను:— 'మనువంశావతంసా! రాజా! నీవు మానవ శరీరమును ధరించితివి. కావున నీ లోకమును వదలునప్పుడు నియమానుసారముగ నన్ను గ్రహించి, యీ శరీరము నిచ్చటనే పరిత్యజించి, తర్వాత పరలోకమునకు వెళ్ళుఁడు.' మృత్యు వచనములను విని భక్తశిరోమణియగు ధ్రువుఁడు నవ్వుచు నిట్లనెను:— 'మంచిది. ఒక మాటయున్నది. కూర్చుండుము. నేను నీవలనఁగూడ ప్రయోజనమును బొందుదును.' ఆతఁ డిట్లాశ్వాసించుటను విని వణఁకుచు మృత్యుదేవత దూరముగఁ గూర్చుండెను. ధ్రువుని గొనిపోవుటకు భగవంతుని దివ్యవిమానము వచ్చెను. దేవతల విమానము నేలమీఁద వ్రాలదు; తాఁకదు. అందువలన నా విమానము అంతరాళముననే నిలిచియుండెను. ధ్రువుఁడు సమస్తకర్మలనుండి నివృత్తుఁడై ధ్రువ ధామమునకు బోవునప్పుడు. ఆతఁడు మృత్యువును బిలిచి సింహాసనమునకు క్రిందుగాఁ గూర్చుండు మనెను. మృత్యువు భయపడుచు సింహాసన సమీపమునఁ గూర్చుండెను. ధ్రువుఁడు సందేహింపక వెంటనే ఆతని శిరముపైఁ గాలిడి దానిని మెట్టుగాఁ జేసికొని దివ్యవిమానమున నెక్కి కూర్చుండి, నవ్వుచు

నిట్లనెను:— 'ఇంక వెళ్లు. నిన్నుఁగూడ సత్కరించితిని.' కావున సూతా! భగవద్భక్తులు హరిభక్తి ప్రభావముచే శ్రీకృష్ణకథామృతమును పానము చేయుటచే మృత్యు శిరమునఁ బాదము మోపవచ్చును. ఇతరులకు మృత్యువును దాఁటుట దుష్కరము. మృత్యువు వచ్చి యజ్ఞమధ్యమున కార్యవిఘ్నము కావించునెడల మన సహస్ర వత్సర యజ్ఞము పూర్తికాదని యజ్ఞప్రారంభమున యోచించి, మృత్యువును బిలిచి యాతనితో నిట్లంటిమి:— 'నీవు మాకార్యములో కొంచెము చేయికలిపి సహాయము చేయవలయును యజ్ఞములో నేదైన పని నీవు చేసిపెట్టవలయును.'

మృత్యు విట్లనెను:— 'మీ యాజ్ఞప్రకారము చేయఁగలను స్వామీ!'

మేమి ట్లాలోచించితిమి:— 'ఈతని వలన నేమి పని చేయింపవలెను? ఈతని జూచిన ప్రాణులందఱు భయపడు చుందురు. ఏమి గడబిడ జరుగునో తెలియరాదు.' అనుకొని మేమిట్లంటిమి:— 'మృత్యుదేవా! నీవు మాయజ్ఞమందు శామిత్రకర్మ—యజ్ఞసంబంధమగు బలి కర్మను చేయవలెను. ఆ కర్మ చేయుటకాక యిక్కడికి వచ్చినవారిలో నెవరిని యజ్ఞ సమాప్తి యగువఱకు చంప కూడదు.' మృత్యువు దీని కంగీకరించి, ఆతఁడిక్కడ ఉండి యీపనిని జేయు చుండును. ఇంకెవరి తోడను మాట్లాడఁడు. కావున నీవు మృత్యు భయమును వీడి నిర్భయుఁడవై విస్తారముగ శ్రీకృష్ణ కథను జెప్పుము. శ్రోతలు, వక్త ఎవరును కాలభయమును

జెందరాదు. యజ్ఞము జరుగుచున్నంతవఱకు కాలుఁడిచ్చటనే యుండును. కాలుఁ డిచ్చట ఉండువఱకు ఎవరును జావరు. కావున నీవు మిక్కిలి ప్రేమతోఁ దెలియునట్లు కథను జెప్పు చుండుము. మేమందఱమును సావధానముగ ఏకాగ్రచిత్తముతో దానిని శ్రవణము చేయుచుందుము. ఈ విధముగ నీ కాలము గడచిపోవును. బుద్ధిమంతు లగువారికి తీరిక సమయములలో నిదియే సర్వశ్రేష్ఠమగు చక్కని సదుపయోగ సాధనము. అట్టివారు ఎల్లప్పుడు శ్రీకృష్ణ కథా కీర్తన సత్సంగములలోఁ గాలము గడుపుచుందురు. మూర్ఖులును, మందబుద్ధులును, పూర్వకృతపాపకర్మలద్వారా శ్రీకృష్ణకథావిముఖులును, సాధుసత్పురుష సంగము రుచింపని వారును, భగవత్కథాకీర్తనములకుఁ బోనివారును, ఒకవేళ బలవంతమున వెళ్లినప్పటికిని అచ్చట కురికిపాట్లు పడుచుందురు, ఆవలింతురు, భక్తులను విమర్శించుచుందురు. లేకున్న వారి స్వకార్యము లను గూర్చి యాలోచించుకొనుచుందురు. నిద్రపోవుదురు. అట్టి దుర్మార్గుల కాల మిట్లు వ్యర్థవిషయములలోనే గడచిపోవుచుండును. దినమంతయు వారు పరనింద, పరచర్చ, విషయభోగములకై పాటుపడుచుందురు. రాత్రులందు ముసుగు కప్పుకొని నిద్రయైనఁ బోవుచుందురు. విషయప్రసంగములో నైన నిమగ్నులగుచుందురు. వారికి పరమాత్మయును లేఁడు, పరలోకమును లేదు. కడుపు నిండ తినుటయే వారికి పరమపురుషార్థము. సాంసారిక విషయ ప్రాప్తియే వారికి సర్వశ్రేష్ఠమగు నానందము.

ఇచ్చట మనసభలో నట్టి మనుష్యుఁడెవఁడును లేఁడు. అట్టి పురుషులకు ఇచ్చట మనసెట్లు నిలువఁగలదు? ఇచ్చట నందఱును సత్సంగ, శుభకర్మలలో మునిఁగి తేలుచుందురు. వీరికి పరనిందకు, పరచర్చకు సమయమే చిక్కదు. దుర్మార్గులు ఒకటి రెండు రోజులు తినకయైన నుండఁగలరుకాని వారి నాలుక ఆమాటలు, యీమాటలు పదిచెడ్డవి మాట్లాడకుండ ఉండలేరు. సత్పురుషులపై సత్యాసత్యనిందలు మోపక, నిందించక వారికి తృప్తికలుగనే కలుగదు. నల్లమందు తినువాఁడు నల్లమందులేక, సారాయము త్రాగువాఁడు సారాయమును త్రావక యెట్లుండలేఁడో అట్లే వీరికి పరనింద, పరచర్చ ఇవి భయంకర వ్యసనములు. నిందకుఁడు నిందింపక ఉండజాలఁడు. అట్టివారి కిచ్చట నిర్వాహమెక్కడిది? కాఁబట్టి మేమందఱమును వినవలెనను కోరికతో నున్నాము కావున భగవద్భక్తుఁడగు పరీక్షిన్మహారాజు చరిత్రమును విస్తారముగఁ జెప్పుము'' శౌనకుఁడిట్లు పలుకఁగా సూతుఁడు సంతోషముతో తర్వాత వృత్తాంతమును జెప్పఁదొడఁగెను.

ఛ ప్ప య.

సున్యోఁ పరీక్షిత్ రాజ్య మాఁహి కలియుగ ఘుసి ఆయో।
ధావా బోల్యో తురత సునత కలియుగ ఘబరాయో॥
పూఛేఁ శౌనక–సూత! కర్యో కలి కైసే వశమేఁ।
నృపతి వేషమేఁ శూద్ర గఊ తాడత కిహి థలమేఁ॥
రాజవేష ధారీ వృషల, వృషభ గఊ తాడన కరత।
బల పూర్వక కస వశ కర్యో, కస నృప సబకే దుఖ హరత॥

అర్థము.

"కలి తన రాజ్యములోనికిఁ బ్రవేశించిన సంగతిని పరీక్షిత్తు విని వానిపైకి దాడి వెడలెను. దాడి సంగతివిని కలి భయపడెను." అను సంగతిని విని శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! పరీక్షిత్తు కలినెట్లు వశముచేసికొనెను? రాజవేషమునను్న శూద్రుఁడు గోవును ఏస్థలమునఁ గొట్టుచుండెను?

రాజవేషధారియగు శూద్రుఁడు గోవృషభములను గొట్టుచుండ, బలపూర్వకముగ పరీక్షిత్తు యెట్లు వశముచేసికొనెను? పరీక్షిన్మహారాజెట్లు అందఱి దుఃఖమును హరించెను?"



## పరీక్షిన్మహారాజు దిగ్విజయము.

౬౭

శ్లో॥ యదా పరీక్షిత్ కురుజాంగలే వసన్,
కలిం ప్రవిష్టం నిజ చక్రవర్తితే।
నిశమ్య వార్తా మనతి ప్రియాం తతః,
శరాసనం సంయుగ శౌండిరాదదే ॥

— శ్రీభాగ. ౧ స్కం. ౧౬ అ. ౧౦ శ్లో.

"వ. పరీక్షిన్నరేంద్రుండు నిజవాహినీసందోహ సంరక్షితంబగు కురుజాంగల దేశంబునం గలిప్రవేశంబు నాకర్ణించి యుద్ధకుతూహలత నంగీకరించి యొక్కనాఁడు సముల్లాసంబున బాణాసనంబుఁ గైకొనెను."

— శ్రీమదాంధ్ర భాగవతము.

ఛ ప్ప య.

కురు జాంగల మహాఁ బసత, యుద్ధ అవసర నహీఁ ఆవేఁ।
ధీర ధనుర్ధర నృపతి, బినారణ హాథ ఖుజావేఁ॥
కలి ప్రవేశ సుని కుపిత, శీఘ్ర సబ సైన సహారీ।
దశోఁ దిశాకూఁ విజయ కరన కీ కరీ తయారీ॥
జాయఁ జహాఁ జహాఁ జనేశ్వర, తహాఁ నిజ కుల కీరతి సునత।
కహాఁ కహాఁ కృష్ణ కృపాకరీ, సునతహాఁత అతి మన ముదిత।

అ ర్థ ము.

కురుజాంగల దేశంబుల నుండుచు పరీక్షిన్మహారాజు యుద్ధావసర మేమియు లేక రాజ్యము చేయుచుండెను. ధీరుఁడు, ధనుర్ధరుఁడగు నృపతికి యుద్ధము లేకపోవునప్పటికి చేతులు జిలప్పుట్టెను. ఇంతలో నీ రాజ్యములలోఁ గలిప్రవేశించిన సంగతిని దెలిసికొని సైన్యము నంతను సిద్ధముచేసి, దశదిశలను జయించి వచ్చుటకు చేయవలసిన యేర్పాటు లన్నియుఁ జేసెను.

పరీక్షిన్మహారాజు ఎచ్చటెచ్చటికి వెళ్లినప్పటికిని తన పూర్వజులయొక్క తన వంశము యొక్కయు కీర్తిని విని, యెచ్చటెచ్చట నేయే సందర్భములలో శ్రీకృష్ణుఁడు కృపతోఁ జూచెనో ఆసంగతిని విని మనస్సున నత్యధికముగ సంతసించెను.



ఎవని కే వస్తువుమీఁద స్వభావానుసారముగ వ్యసన ముండునో వాని కా వస్తువు లేకున్న మనస్సునకు శాంతి యుండదు. వాఁడు దానికొఱకు అన్వేషించుచుండును.

శాస్త్రజ్ఞుఁడు వాదవివాదమందు వ్యసనము కలవానికి శాస్త్రవాదనకు తపించుచుండును. మల్లుఁడు మంచికుస్తీకొఱకు పరితపించుచుండును. ఉపన్యాసకుఁడు గొప్ప సభలో నుపన్యసింపవలెనని యుత్సహించుచుండును. కళాతపస్వి తన కళను పెద్దైన ప్రదర్శనములోఁ బ్రదర్శింపవలెనని ప్రయత్నము చేయుచుండును. నటకుఁడు తన నాట్యకళను బ్రదర్శింపవలెనని అభిలాష చెందియుండును. ఎవరికైన సుందరమైన పిల్లవాఁడుండెనా, వాని కనేక అలంకారములు కావించి అటునిటు త్రిప్పుచుండును. కారణము ఎవరైన వానియందమునుగాంచి వారినిఁ బ్రశంసింతురేమోననియే. రణములోఁ దన బలపరాక్రమములను, యుద్ధకౌశలమును జూపించి శత్రువును బాగుగా నొప్పింపవలయునని శూరుఁడు, వీరుఁ డగువాఁడు సంగ్రామము కొఱకు ప్రతీక్షించుచుండును.

పరీక్షిన్మహారాజు ప్రసిద్ధ శూరవీరుఁడు. ప్రఖ్యాత ధనుర్ధరుఁడును; కాని యాతనికి యుద్ధావసరము చిక్కలేదు. అతని పూర్వజులగు పాండవుల ప్రతాప పరాక్రమములవలన, నింకవఱకే రాజునకు నీతనికి విరుద్ధముగఁ దలయెత్తుకొనుటకు ధైర్యములేక అందఱును లొంగిపోయిరి. ఆసమయమున రాజ్యము చేయుట యన నొక ధర్మముగఁ బరిగణింపఁబడుచుండెడిది. సామ్రాజ్యాభివృద్ధి చేసికొనవలెనని కాని, వ్యాపారమును జేసికొనవలెనను లోభము చేఁగాని, ఏ దేశముమీఁదను ధర్మాత్ముఁడగు రాజు దండెత్తెడివాఁడు కాఁడు. ఏరాజైన దిగ్విజయాదులను గావించెనా, ఆతఁడు అన్యరాజుల స్వాతంత్రము నపహరించుటకుఁగాదు, కేవలము తన ప్రభావము

నెఱుక పఱచుటకును, తన కీర్తి నభివృద్ధి చేసికొనుటకును దండెత్తుట రణమొనర్చుట జరుగుచుండెడిది. అన్యనరపతి వీనికి లొంగెనా ఇఁక యుద్ధముండదు. వానిని దండించుట యును లేదు; కప్పము కట్టించుకొనుటయును లేదు. ఇద్దరును దమతమ కార్యములను యథారీతిగ జరుపుకొనుచుందురు. తమతో పోటీపడని, యెదిరించని రాజుతో మాటయు మంతియు, యుద్ధము మొదలైనవి జరుపుట ధర్మాత్ముఁడగు రాజునకు తగనిపని. 'ధర్మాత్ముఁడగు రాజు ఇట్టి యుద్ధముల కనుమోదింపఁడు.

ఒక దినమునఁ బరీక్షిన్మహారాజు కలి తనరాజ్యములోఁ బ్రవేశించినాఁడను సంగతి నెవరి వలననో వినియుండెను. ఆతఁడు చాల చింతించి వాని నణఁచుట కుద్యుక్తుఁడయ్యెను. ఆతనికి హర్ష శోకములు రెండును గలిగెను. చాల దినముల నుండి దేనికొఱకు కనిపెట్టికొనియుంటిమో అట్టి యుద్ధావస రము చిక్కినదను సంతోషమును, ధర్మమువిూఁద నింతగా లక్ష్య ముంచుచున్నప్పటికిని అధర్మమిత్రమగు కలి నారాజ్య ములో నెట్లు ప్రవేశించినాఁడా? యను దుఃఖమును గలిగెను. ఆతఁ డిట్లనుకొనెను:— "కలి నెట్లు నిగ్రహింతును? నాయను మతిలేనిది కలి రాఁజాలఁడే. నాధర్మమున కట్టి ప్రభావము కలదే. ప్రజలలో నెచ్చటనైనఁ గలికి కొంచెము సందు చిక్కెనా, దానిద్వారా ప్రవేశింపవచ్చును. సేనను సిద్ధము చేసి, ధనుర్బాణములను ధరించి పర్యటింప బోయెదను. ఈవిధ ముగ నన్నిదిశలఁ బరిభ్రమించెదను. దీనివలన దిగ్విజయమును గలుగును. కలి యేఛిద్రమునఁ బ్రవేశించినదియుఁ దెలియుఁ

గలము.'' ఇట్లాలోచించి మహారాజు గజ, తురగ, రథ, పదాతులను చతురంగ సైన్యమును సిద్ధము చేయవలసినదని యాజ్ఞాపించెను. రాజాజ్ఞను వినఁగానే సైనికులందఱును ఆనందాతిరేకమున నున్మత్తులవలె నైరి. చాలకాలమునుండి రాజధానిలో ఊరక కూర్చుండుటచే వారికి విసుగు పుట్టినది. సైనికులకుఁ గొట్టుట - చంపుటయు, వేఁచుట - దోచుటయు, తిట్లాట - పోట్లాటయు నిష్టము. ఎవరినైనఁ జంపినను, ఏనగరమునైన దోచినను, దేనికైన నిప్పు పెట్టినను ఇట్టిపనులందు వారికానందము నొందు. శిబిరములలోఁ గూర్చుండిన వారి మనస్సున కానందముండదు. మహారాజు ఆజ్ఞను బొంది వారందఱును మిక్కిలి శీఘ్రముగ సిద్ధపడిరి. సేనను సిద్ధము చేసి నగర రక్షణ కేర్పాటులను గావించి, తనకు విశ్వాసపాత్రులును, బుద్ధిమంతులు నగు వృద్ధమంత్రులను వెంటఁబెట్టుకొని సేనను గైకొని దిగ్విజయము నిమిత్తమై పరీక్షిన్మహారాజు బయలుదేరెను. ఆతఁడు భద్రాశ్వ, కేతుమాల, భారత, ఉత్తరకురు, కింపురుషాది దేశముల దిగ్విజయము గావించుచు బయలుదేరెను. మహారాజేయే దేశములకుఁ బోయినను అచ్చటి రాజులు, మహారాజులు వివిధములగు కానుకలను దెచ్చి, పరీక్షిన్మహారాజు ముందుపెట్టి, ప్రణామములు గావించి ఆతనికి లొంగినట్లంగీకరించిరి. పరీక్షిత్తుకూడ వారి రాజ్యము యొక్కయు, మంత్రి, పురోహిత, యువరాజ, కోశ, దుర్గ, సేనావాహన, ప్రజలయొక్క కుశలము నడుగుచు, వివిధములగు ధర్మచర్చలు చేయుచు వారి యాతిథ్యమును స్వీకరించి వారిని వీడ్కొలుపుచుండెను. ఈ విధముగ నా మహా

రాఁజెచ్చటికి పోయినను అచ్చట ఆతనికి వివిధములగు స్వాగత సత్కారములు జరుగుచుండెను. ఆతని స్వాగతములో నాతని పూర్వజుల కీర్తిని గానముచేయు పరిషదు లుండెడు వారు. కథావాచకులు పాండవులకు సంబంధించిన కథలను జెప్పెడివారు. వారి భగవద్భక్తిని గూర్చి వర్ణించెడువారు. వాసుదేవ భగవానుఁడు పాండవుల నెట్లు సంకటముల నుండి యుద్ధరించినదియు, వారి కార్యముల నన్నిటి నెట్లు నిర్వహించినదియు, గర్భములోనుండఁగా నశ్వత్థామ వేసిన యస్త్రమునుండి పరీక్షిత్తు నెట్లు రక్షించినదియు మొదలగు విషయములను విని భగవద్భక్తుఁడగు మహారాజు మిక్కిలి ప్రసన్నుఁడయ్యెను. అచ్చటచ్చట ఈతని శుభాగమన సందర్భమున నటనర్తకులు నాటకములు వేసెడువారు. వానిలోను శ్రీకృష్ణ పాండవులక్కు సంబంధించిన అభినయమే చూపింపఁబడుచుండినది. దానిని గాంచి పరీక్షిత్తు మిక్కిలి సంతోషించెడువాఁడు. తన పూర్వజులపై శ్రీకృష్ణున కెంతటి ప్రేమ కలదో, దానిని స్మరించుకొని పరీక్షిన్మహారాజు గద్గదికుఁడై నిండుసభలో నశ్రువులు రాల్చెడువాఁడు. సూత, మాగధ, వందీజనములును, కథకులును మహారాజు శ్రీకృష్ణ కథా శ్రవణము చేయుటచే మిక్కిలి ఆనందించుచున్నాఁడని తెలిసికొని, ఇతర విషయములను గథలను వదలి, మహారాజు సముఖమునఁ గథలలో వివిధవిధముల ఉపమాది వివిధాలంకారములచే నలంకరింపఁజేసి వినిపించెడువారు. దాని వలన పరీక్షిన్న రేంద్రుని యానందమునకు మేఁటలేదు. శ్రీకృష్ణ కథ నెవరు చెప్పిరో వారిని మహారాజత్యంత స్నేహ కాతరదృష్టి

లతో మాటి మాటికి చూచి, వారు చెప్పిన దానిని గూర్చి ప్రశంసించుచు, వారికి మణి మాణిక్యములను, ధనమును, శిల్పములను, బహుమూల్యవస్త్రాభూషణములను బారితోషిక ముగ నిచ్చెడి వాఁడు. వారందఱును మహారాజిచ్చినట్టి సమస్త వస్తువులను గ్రహించి, మహారాజు ననేక విధములఁ బొగడుచు వెళ్లెడువారు. ఈ విధముగ మహారాజులవారి జైత్రయాత్రాకాలములో నధికకాలము శ్రీకృష్ణ కథా శ్రవణమందే గడచిపోయెడిది.

పరీక్షిన్నరేంద్రుఁడు శ్రీకృష్ణ కథారసికుఁడను సంగతిని వృద్ధబ్రాహ్మణులు తెలిసికొని, యాతని సమీపమునకు వచ్చి యిట్లనెడువారు:— "మహారాజా! మేము పాండవులతో శ్యామసుందరుని గాంచితిమి. ఆతఁడు మమ్ములను మిక్కిలి సత్కరించెడువాఁడు. మే మనేక యజ్ఞములలోఁ గలిసికొంటిమి. అచ్చట వాసుదేవభగవానుఁడు తన చేతులతో మమ్ములఁ బూజించెడువాఁడు."

ఇది విని మహారాజు మిక్కిలి యానందించి మాటి మాటికి ఇట్లడుగుచుండెను:— "మీరు భగవంతుని ఎట్లు దర్శించితిరి? అతఁ డొక్కొక్కప్పుడు చతుర్భుజములను, ఒక్కొక్కప్పుడు ద్విభుజములను ధరించుచుండెడువాఁడని వినికిడి. మీరే రూపమున దర్శించితిరి?"

బ్రాహ్మణు లిట్లనిరి:— "మహారాజా! మే మా శ్రీకృష్ణుని చతుర్భుజములతోడను దర్శించితిమి. ద్విభుజములతోడను దర్శించితిమి. మహాభారతయుద్ధములో మేము పాండ

వుల నాశీర్వదింపఁ బోయితిమి. అచ్చట మేము స్వయముగ శ్యామసుందరుని చతుర్భుజరూపముతో మీ తాతయగు నర్జునుని రథమును నడుపుటను గాంచితిమి. ''

అత్యంతోత్సాహముతో మహారాజిట్లడిగెను:- '' భగవానుఁ డెట్లు రథము తోలెడివాఁడు? చేతిలో కోలకూడ ఉండెడిదా? ఒక్కఁడే యుండెడువాఁడా లేక వేఱొక సారథి కూడ యుండెడువాఁడా? మా తాత ప్రైననే కూర్చుండెడు వాఁడా? భగవానుఁడు గుఱ్ఱపు కళ్లెములను లాగుచుండెడు వాఁడేనా? ఆహా! ఆ సర్వేశ్వరున కెంతటి భక్తవత్సలత? ''

బ్రాహ్మణు లిట్లనిరి:- '' మహారాజా! భగవానుఁ డొక్కఁడే రథమును దోలుచుండెడువాఁడు. అంతేకాదు. ఆతఁడు స్వయముగ నాతని చేతులతో గుఱ్ఱములను కూడ మాలిసు చేసెడువాఁడు. ఆతఁడు వాటి కళ్లెములను బట్టుకొని నదలించెడువాఁడు. సూతుఁ డేపనులు చేయుచుండెడువాఁడో, పాండవుల స్నేహవశమున పరమేశ్వరుఁడగు కృష్ణుఁడు నదే చేయుచుండెడువాఁడు. ''

ఇంతలో నింకొక బ్రాహ్మణుఁ డిట్లనెను:- '' రాజా! సారథి చేసెడు పనిచేయుట అట్లుంచుఁడు. మీ పెద్దతాతయగు ధర్మరాజు వెనువెనుక చేతులు కట్టుకొని సేవకునివలెఁ బోవు చుండఁగా నేను చూచితిని. ధర్మజుఁడు సింహాసనముమీఁదఁ గూర్చుండఁగా దేవకీనందనుఁడు నీచాసనమునఁ గూర్చుండెడు వాఁడు. ధర్మరాజే దైన నడిగిన నాతఁడు నిలుచుండి శిష్టాచారము ననుసరించి జవాబొసంగును. ''

ఇది వినఁగానే పరీక్షిన్మహారాజు నేత్రములనుండి నశ్రు బిందువులు రాల్చుచు నిట్లనెను:— "నా పితామహులు ధన్యులు, వారి మీఁద వాసుదేవుఁడెంతటి అధికానుగ్రహము చూపెనువాఁడు! అందుకనియే మా తాతలు భగవంతునివలె లోకవంద్యులును, ప్రాతఃస్మరణీయులునైరి. అందఱును నన్ను వదలి వెళ్లిపోయిరి. నిజముగ నభాగ్యుఁడను నేనే."

అంత నింకొక వృద్ధబ్రాహ్మణుఁ డిట్లనెను:— "మహారాజా! నీ విట్లేల పలుకుచున్నావు? నీకు సమానమగు భాగ్యశాలి యీ లోకమున నెవఁడుండఁ గలఁడు? నీవు పరమ భాగవతుఁడవు. ఇంకెవరికైన వేలకొలఁది లక్షలకొలఁది, కోట్లకొలఁది సంవత్సరములు అనేక జన్మలు తపస్సు చేసి నప్పటికిని భగవద్దర్శనము కాఁగలదా? నీవనాయాసముగ— తల్లి గర్భములోనే— భగవంతుని దర్శించితివి. ఆతఁడు నీకు తోడుగా గర్భములోనుండి రక్షించెను. నీకు శ్రీకృష్ణకథయందిట్టి రుచి కలుగుటకు కారణ మాతని కృపా ఫలమే. నీ పితామహుల భాగ్యమును గూర్చి చెప్పుట వ్యర్థము. మహారాజా! ధర్మరాజునకు దూతయై శ్రీకృష్ణుఁడు హస్తినాపురమునకు వచ్చినప్పుడు నేనచ్చట నుంటిని. గొప్ప గొప్ప ఋషులు, మునులు, దేవర్షులు, మహర్షులు భగవానుని సందేశమును వినుటకు వచ్చిరి. నిండుసభలో భగవానుఁడు గొప్ప గర్వముతో మేఘగంభీర వాక్కులతో ధృతరాష్ట్రునితో నిట్లనెను:— "నేను ధర్మరాజునకు దూతనై వచ్చితిని. మీతోఁ గూడ నాకు సంబంధము కలదు; కావున నేను మీకు హితవాక్యములు చెప్పుచున్నాను." దుర్యోధనుఁడు మధ్యలోనే

దానిని ఖండించుచు నిట్లనెను:— "నీవు మాకు సంబంధి వగుచో, మా యాతిథ్య సత్కారముల నేల గ్రహింపవు? నీవు విదురునింట భుజింప నేలఁబోయితివి?"

ఆ సమయమున నిండుసభలో నిర్భయుఁడై నిఖిలాధి నాథుఁడగు శ్రీకృష్ణుఁ డిట్లనెను:— "దుర్యోధనా! భోజనము ప్రేమతోనైనఁ జేయవలసి యున్నది. లేక విపత్తి కలిగినప్పు డైనఁ జేయవలసి యున్నది. నేను మీ యింట భోజనము చేయుటకు నాకేమియు విపత్తి కలుగలేదు. ఇఁక ప్రేమతో నందుమా? నీవు నన్నుఁ బ్రేమింపవు. నీవు పాండవుల పైతృక రాజ్యము నీయవు. వారి యెడల శత్రుత్వమును వహింతువు. పాండవులకు శత్రువైనవాఁడు నాకును శత్రువే. కావున శత్రువు నింటిలో భోజనము చేయుట నీతికి విరుద్ధము."

మహారాజా! నిండు సభలో నందఱి సమక్షమున నిట్లు స్పష్టముగ మాటలాడిన రెండు ప్రత్యుత్తరములను వినఁగానే దుర్యోధనుని ముఖము వాడిపోయెను. ఇఁక నాతఁడు కిక్కు రనలేదు. పాండవులకు బలము శ్రీకృష్ణుఁడేనని దుర్యోధ నుఁడు దుష్టచతుష్టయముతో నిట్లాలోచించెను. "కావున నీతనిని గట్టిన, పాండవులు నిర్బలులై, ఇఁక రాజ్యమడుగ సాహసింపరు." కాని కురుకులతిలకా! పరీక్షిన్నరేంద్రా! ఆ జగదీశ్వరుని ఎవరు కట్టఁగలుగుదురు? లోకమంతయు నాతని లీలచే నాడుచున్నది. ఆతని ప్రేరణచే జీవులందఱు ప్రారబ్ధ మున బంధింపఁబడియున్నారు. అట్టియెడ నాతని బంధించుట హాస్యాస్పదము కాదా?"

పరీక్షిన్మహారాజు ఈ విషయముల నన్నిటిని మిక్కిలి శ్రద్ధతో, సమస్త కార్యములను వీడి, వినుచుండెను. ఒక బ్రాహ్మణు డిట్లనెను:— "రాజా! ఒకానొకప్పుడు నేను యుద్ధసమయమున దుర్యోధనుని కడకు వెళ్లితిని. అక్కడ నుంచి నాకు ధర్మరాజును జూడవలెనను కోరిక కలిగెను. మా బ్రాహ్మణుల కెక్కడికిని అడ్డులేదు. ఏ సేనలోకుండ వెళ్లియైన దాన దక్షిణలను దీసికొని వచ్చెడివారము. రాజ్యము లోని పరిచిత బ్రాహ్మణులకు రెండు సేనాద్వారములను దెఱువఁబడినవి. ఎవఁడైన నపరిచిత బ్రాహ్మణుఁడు వచ్చెనా, ఆతఁడు గుప్తచరుఁడేమో మన రహస్యముల నన్నిటిని శత్రువులకుఁ జెప్పునేమో యని వానిమీఁద కొంచెము శంక చేసిఘా యుంచెడివారు. నన్ను మాత్రము కౌరవపాండవు లిరువురు నెఱుఁగుదురు. కావున నేను నిర్భయుఁడనై రెండువైపులకు వెళ్లుచుండెడు వాఁడను. ధర్మరాజు దగ్గఱకు చదువుకొన్నవాఁడు కానిండు, చదువులేనివాఁడు కానిండు, మూర్ఖుఁడు కానిండు, విద్వాంసుఁడు కానిండు వెళ్లిన నందఱను గౌరవించుచుండును. ఆతఁ గొప్ప బ్రాహ్మణ భక్తుఁడు. అక్కడ నాకు ప్రొద్దు క్రుంకెను. ధర్మరాజు నేనచ్చట నుండుట కేర్పాటు కావించెను. రాజా! నేను ప్రత్యక్షముగఁ జూచిన విషయమును జెప్పుచున్నాను — పాండవులందఱును దమతమ శిబిరములలో యుద్ధానంతరమున నిశ్చింతగ నిద్రించెడువారు. కాని శ్యామసుందరుఁడు మేల్కొని ధనుర్బాణములనుధరించి, వీరాసనమునఁ గూర్చుండి వారికి కావలి కాయుచుండెడు వాఁడు. పాండవుల కేబాధయు కలుగరాదని ఆతనికి రాత్రిం

బవళ్లి దేచింత. అందువలన నాతఁడు పగలు రథసారథియై రథమును నడుపుచుండును, రాత్రులందు మేల్కాని కావలి కాయుచుండును."



ఇదివిని పరీక్షిన్మహారాజేడ్చుచు నిట్లనెను:- "బ్రాహ్మణోత్తమా! మీరు చాల అద్భుత విషయమును జెప్పితిరి. సారథి అయినాఁడనియు, దూతగాఁబోయెననియు, సభాసదుఁడుగ నుండెననియు, మంత్రియై సలహా చెప్పెననియు. నింక ననేక విషయములు భగవానుని విషయములో యుంటెని గాని రాత్రులందు కావలి కాయుచున్నాఁడను విషయమును మీవలన మాత్రము వినుచున్నాను. దయతో నీవిషయమును నాకు విస్తారముగఁ జెప్పుఁడు. నా పితామహుల శిబిరములం దాతఁడు శస్త్రములను ధరించి యెట్లు కావలిగాఁచెడువాఁడు? ఈసంబంధమునను, ఇంకేమైన నద్భుత సంఘటనలున్న వాటి విషయమును నాకు విపులముగాఁ జెప్పవలయును."

మహారాజు చూపు ఉత్సాహమును గాంచి యావృద్ధ బ్రాహ్మణుఁడిట్లనెను:- "రాజా! నీకీ సంబంధమున నొక యద్భుత సంఘటనముగూర్చి చెప్పెదను. నీవు నీమంత్రులందఱితోఁగూడి దీనిని శ్రద్ధగా వినవలయును."



ఇట్లు చెప్పి యా బ్రాహ్మణుఁడు భగవానుఁడెట్లు శస్త్రధారణచేసి పాండవులకు కావలికాచినదియుఁ జెప్పుట కుద్యుక్తుఁడయ్యెను.

ఛప్పయ.

కహేఁ విప్రవర ఆఇ కృష్ణనే కరీ కృపా కస।
బనే సారథీ దూత, భృత్య ఘనశ్యామ దయావస॥
భక్త వస్య భగవాన్ దీనతా తేఁ బధిఁజావేఁ।
కింతు కరేఁ అభిమాన తాహి యమ సదన పఠావేఁ॥
కరేఁ కృపా కరుణాయతన, జీవ క్షుద్రతా నిత కరేఁ।
శరణాగతకే అఘ అఖిల, అఖిలేశ్వర ఛినమేఁ హరేఁ॥

అర్థము.

బ్రాహ్మణోత్తముఁడు వచ్చి యిట్లనెను:— "ఘనశ్యాముఁడగు శ్రీకృష్ణుఁడు కృపావశమున నెట్లు సారథియు, దూతయు, భృత్యుఁడయ్యె నందువా? భక్తవశ్యుఁడై భగవానుఁడు దీనునివలెఁ గట్టుపడును. కాని అభిమానము చెందిన వానిని యమసదనమునకుఁ బంపించును.

కరుణాయతనుఁడగు భగవంతుఁ డెల్లప్పుడును గృప జూచును. జీవుఁడు నిత్యము క్షుద్రకార్యము లొనర్చును. శరణాగతులయొక్క పాపముల నన్నిటిని నఖిలేశ్వరుఁడు క్షణములో హరించును."



# భగవానుఁడు పాండవుల నెట్లు రక్షించెను?

౬౮

శ్లో॥ సారథ్య పారషద సేవన సఖ్య దౌత్య -
వీరాసనానుగమన స్తవన ప్రణామాన్ ।
స్నిగ్ధేషు పాండుషు జగత్ప్రణతిం చ విష్ణో -
ర్భక్తిం కరోతి నృపతిశ్చరణారవిందే ॥

— శ్రీభాగ. ౧ స్కం. ౧౬ అ. ౧౬ శ్లో.

'వ. ............ మంగళపాఠక సంఘాత జేగీయమాన పూర్వరాజ వృత్తాంతంబు లాకర్ణించుచుఁ బాఠక పఠిత పద్యంబుల వలనం బాండవులకు భక్తవత్సలుం డైన పుండరీకాక్షుం డాచరించిన సారథ్య, సభాపతిత్వ, సఖ్య, సాచివ్య, దౌత్య, వీరాసనత్వాది కర్మంబులు నశ్వత్థామాస్త్ర తేజంబువలనఁ దన్ను రక్షించుటయు, యాదవ పాండవులందలి స్నేహానుబంధంబును, వారలకుఁ గలిగిన భగవద్భక్తి విశేషంబును విని విశ్వంభరుని భక్తవాత్సల్యంబునకు నాశ్చర్యంబు నొందుచు వందిబృందంబులకు మహార్ఘంబులగు నంబరాభరణ సందోహంబుల నొసంగుచుఁ బద్మనాభ పాదపద్మ భజన పరతంత్ర పవిత్ర మానసుండై యుండె.''　— శ్రీమదాంధ్రభాగవతము

ఛప్పయ.

బోలే బ్రాహ్మణ వృద్ధ - యుద్ధ కీ బాత్ బతాఊఁ।
రాజన సునియే కథా సరస శుభ సుఖద సునాఊఁ॥

కరీ ప్రతిజ్ఞా భీష్మ అపని పాండవ బిను కరిహాం।
సబ శంకా – సంతాప సుయోధన కే అబ హరిహాం॥
సునత హఁసే హరి దయామయ, లై కృష్ణా కౌతుక కియో।
'హో సౌభాగ్యవతీ సతీ', భూలి వృద్ధ నే బర దియో॥

అర్థము.

వృద్ధబ్రాహ్మణుఁ డిట్లని చెప్పఁదొడగెను:— "రాజా! నేను యుద్ధవిషయమును జెప్పెదను వినుము. అది చాల సరసము, శుభప్రదము, సుఖకరమైనట్టిదియు నగు కథ. భీష్ముఁడు అపాండవమును గావించి, సుయోధనునకుఁ గల సమస్త సందేహ సంతాపములఁ బోఁగొట్టెదనని ప్రతిజ్ఞను బూనెను.

దయామయుఁడగు కృష్ణుఁడిది విని నవ్వి, ద్రౌపదినిఁ గౌతుకముగ భీష్మునివద్దకుఁ గొనిపోవ 'సౌభాగ్యవతివి కమ్ము' అని పొరపాటున తెలిసికొనక భీష్ముఁడు వర మొసంగెను."



ఆనందము నెక్కడో బయటనుండి తేనక్కఱలేదు. విషాద మెచ్చటినుండియోవచ్చి మన హృదయమందుఁ బ్రవేశింపదు. సుఖదుఃఖ స్రోతలు రెండును హృదయమందే కలవు. అజ్ఞానవశమున మానవుఁడు బాహ్యవస్తువులందు సుఖదుఃఖారోపములను గావించి నిందాస్తుతులఁ గావించుచుండును. ఒకవేళ బాహ్యవస్తువులలోనే సుఖము ఉన్నదంటిరా, అది అందఱికిని సుఖము నిచ్చునట్టిది కావలయును. కాని లోకములో నట్లు జరుగుట లేదు. ఒక వస్తువు వలన నొకనికి

సుఖము కలిగిన, వేఱొకనికి ఆవస్తువు వలననే దుఃఖము కలుగుచున్నది. ఒక వస్తువు ఒకనికి రుచికరము; కాని వేఱొకనికి అరుచికరముగ నున్నది. ఒక విషయమున నొకఁడానంద తాండవమును గావించును. మఱొకఁడు వానిని చేయుటలేదు. ఈ విషయము లన్నిటిచే మనకు తెలియున దేమనగా - పూర్వజన్మ సంస్కారములకు వశీభూతులము. మనమనస్సుతో దేని ననుకూలముగ భావించితిమో, దానిని జూచుటచేతను, వినుటచేతను, తాఁకుటచేతను, దగ్గఱనుంచు కొనుటచేతను మనము సుఖమును బొందుచుందుము. దేనిని ప్రతికూలమని భావించితిమో, దానినుండి మనము తప్పించు కొనవలెనని ప్రయత్నించుచు, దానికి సంబంధించిన ప్రశంసా వాక్యములను విని మనము దుఃఖపడుచుందుము. కావున సుఖ దుఃఖములకుఁ గారణము బాహ్యవస్తువులు కావనియు, వానికి బీజము లంతఃకరణములోఁ గలవని తెలిసికొనవలెను.

పూర్వజన్మ సంస్కారములచే నిరంతరము పాపకర్మలు చేయు విషయాసక్తునకు శ్రీకృష్ణకథలు రుచింపవు. ఎక్కడనైన భక్తిని గుఱించికాని, భక్తులను గుఱించికాని, భగవానుని గుఱించికాని ప్రసంగము జరిగినా వారు విసుగుకొని యిట్లనుచుందురు:— "ఇదేమి కూనరాగము లాలాపించెదవు ! రాగ మలంకారముగ నుండవలయును. రామ రామ యని ప్రేలుటకును, గోలపెట్టుట కీభక్తులు చాలమంది యున్నారు" కాని దీనికి విపరీతముగా భక్తుల కీ సాంసారిక రాగసౌందర్య ముల విషయమనిన నేవగింపుగ నుండును. వారు తమ రసిక శిరోమణియగు శ్యామసుందర రాగ సౌందర్యములందుండు

టకే కోరుకొనుచుందురు. వారికి భగవత్కథలు వినుచున్నప్పటికిని తృప్తి జనింపనే జనింపదు. వారా భగవచ్చరిత్రము వినుటలో నతృప్తులై యుందురు. అత్యంతోత్సాహముతో పరీక్షిన్మహారాజు, ఆవృద్ధబ్రాహ్మణుని భగవానుఁడు కావలి కాయు సంగతిని జెప్పవలసినదని అడుగఁగానే ఆబ్రాహ్మణుఁడు గద్గద కంఠముతో శ్రీకృష్ణకృపను ఆతని భక్తవత్సలతను స్మరించి యిట్లు చెప్పఁదొడంగెను.

బ్రాహ్మణుఁడిట్లనెను:– "రాజా! భగవానుఁడు వీరాసనమునఁ గూర్చుండి పాండవ శిబిరరక్షణ చేయుటయు, ధనుర్బాణములను ధరించి కావలి కాయుటయు నేను స్వయముగఁ జూచితిని. శరీర రక్షణకొఱకు చేతులెట్లు నిరంతరము వ్యగ్రత చెంది యుండునో, అట్లే పాండవులను రక్షించుట కాతఁడు వ్యగ్రుఁడై యుండెడువాఁడు. శరీరమున నేయంగమున జిల పుట్టినప్పటికిని అనాయాసముగఁ జేయి యచ్చటికిపోయి గోకి అచ్చటిబాధను బోగొట్టును. నిద్రించుచున్న పాండవుల నెవరును హానిచేయఁగూడదనియే శ్రీకృష్ణుని నిరంతర చింత. ఆతనికి సేనలు కాపలాకాయుటచేఁ దృప్తి లేదు. పాండవులు నిద్రింపఁగానే స్వయముగా నాతఁడస్త్రశస్త్రములను దీసికొని తాను నిద్రింపకయే కావలి కాయుచుండెడువాఁడు. ఆకావలి కాయుసందర్భమున నొక మిక్కిలి యద్భుతమగు నితిహాసము చెప్పఁబడుచున్నది. రాజా! నేను నాకన్నులారాఁ జూచినది కాదుకాని, యుద్ధానంతరమున నేను కథకులనోట నీకథను వింటిని. దానిని మీకుఁజెప్పెదను. కావున సావధానులరై వినవలయునని కోరిక."

పరీక్షిన్మహారాజిట్లనెను:— "బ్రాహ్మణోత్తమా! శ్రీకృష్ణకథాశ్రవణము చేయుటలో నేనెల్లప్పుడును సావధానముగనే యుందును. మీరీ యద్భుతమగు నితిహాసమును మీరు వినిన ప్రకారము తప్పక చెప్పవలయును."

వృద్ధబ్రాహ్మణుఁ డిట్లనెను :- "రాజా! మహాభారత యుద్ధములో నీకు పితామహులగు పాండవులకు సేనాపతి ధృష్టద్యుమ్నుఁడు. కౌరవ సేనాపతి భీష్మపితామహుఁడు. భీష్మపితామహుఁడు గొప్ప పరిశ్రమతోఁ బోరుచున్నప్పటికిని కౌరవులు, పాండవులు ఇద్దరు సమానముగానే యుండిరి. ఆతని హృదయములోఁ బాండవుల యెడలఁ బ్రేమ యుండుటచే నాతఁడు బుద్ధిపూర్వకముగఁ బాండవులమీఁద ప్రహారము చేయుటలేదు. ఆతని చేతులమీఁదుగాఁ దన వంశనాశము కారాదని ఆతని యాంతర్యాభిలాష. 'పాండవులను నావడిలోఁ గూర్చుండఁబెట్టుకొని యాడించినాను. నా సవతి సోదరుల కంటెను మిక్కిలి ప్రేమతోఁ బోషించి పెంచితిని. అట్టివారి హత్యచే నాహస్తము రక్తరంజితము కారాదు.' అని యాతఁ డనుకొనుచుండెడివాఁడు. దుర్యోధనున కిది తెలియును; కాని యావృద్ధుఁడు బ్రతికియుండఁగా నింకొకనిని సేనాపతిగా నియమింప లేకుండెను. కావున నీ విషయమునుగూర్చి చాల చింతించుచుండెను. ఆతఁడిట్లనుకొనెను:— "నాకు సేనాపతియైనవాఁడు శత్రువులయెడల దయఁజూపిన నాకు విజయము కలుగుట అసంభవము" ఇట్లాలోచించి యాతఁడు పితామహుని దగ్గఱకుఁబోయెను. పోఁగానే ఆతనిపాదముల మీఁదఁ బడి ఆతనిచింతకు కారణమును జెప్పుకొనెను.

దుర్యోధనుఁ డిట్లనెను:— "పితామహా! మీరు మా వంశములో నందఱకంటె జ్యేష్ఠులును, శ్రేష్ఠులును. అందు కనియే మిమ్ములను నాపదునొకండు అక్షౌహిణీల సేనకు సేనాపతిగాఁ జేసితిని. ఇప్పుడు మాయందఱ బ్రదుకు మీచేతిలో నున్నది. మీరు మమ్ములను రక్షించినను సరియే, భక్షించినను సరియే. మీరు క్రుద్ధులై చేత ధనుర్బాణములను ధరించి— మనుష్యుల మాటయేల? సమస్త దేవ, దానవ, యక్ష రాక్షస అసురులందఱును గలిసి ఒక్కటై వచ్చినప్పటికిని మిమ్ములను జయింపజాలరను సంగతి — నేనేల? లోకమున కంతటికిని దెలియును. మీరు తలఁచుకొనునెడలఁ గేవల మొక్క బాణము చేతనే పాండవ సేననంతను సంహారము చేయఁగలరు. కాని నాకు చెప్పుటకు లజ్జయును, దుఃఖమును, సంకోచమును గలుగుచున్నది. అయినను జెప్పకొనకపోయిన పని నెరవేరు నట్లు లేదని తోఁచుచున్నది. మీరు పక్షపాతము వహించుచున్నారు. మీరు సేనాపతులరయ్యు శత్రువుల యెడల దయ చూపించుచున్నారు. మీరు మనఃస్ఫూర్తిగా యుద్ధము చేయుటలేదు. మీరు పాండవులఁ జంపుటకు వెనుకాడుచున్నారు. ప్రభూ! ఇట్లైన నాపని యేమి నెరవేరినట్లు? ఇట్లైన నాకు విజయ మెట్లు కలుగఁగలదు? మీకు యుద్ధము చేయుటయే యిష్టము లేకున్న నాకు మొదటనే చెప్పియుండ వలసినది. నా కాధారము మీరే. మీ బలమును నమ్మికొనియే నేను యుద్ధమునకు సిద్ధపడితిని."

దీనతాపూర్ణములును, తన ప్రశంసతో నిండినవియు నగు దుర్యోధనుని వాక్కులను వినఁగానే వృద్ధపితామహుని

రక్తము పొంగిపోయెను. ఆతఁడు తనసేనాపతి పదవికి గర్వించి దుర్యోధనునకు సంతోషము కలిగించుటకై యిట్లు ప్రతిజ్ఞను బూనెను.— "నాయనా! దుర్యోధనా! నీవు నన్ను సేనాపతిఁగఁజేసి చాల యధికముగ సమ్మానించితివి. అదియును గాక నీవు నన్నిప్పుడు మిక్కిలిగఁ బ్రశంసించితివి. దీనికి నీ యెడలఁ జాల ప్రసన్నుఁడ నైతిని. మంచిది. రేపు నీవు నా వీరత్వమును జూడఁగలవు. రేపు లోకములో పాండవులైన నుండరాదు, నేనైన నుండరాదు. నేను నిశ్చయముగ మోహమునువీడి, రేపు తీక్ష్ణబాణములచేఁ బాండవులను వధించెదను. నీవిఁక శోకమును వీడి, నిశ్చింతతో విశ్రాంతిని దీసికొనుము." పితామహుని యిట్టి ప్రతిజ్ఞను విని దుర్యోధనుఁ డత్యంత ప్రసన్నుఁడయ్యెను. పాండవులిఁకఁ జచ్చిరని యాతఁడు నిశ్చయించుకొనెను. కాని మహారాజా! నందనందనుఁడు రక్షకుఁడై యుండఁగా, శ్యామసుందరుఁడు శిరస్సుపైనుండఁగా, వాసుదేవుఁడు సారథియై రథమును నడుపుచుండఁగా వారి నెవరేమి చేయఁగలరు? కాని దుర్యోధనుఁ డట్లే నమ్మికొని యుండెను. ఆతనికి చరాచర స్వామియగు శ్యామసుందరుని ప్రభావమేమి తెలియును? ఆరాత్రి యంతయు సుఖదమగు తన విజయస్వప్నమును జూచుచుండెను.

ఈవిషయము నిమిషములో రెండుసేనలలోను వ్యాపించెను. పాండవ పక్షములోని వీరులందఱును భయపడిరి. వారు మొదటినుండియు భీష్మబాణవర్షముచే సంత్రస్తులైరి. ఇప్పుడు పాండవ వధ విషయమును వినఁగానే అందఱకు గుండెదిగులు కలిగెను. పంచపాండవులు మాత్రము నిశ్చింతతో నుండిరి.

వారికి శోకభయములు రెండును లేవు. వారు తమ సర్వస్వ మును సర్వేశ్వరుఁడగు శ్యామసుందర చరణారవిందములందు సమర్పించిరి. వారు వారి రథముల కళ్లెమును వాసుదేవుని చేతికి వప్పగించిరి. ఆతఁడు దాని నెక్కడ త్రిప్పి, యెక్కడికి తీసుకొని పోయినను బాధలేదు. వారందఱు వారి కర్తృత్వ మును వాసుదేవుని చేతులకు వప్పగించిరి. విజయము సంభ వించెనా విశ్వేశ్వరునకే విజయము సంభవించును. పరాజ యము కలిగెనా దానికిఁగూడ భోక్త యాతఁడే. మనమాతని చేతిలోని యంత్రములము. ఆతఁడెట్లు త్రిప్పిన నట్లుతిరిగెదము. ఎక్కడ కూర్చుండఁ బెట్టిన నక్కడ కూర్చుందుము — అని యిట్లాలోచించి పాండవులు నిశ్చింతులై ముసుఁగులు పెట్టు కొని నిద్రించుచుండిరి. కాని శ్రీకృష్ణునకు నిద్ర యెక్కడిది? ఆతఁడెప్పుడును భక్తరక్షణ దీక్షాకంకణము కట్టుకొని వారిని రక్షించుటకు వ్యగ్రుఁడై యుండెను. ఆతఁడత్యంత దుఃఖమును ప్రకటించు ముఖముతో ద్రౌపదీదేవి దగ్గఱకుఁబోయి, యధీర తతో నిట్లనెను:— "పాంచాలీ! నీపసుపు కుంకుమ పోవురోజు దాఁపురించినది!"

భగవానుని శ్రీముఖమున నీహృదయ విదారకమగు వాక్యములను వినఁగానే ద్రౌపది మిక్కిలి వ్యాకులతను జెంది, యేడ్చుచునిట్లనెను:— "అశరణశరణా! నీవుండఁగా నాపసుపు కుంకుమ పోవునని నాకు స్వప్నమందైనను భయములేదు. నేను నీకృపాధారముననే నిశ్చింతతతో నున్నాను. నీవే యిట్టి యధీరతా వాక్యములు పలుకుచుండ నాజీవితము వ్యర్థమే కాఁగలదు. ప్రభూ! విషయమేమి?"

భగవంతుఁ డత్యంత చింతను బ్రకటించుచు నిట్లనెను:- "దేవీ! ఏమిచెప్పెదను? నిన్న భీష్మపితామహుఁడు రేపు పాండవులను జంపుదుననియు, లేకున్నఁ దాను జత్తుననియుఁ బ్రతినఁబూనెను. ఆవృద్ధునిబలమును నేనెఱుఁగుదును. అతఁడు చేయఁదలఁచినది చేసితీరును. ముల్లోకములలో నెవఁడు నాతని నెదుర్కొనఁజాలఁడు."

ద్రౌపది కాతరవాక్కులతో నిట్లనెను:— "ఓ దీనానాథా! నా ప్రాణనాథుల నైదుగురను రక్షించు నుపాయమేదైనఁ జూడవలయును. ఎట్లైన వారికి జీవనదానము చేయవలయును." విశ్వేశ్వరుఁడు వివశుఁడై యిట్లనెను:— "దేవీ! ఇంకెవరైన నిట్టిప్రతిజ్ఞను జేసియుండిన, దానికేదైన నుపాయము చూచెడువాఁడనే, కాని వృద్ధసింహము ముందఱ నాయాటలు సాగవు. ఈతఁడలిగిన, నీతని ధాటికి ఆగఁగలిగిన వీరుఁ డింతవఱ కీముల్లోకములలో నుద్భవింపలేదు. నేను శస్త్రగ్రహణము చేయనను ప్రతిజ్ఞను బూనకుండినయెడల, నీ వృద్ధవ్యాఘ్రమువని పట్టించెడువాఁడనే కాని నేనా ప్రతిజ్ఞనుజేసి నాచేతులు నఱకుకొంటిని. ఇఁక నాకేమియు నుపాయము కనఁబడుట లేదు."

నిరాశాస్వరముతో ద్రౌపదియిట్లనెను:— "ఇప్పుడిఁక నాజీవితాశను వీడెదను. నాకన్నులార నీబీభత్స కాండమును జూడఁజాలను. సౌభాగ్యవతియు, సతియు, సాధ్వియునగు స్త్రీ తన కన్నులతోఁ బతి పరలోకప్రయాణమును జేయుటను గాంచదు. ప్రభూ! నాపతులకంటె ముందుగానే అగ్నిలోఁబడ్డి

నాప్రాణములను వీడెదను. నాకిప్పు డగ్నికంటె వేఱొకయాశ్ర యము లేదు. నాకు నీవొక్కఁడవే ఆశ్రయమవు. అట్టి నీవిట్టి నిరాశాపూర్ణములగు పలుకులు పలుకుచున్నావు.''

భగవానుఁడిట్లు పలికెను:— "విషయము సత్యమే. ఆవిషయమే నేను నీతో జెప్పితిని. ఇప్పుడు నీకెట్లుతోఁచిన నట్లు చేయుము.'' ఇట్లని కృష్ణుఁడు వెడలిపోయెను. పాండవులు నిద్రించుచుండిరి. కాని ద్రౌపది కన్నులకు నిద్ర యెక్కడిది? ఆమెకు విశ్వాసము విలీనమై పోయినది. బాగుగా నాలోచించిన మీఁదట నామె అగ్నిలోఁబడి మరణించుటకే నిశ్చయించు కొనెను. తన నిశ్చయమును గార్యరూపమున నొనరించుటకు ఆమె ఆసనము నుండి లేచి ద్వారము కడకు వచ్చెను. ద్వారముకడకు వచ్చి చూచునప్పటికి వాసుదేవుఁడు ధనుర్బా ణములను ధరించి, వీరాసనమునఁ గూర్చుండి కావలిగాయు చుండుటను గాంచెను. ద్రౌపది తన శరీరము నంతను పెద్ద వస్త్రముచేఁ గప్పుకొని మెల్లగా నడుగులు పెట్టుచుఁ బోవు చుండెను. తేలిక పాదధ్వనిని విని దేవకీనందనుఁ డిట్లడిగెను:— "ఎవరు వారు వెళ్లుచున్నారు. నిలుచుండుము?'' అప్పుడు ద్రౌపది భయపడి యేడ్చుచు నిట్లనెను:— "ఒకానొక దుఃఖితు రాలు తన దుఃఖమును బోఁగొట్టుకొనుట కసహాయురాలై వెళ్లుచున్నది. అట్టిదాని నేల నడ్డగించెదవు? గొప్ప కావలి వాఁడ వైతివి! నీవు రక్షించుటకే అసమర్థుఁడ వైనప్పుడు, ఇంక కావలివాని వేషమేల వ్యర్థముగ వేసికొందువు?''

రాజా! మీ నాయనమ్మ ఇట్లు కోపయుక్తమగు వచనములను బలుకఁగా విని, ఆమె వాక్కులను విని గుర్తించి

భగవానుఁ డిట్లనెను:— "ఎవరు, ద్రౌపదీ! నీ వెచ్చటకు వెళ్లుచున్నావు? నీ విట్లు విచిత్రవేషమును వేసికొంటివేల?"

ద్రౌపది అదే దృఢతాస్వరముతో నిట్లనెను:— "వెళ్లుచున్నాను నా భాగ్యనిర్ణయము కావించుటకు. నే నింత వఱకు శ్రీకృష్ణునే నా కాశ్రయమనియు, సహాయకుఁడనియుఁ దలఁచితిని. ఆతఁడు నన్నాశ్రయ విహీనను జేయఁగానే నాకు చరాచర జగత్తున వ్యాపించిన అగ్నిదేవుఁడే ఆశ్రయము కాఁ గలఁడు. ఆతనిని శరణు వేఁడఁబోవుచున్నాను."

భగవంతుఁడు భయభీతుఁడై యిట్లనెను:— "నీవు నిజముగ నగ్నిలోఁ బ్రవేశింప నిశ్చయించితివా? రేపు గడువ నిమ్ము — రేపేమి జరుగనున్నదో తెలియదు గదా!"

ద్రౌపది యిట్లనెను:— "నిన్నటికి, నేఁటికి, రేపటికి కర్తయు, భర్తయు, హర్తయు, విధాతయు దేనిని జెప్పు చున్నాఁడో, ఆతఁడు దేనిని నిశ్చయించినాఁడో అదియే జరుగఁగలదు, దానికన్యథా వర్తించుట కెవరికి సామర్థ్యము కలదు? అయిన నిర్ణయమేమో అయినది. నే నీ సంఘటనము నా కన్నులతోఁ జూడఁ దలఁపను. అది జరుగుటకు పూర్వమే నేను పరలోక ప్రయాణము చేయఁ దలఁచు కొన్నాను. ముందుగా వెళ్లి నేను నా భర్తలకు పరలోకములో స్వాగత మొసంగెదను. నాకు చివరఉపకార మొకటి చేయునెడల, నేను నా కార్యమందు సఫలతను బొందఁ గల్గుదును."

భగవానుఁ డిట్లనెను:— "దేవీ! నీవు చేయు మను కార్యము నా శక్తికి మించినది కాకున్నచో నే నవశ్యము చేయఁ గలను."

ద్రౌపది విలపించుచు నిట్లనెను:— "ప్రభూ! నీ శక్తికి మించిన దీ లోకములో నేదియు లేదు. మంచిది. నీవు నా కొఱ కొక చితినిఁ బేర్చిపెట్టుము!"

భగవానుఁ డిట్లనెను:— "అవును, నేను చేయఁగలను. నీ వగ్ని ప్రవేశము చేయుటకే నిశ్చయించిన యెడల, సతి యగునది షోడశ శృంగారములు చేసికొని చితిని ప్రవేశింప వలయును. నీవు శృంగారము చేసికొని రమ్ము. ఈ లోఁగా నేను నీ కొఱకు చితిని సిద్ధము చేసెదను." భగవదాజ్ఞను బొంది ద్రౌపది లోపలికి శృంగారము చేసికొనఁ బోయెను. అచ్చట శ్యామసుందరుఁడు ఎండు కట్టెలను ప్రోవుచేసి పెద్ద చితిని బేర్చెను.

రోదనము చేయుచు ద్రౌపదీదేవి షోడశశృంగారములను గావించుకొనెను. నేఁ డామె శృంగారము చేసికొనుటలో సంతోషము లేదు; కాని అట్లు చేసికొనుట తనకుఁ గర్తవ్యమని చేసికొనుచుండెను. శృంగారము చేసికొని ఆమె బయటకు వచ్చెను. పాండవులు గుఱ్ఱుపెట్టి గాఢముగ నిద్రించుచుండిరి. వారి కీలోకము విషయమే తెలియకుండెను. రాత్రి యందు కటికచీకటి. కొంచెముగ మబ్బుకూడ పట్టియుండెను. అంతట నిశ్శబ్దముగ నుండెను. కేవలము కావలివారి కేకలు మాత్రము వినఁబడుచుండెను. దూరముగ నశ్వత్థము క్రింద

భగభగమని చితి వెలుఁగుచుండెను. ఆమె తన భర్తలకు లోలోన నమస్కరించుకొని, వాసుదేవుని వెంట వెళ్లు చుండెను.

రాజా! బయట యేమి జరుగుచున్నదో మీతాత లైదుగురికి తెలియనే తెలియదు. లోకమంతయు నిద్రించు చున్నది. కాని మేల్కొన్నది మాత్రము కృష్ణుఁడు, ద్రౌపది. మీ నాయనమ్మ యగు ద్రౌపది యేడ్చుచు నశ్వత్థవృక్ష సమీపమునకుఁ బోయి, తన అశ్రుభరిత నేత్రములచే నొక్క సారి కన్నులార శ్యామసుందరునిఁగాంచి, చితిపై దుముకుట కుద్యుక్తురాలయ్యెను. అప్పుడు కావలివాని వేషమున ధను ర్బాణములను ధరించిన అచ్యుతుఁ డిట్లనెను:— "ద్రౌపదీ! నీవు పరమ పతివ్రతవయ్యును బొరపడుచున్నావు మొట్ట మొదట అగ్నికి ప్రదక్షిణము కావించిన తర్వాత దానిలోఁ బ్రవేశింపవలయును. నీవగ్నికి మొదటి ప్రదక్షిణ చేయుము" ఏడ్చుచుఁ బాంచాలి యిట్లనెను:— "నాకన్నియుఁ బ్రదక్షి ణములే ప్రభూ! మీరట్లే ఆజ్ఞాపించునెడల, ఇదిగో ప్రదక్షి ణము చేయుచున్నాను గొనుము." ఇట్లని ద్రౌపది అగ్నికొక ప్రదక్షిణము చేసి ప్రవేశింపఁ దలఁచెను. అప్పుడు శ్యామ సుందరుఁ డిట్లనెను:— "అగ్నికొక ప్రదక్షిణము చాలదు. ఏడు ప్రదక్షిణములు చేయవలయును."

ద్రౌపది దుఃఖిత మనస్కయై యిట్లనెను:— "ప్రభూ! నాకిప్పు సామర్థ్యములేదు. నాకాలు లేచుటలేదు. ఇఁక నేను రెండవ ప్రదక్షిణము చేయఁజాలను. విధియో, అవిధియో నేనిప్పు డగ్నిలోఁ బ్రవేశించి తీరెదను."

భగవంతుఁడు గంభీరుఁడై యిట్లనెను:— "ఒక్కపని చేయుము. అవిధికార్యము ఉచితము కాదు. నీవు నావీఁపు మీఁద నెక్కుము. ఈవిధముగ నీవు సప్త ప్రదక్షిణము లొనర్పఁగలవు."

శ్రీకృష్ణుఁడు సుభద్రాదేవి కారణముగ ద్రౌపదికి కూడ తోఁబుట్టినవానివలె నుండెను. భగవానునికడ నామె కేవిధమగు సంకోచమును లేదు. కావున భగవదాజ్ఞ నామె శిరసావహించెను. భక్తవత్సలుఁడగు భగవానుఁడామెను దన భుజముపై నెక్కించుకొనెను. రాజా! నీ తాతలకు సర్వేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడేమి చేయలేదు? యోగిజన మెవని చరణ కమలరజము కొఱకనేక జన్మలు తపస్సు చేయుదురో అట్టివాఁడు భక్తవాత్సల్యముచే భక్తుల ధూళిభరితమగు పాదములను శిరమున ధరించుచుండును. ద్రౌపది తన యశ్రువులచే నాతని పీతాంబరమును దడుపుచుండెను. ఆతఁడామెను ఎత్తుకొని అగ్నికి ప్రదక్షిణము చేయుచుండెను. ప్రదక్షిణమును జేయుచుఁ జేయుచుఁ జాలదూరమున నుండిన భీష్ముని శిబిర సమీపమునకుఁ జేరెను. అప్పు డాదుర్గాస్వరముతో నిట్లనెను:— "దేవి! ఒక్క పెద్ద పొరపాటు జరిగినది. సతీ పతివ్రత చితినెక్కుటకుఁ బూర్వము తన కుల వృద్ధునకుఁ బ్రణామము చేయవలయును. మీ వంశములో భీష్మపితామహుఁడే అందఱికంటెఁ బెద్దవాఁడు. కావున నీవు వెళ్లి ఆతనికి ప్రణామము చేయుము."

మహారాజా! అది కటిక చీఁకటి రాత్రి. చేతికి చేయి కనఁబడుటలేదు. ఆసమయమున మేఘములు క్రమ్ముకొని.

వచ్చినవి. చిన్నచిన్న చినుకులు చిటుకు చిటుకు మని పడు చుండెను. వారి వస్త్రములు తడవకుండునట్లు శ్రీకృష్ణుఁడొక కంబళమును గప్పుకొనెను. ద్రౌపదికి ఒక కంబళమును గప్పెను. శ్రీకృష్ణుఁడు భీష్మునకు నమస్కరింపు మనఁగా ద్రౌపది యిట్లనెను:— "ప్రభూ! పితామహుఁ డీసమయమున శయనించి యుందురు. అదియునుగాక ఆతనిదగ్గఱ గట్టి కావలి కాయువారుందురు. నన్ను లోనికి నమస్కరింపఁ బోనిత్తురా? నేనిక్కడ నుండియే వృద్ధపితామహునకు నమస్కరించెదను."

భగవానుఁడిట్లనెను:— "కాదు; ఇట్టి విధిహీనమగు కార్యమును జేయవలదు. ఆతఁడిక్కడ సిద్ధముగ నున్నప్పుడు స్వయముగ వెళ్లి ఆతని చరణములకుఁ బ్రణామిల్లవలయును. భీష్మపితామహుని దగ్గఱకెవ్వరును వెళ్ల జాలరనుసంగతి నిజమే; కాని సాధువులు, బ్రాహ్మణులు, కన్యకలు, పతివ్రతలగు స్త్రీలు, దీనదుఃఖితులు ఇష్టమువచ్చినప్పుడు పితామహుని దర్శింపవచ్చును. వీరందఱకు నాతనిద్వారము తెఱచియే యుండును. ఇఁక నేనా? బయటనే కూర్చుందును. నీవు ముందుగా నాతనికి నీపరిచయమును గావింపవలదు. వెళ్లి ప్రణామము కావింపుము. ఆయన ఆశీర్వదించిన తర్వాత నీవు నీపరిచయమును గావింపవలెను. ఇంతరాత్రివేళ నీవెవరిని తోడుపెట్టుకొని వచ్చితివని యడిగెనా నాపేరు చెప్పవద్దు. నీ భృత్యుఁడు వెంట వచ్చినాఁడని చెప్పవలయును."

ఇప్పుడు శ్యామసుందరుఁడు తనరక్షణకొఱకే ఉపాయ మాలోచించుచున్నాఁడను సంగతిని దెలిసికొని ద్రౌపదికి

కొంచముగ నాశకలిగెను. ఆమెకు శాంతికలిగెను. ఇంతలోనే శ్రీకృష్ణుఁడు భీష్మపితామహుని శిబిరద్వారముకడకు చేరెను. 'ఎవరువారు?' అని కావలివాఁ డనెను. భగవానుఁడు భయపడుచు నిట్లనెను:— 'ఈమె సతి. పితామహుని దర్శనముచేయఁగోరుచున్నది.'

కావలివాఁడు మిడిసిపాటుతో యిట్లనెను:— "అవును; సతి లోనికి వెళ్లవచ్చును. అట్టి యామెకు పితామహుని ద్వారము సదా తెఱచియేయుండును. కాని నీవు లోనికివెళ్ల వీలులేదు."

భగవానుఁడు దీనస్వరముతో నిట్లనెను:— "అన్నా! లోనికి వెళ్లనీయకపోయిన నెక్కడనైనఁ గూర్చుండుటకైన నీడచూపించుము. చినుకులచేఁ దడిసిపోవుచున్నాను."

అంత నాతఁడు గద్దించుచు నిట్లనెను:— 'ఇక్కడ ఛాయ యెక్కడిది? బయట కూర్చుండుము. లోపలకుఁ బోవుటకు వీలులేదు.' అప్పుడు వివశతను జూపించుచు భగవానుఁడు ద్రౌపదితో నిట్లనెను:— 'దేవీ! నీవు వెళ్లుము. నే నిచ్చటనే కూర్చుండును.' అంతఁ గావలివాఁడిట్లనెను:— 'లోపలికి చెప్పులు తొడుగుకొని పోరాదు. కాలిచెప్పులు నిచ్చటనే విడిచిపొమ్ము.' ద్రౌపది భయపడుచు నిట్లనెను:— 'ఇక్కడ వర్షములో నా చెప్పులు తడిసిపోగలవు.' అంత శ్రీకృష్ణుఁడిట్లనెను:— 'దేవీ! నీవు వాటిని నాకిచ్చిపొమ్ము. నీవు వచ్చేవఱకు నేను వాటిని కంబళములో దాఁచి యుంచెదను.'

రాజా! మీ నాయనమ్మ యంత్రమువలె భగవానుని ఆజ్ఞలన్నిటిని యథాప్రకారముగఁ బాలించెను. ఆమె చెప్పులను శ్రీకృష్ణున కొసంగి లోపలకు వేగముగఁ బోయెను. లోపలకు బోయి చూచునప్పటికి వృద్ధసింహము నిద్రించుట లేదు. తన శిబిరములో మదోన్మత్త సింహమువలె మెల్ల మెల్లగా నిటు నటు పచారుచేయుచుండెను. ఆతని ముఖవైఖరిని బట్టి యాతఁడేదో చింతలో నిమగ్నుఁడై యున్నట్లు తోఁచుచుండెను. ఏదో గొప్ప గంభీరవిషయమును గూర్చి చింతించు చున్నట్లుండెను. ద్రౌపది మెల్లమెల్లగా వెళ్లి తన వస్త్రములను జాగ్రత్తగా సవరించుకొని, శిరస్సును నేలకు మోపి పితామహునకుఁ బంచాంగనమస్కారము కావించెను. ఆమె మిక్కిలి క్షీణస్వరమున నిట్లనెను:— "దేవా! నేను సతినై నా మంగళసూత్రము నిలుచుటకై నీకు ప్రణమిల్లు చున్నాను." ఘోరచింతలో నిమగ్నుఁడైన పితామహుఁడు అకాత్తుగ నొక సతీసాధ్వి కులస్త్రీ తన సమ్ముఖమునఁ బ్రణామము చేయుటను గాంచి స్వభావానుసారముగ నాతని నోటినుండి యిట్లు వెలువడెను:— "సౌభాగ్యవతి వగుము" అప్పుడు పాంచాలి యానందమునకు మేరలేకుండెను. ఆమె నేలపైఁ గూర్చుండి యేడ్చుచు నిట్లనెను:— "దేవా! మీరు సత్యవాదులు. మీరు నవ్వులాటలకైన నసత్యమును బలుకరు; కాని నేఁడు మీ యాశీర్వాదము సత్యమగునో కాదో! ఈ విషయమున నాకు సందేహము కలదు. నా ముత్తైదువు తనమును నాశముచేయుటకు నిన్న మీరు ప్రతిజ్ఞ పూనితిరి." ఇప్పుడు పితామహుని ధ్యానము భంగమయ్యెను. ఆతఁడు

పాంచాలిని గుర్తించి యిట్లనెను:—"ఎవరవమ్మా! ద్రౌపదీ! నీ వీ నిశీథమునఁ గటికచీఁకటిలో నెట్లు వచ్చితివి? నీ వస్త్రములు తడువలేదు. కాలికి బురద కాలేదు. నీకు నా శిబిర మార్గము చెప్పిన దెవరు?"

ఏడ్చుచు ద్రౌపది యిట్లనెను:— "ప్రభూ! నేను నమ్మకమగు నొక సేవకునితోఁడ వచ్చితిని."

ఇంతటి యుక్తిని జెప్పువాఁడు శ్యామసుందరుఁడు కాక వేఱొకఁడు లేఁడని యాతఁడు తెలిసికొనెను. ఆతఁడు తొట్రుపాటుతో నిట్లడిగెను:—"ఆ సేవకుఁడెచ్చట నున్నాఁడు?"

ద్రౌపది యిట్లనెను:— "ప్రభూ! ఆతఁడు ద్వారమందున చెప్పులు చేతఁబట్టుకొని కూర్చుండినాఁడు. ఎంత బ్రతిమిలాడినను ద్వారపాలకుఁడు లోనికి ఆతనిని రానీయలేదు."

ఇది వినఁగానే పితామహుఁడు ద్వారము వైపునకుఁ బరువిడెను. కావలివారు మేల్కొని యుండిరి. వెళ్లఁగానే పితామహుఁడు శ్యామసుందరుని శరీరము నాతఁడు కౌఁగలించుకొని, తన ప్రేమాశ్రువులచే నాతనిని దడుపుచు నిట్లనెను:— "శ్యామసుందరా! నీ వెవరికి రక్షకుఁడవుగ నుంటివో వారిని జంపఁగలవాఁ డెవ్వఁడు? ఎవరి పసుపు కుంకుమమును నీవు రక్షింపఁదలఁచితివో ఆమె పసుపు కుంకుమను దీయఁగలవా రెవ్వరు? దీనబంధూ! భక్తవత్సలా! అశరణ శరణా! శరణాగత ప్రతిపాలకా! ఇంతటి నీ నమ్రతను, ఇంతటి శరణాగత వత్సలతను గాంచి నేను తిరుగుచున్నాను. నా శరీరము నాకు తెలియదు. దయాసాగరా! ఇప్పుడు నే నెట్లో చావఁగలను;

కాని నాదొక భిక్షకలదు. మరణకాలమున మీ యీ శ్యామ సుందర చతుర్భుజ వేషముతో నా సమ్ముఖమున నుండవల యును. నీ దర్శనము చేయుచు నే నీ పాంచభౌతిక శరీరమును వదలవలయును. ఈ వరమును నా కొసంగుము. ''

భగవంతుఁడు 'తథాస్తు'ని యావరము నొసంగెను. ఈవిధముగ రాజా! మిక్కిలి కౌశలముతో నాతఁడు పితా మహుని ద్వారా నే పాండవులను నిర్భయులఁ గావించి ద్రౌపది మంగళసూత్రమును నిలిపెను. ఇట్టి సంఘటనలు ఒకటియు, రెండునుగావు. అనేకములు కలవు. వాటిని వర్ణింప సహస్ర జిహ్వాలుకల శేషునకైన నలవికాదు. మహారాజా! ఆతఁడు నీ తాతల కెంతటి చిన్న కార్యమును జేయుటకైనను అది తనకు గౌరవమని యంగీకరించును. సేవకునివలె ధర్మరాజు వెను వెనుక నడుచుచుండెడువాఁడు, ఆతఁడెదుట నిలుచుండి స్తుతించెడువాఁడు. మునుముందుగా నాతఁడు లేచి నమస్క రించి, భూమండలములోని మిగిలిన రాజులచే నమస్కరింపఁ జేసెడువాఁడు. ఆతఁడు నీపితామహుల యశమును దిగంత ముల వ్యాపింపఁ జేసెఁనాడు. మహారాజా! నీవు నీ పూర్వ జులవలె శ్రీకృష్ణభక్తుఁడ వగుట చాల గొప్పవిషయము. నీకుఁగూడ భగవత్పాదారవిందములందును – ఆతని లీలాగుణ ములను వినుటయందును అత్యంతానురాగము కలదు. ఇదియే జీవితమునకు సార్థకత. వాసుదేవభగవానుని యందు అవ్యభి చారిణి అహైతుక భక్తి కలిగియుండుటయే మానవ శరీరము ధరించినందులకు ఫలము.''

పరీక్షిన్మహారాజీ కథను విని మిక్కిలి ప్రసన్నుఁడై, ఆ బ్రాహ్మణున కనేక ధన, రత్న, వస్త్ర, భూషణాదుల నొసంగి సత్కరించెను.

ఛప్పయ.

కృష్ణా తే యోఁ కహేఁ కృష్ణ కఛు బాత సునీహై?
పాండవ మారూఁ కాల్హి ప్రతిజ్ఞా భీష్మ కరీహై॥
కహే ద్రౌపదీ దుఖిత దయాలో! దయా దిఖాఓ!
పావకమేఁ జరి మరూఁ నాహిఁ పతి మోర బచాఓ॥
రచీ చితా ఫేరీని మిస, భీష్మ ద్వార పై లేగయే।
గంగా సుత ఆసిస దఈ, తబ పాండవ నిర్భయ భయే॥

అర్థము.

శ్రీకృష్ణుఁడు ద్రౌపదితో నిట్లనెను:— ‘ ద్రౌపదీ! అపాండవము కావింతునని భీష్ముఁడు ప్రతిజ్ఞ చేసెనను సంగతిని విన్నావా?’ ద్రౌపది దుఃఖితయై, ‘దయాళూ! దయను జూపుము. నా భర్తలను రక్షింపఁజాలకున్న నేనగ్నిలోఁబడి చచ్చెదను’

శ్రీకృష్ణుఁడే చితిని రచించి, దానికి ప్రదక్షింప వలయునను మిషతో భీష్ముని గుడారద్వారమునకుఁ గొనిపోయి ఆతనికి నమస్కరింపఁ జేసెను. అప్పుడు గంగాసుతుఁ డగు భీష్ముఁడు ‘సౌభాగ్యమస్తు’ని ఆశీర్వదింప పాండవులు నిర్భయులైరి.

—:♦:—

# దిగ్విజయ ప్రసంగమున పృథ్వీ ధర్మ సంవాదము

శ్లో॥ యద్వాంబ తే భూరి భరావతార
కృతావతారస్య హరేర్ధరిత్రి ।
అంతర్హితస్య స్మరతీ విసృష్టా
కర్మాణి నిర్వాణ విలంబితాని ॥

— శ్రీభాగ. ౧ స్కం. ౧౬ అ. ౨౩ శ్లో.

'మ. జననీ నీ భరమెల్ల డించుటకునై చక్రాయుధుండిన్ని హా
యనముల్ దాను నరాకృతిఁ మెలఁగి నిత్యానందముం జేసి పో
యిన నేనింక ననాథనై తిఁ గుజనుం డెవ్వాఁడు శాసించునో
పెనుదుఃఖంబులఁ బొందఁగంటివనియో భీతిల్లి చింతించుటల్.'

— శ్రీమదాంధ్ర భాగవతము.

చ ప్ప య.

హరిలీలా అతిమధుర అఇ సబ నృపహిఁ సునావహిఁ।
సబ సమాజ కేసంగ సునహిఁ, అతి హియ హరషావహిఁ॥

తబ ఈ శిబిర సమీప ఘటీ ఘటనా అద్భుత అతి।
ఏక పైర తేఁ ధర్మ వృషభ బని చలహి మంద గతి॥

ధేను రూప ధరణీ ధరే, రోవే సుత బను మాతుజ్యోఁ।
మాతు దుఖిత పూఛహి తనుజ, ధర్మ ధరణి తేఁ కహే యోఁ॥

అ ర్థ ము

హరిలీల అతిమధురమైనది. అన్యరాజులందఱును వచ్చి యా హరిలీలలను జెప్పుచుండిరి. సమస్త పరివారముతోఁ గలిసి

వాటిని విని హృదయములో మిక్కిలి సంతోషించిరి. ఆ సమయమున శిబిర సమీపమున నొక సంఘటనము జరిగినది. ధర్మమొక యెద్దువై ఒంటి కాలిమీఁద మందగమనముతో నెల్లుచుండెను. భూదేవి గోరూపమును ధరించి తన బిడ్డను బోఁగొట్టుకొనిన తల్లి యెట్లు విలపించునో అట్లు విలపించుచుండెను. అప్పుడు ధర్ముఁడు తల్లి దుఃఖమునుగాంచి నీవేడ్చుటకుఁ గారణమేమని యడిగెను.



ఎప్పుడును పగల్లే యుండి రాత్రిళ్లు లేకున్నచో దినములోఁగల గొప్పతనమును తెలియదు. నిత్యనూతనత్వమును దోఁచదు. దుఃఖము వలన సుఖమహాత్వమును, అంధకారము వలనఁ బ్రకాశ మహాత్వమును దెలియఁ గలదు. అధర్మము వలన ధర్మగౌరవము తెలియును. ఇదేవిధముగఁ బ్రపంచములో సమస్త వస్తువులలో ద్వంద్వము కలదు. జీవన మరణములు, హాని లాభములు, కీర్త్యపకీర్తులు, జయ పరాజయములు, సుఖదుఃఖములు, మంచిచెడ్డలు, మధుర తిక్తములు, అనుకూల ప్రతికూలములు అను నీ ద్వంద్వములకే సంసారమందురు. ఈ ద్వంద్వములను దాఁటి వెళ్లినవాఁడు నిర్ద్వంద్వుఁడు. ఆతఁడు సంసారి కాఁడు. సంసారమునకు స్వామి. ఆతఁడు జీవుఁడు కాఁడు, బ్రహ్మ. ఆతఁడు జగత్ప్రాణి కాఁడు, జగత్పతి. పరివర్తనము సదా ద్వంద్వములోనే సంభవము. నిర్ద్వంద్వము సదా నిర్వికారము, నిర్లేపము, అపరివర్తన శీలముగ నుండును. అందుకనియే శాస్త్రకారులు మొదట

అధర్మమును త్యజించి ధర్మాచరణము చేయవలెనని శాసింతురు. తర్వాతఁ జివరకీ ధర్మాధర్మముల రెంటిని బరిత్యజించి నిర్ద్వంద్వుఁడు కావలెనని చెప్పుదురు. నిర్ద్వంద్వుఁడు కానిది సుఖము లేదు. నిజమగు శాంతి లేదు. సంస్కృతికి అంతము లేదు. సంసార నాశము లేదు. పగలు గడవఁగానే రాత్రి కలుగుట తప్పనిసరియైనట్లును, జన్మించిన వానికి మరణము నిశ్చితమైనట్లును, ధర్మము తర్వాత నధర్మప్రచారము జరుగుట సనాతన నియమము. కృతయుగము తర్వాత త్రేతాయుగము, త్రేత తర్వాత ద్వాపరయుగము, ద్వాపరము తర్వాత కలియుగము వచ్చుట అపరిహార్యము. దాని నెవరు ప్రయత్నించి తొలఁగింపలేరు. ఇంకొక విధముగఁ జేయలేరు. మధ్యమధ్య దాని నాపుటకు మాత్రము ప్రయత్నములు జరుగుచుండును, కాని దానివలన దానిప్రచార మధికమగుచునే యుం ను. ప్రవాహము నెవరును ఆపఁజాలరు. ఒకవేళ నాప్రవాహమును యంత్రముల మూలముననూ, ఇతర ప్రయత్నముల మూలముననూ ఆపినయెడల, నాప్రయత్న శిథిలమున్నచోట మరల నాప్రవాహము క్రిందకుండా స్వాభావికగతిచేఁ బ్రవహించుచుండును.

పాండవు లున్నప్పుడెచ్చట చూచినను ధర్మప్రచారమే యుం.డెడిది. కలియుగము ప్రవేశించినప్పటికిని శ్రీకృష్ణభగవానుఁ డుండుటచే నది భూమిమీఁదఁ దన ప్రభావమును జూపింపలేకపోయెను. ఇప్పుడు భగవానుఁడు స్వధామమునకుఁ జేరెను. పాండవులుకూడ తమ ఇహలౌకిక లీలలను బూర్తి కావించిరి. ఇప్పుడికఁ గలియుగము స్వేచ్ఛగ తాండవ

మూడు అవకాశము లభించెను. అది నల్దిశలను తన ప్రభావ మును ప్రసరింపఁ జేయుచుండెను. అయినను దాని మన స్సులోఁ గొంచెముగ భయముండి పీడించుచుండెను. పరీక్షి న్మహారాజు గొప్పధర్మాత్ముఁడు. ఆతని శరీరములో భరత వంశము యొక్క రక్తము పారుచుండెను. ఈతఁడు శ్రీకృ ష్ణుని చెల్లెలికొడుకునకుఁ గుమారుఁడు. పాండుమహారాజు మనుమనికి తనయుఁడు. అందువలనఁ గలి ఆతనిఁ జూచి భయ పడుచుండెను. ఏదోవిధముగఁ దాను మహారాజు దగ్గఱకుఁ జేరవలెనని సమయము కొఱకు నిరీక్షించుచుండెను. ఏల యనఁగా రాజు అధర్మమునఁ బ్రవేశింపనంతవఱకు ప్రజ లధర్మ మునఁ బ్రవృత్తులుకారు. రాజేభావముతో నుండునో ప్రజలు నా భావముతోడనే యుందురు. "యథారాజా తథా ప్రజాః" రాజెట్లో ప్రజలునట్లే. రాజుయొక్క భావము దుష్టమగుటచే బుద్ధి, సిద్ధులు క్షయమగును. ఒకానొకరాజు వేటాడ నడవికిఁ జనుచుండెను. దారిలో నొక పందిని వెంబడించుచు నతని సహచరుఁడు వెళ్లిపోయెను. అతఁడొక్కఁడే మిగిలెను. ఎండలో బాగుగాఁ బరువెత్తుటచే వానికి తీవ్రముగ దప్పిక యయ్యెను. దగ్గఱలో నొక చెఱకుతోఁట యుండెను. దాని నొక యువతి కావలి కాయుచుండెను. రాజు దానిని దాహ మిమ్మని అడిగెను. ఆమె ఆతని నొక సాధారణ పథికుఁడను కొని, తత్క్షణమొక చెఱకును విఱిచి దాని రసమును పిండి, ఒక పాత్రలోఁ బోసి రాజున కొసంగెను. మంచి రుచిగలిగి, అప్పుడప్పుడు తీయఁబడిన మధురరసమును త్రావి రాజునకు దప్పిక తీరెను. అతఁడు మిక్కిలి సంతుష్టుఁడయ్యెను, కాని

ఒక్క చెఱకులోనుండి యింత రసము వచ్చుటచే నాతఁ డాశ్చర్య పడెను. ఆతఁడు మనస్సులో నిట్లనుకొనెను:— "ఓహో! ఒక్క చెఱకుగడలోనే యింతరసము వచ్చుచుం డఁగా నీకృషికుఁడు శ్రీమంతుఁడై యుండవచ్చును. నా కీతఁడు కేవలము ఆఱువందలే యిచ్చుచున్నాఁడు. కావున నీతని కింకను బన్నును వేయవలెను. పన్నెక్కువవేసిన నా కోశము వృద్ధికాఁగలదు." ఇట్లనుకొనుచు నాతఁడు చాల దూరము పోయెను. పంది యెచ్చటనో మాయమయ్యెను. తన సహచరుఁడు కలిసికొనలేదు. ఇప్పుడు మరల నాతఁడు రసము నడిగెను. ఆ పిల్ల మరల నొక చెఱకును పెఱికి రస మును బిండెను. ఈ సారి దానిలో వెనుకటి రసములో సగ మైన రాలేదు. అప్పుడు రాజాశ్చర్యచకితుఁడై యిట్లడిగెను:— "దేవీ! మొట్టమొదట ఒక్క చెఱకువలనే పాత్రయంతయు గిఱ్ఱున నిండిపోయినది. ఈ సారి సగముకూడ నిండలేదే?" అప్పుడా తెలివిగల బాలిక యిట్లనెను:— "పథికా! నేను నా మనస్సులో నే చెడ్డభావనయును జేయలేదు. నా తండ్రి ధర్మాత్ముఁడు. ఈ దేశాధిపతి రాజునకేదైనఁ చెడ్డభావన, పాపము కలిగినదని తోఁచుచున్నది. వాని మనస్సులో నెవని ద్రవ్యమునైన హరించుబుద్ధి కలిగినదేమో, అందువల ననే దీనిలో రసము తగ్గినది." రాజునకుఁ దన పొరపాటు తెలియవచ్చుటచే నధిక పన్నును వేయవలెనను కోరికను మానుకొనెను. దీనివలన మనకు దెలియవచ్చునీతి యేమనఁగా రాజు అధర్మవంతుఁడు కానంతవఱకు ప్రజలు అధర్ములు కారు. సర్వత్ర పాపప్రచారముకాదు. రాజు అధర్మవంతుఁ డయ్యెనా

ప్రజలందఱు నాయవగుణముల నన్నిటిని కన్నులు మూసి కొని యనుసరింతురు. రాజు యనుసరించు ఆచారముల నన్యులుకూడ అనువర్తించి, దానిలోనే తనకు ఉన్నతి కలదని తలంచు చుందురు. అందువలన నెట్లైన రాజుశరీరములోఁ బ్రవేశింపవలెనని కలి యోచించుచుండెను. కలి కారణమున నందఱ ప్రవృత్తియు నధర్మము వైపునకు వ్రాలియుండెను. అందఱును దమ కులాగత సదాచారములను బరిత్యజించి యెక్కడ వీలైన నక్కడ అందఱతోఁ గలిసి కూర్చుండి ఆహారపానీయములను గొనుచుండిరి. యజ్ఞ యాగాదులం దును, శ్రాద్ధ తర్పణాది పారలౌకిక కార్యములందును ప్రజల మనస్సులందు కొంచెము కొంచెముగ నవిశ్వాసము ఉత్ప న్నము కాఁజొచ్చెను; కాని రాజభయముచేతను, సమాజ బంధనము కారణముననను వారాపాపములను సర్వసాధారణుల కడ సమర్థింపలేకుండిరి. బుద్ధిపూర్వకముగఁ గాకపోయినను కొన్ని ధర్మకార్యములు భయముచేఁగూడ జరుగుచుండును.

ధర్మము బుద్ధికలది. దానికి దేశకాలానుభవము కలదు. ఇఁక దనకాలము వెళ్లిపోయినదని అది తెలిసికొనెను. ఇప్పుడు అధర్మము మోపుగానున్నది. దానితో విరోధము పెట్టుకొనిన పనినడువదు. ఆకారణమున నది దుఃఖము చెందియు దుఃఖమునకుఁ గారణ మధర్మమే ననదు. తనప్రారబ్ధమని దుఃఖము ననుభవించును. కాని పృథివి ఆడుది. స్త్రీలకు శృంగారము స్వభావముచేఁ బ్రియముగ నుండును. అందులో భాగ్యవతియగు స్త్రీకి మిక్కిలిగనుండును. పృథివి ముత్తైదువు. ధర్మము ఆమెకు యజమాని. ధర్మరక్షకుఁడు భగవంతుఁడగు

వాసుదేవుఁడు. భూమిమీఁద ధర్మప్రచారము జరుగుచుండిన హర్షముచే నామె రోమములు నిక్కపొడుచును. మిక్కిలి ప్రసన్నురాలైన భార్య అత్యంత సంతోషమునఁ దన పతి చరణములకుఁ దనసర్వస్వము సమర్పించినట్లు ధర్మముద్వారా వృద్ధిపొందిన వసుంధర నిజముగ వసుంధర యగును. ఆమె అత్యంతాహ్లాదమున నుప్పొంగి అక్కడక్కడ సువర్ణమును-వివిధములగు రత్నపుగనులను బయట పడవేయును. నానావిధములగు ఫల పుష్ప కంద మూలాదులను ప్రసవించి ప్రజలను సుఖులను గావించును. దీనికి విపరీతముగా నీభూమిమీఁద నధర్మము వ్యాపించినప్పుడు దుఃఖితయై సమస్త బీజములను, ధనమును దనలో దాఁచుకొనును. భూదేవికి సర్వశ్రేష్ఠమగు శృంగారమును—మిక్కిలి మూల్యవంతమగు శిరోభూషణమును భగవంతుఁడగు నందనందన వజ్రాంకుశ, ధ్వజాది చిహ్న చిహ్నితమును, ఇంద్రాది దేవతలచే వందితమునగు నాతని పాదపద్మముల చిహ్నము లామె వక్షఃస్థలమున నంకితమగుటయే. ఆ చరణము లిప్పుడు భూమినుండి అంతర్హితములైనవి. వసుంధరాభగవతి యిప్పుడా యనుపమ చరణఛాయా రహితయైనది. అందువలన నామెముఖము మ్లానమైయుండెను. అశ్రువుల జాఱ్చుచు నామె రోదనము చేయుచున్నది. ఆమె యిట్లేడ్చుటనుగాంచి ధర్మమామె నిట్లడిగెను.

అంత శౌనకుఁడిట్లడిగెను:— "సూతా! పృథివి జడమైనది కదా! ఆమె యెట్లేడ్చినది? మాట్లాడుటకు ధర్మము సజీవప్రాణి కాదుగదా! అట్టియెడ నీరెంటికి సంభాషణము జరుగుటెట్లు?"

సూతుఁడిట్లనెను:— “ధర్మజ్ఞా! ఈశంక నీదికాదు. నీ కన్నియును దెలియును; కాని యీకలియుగజీవుల హితార్థమై నీవడుగుచున్నావు. మహామునీ! లోకములో జడపదార్థమను నది లేదు. లోకములోఁ జిన్నదియు లేదు. పెద్దదియు లేదు. బరువుకలదియు లేదు, తేలికదియును లేదు. ఈభేదము లపేక్షా కృతములు. హస్తి కంటె అశ్వము చిన్నదనియు, గుఱ్ఱము కంటె గాడిద చిన్నదనియు, ఖరము కంటె హరిణము చిన్న దనియు, కురంగము కంటెఁ గుక్క చిన్నదనియు, శ్వానము కంటె మార్జాలము చిన్నదనియుఁ, బిల్లికంటె బిలములోని మూషకము చిన్నదనియు ననుకొనునట్లు దీనిలోఁ బెద్దది చిన్నది అనునది లేదు. ఏనుఁగు కంటెఁ బెద్దజీవము కూడ కలదు. దానికంటె నిది చిన్నది. చీమకంటెఁ జిన్నజంతువు లనేకములు కలవు. వాటికంటెఁ జీమయే పెద్దది కాఁగలదు. మేరుపర్వతమునకు మించిన వస్తువుకూడ లోకములో నుండ వచ్చును. దానికంటె మేరువు చిన్నది. త్రిసరేణువు కంటెఁ గూడ చిన్నదగు పరమాణువు కలదనుచున్నారు. అప్పుడు త్రిసరేణువు పరమాణువు కంటెఁ బెద్దది. జడచేతనముల విషయములోఁ గూడ నిదే పద్ధతి. దేనిలోఁ జైతన్యప్రకాశ మెంత అధికముగ నుండునో అది అంత సజీవమని పిలువఁబడు చున్నది. చైతన్యప్రకాశము తక్కువగానున్న వస్తువులు జడములని జనులందురు. మానవులలోఁగూడ బుద్ధిహీనులైన వారిని ‘జడు’లని పిలుచుచుందురు. అాయి జడముకాదు. పృథివి జడముకాదు. వీనిలోఁ జైతన్య ప్రకాశము తక్కువగ నుండును. వీని కంటె వృక్షములలో నధికముగ నుండును.

కావున వృక్షములు వాళ్లకంటెఁ జైతన్య మయములని చెప్పు చుందురు. ఇట్లే వృక్షముల కంటెఁ గీటక పతంగములును వానికంటెఁ బశు పక్ష్యాదులును, వానికంటె బుద్ధిజీవులును బుద్ధిజీవులలో మనుష్యులును శ్రేష్ఠులని చెప్పఁబడియున్నది. ప్రపంచములోఁ గల భౌతికవస్తువు లన్నిటికిని ఒక్కొక్క అధిష్ఠాతృదేవత యుండును. అవి దేవతలవలె నశరీరిగానుండి, భావజగత్తులో నుండును. ఏదైన మాటలాడవలసినచో నది తనకనురూపమగు శరీరములోఁ బ్రవేశించి మాటలాడును. భూతప్రేతాదుల విషయములో నెట్లులో దీని విషయములో నంతియే. మహాభాగా! ఒకానొక భాష నెఱుఁగని వాని శరీరములో నాభాష తెలిసిన ప్రేతము ప్రవేశించినచో నా భాషను ఆమానవుఁడు స్పష్టముగ మాటలాడుటను మనము ప్రత్యక్షముగఁ గాంచుచున్నాము. ఆతఁడేది మాటలాడినను వానినోట నాప్రేతమే పలుకుచుండును. ఇదేవిధముగ ధర్మము, ధరణి, కలి ఇవన్నియు నశరీర దేవతలు. ఈ మానవులకు వారి భావములను బ్రకటింపవలసి వచ్చినప్పుడు తదనురూపముగఁ దాము స్వరూపమునైనఁ దాల్తురు లేదా ఏమానవునిలోనో ప్రవేశించెదరు. ఇక్కడ పృథివి గోరూపమును ధరించెను. ఏలననఁగా గోవునకు, పృథివికి చాలవిషయములలో సామ్యము కలదు. పృథివి మనలను ధరించి పాలనపోషణ నెట్లుచేయునో, అదేవిధముగ గోవుకూడ పాలుపిదికియు నెద్దులను గనియు మనలను రక్షించుచున్నది. గోపుత్రులు వృషభములెట్లో పృథ్వికి పుత్రుఁడు ధర్మము. ధర్మోపార్జనము భూమిమీఁదనే చేయవలసి యున్నది. ఇతర లోకములు ధర్మాధర్మ ఫలము

లను భోగించుటకు మాత్రమే. ధర్మవృద్ధి భూమిమీఁదనే కావలయును. కావున ధర్మము వృషభరూపమును ధరించెను. కృతయుగమందు ధర్మమునకు తప, శౌచ, దయా, సత్యములు చరణ చతుష్టయము. త్రేతాయుగములోఁ దపము నశించుటచే ధర్మము మూఁడు పాదములు మాత్రమే కలదయ్యెను. ద్వాపరములో శౌచము నశించుటచే రెండు పాదములే నిలిచెను. కలియుగములో దయ నశించుటచే ధర్మము కేవలము సత్యమను పాదము మీఁదనే నిలిచియుండెను. ఘోర కలియుగము రాఁగానే సత్యమను పాదము నశించి పోఁగాఁ గృపాళుఁడగు భగవంతుఁడు అవతారమునెత్తి ధర్మమును మరల నాలుగు పాదముల నడిపించును. అప్పుడు మరల కృతయుగము జరుగును. ఈవిధముగ నీక్రమము అనాదికాలమునుండి జరుగుచున్నది. అనంతకాలము వఱకు జరుగఁగలదు. ఇదియే ప్రకృతియొక్క - సృష్టియొక్క ధర్మము. ఇప్పుడు కలియుగము వచ్చుటచే ధర్మము ఒంటికాలి వృషభమయ్యెను. పృథివి గోరూపమును ధరించి, దుర్బలమై, చిక్కి శల్యమై, యేడ్చుచు, పశ్చాత్తాపపడుచు, దుఃఖితయై పరీక్షిన్మహారాజు శిబిర సమీపమున నిలువఁబడెను. ఒంటికాలి వృషభము దానితో నిట్లనుచుండెను.

వృషభరూపమగు ధర్మము ఇట్లడిగెను:— "అమ్మా! నీవింతగా నేడ్చుచుంటివేల? నీదుఃఖమునకుఁ గారణమేమి? నీ కుశలక్షేమమును జెప్పుము. నీముఖము మ్లానమగుటకుఁ గారణమేమో చెప్పుము. నీకు లోలోన నేదో క్లేశమున్నట్లు తోఁచుచున్నది."

పృథివి యిట్లనెను:— "ఏమి క్లేశము? ఏమి చెప్పుదును? చెప్పఁదగిన విషయముకాదు. నా దురదృష్టమునకు ఏడ్చుచున్నాను? మానవునకు సుఖదుఃఖములు వారివారి యదృష్టమును బట్టి లభించుచుండును."

ధర్మ మిట్లనెను:— "ఇది నిజమే. సుఖదుఃఖములు ప్రారబ్ధానుసారముగఁ గలుగుచుండును. అయితే దుఃఖములు కలుగుటకుఁ గొన్ని కారములుండును. తల్లులకు విశేషించి నాలుగే కష్టములుండును. వారి బంధువులెవరైనఁ బరదేశము వెళ్లినను, పుత్రదుఃఖము కలిగినను, ఆశ్రిత పరివారమున కేదైన విపత్తు కలిగినను, పతివియోగము కలిగినను దుఃఖము కలుగును. కాని వీనిలో నీకే కష్టము సంభవించినది? సద్గుణవంతుఁడగు నీహితైషి నెచ్చటికైన వెళ్లినాఁడా? నామూఁడు కాళ్లు ఖండింపఁబడుటచే నీకు దుఃఖము కలుగుచున్నదా? ఇప్పుడు నీమీఁద శూద్రులకు, మ్లేచ్ఛులకు ఆధిపత్యము సంభవించినదా? లేక త్వరలో రానున్నదా? వీనిలో నేకారణమున నింత వ్యాకులతతో నున్నావు? లేక నేఁడు ధర్మము లుప్తమగుటచేఁ గుపితుఁడై దేవేంద్రుఁడు సమయమునకు వర్షము కురిపింపకఁ బోవుటచే నిన్నాశ్రయించుకొనిన ప్రజలు దుఃఖితులు కాఁగా నీవు దుఃఖించుచున్నావా? లేక నిరీహ బాలకుల యెడలను, అబలల యెడలను రాక్షసప్రకృతి గల దుష్టులు ఇష్టమువచ్చినట్లు అత్యాచారములు చేయుచుండుటచే నీహృదయము ద్రవీభూతమైనదా? అధ్యయన, అధ్యాపనాది ధర్మకార్యములందు లగ్నము కావలసిన బ్రాహ్మణులు, ఆ కార్యములందు లేక, దుష్టరాజుల సేవలో లగ్నమగుటచే

నీముఖము మ్లానమైనదా? లేక అనధికారులును, కుకర్మ లును, సదాచార విహీనులగు బ్రాహ్మణుల సమీపమున సర స్వతి యుండుటచే నావాగ్దేవి కొఱకు నీవు దుఃఖించు చున్నావా? లేక యీ నామమాత్రపు నరపతులనఁబడు దస్యులచేఁ బీడింపఁబడు ప్రజల దుఃఖమును గాంచి యేడ్చు చున్నావా? లేక పైరుపచ్చలతో సమృద్ధిశాలియగు రాష్ట్ర ములలోఁ గలి ప్రవేశించుటచేఁ బాడఁపడియుండుటను గాంచి నీహృదయము విదీర్ణమగుచున్నదా? లేక నేఁటి మానవు లందఱును సదాచార నియమములను మఱచి, ఎక్కడ పీలైన నక్కడ, కులవిచక్షణలేక నందఱతోఁ గూర్చుండి సమస్త పదార్థములను సమస్త కాలములను దినుచుండుటను గాంచి, ఆ అనాచారులనుగాంచి శోకించుచున్నావా? లేక, నేఁడు కామవాసన చాల ప్రబలముగ నుండుటచేఁ బ్రజలు ప్రాచీన మర్యాదను విడిచిరి. గమ్యాగమ్యముల భేదభావ ములు లేకుండిరి. అందఱును స్వేచ్ఛాచారులగు స్వచ్ఛంద కాముకులైరి. వృద్ధిపొందిన యీకాముకుల కామవృత్తిని గాంచి నీవు పశ్చాత్తాపము చెందుచున్నావా? లేక నో మాతా! నీకనన్యాశ్రయుఁడును, ఏకమాత్ర రక్షకుఁడును నీకు స్వామియు శ్యామసుందరుఁడు పరలోకమునకు వెళ్లుటచే నీవింతగా దుఃఖించుచున్నావా? వీనిలో నీదుఃఖమునకు కారణ మెద్ది? నీవు నాకు నిజముచెప్పుము. అంతయు స్పష్టముగఁ జెప్పుము. నీదుఃఖముచే నేనును దుఃఖమును జెందుచున్నాను. నేఁడు నీవు సౌభాగ్యహీనమగు విధవవలె విలపించుచున్నావు.

నీకు సౌభాగ్యదాత ఆనందకందుఁడగు శ్రీనందనందనుడు కాఁడా? నీవాతని కొఱకు కేడ్చుచుంటివా?"

ధర్ముఁ డిట్లడిగిన మీఁదట పృథివీదేవి మాటలాడఁ జాలక పోయెను. ఆమె దుఃఖమునకు ఇవన్నియును గారణములే. తన దుఃఖమునకు దేనిని గారణముగఁ జెప్పఁగలదు? ఆమె దుఃఖమునకు ముఖ్యమగు నేకమాత్రపు కారణము ముకుందుఁడు స్వధామమునకుఁ బోవుటయే. దేవవందిత భగవత్పాదారవిందములు భూమిమీఁద విరాజిల్లునెడల నీ దుఃఖము లేవియును పృథివి చూడవలసిన పనిలేదు. విశ్వేశ్వరుఁడు వెడలిపోఁగానే. అధర్మబంధువగు కలి సర్వత్ర తన ప్రభావమును వ్యాపింపఁజేసెను. జీవుల బుద్ధులన్నిటిని పాపమాచ్ఛాదించివేసెను. అధర్మభారముచేఁ గ్రుంగిపోవుచున్న అవని మూఁడుకాళ్ల ముసలి యగు ధర్మమునకు యథారీతిగ జవాబొసంగెను.

అంత శౌనకుఁ డిట్లనెను:— "సూతా! కలియుగము వచ్చినదని ధర్మమునకుఁ దెలియదా? అందుకనియే పృథివి దుఃఖించుచుండెను. ఆతఁ డన్నియు నెఱిఁగినచో బుద్ధిపూర్వకముగ నేల నిట్టి వ్యర్థప్రశ్నలు వేయవలయును?"

సూతుఁడిట్లనెను:— "మహాభాగా! ప్రాణు లెఱిఁగియు సుఖ దుఃఖ విషయముల నడుగుచుందురు. అడుగుటచేతను, దానికి సంబంధించి చర్చ చేయుటచేతను దుఃఖము తగ్గుచుండును. సుఖాభివృద్ధి కలుగును. తన స్నేహితుని సమ్ముఖమున దుఃఖమును జెప్పుకొనుటచే హృదయము తేలిక

యగును. ఈ చర్చ జరుగుటకే ధర్ముఁ డిట్లడిగెను. ఈతనికి భూదేవి యెట్లుత్తరమిచ్చినదియు, విస్తారముగఁ దన దుఃఖ కారణమెట్లు చెప్పినదియు నేను మీకు చెప్పఁబోవు చున్నాను. మీ రందఱు సమాహితచిత్తులరై వినుఁడు. దీనిని శ్రవణము చేయుటచే ధర్మవృద్ధి కాఁగలదు. ఎచ్చట నీ ధరణీ ధర్ముల సంవాదము వినఁబడుచున్నదో, అచ్చటికి కలియుగము ప్రవేశింపఁజాలదు. అక్కడనుండి కలియుగము తన జండాను పీఁకికొని పాఱిపోవును. కావున నేను మీకీ సంవాదమును వినిపించు చున్నాను.'' ఇట్లని సూతుఁడు రాఁబోవు కథను జెప్పుట కుద్యుక్తుఁడయ్యెను.

ఛప్పయ.

బీతతి సుఖద బసంత గ్రీష్మమేఁ గరమీ ఆవే।
ప్రథమ పక్ష శశి క్షీణ ద్వితియ మహఁపుని ఖిలజావే।
మహామోద మేఁ హఁసే వహీ దుఖ మేఁ పుని రోవే।
త్యోఁ కలియుగ పశ్చాత్ సుఖద శుభ సతయుగ హోవే॥
జననీ దుఖతేఁ దుఖిత హ్వై, కాహే అశ్రు బహావతీ।
కాంతిహీన ముఖ మ్లాన కరి, కసడరి-డరి డకరావతీ?॥

అర్థము.

"సుఖకరమగు వసంతముపోయి గ్రీష్మములో నెండలు మండును. శుక్లపక్షమునఁ గల చంద్రుఁడు కృష్ణపక్షమున క్షీణించి మరల పైకి వచ్చును. మహామోదమున నవ్వినవాఁడే మరల దుఃఖములో నేడ్చును. అట్లే కలియుగము తర్వాత సుఖదమగు కృతయుగము వచ్చును.

అమ్మా! పృథివీ! ఎందుకు నీవు దుఃఖించు చున్నావు? ఏల కన్నుల నీరు కార్చు చున్నావు. కాంతిహీనవై, మ్లాన మును బెట్టుకొని యేల భయమునఁ గ్రేపుచు నేడ్చెదవు?'' అని ధర్ముఁడు పృథివి నడిగెను.

—:*:—

## భూదేవి తన దుఃఖమును జెప్పుకొనుట

### ౭౦

శ్లో॥ తస్యాహమబ్జ కులిశాంకుశ కేతు కేతైః,
శ్రీమత్పదైర్భగవతః సమలంకృతాంగీ।
త్రీనత్యరోచ ఉపలభ్య తతో విభూతిమ్,
లోకాన్ సమాం విసృజ దుత్స్మయతీం తదంతే॥
— శ్రీభాగ. ౧ స్కం. ౧౬ అ. 33 శ్లో.

''గీ. అట్టి వాసుదేవు నబ్జవజ్రాంకుశ
చక్రమీన శంఖ చాప కేతు
చిహ్నితంబులైన శ్రీచరణము లింక
సోఁక వనుచు వగపు సోఁకెనయ్య.

క. హరిపాదంబులు సోఁకెడి
సిరి కతమున నఖిల భువన సేవ్యత్వముతో
స్థిరనైతి నిన్నిదినములు
హరి నాగర్వంబు మాన్పి యరిగె మహాత్మా!

క. లీలాకారముఁ దాల్చెను
శ్రీలలనేశుండు ఖలుల శిక్షించి భవో
న్మూలనము సేయు కొఱకును
నాలుగు పాదముల నన్ను నడిపించుటకున్."

— శ్రీమదాంధ్ర భాగవతము.

ఛప్పయ.

బోలీ వసుధా; వత్స! విపతి కీ బాత బతాఊఁ।
ప్రాణనాథ పదపద్మ పరస బిను అతి అకులాఊఁ॥
జినకీ కృపా కటాక్ష పాఇ పావన సబ హోవేఁ।
మధుర మంద ముసకాన నారి లఖి ధీరజ ఖోవేఁ॥
తిను బిను హౌఁ విధవా భఈ, సబ సుహాగ సుఖ లుటిగయో।
శమ,దమ బల,తప, తేజ, గుణ, గయే ధైర్య మమ ఛుటిగయో॥

అర్థము.

ధర్మునితో భూదేవి యిట్లనెను:— "నాయనా! నా విపద్వృత్తాంతమును జెప్పెదను వినుము. ప్రాణనాథుఁడగు శ్రీకృష్ణపదారవింద పరశువేది లేక చాలబాధపడుచున్నాను. ఆతని కృపాకటాక్షవీక్షణమును బొంది సమస్తమును బావనమై పోవును. ఆతని మధుర మందహాసమును స్త్రీలు గాంచి ధైర్యమును గోల్పోవుచుందురు. ఆతఁడు నన్ను వదలి వెళ్లి పోఁగా విధవనైపోయితిని. నా పసుపు కుంకుమ సుఖమును బోఁగొట్టుకొంటిని. శమ, దమ, బల, తప, తేజ, గుణము లన్నియుఁ బోయినవి. నా ధైర్యము వీడిపోయినది."



శ్రీహరి సకల సద్గుణ నిధానము. ఆతఁడు బ్రహ్మ భావముచే చరాచర విశ్వమంతటను నిండియున్నాఁడు, కాని యాతఁ డెచ్చట విశేషరూపమునఁ బ్రాదుర్భావము చెందునో, ఏ భక్తుని హృదయమం దాతఁడు భగవద్భక్తిద్వారా ప్రకట మగుచుండునో, ఆ హృదయములోనికి సమస్త సద్గుణములు స్వతః వచ్చి నివాసము చేయుచుండును. వాసుదేవ భగవానుని ప్రాదుర్భావమునకును, సద్గుణములకును శరీర ఛాయల వలె సంబంధముండును. శరీర మెచ్చట నుండునో దానిఛాయ దానివెంటనే యుండును. పాలలోని తెలుపును, చంద్రునిలోని శీతలత్వమును, అగ్నిలోని యుష్ణతను, పృథివిలోని గంధమును వేఱుచేయఁజాలనట్లు సద్గుణములు పరమేశ్వరునకు వేఱుగ నుండఁజాలవు. సమస్తలోకాతీత సద్గుణములచేతనే శ్రీహరి శ్రీవిగ్రహ మేర్పడును. ఆ శ్రీవిగ్రహ మంతర్హితము కాఁగానే దానితోఁగూడ నీసద్గుణములు కూడ విలీనములగును. సుఖము స్వయముగ నదియొక సద్గుణము. సుఖము లేనిచోట దుఃఖము తిష్ఠవేయుచుండును. ఆనందము పోఁగానే విషాదమనునది ప్రవేశించుచుండును. ఆహ్లాదము లేనిచోట తాప, సంతాప, చింతాదులు వచ్చి బసచేయును. ప్రాణులందఱును ఆనంద, ఆహ్లాద, సుఖములు లేనివారై దుఃఖితులు, చింతితులగు చుందురు. భూదేవి మిక్కిలి దుఃఖపడుచుండుటను గాంచి ధర్మము ఆమె దుఃఖమునకుఁ గారణ మడిగెను. అప్పుడు మ్లానముఖముతో గోరూపధారిణి యగు పృథివి చెప్పఁ దొడఁగెను.

పృథివి యిట్లనెను:— "నాయనా! ధర్మా! నీవు దేనిని గూర్చి నన్నడుగుచున్నావో అది నీకు తెలియకున్నదా యేమి? ఇట్లు తెలియని అమాయకునివలె నన్నేల అడుగుచున్నావు? నీవు నీస్థితిని జూచుట లేదా యేమి?"

ధర్ముఁడిట్లనెను:— "దేవీ! నాకీ మూఁడు కాళ్లు విఱిగిపోయినవి. నాల్గవదానికిఁగూడ బాధ కలుగుచున్నది. దీనికి కారణమేమో నీవే చెప్పుము. ఇట్లేల నగుచున్నది? నేను పాదహీనుఁడుగను, ఉత్సాహహీనుఁడుగ నైతినేల?"

పృథివి యిట్లనెను:— "నీకు శౌచ, తప, దయా, సత్యములు పాదములు. ఈ నాలుగే ప్రధాన గుణములు. ఈ గుణముల నాశ్రయించి వేలకొలఁది గుణము లుండును. సత్యమునకు మించిన ధర్మము లేదు. శౌచము వలనఁగూడ మానవులకు హృదయము పవిత్రమగుచున్నది. పవిత్రహృదయములో ప్రభువు నివాసము చేయును. దయ యనునది ధర్మమునకుఁ దల్లి. దయలేనిచోట నీవు ఉండనే యుండవు. క్షమ క్షోభను నాశము కావించును. త్యాగము సంసార బంధనమునుండి విడివఱచి మోక్షమార్గమునకుఁ గొనిపోవును. సంతోషము సుఖమునకు సోదరుఁడు. కోమలత కమనీయతకు తోఁబుట్టువు. కోమలత లేనిచోట దాని సవతి కర్కశత ప్రవేశించును. అది యున్నచోట సౌందర్య సుఖములు రెండు నుండవు. అంతరింద్రియములగు మనో, బుద్ధి, చిత్తాహంకారములను అంతఃకరణ మందుము. వాటిని వశమం దుంచుకొనుటయే శమము. జ్ఞానేంద్రియములను వశమందుంచుకొని వాటిని సన్మా

ర్గమునఁ బెట్టుటకే దమమందురు. కర్మేంద్రియములను సుమార్గములకుఁ బోనీయక, అవి కోరిన సాంసారిక సుఖభోగములను వానికి లేకుండఁజేయుటకే తపమందురు. ప్రతి జీవిలో ప్రభువున్నాడనుకొనుటకు 'సమత' యందురు. ఎవని బుద్ధి సమతలో స్థిరమగునో వానికి శోక మోహాము లెన్నడు నుండవు. సమస్తమును సర్వేశ్వరుని స్వరూప మగుచో నింకెవరితో విరోధ జగడములు జరుపుట? ఎవఁడేదైన నననిండు. ఎవరిని నీ వనకుండు నెడల దుఃఖము కలుగనే కలుగదు. వచ్చిన దుఃఖములను నిందింపక స్వేచ్ఛగా సహించు నెడల, దానిని తితిక్ష యందురు. విషయముల యెడల నుదాసీనముగ నుండుటకే ఉపరతి యందురు. చిత్తమున కేదియో చింతనీయమగు వస్తువుండవలయును. అది విచారింపక నిలువనేనిలువదు. కావున నెవఁడు వ్యర్థవిషయములను విచారింపక మనస్సును శాస్త్రీయవిషయములం దుంచునో ఆక్రియను శ్రుత మందురు. ఈ శాస్త్రీయ చింతనముచే నంతఃకరణములోని మలవిక్షేపములు తొలఁగిపోవును. సదసద్వివేకమునకే జ్ఞాన మందురు. జ్ఞాని దృష్టిలో సుఖదుఃఖములు లేవు. నిర్ద్వంద్వ మున్నచోట దుఃఖశోకములకు మూలకారణమగు సంసారము తత్క్షణము విలీనమై పోవును. చిత్తవృత్తి స్వభావముగనే విషయముల వైపునకుఁ బోవుచుండును. దానిని విషయములనుండి లాగి శ్యామసుందరుని యందు లగ్నముచేయుటకే వైరాగ్యమందురు. వైరాగ్యము కలవాఁడు సంగ్రహము చేయవలసిన పనియేమున్నది? సంగ్రహము చేయనిది రక్షణచింతకూడ

ఉండఁజాలదు. ఎవ్వరిమీఁదను అవిశ్వాస ముండఁజాలదు. సంగ్రహము దుఃఖహేతువు. అధిక సంగ్రహముచే నధిక చింత కలుగుచుండును. ప్రపంచమందు గల ఐశ్వర్యమంతయు నందనందనునిదే. కావున విశ్వబ్రహ్మాండములోని సమస్తైశ్వర్య మును నీ పిత్రార్జితమనుకొని దానియందు నీది నాది యను భేదభావ ముంచరాదు. ఐశ్వర్యమంతయు తన పిత్రార్జితమైన దనుకొని, తాను ఐశ్వర్యవంతుఁడ ననుకొనుట – ఇదియే యథార్థమగు నైశ్వర్యగుణము. ఐశ్వర్యమంతయును మన తండ్రిదే యగునెడల, పరుల యైశ్వర్యమును జూచి ద్వేషింప నేల ? ఇంకొకరి దెవరిది ఉన్నది ? అంతకు నేకమాత్రమగు నుత్తరాధికారుల మగు మనమే ఆ జగత్పితకు ఏకైకపుత్రు లము. ఒక వర్తకునకు విదేశములలోఁ జాల వ్యాపారశాఖ లుండి వాటిలో ననేకులు నౌకరులు, గుమాస్తాలు పనిచేయు నట్లు మన ఆజ్ఞచేతనే సర్వత్ర పనులు జరుగుచున్నవి. కాని యీ సమస్తైశ్వర్యమునకు స్వామి యీ శెట్టి, ఆతని పుత్రులు. సాంసారిక విషయములతో సదా పోరాడుచుండుటయు, వాటి కెన్నడు లొంగకుండుటయు, దుర్గుణములను సదా సంహారము కావించుటయు నిజమగు శూరవీరత కాఁగలదు. ఎవనిలో నీ శూరవీరత కలదో, ఎవఁడు ధనుర్ధరుఁడై, బాణము నెక్కు పెట్టుకొని నిరంతరము జాగ్రత్తగ సన్నద్ధుఁడై యుండునో వాని నెవఁడీలోకములో చెఱుపఁగలఁడు ? వాని నెవఁడు పరా జితునిఁ గావింపఁగలఁడు ?

సూర్యునిలోను, చంద్రునిలోను, అగ్నిలోను, చరాచర విశ్వమందును గల తేజస్సంతయు దేవకీనందనునిదే. ఆ తేజ

స్సుచే తేజస్వియై సదా దుర్గుణములను దపింపఁజేయఁవల యును. ఇదియే తేజముయొక్క ఉపయోగము. దీనిని సదా ఉపయోగించుకొనవలయును. నిస్తేజపురుషుని అంద అణఁచి వేయఁజూతురు. బలము మూఁడు విధములుగ నున్నది— శారీరకబలము, ఇంద్రియబలము, మానసికబలము. మనోబల మును సహ మందురు. ఇంద్రియబలమును ఓజస్సందురు. శరీరములో వృద్ధియైన శక్తికి బలమందురు. ఈ సమస్త బల ములును అన్నిటికంటె బలముగల కాలస్వరూపుఁడగు శ్రీకృ ష్ణునివే. ఆతనిలోని లవలేశమగు బలము నాధారము చేసి కొనియే అందఱు నది తమబలముగఁ జెప్పుకొనుచుందురు. బలరాముని సోదరుఁడగు కంసనిషూదనుని హృదయమందు ధరించినవానిదే నిజమగు బలము.

విస్మరణమే మత్యువు. స్మృతినే శాస్త్రకారులు జీవన మనిరి. అందుకనియే ఋషులు మాటిమాటికి సర్వదా విష్ణు స్మరణము చేయవలసినదని నొక్కి చెప్పుచు వచ్చిరి. పొర పాటుననైనా నాతనిని విస్మరింపరాదు. సర్వదా హరిస్మృతి కలవానికి విపత్తులేమియును రావు. ఏలననఁగా 'హరిస్మృతి సర్వ విపద్విమోక్షణముగఁ' జెప్పఁబడినది. ఈ జీవి విషయా ధీనుఁడు. విషయాధీనతను స్వేచ్ఛగ గ్రహించుటచే నీతఁడు పరతంత్రుఁడైనాఁడు. పరాధీనునకు స్వప్నమందైన సుఖముం డదు. కావున నీ దుర్వ్యసనములను ప్రబలాందోళనద్వారా నెవఁడు జయించి యాత్మయందు స్థితుఁడైయుండునో, వాఁడే స్వరాజ్యమును బొందినాఁడని తెలిసికొనుము. అతఁడే నిజ

మగు స్వతంత్రుఁడు. స్వతంత్రతా సమ్ముఖమున సుఖము చేతులు కట్టుకొని నిలిచియుండును.

కర్మలొనర్చుటలోఁగల నిపుణతకు కుశలత యందురు. పూర్వము శుభకర్మలన్నిటిలో మానవులు కుశలు ధరించెడు వారు. ఏలననఁగాఁ గుశలు పరమపవిత్రములు. అందువలనఁ గుశలను ధరించినవానిని గాంచి అందఱును-'ఏడు మంచిపని చేయుచున్నాఁ'డను చుండెడివారు. అందువలన వానిని 'కుశ-ల' యను చుండెడివారు. లేక యెవఁడు కుశలను దెచ్చి చక్కఁగా విడఁదీసి కట్టగట్టి చక్కని కట్టగఁజేయునో వానినిఁ గుశలుఁ డందురు. అందువలన నీశబ్దము బుద్ధిమంతుఁడై శుభకార్యములు చేయువానికి రూఢ్యర్థమైనది. అనఁగా సత్కర్మలు చేయువాఁడు కుశలుఁడు. కుశలు ధరించినవానినిఁ బాప మెట్లంటఁగలదు? పాపమునకు సోదరుఁడు కలి. పాపమునకుఁ గొడుకు దుఃఖము. కుశల పురుషునికడకు ఇవన్నియు రాఁజాలవు.

సద్గుణములవలన బయలుదేరు ప్రకాశమునకే 'కాంతి' అందురు. సద్గుణములు లేని విషయాసక్తునకుఁ గాంతి యెక్కడిది? అట్టివారు ప్రభా, కాంతి, తేజాదులు లేనివారై యుందురు. కావునఁ గాంతినిగాంచి వానిలోఁ గమలాకాంతుఁడు విరాజిల్లుచున్నాఁడని తెలిసికొనవలయును.

వికార సామగ్రి యెదుటనుండియు నెవనిమనస్సు ధైర్యకారణమున వికారముత్పన్నము కాదో వానిని 'ధీరుఁడు' అందురు. ధైర్యవంతునకు లోకములో సాధ్యముకాని పని

లేదు. ఆతఁడు పాతాళమును పగులఁ గొట్టఁగలఁడు, ఆకాశ మును వికావికలు చేయఁగలఁడు. మందరాచలమును బెత్తికి గిరగిర త్రిప్పఁగలఁడు. స్వర్గపాతాళముల నేకముచేసి కలుపఁ గలఁడు. మానవుఁడు ధైర్యమును విడిచినప్పుడు దుఃఖితుఁ డగును.

మానవుఁడు కర్కశుఁడైనప్పుడే దేనివలననైన భయ పడును. కర్కశపురుషుని హృదయ మెల్లప్పుడును భయభీతమై యుండును. వాఁడన్యులను భయపెట్టుచుండును; అన్యులకును భయపడుచుండును. కాని మృదుత్వమును ధరించిన వానినిఁ గాంచి యెవఁడును భయపడఁడు. అందఱ నాతఁడాకర్షిం చును. పుష్పము మృదువుగ నుండును. అందఱాతనిని గాంచి ప్రసన్నులగుచుందురు. కుల స్త్రీ, అబోధశిశువు, నేయి, పాలతోఁ జేసిన మిఠాయిలు ఇవన్నియు మృదువులుగ నుండును. ఇవి సాధారణముగ నందఱ మనస్సులను హరిం చును. శ్యామసుందరుఁడు వీటి అన్నిటికంటె మృదువు. కావున శ్యామసుందరుని హృదయములో ధరించినచో, వాని హృదయము అప్పుడప్పుడు తీసిన వెన్నవలె మృదులము లగును.

ఇతరుల కనిష్టము చేయవలెనని మనస్సులోనికి భావన రాఁగానే భయ ముత్పన్నమగును. సమస్తప్రాణుల కభయ దాన మొసంగినవాఁడును, నిర్భయతావ్రతమును ధరించిన వాఁడు సమస్త ప్రదేశములందును, సమస్త దిశలయందును సుఖియగును. ఈ గుణము విషయాసక్తులకు కలుగదు. ఏల ననఁగా భయము ద్వైతమువలనఁ గలుగును. సర్వత్ర తవ

శ్యామసుందరుని జూచుటానికిని, అద్వైతుఁడగు నచ్యుతు నాశ్రయించినవానికి భయమునకుఁ జోటేది ?

ఉద్ధతస్వభావమే ఇతరులమనస్సులలో క్షోభముకలుగఁ జేయును. అశిష్టతను వీడి వినయము నాశ్రయించినవాని సము ఖమున నందఱు తలలు వంచవలసినదే. వినయము మనలను స్వర్గమునుగూడ దాఁటించి, పైన మోక్షమువఱకు గొని పోయి భగవద్భక్తి మందిరములోనికి ప్రవేశము కలుగఁ జేయును. కావున భక్తులకు సర్వశ్రేష్ఠమగు భూషణము వినయము. దుశ్శీలుఁడైనవాడును, శాలీనతను వదలిన వాఁడును ఈ లోకములోను బరలోకములోను ప్రతిష్ఠితుఁడు కాఁజాలఁడు. శరీరము నలంకరించుకొనుటకు కడియములు, మురుగులు. బాజుబందులు, కంకణములు, ముకుటము మొద లగు ననేకభూషణములు కలవు; కాని యిన్నిటితో నలంక రింపఁబడిన శరీరము శీలగుణరహితమగుచో నది వ్యర్థమే కాఁగలదు. స్త్రీ పురుషు లందఱకును సర్వశ్రేష్ఠమగు భూష ణము శీలమే.

ప్రతి కార్యమునకు సిద్ధి ఉత్సాహము ద్వారా కలు గును. మనస్సులో కార్యమొనర్చుటకు లేచిన పొంగునకే ఉత్సాహ మందురు. ఉత్సాహవంతుఁ డన్నియుఁ జేయుటకు సమర్థుఁడగును. ఒక ఉత్సాహవంతుఁడు ఎందఱో పిరికివార లను వీరులుగా నొనర్చును. సద్గుణముల వలననే సౌభాగ్య ముదయించును. గుణహీనుఁడు సౌభాగ్యశాలి యెట్లు కాఁగ లఁడు ? కావున సౌభాగ్య కార్యమునకు సద్గుణములే కార ణములు.

ప్రతి కార్యమందును నీచముగఁ బ్రవర్తించుటయు, కార్యముయొక్క ఫలాఫలములను దెలిసికొనకయే దానిలోఁ బ్రవృత్తుఁడగుటయు, నిది బుద్ధియొక్క అస్థిరతకు లక్షణము. ప్రతికార్యమును బాగుగాఁ దెలిసికొని, గంభీరతతో దానినిఁ జేయుచు, నిశ్చయింపఁబడిన కార్యమును స్థిరత్వముతోఁ జేయునెడల నాతఁడు లోకములో విపులకీర్తిని, దేవదుర్లభమగు సమ్మానమును బొందును. ఈ గుణము లన్నియు నాస్తికులలోను, హరిభక్తివిహీనులలోను ఎన్నటికిని రాఁజాలవు. కావున నీ సద్గుణములన్నిటికిని జనని — ఆస్తికత. తల్లి చంకలో పిల్లవాఁడెట్లు నిర్భయముగ నాడునో, అట్లే ఆస్తికత నాశ్రయించినచో నీ ప్రపంచములో సర్వత్ర సుఖమే తోఁచుచుండును. ఆస్తికపురుషుఁ డెన్నఁడును పాపకర్మలను జేయఁడు. ఏలననఁగా నాతఁడు సర్వత్ర తన ప్రభువునే చూచుచుండును. పెద్దల సమక్షమునఁ బాపకర్మ చేయుటకు సాహసము కలుగదు. ఆస్తికపురుషునకు స్వాహంకారము కూడ ఉండదు. ఆతఁడు నిరహంకారియై తనస్వామిని సర్వత్ర చూచును.

ఈ సద్గుణము లన్నియును, ఇవికాక ఇంకను శ్రేష్ఠులచే సదా ప్రశంసింపఁబడు శ్రేష్ఠగుణము లన్నియు నొక్క శ్రీహరిలోనే కలవు. ఆతని కీ గుణములు సాధనచేతను, ప్రయత్నము చేయుటచేతను ఇంకొక చోటునుండి రాలేదు. ఈ గుణములాతనికి స్వాభావికములు. ఈగుణము లాతని కెన్నడును విడిగా నుండఁజాలవు. ఏకారణముచేనైనఁ దగ్గిపోవు. అట్టి సర్వసద్గుణ

ధాముఁడగు శ్రీనివాసుఁడు లేక నేఁడు నేననాథనైతిని. ఆతఁడు స్వధామమునకుఁ బోవుటచే కుటిల కలికాలము నాపై నాధిపత్యమును స్థాపించుచున్నది. ఆ కుటిల కలియొక్క కల్పిత కార్యములచే నేను కాతరను, దుఃఖితురాల నైతిని. నా దుఃఖమున కిదియే ప్రధానకారణము."

ధర్ముఁడిట్లనియె:— "అయితే నీ కొక్కదానికే దుఃఖముగ నున్నదా? లేక యింకెవరి విషయముననైన దుఃఖము కలదా?"

పృథివి యిట్లనెను:— "నన్ను గూర్చిన విచారము మాత్రమే యగునెడల నాకింత దుఃఖముండదు. నాకు నిన్నుఁ గూర్చిన దుఃఖము కూడ కలదు. నీకు మూఁడు కాళ్లు తెగఁ గొట్టఁబడినవి. నాలుగవకాలుకూడ జర్జరితమగుచున్నది. నీవు దేవతలందఱకంటె శ్రేష్ఠుఁడవుగ నెన్నఁబడుచున్నప్పటికిని, నిన్నిప్పు డడుగువారు లేరు' సర్వత్ర నిన్ను దిరస్కరించుటను గాంచి నేనత్యంతము దుఃఖించుచున్నాను. భూమిమీఁద పూర్వమువలె యజ్ఞయాగాదుల ప్రచారము లేదు. కావున దేవతలకు యజ్ఞభాగము లందుట ఆగిపోయినది. కొందఱు నాస్తికులు స్వర్గస్థులగు పితరులను లేరనుచుందురు. ఆకారణమున పితరులకు పిండోదక తర్పణాదులు చేయుటలేదు. ఇందు వలనఁ బితరులును దుఃఖితు లగుచున్నారు. మానవులు క్షీణాయుష్కులును, క్షీణపురుషార్థులు నైరి. ఋషులు, మునులు నన్ను వీడి మహర్లోకమునకుఁ బోయిరి. ఏ నా వనములలో వేలకొలఁది ఋషులును, మునులును, సాధువులును,

సత్పురుషులును తపస్సు చేయుచుండిరో అక్కడ ఇప్పు డొక్కఁడును గనపడఁడు. సాధుదర్శనము దుర్లభమై పోయి నది. సాంసారిక సుఖములే సర్వస్వమనుకొను భౌతికవాదులు ఆధ్యాత్మికతయనిన మండిపడి సాధుసత్పురుషులను ద్వేషించు చున్నారు. నాదుఃఖమునకు ఇదికూడ ఒక కారణము. అంద ఱును నాకు పుత్రులే. వర్ణాశ్రమధర్మము నాశ్రయించిన వారందఱును నాశరీరము నుండియే యుద్భవించిరి. నాపైననే పెద్దవారైరి. అందఱును నేఁడు కలికాల ప్రభావముచేఁ బ్రభావితులుకాఁగా నందఱుపై నధర్మము ఆధిపత్యము వహిం చుటను గాంచి నేనధీరురాల నైతిని. అన్నిటికంటె మిక్కిలి దుఃఖము నాకు వాసుదేవుఁడు వైకుంఠముచేరుటచే కలుగు చున్నది. ఆతఁ డీ మర్త్యలోకమందు మానుషశరీరమును ధరించి నాపైనుండఁగా, నాతని అతి సుకోమల చరణారవింద ములు నాపైఁబడినవి. అప్పుడు నాశరీరమంతయు రోమాంచ మైనది. నేను కృతకృత్యురాల నైతిని.''

ధర్ముఁ డిట్లనెను:— ''అమ్మా! భగవంతుని చరణార విందములలో నంతటి విశేష మేమున్నది?''

ధరణి యిట్లనియె:— ''ధర్మా! నీవు భగవంతుని చర ణారవింద మహాత్మ్యము నెఱుఁగవా? ఒక్కసారి లక్ష్మీదేవి తన కృపాకటాక్షమును తమమీఁదఁ బరపినఁ జాలునని సదా బ్రహ్మాదులు తపస్సు చేయుచుందురు. అట్టి త్రైలోక్య వందితు లగు వారు అభిలషించు లక్ష్మీదేవి ఎవని చరణారవిందములను సదా శ్రద్ధతో సేవించుచుండునో, ఆమె చంచలయైనను వేనిని వదలదో అట్టి శ్రీచరణముల మహిమను నేనేమని

వర్ణింపఁగలను? ఏచరణములందు వజ్రాంకుశ ధ్వజారవిందాది చిహ్నములు శోభిల్లుచున్నవో, అట్టి చరణములు నన్ను సోకినప్పుడు నేను నాసౌభాగ్యమునకు ఉబ్బిపోయెడుదానను. అట్టి నాసౌభాగ్య మంతమైపోయినది. నేఁడు శ్యామసుందరుఁడు నన్ను భాగినిఁగఁ జేసి విలపించుచుండ వదలి స్వధామము నకుఁ బోయెను.

ఎవఁడు తన మాయచే మనుష్యవేషమును ధరించెనో, స్వేచ్ఛావిహారియయ్యు నెవఁడు యదుకులములో నవతరించెనో, ఎవఁడు వృద్ధిపొందుచున్న నాభారమును దీసివేసెనో, ఎవఁడు రాజవేషమునఁ బుట్టిన రాక్షసులను, అసురులను జంపి నన్ను నిష్కంటకఁగ నొనర్చెనో, ఎవఁడు సర్వత్ర నీకు విజయమునే యొసంగి సర్వత్ర నీయాధిపత్యమునే నెలకొల్పెనో ఆ పురుషోత్తముని వియోగమును భరింప నెవరు సమర్థులు? తన రుక్మిణీ, సత్యభామాది పదునాఱువేల నూటయెనిమిది మంది రాణులను గర్వితలుగాఁ జేసినట్టివాఁడును, తన కమనీయ కటాక్షములచే వారిపైఁ బ్రేమచూపినవాఁడును, తన కమనీయ మందహాసముచే నందఱ మనస్సులను హరించి, వారికి గౌరవమును వృద్ధికావించినవాఁడును, ఎవని మృదు మధుర వాక్కులను విని కామినులు తమ ధైర్యమును గోల్పోవుదురో, ఓ ధర్మా! ఆయనుపమ సౌందర్య నిధియగు ఘన శ్యాముఁడు నన్ను వదలి వెళ్లిపోయినాఁడు.''

ధరణీ ధర్మముల కిట్లు సంవాదము జరుగుచుండఁగా బ్రహ్మావర్తమందు ప్రాచీ సరస్వతీ తటమునకుఁ బరీక్షిత్తు చేరుకొనెను.

ఇట్లు చెప్పి సూతుఁడు కొంచెము సేపు ఆగెను. రాఁబోవు కథా విషయమును గూర్చి ఆతఁ డాలోచించుచుండెను.

ఛ ప్ప య.

జలజ సరిస జే చరన, యోగిజన జినకూఁ ధ్యావేఁ ।
జినమేఁ వజ్ర, త్రిశూల, కమల ధ్వజ శోభా పావేఁ ॥
దుఖహార సుఖకర పాద పద్మ మమ హియ జబ పరతే ।
రోమాంచిత కరి దేహ వర్ష హియ మేఁ అతి భరతే ॥
ఆజ ఉన్హీఁ తే హీన హ్వై, భాగ్యహీన అబలా భఈ ।
శ్రీ, హ్రీ, లజ్జా, కాంతి, ధృతి, సుఖ సమృద్ధి బిను హ్వై గఈ ॥

అ ర్థ ము.

ఎవని పాదారవిందములను యోగిజనములు ధ్యానింతురో, ఏ పాదములందు వజ్ర, త్రిశూల, కమల, ధ్వజాది రేఖలు శోభించుచున్నవో, అట్టి దుఃఖహారమును, సుఖకరమునగు పాదపద్మములు నా హృదయమున నెప్పుడు నిలిచిన నప్పుడు నా దేహము రోమాంచితమై హృదయము సంతోషమున నిండిపోవును.

నేఁ డట్టివాఁడు లేకుండుటచే భాగ్యహీనయగు నబలనైతిని. ఇప్పుడు శ్రీ, హ్రీ, లజ్జా, కాంతి, ధృతి, సుఖ సమృద్ధి లేనిదాననైతిని.



# పరీక్షిత్తు - కలి సమావేశము

## ౭౧

శ్లో॥ తత్ర గో మిథునం రాజా హన్యమాన మనాథవత్ ।
దండహస్తం చ వృషలం దదృశే నృపలాంఛనమ్ ॥
— శ్రీభాగ. ౧ స్కం. ౧౭ అ. ౧ శ్లో.

"శా॥ కైలాసాచల సన్నిభంబగు మహా గంభీర గోరాజముం
గాల క్రోధుఁడు దండహస్తుఁడు నృపాకారుండు క్రూరుండు జం
ఘాలుండొక్కఁ శూద్రుఁడా సురగతిం గారుణ్యనిర్ముక్తుఁడై
నేలం గూలఁగఁదన్నెఁ బంచితిలఁగా నిర్ఘాత పాదాహతిన్."
— శ్రీమదాంధ్ర భాగవతము.

ఛప్పయ.

జహాఁ ధరణి అరు ధర్మ, కరేఁ సంవాద కష్టకర ।
కరత దిగవిజయ తహాఁ, పరీక్షిత పహుఁచే నృపవర ॥
బనే వృషభవర ధర్మ, ధేను తను ధరణీ ధారే ।
ఛద్మ వేష మేఁ వృషల నృపతి బని తినకూఁ మారే ॥
వృషభ ఏక పగ తేఁ వ్యథిత, కామధేను లఖి దుఃఖిత అతి ।
శూద్రహానేఁ థర-థర కపేఁ, కర్యో క్రోధ బోలే నృపతి ॥

అర్థము

ధరణీ ధర్మములు రెండును కష్టతర సంవాదమును జేయుచున్నకడకు పరీక్షిన్మహారాజు దిగ్విజయము చేసికొనుచు నక్కడకుఁ జేరెను. ధర్మము వృషభమయ్యెను. ధరణి ధేను రూపమును జెందెను. ఛద్మవేషమున శూద్రుఁడు నృపతియై ఆ గోవును గొట్టుచుండెను.

వృషభ మోఁటికాలితో బాధపడుచుండెను. గోవు దానినిజూచి మిక్కిలి దుఃఖము చెందెను. శూద్రుఁడు కొట్టఁగా దడదడవణఁకెను. అప్పుడు పరీక్షిత్తు దానినిగాంచి క్రోధము చెందెను.



కాలగతి దుర్నివార్యమైనది. మనము ఏ యుపాయము లచేఁ బోగొట్టఁదలఁచితిమో, దానిసమయము వచ్చునప్పటికి, ఆ ఉపాయములే దాని ప్రవృత్తికి సహాయకములగుచుండును. కాలస్వరూపుఁడగు శ్రీకృష్ణుఁ డేసమయమున దేనిని జేయ వలసి యుండునో, దైవిక సంయోగరూపమున నట్లెయై వచ్చు చుండును. లోకులు భ్రమవశమున నీకార్యము ఇట్లు జరుగఁ గూడదు, అయితే అకస్మాత్తుగ నైనదనుచుందురు. నిజముగఁ జెప్పవలసివచ్చిన, నేకార్యమును అకస్మాత్తుగ నెన్నడును జరుగదు. అన్నిటిని గాలము కట్టివైచినది. మనమిట్లు చేసి యుండిన బాగుండెడిదని అజ్ఞానులు పొరపాటునఁ బశ్చాత్తాపము చెందుచుందురు. నీవేమి ప్రయత్నము చేసినప్పటికి నెట్లు జరుగునో అట్లే జరుగఁగలదు. నీవు నీయిష్టము వచ్చి నట్లు చేయుటకు స్వతంత్రుఁడవు కావు. జరుగవలసినదేమో నీద్వారా జరుగుచుండును. మంగళాయతనుఁడగు శ్రీహరికి నీసర్వస్వము సమర్పించుటలో నీకు మంగళము కలదు.

గంగా యమున పరమపావన పుణ్యప్రదేశమందు ప్రాచీసరస్వతీనది సమీపమున ధరణీ ధర్మములు గో వృషభ రూపములను ధరించి సంభాషించుకొనునప్పు డచ్చటకు సంయోగవశమున నకస్మాత్తుగ ధనుర్బాణములు ధరించి

సువర్ణమండిత రథము నెక్కి పరీక్షిన్మహారాజు వచ్చెను. ఒక శుభ్ర శంఖమువలెను, కొంగ ఱెక్కలవలెను, హంసవలెను తెల్లగానున్న వృషభమును పరీక్షిన్మహారాజు చూచెను. దానికి మూఁడుకాళ్లు విఱిగి యుండెను. దానికి దగ్గఱగా మిక్కిలి దుర్బలమై, చిక్కి శల్యమైనదియు, వత్సవిహీనమైనదియు, ఆఁకలిచెంది యుస్సురనుచు గోవు నిలుచుండి యుండెను. చేతిలో నొకదండమును బట్టుకొని, శిరస్సునఁ గిరీటమును ధరించి, రాజవేషమును ధరించి యొకవ్యక్తి రెంటిని నిర్దయతాపూర్వకముగ గొట్టుచుండెను. అవ్యక్తి వేషమునుబట్టి చూచిన భూపతివలెనుండెను కాని చూడఁగా నాతఁడు ద్విజేతరుఁడగు వృషలుఁడుగఁ దోఁచుచుండెను. ఆ వేషము యథార్థమైనది కాదని చూచువారికి స్పష్టముగఁ దోఁచుచుండెను. అదియునుగాక ధర్మజ్ఞుఁడగువాఁడు క్షమింపరాని నీచకార్యము నాతఁడు చేయుచుండెను. ఒంటికాలిపై నిలుచుండిన దీన వృషభముపై నాతఁడు విపరీతముగ ఘోరముగఁ గొట్టుచుండెను. పాపము ఎద్దు మూత్ర పురీషములను విడుచుచు, భయభీతమై, కాతరదృష్టిచే నల్దిశలఁ దన కెవఁడైన, రక్షకుఁడు దొఱకునేమోనని వెదుకుచుఁ గన్నుల నీరు గార్చుచుఁ జూచుచుండెను. ఆదీన దుర్బల గోవుస్థితియు నిట్లే యుండెను. ఆ వృషలుఁడు మాటిమాటికి తనకాలితోఁ దన్నుచుండెను. పాపము గోవు అసహాయమై, బలహీనమై, రక్తహీనమై గడగడ వణఁకుచు, దుఃఖించుచు 'అంబా' యని అఱచుచు నాఁకలిచేఁ గాతరమై అశ్రువులు కార్చుచుండెను.

దయాళుఁడగు పరీక్షిన్మహారాజు తన రాజ్యమందే గో వృషభముల కిట్లు బాధకలుగుటను గాంచఁగానే ఆతని యాశ్చర్యమునకు మేఱలేకుండెను. ఆ రాజవేషధారియు, నిర్దయుఁడగు శూద్రునిమీఁద రాజునకు మిక్కిలి కోపము కలిగెను. పరీక్షిన్మహారాజు తన రథముమీఁదఁ గూర్చుండియే, అత్యంత కోపముతో, మేఘగంభీర వాక్కులతో, వానిని కసరుచు నిట్లనుట కారంభించెను – "ఓరీ! దుష్టా! నీవెవఁడవురా? జాగ్రత! ఇఁక నీవీ గో వృషభములను గొట్టితివా నేను నీ శిరస్సును శతసహస్రములుగ ముక్కలు ముక్కలు చేసి పారవేసెదను. నీచా! నీకు సిగ్గులేదటరా! బలవంతుఁడవై దీన దుర్బలులపైఁ బ్రహారము చేయుచున్నావా? నీవు స్వస్థుఁడవు, సర్వాంగుఁడవై కుంటివానినిఁ గొట్టుచున్నావా? నా రాజ్యములో నుండియు నిట్టి యవినీతి కార్యము నొనర్చుచున్నావు. నా యాశ్రయమున నుండు ప్రజలపై నెవ్వఁడు నెప్పుడు నీతీరునఁ గొట్టఁజాలఁడు. ఎవ్వఁడు వారి నీవిధముగ బాధపెట్టఁజాలఁడు. నీవు రాజువు కావు, పాపివి! నాటకములోని నటకుఁడు రాజవేషమును ఆయా దుస్తులతో వేసికొని వచ్చినట్లు నీవుకూడ ఛద్మవేషమును ధరించి వచ్చితివి.

సమస్త ప్రపంచమును రక్షించు వాసుదేవభగవానుఁడు స్వధామమునకుఁ బోయెనని నీవనుకొనుచున్నావు కాఁబోలు. త్రైలోక్య విజయుఁడును, గాండీవ ధనుర్ధారియు, భగవంతునకు సఖుఁడును, నాకు పితామహుఁడును, వీరశిరోమణియు నగు నర్జునుఁ డిప్పు డీ యవనిని బరిత్యజించినాఁడని

తలపోసినాఁడవేమో! ఇప్పుడెవరును రక్షకులు లేరనుకొనుచున్నావు. అట్లైన నీ యీ విచారము వ్యర్థము. నేనుండఁగా నీలోకములో నిట్టి యన్యాయము జరుగఁగూడదు. మనుష్యులతో నిండిన నగరమగుఁగాక, నిర్జనవనమగుఁగాక సర్వత్ర నాశాసనము కలదు. శరీరముతో నేను వెళ్లఁజాలకపోయినను నాయాజ్ఞ సర్వత్ర వ్యాపించును. నా తేజస్సు సర్వత్ర వ్యాపించినది. నిలువుము. నీ ప్రాణములు తీయక నేను వదలను.''

పరీక్షిన్మహారాజు పలికిన యిట్టి ఓజో తేజో పూర్ణములగు వాక్యములను విని యాఛద్మవేషధారి యగు రాజు భయపడి, అక్కడే అతివిగ్రహమువలె మెదలక నిలుచుండెను. ఆతఁడిప్పుడు గో వృషభములను గొట్టుట మానెను. నిర్దయుఁడగు నావృషలుఁడు తన పాపకార్యమునుండి నివృత్తుఁడగుటను గాంచి పరీక్షిన్మహారాజు ఒంటికాలిపై నిలుచుండిన యెద్దునుగాంచి యిట్లనెను:— ''ఓ వృషభమా! నీవు చూచుటకు చాల సుందరముగ నున్నావు. ఇట్టి యందమగు వృషభము నేనింతవఱకు చూడలేదు. దీనినిబట్టి నీవు వృషభరూపమును ధరించిన దేవతవేమోనని తోఁచుచున్నది. ఒకవేళ దేవతవు కాకపోయినను నీవు సాధారణ వృషభమవు మాత్రము కాదు. ఎద్దులకు నాలుగు కాళ్లుండును. నీకొక్కటే కాలున్నది. అయినప్పటికి ఆ ఒంటికాలిమీఁదనే దుముకుచు నడుచుచున్నావు. అందుకు నాకు దుఃఖముకూడ కలుగుచున్నది. నారాజ్యములో నిట్లు వృషభమునకు మూఁడుకాళ్లు తెగఁగొట్టఁబడుట నాకు చాల లజ్జాకరమగు విషయము.

నీవు నామాటలను బాగుగా వినుచున్నావనియు, వినుటయేకాదు ప్రత్యుత్తరమును దెలిసికొనఁ గలుగుచున్నావనియు నీ కర్ణముల ఆకృతినిబట్టి తెలిసికొనఁ గలుగుచున్నాను. కావున నీ భూమిమీఁద కురువంశీయ రాజుల శాసన మున్నంతవఱ కే ప్రాణియు దుఃఖింపరని నేను చెప్పుచున్నాను. బలవంతుఁడు నిర్బలుల నిట్లు బాధింపఁజాలఁడు. నే నీనాఁడు మొట్టమొదటగా రాజచిహ్నములు ధరించిన శూద్రునిచే నీ బోటి శ్రేష్ఠవృషభమును తాడించుటను గాంచితిని. నా రాజ్యములో గోపుత్రుఁడగు వృషభమున కింతటి దుఃఖమా! ఛీ! నే నెందులకు? అస్తు! ఓ సురభినందనా! ఇప్పుడు నీవు దుఃఖించుట మానుము. నీ దుఃఖము పోయినదని తెలిసికొనుము. నీవు బాధపడవలసినదేమియో అనుభవించితివి. ఇప్పుడిఁక నీకు భయము కలిగించినవానికి భయముకలదు. ఇప్పు డ్వాతనికి శిక్ష జరుగఁగలదు.''

ఈవిధముగ ధర్మము నాశ్వాసించుచు పరీక్షిన్మహారాజు మరల గోమాతతో నిట్లనెను:— ''అమ్మా! కపిలా! ఇప్పుడు నీవు నీ అశ్రువులను దుడిచికొనుము. ఇఁక నీదుఃఖము పోయినదని తలఁచుము. నీకు బాధకలిగించువానికి నేను యముఁడనై వచ్చితిని. నీవైపు క్రూరదృష్టితోఁ జూడఁగల సాహసమింక నెవరికిని లేదు. ఇంకను నిన్నుఁ గ్రూరదృష్టితో నెవఁడైనఁ జూచిన వాని గ్రుడ్లు తోడెదను. నిన్నుఁ గొట్టుటకొఱకు అడుగును ముందుకు పెట్టెనా వాని పాదముల రెంటిని ఖండించి వాఁడిఁక నడువలేకుండునట్లు చేయుదును. బలగర్వమున నీమీఁద నెవఁడైనఁ జేయియెత్తెనా నేను వాని బాహు

బందులు, భుజకీర్తులు కల భుజములను వాని శరీరమును౦డి వేరుచేయుదును. ఈ దుష్టుఁడు మిమ్ములను బాధించుట లేదు; నన్నవమానించుచున్నాఁడు. నాపుణ్యమును క్షీణింపఁజేయుచున్నాఁడు. ఏరాజు రాజ్యములోని దుష్టులు తమ్ముఁదాము రక్షించుకొనలేని ప్రజలను బాధింతురో, అట్టి అజాగ్రత్తగల రాజుయొక్క సమస్త కీర్తి, ఆయువు, ఐశ్వర్యము, పరలోక సంబంధమగు పుణ్యములును, ఇతర సుకృతములును నశించిపోవును. ఏలననఁగా రాజుయొక్క అసావధానముచేతనే దుష్టులు కిట్లొనర్చుటకు సాహసము కలుగును. ఏవిధముగ నైనను, ఏ ఉపాయములచే నైనను, ప్రాణపణముగఁ బ్రజలను రక్షించుటయే పరమధర్మము. నగరములోఁగాని, అరణ్యములోఁగాని యెక్కడనైనను, ఏ యనాథుని బాధింపకుండునట్లును, ఎచ్చటను దుర్బలులపై సబల ప్రహారము కావింపకుండునట్లును ఉగ్రప్రచండశాసనము చేయవలెను.

మీ కెవనివలన భయము కలిగినదో, నేను రాజునై యుండఁగా మిమ్ముల నెవఁడవమానించెనో అట్టిపాపిని నేనిప్పుడే చంపుదును. ఇఁక నిప్పుడు వీనిని యముఁడు కూడ రక్షింపఁజాలఁడు.''

సూతుఁడు ఋషులతో నిట్లనెను:_ ఋషులారా! ఈ విధముగఁ బరీక్షిత్తు వృషభరూపమును ధరించిన ధర్మమునకును, గోరూపమును ధరించిన భూదేవికిని వివిధవిధముల ధైర్యమును జెప్పెను. మధురములును, తేజోపూర్ణములగు వాక్యములను బల్కి వారిని నిర్భయముగ నుండుమనెను. అంత నాతఁ డిట్లాలోచించెను:_ ''ఈదుష్టుఁ డెవఁడు? ఈతఁడీ

గోవును గొట్టుటెందులకు? ఈయెద్దుకూడ సాధారణపుటెద్దు కాదు. దీనికి మూడుకాళ్లు లేవు. అవియు నిప్పుడె తెగఁగొట్టి నట్లుగ లేవు. ఇది ఒంటికాలిదేమో ననియుఁ దోఁచుచున్నది. ఇది పశువుగాక దేవతయని నామనస్సునకుఁ దోఁచుచున్నది. నాతో నేమో చెప్పుకొనఁదలఁచుకొన్నట్లున్నది. నేను వీరిని ఈ దుష్టుని సమాచారమడిగి తెలిసికొందును. వీని నిప్పుడే చంపుదునుగాని, వీని పరివారములో నింకెవరైన నుండిన వారి జాడకూడ తెలిసికొని వారినందఱను వధించెదను. నా రాజ్యములో నొక్క క్రూరుఁడుకూడ నుండరాదని నా యాశ యము.'' ఇట్లన్నియు నాలోచించి మహారాజు ఆ వృషభ రూపధారియగు ధర్మము నిట్లడిగెను.

రాజిట్లడిగెను:— ''సురభినందనా! నీవు నా మాటల నన్నిటిని విని, గ్రహించుచున్నావని నేను నీ యాకృతిని గాంచి యనుమానించుచున్నాను. నాకు మొట్టమొదట నీ విషయము తెలియవలయును. నీ వెవరవు? ఎద్దులు సాధారణ ముగా నాల్గుకాళ్లు కలిగియుండును. నీకు మిగిలిన మూఁడు కాళ్లెచ్చటికి పోయినవి? నీవు పుట్టుకతోడనే ఒంటికాలి దానవా లేక మధ్యలో నెవఁడైన మూఁడుకాళ్లను గొట్టి వేసినాఁడా? అదియే నిజమగుచో నే దురాత్ముఁడు నీ పాద ములను ఖండించినాఁడు? నీ వా కులకళంకుని పేరు చెప్పుము. నే నిప్పుడే వానికి పాపఫల మనుభవింపఁజేసెదను. ఇప్పుడే వానిని నరకద్వారముకడకు బంపెదను. నీ కాళ్లను దెగఁ గొట్టనిండు, తెగఁగొట్టకపోనిండు, వాఁడు రాజవంశపు కమ నీయకీర్తిని గళంకితము కావించినాఁడు. నీ వా దుష్టుని పేరు

చెప్పుము. ఈనీ కాళ్లు నేఁడు నఱికినవి కావు. ఈదుష్టుఁడిది వఱ కెన్నఁడైన నఱికినాఁడా? నీవు భయపడవలదు. ఈ ఈ దుష్టుఁడు నాసమ్ముఖమున నిన్నేమియుఁ జేయఁజాలఁడు. ఇప్పుడు వీఁడు నీవైపు చూడనైనఁ జూడలేఁడు. నా పని దుష్టుల నణఁచుటయును, పాపులను దండించుటయునై యున్నది. పరులకు దుఃఖము కలిగించు దేవతనైనను నేను భూమిమీఁద బ్రతుకనీయను. వర్ణాశ్రమాచారయుక్తులగు ప్రజలను బుత్రులవలెఁ బాలించుట రాజునకుఁ బరమధర్మము. ఘోరవిపత్తులలో ధార్మికమర్యాదలు శిథిలములగుచుండును; కాని విపత్తులు లేనప్పుడు దుర్మార్గానుసారుల దండించుట రాజునకుఁ గర్తవ్యమగుచున్నది. కావున మునుముందుగా నీ విషయమును సవిస్తరముగఁ దెలుపుము. తర్వాత నీ దుష్టుని పేరును, స్థానమును గూర్చి చెప్పుము.''

పరీక్షిన్మహారాజిట్లు పలికి మెదలకుండెను. ఆ రాజవేష ధారియగు వృషలుఁడు సమ్ముఖముననే భయభీతుఁడై నిలువఁబడియుండెను. గోమాత కన్నుల నీరుకార్చుట మానినది. కాని యింకను నామె పూర్ణముగ నిర్భయముగఁ గనఁబడుట లేదు. ఆమె లోపల ఇంకను భయముతోడనే యుండెను. వృషభము ఒంటికాలిమీఁద నిలుచుండి రాజువంక జూచుచు నాతని మాటల నన్నిటిని ధ్యానపూర్వకముగ వినుచుండెను. రాజు ప్రశ్నల నన్నిటిని వృషభము వినుచుండుటచేతను, తనకుఁ గష్టమును గలిగించిన రాజవేషధారియగు శూద్రుని యొక్కయుఁ, దనయొక్క పరిచయమును గూర్చియుఁ బ్రశ్నించుటచేతను వృషభవేషమును ధరించిన ధర్మము రాజునకు

మిక్కిలి గంభీరముగను ధర్మపూర్వకముగను ప్రత్యుత్తర మొసంగెను.

సూతుఁడిట్లనెను:— "మునులారా! పరీక్షిన్మహారాజునకును, ధర్మమునకును నడచిన అత్యంత మనోహరమును శిక్షాప్రదమునగు సంవాదమును నేను మీకు చెప్పఁబోవుచున్నాను. దానిని మీరందఱును మిక్కిలి ఏకాగ్ర చిత్తముతో వ్యగ్రతను ప్రకటింపకయే సావధానముగ శ్రవణము చేయుఁడు. దానిని వినుటచేతనే యెవరికిని కలిభయ ముండఁజాలదు."

ఛ ప్ప య.

అరే దుష్ట! తూఁ కౌఁన స్వయం బలవాన బన్యో హై।
బల హీనని కూఁ హానే, ఠహార, యహ తీర తన్యో హై॥
పుని పూఁఛే గోతనయ! దుఖిత కస తీన పైర తే।
రాజవేష మేఁ వృషల హనహి కహు కౌనబైర తే॥
జోహో కారన కష్టకో, వేగి వృషభ బతలాయి దో।
దుష్టమారి బదలో లఊఁ, సబ సచ్ సచ్ సమఝాఇదో॥

అ ర్థ ము.

"ఓరీ దుర్మార్గుఁడా! నీవెవఁడవురా? స్వయముగ బలవంతుఁడవైనావు. నీవు బలహీనులను జంపుచున్నావా! నిలువుము. ఇదిగో బాణముతోఁగొట్టెదను. మరల నిట్లడిగెను:— గోతనయా! మూఁడుకాళ్లు తెగఁగొట్టఁబడి దుఃఖముతో నున్నావేల? రాజవేషమును ధరించిన శూద్రుఁడు నిన్ను గొట్టుచున్నాఁడు. వానికి నీకు ఏమివైరము కలదు?

ఓ వృషభమా! నీకు కష్టము కలుగుటకు కారణ మేదియో నాతో వేగముగఁ జెప్పుము. దుర్మార్గునిఁ జంపి నాకసి తీర్చుకొందును. అంతయు నిజము చెప్పుము.''

—:0:—

# ధర్మ, పరీక్షిత్తుల సంవాదము

## ౭౨

శ్లో॥ ధర్మం బ్రవీషి ధర్మజ్ఞ ధర్మోఽసి వృషరూపధృక్ ।
యదధర్మకృతః స్థానం సూచకస్యాపి తద్భవేత్ ॥
—శ్రీభాగ. ౧ స్కం. ౧౭ అ. ౨౨ శ్లో.

" ఆ. ధర్మమూర్తివయ్యు ధర్మజ వృషరూప
పరమధర్మమీవు పలుకుత్రోవ
పాపకర్మ సేయు పాపంబు సూచింపఁ
బాపకర్మఁడేగు పథము వచ్చు. ''
— శ్రీమదాంధ్ర భాగవతము.

ఛప్పయ.

ధర్మ కహేఁ హే దేవ! దుఃఖదేవే కో కాకూఁ ।
హోవే కారన ఏక బతాఊఁ హాఁ తబ తాకూఁ ॥
ఈశ్వర, కర్మ, స్వభావ భిన్నముని భిన్న జనావేఁ ।
స్వయం సమర్థు లేఁ ఆప కాహి దుఃఖ బీజ బతావేఁ ॥
కహేఁ నృపతి – తుమ ధర్మహో, ధర్మ బినా అసకో కహే ।
అఘకారీ కే పాప కహి, సూచక హూ అధగతి లహే ॥

అర్థము.

ధర్మదేవుఁ డిట్లనెను:— "ఎవరి కెవరు దుఃఖమును గలిగింతురు? అసలీ సుఖదుఃఖములు కలుగు కారణములలో నొకదానిని నీకు చెప్పెదను వినుము. వివిధములగు సిద్ధాంతములను వివిధ మునులు చెప్పిరి. సుఖదుఃఖములకు కారణము ఈశ్వరుఁడు, కర్మ, స్వభావమని తెల్పిరి. కాఁబట్టి నీవే దుఃఖబీజమునకుఁ గారణమును ఆలోచించి తెలిసికొని చెప్పుము."

అంత పరీక్షిన్మహారాజిట్లనెను:— "నీవు ధర్మమవు. నీవు తప్ప యీ విధముగ నెవరు చెప్పుదురు? పాపి చేయు పాపములను నిర్దేశించునెడల పాపము లభించి అధోగతియే చెందవచ్చును."



పాపాత్ముల యొక్కయు, పుణ్యాత్ములయొక్కయు పరీక్ష దుఃఖసమయమున జరుగును. ఎల్లప్పుడు పాపమునే చేయువానికిని పూర్వజన్మ సంస్కారములచే పాపప్రవృత్తియే కలవానికిని ఏదైన విపత్తు సంభవించునెడల, వ్యర్థముగ నెందఱనో తనదుఃఖమునకు కారణముగఁ జెప్పి, దుఃఖవిముక్తుఁడగుటకుఁ బ్రయత్నము చేయుచుండును. పాపి తనదుఃఖములకుఁ గారణము తన పూర్వజన్మ పాపములని తెలిసికొనక పరులమీఁదఁబెట్టి వారిని ద్వేషించుచుండును. పొరపాటున నైనఁ బాపములవైపునకు మనస్సుపోని ధర్మాత్మునకేదైన విపత్తు సంభవింపఁజేసినయెడల, నాకష్టపెట్టిన వానిని దనకష్టములకుఁ గారణమని తలఁపఁడు. వానినడిగిన నిట్లనును:— "ఎవ్వఁడును సుఖదుఃఖములు పెట్టువాఁడులేఁడు. మానవుఁడు

తాను పూర్వజన్మమునఁ జేసిన కర్మల ననుభవించుచుండును. నేను పూర్వజన్మములో 'నీతని కపకారము చేసియుందును. అందువలననే ఈతఁడు బదులు తీర్చుకొన్నాఁడు. నాఋణ్ము మునుదీర్చి యీతఁడు నాపై గృపఁజూపినాఁడు. నేను చేసిన కర్మకు ఫలమనుభవించితిని.'' ఇట్లనుటచేఁ గొట్టువానికిని, దుఃఖపెట్టువానికిని ఈధర్మాత్ముని పాపములన్నియుఁ జెందును; కాని ఇట్లనక దుఃఖపెట్టినవానిని దూషించుచు, వాని నవమానము చేయుచు, నిందించుచు నాతని కపకారము చేయుట యందు ప్రవృత్తికలిగినవాని కాపాపములు లభించును. కావున ధర్మాత్ముని నీతియేమనఁగా నెవరిపాపములను ప్రకాశింపఁ జేయఁగూడదు. తనకువచ్చిన దుఃఖములు తాను భోగింప వలసినవని సహింపవలెను. అందఱకును వారివారికి కలుగు సుఖదుఃఖములు వారివారి ప్రారబ్ధానుసారముగ లభించునని మనస్సులో దృఢముగ నమ్మవలెను. సుఖదుఃఖములను గలిగించువాఁడు తానుగా సుఖదుఃఖములను గలిగింపలేఁడు. ఆతఁడు కేవలము నిమిత్తమాత్రము.

పరీక్షిన్మహారాజు ఒంటికాలి యెద్దురూపమును ధరించిన ధర్మముతో మాటిమాటికి తనకు దుఃఖమును గలిగించిన వానిపేరును జెప్పుమని యడుగఁగా నా ఒంటికాలితోనున్న వృషభము మనుష్యవాక్కులతో నిట్లనెను:— ''ప్రభూ! నీవు నాకభయదాన మొసంగితివి. నేను మీకు కృతజ్ఞుఁడను. లోకములో నన్నదాన, సువర్ణదాన, గోదాన, రత్నదాన, కన్యాదానాదు లన్నిటికంటె నభయదానము మిక్కిలి శ్రేష్ఠమైన దని శాస్త్రకారులు వచించియున్నారు. దీనుఁడను, దుఃఖితుఁడ

నగు నాకభయదానమొసంగుట ఆశ్చర్యకరమగు విషయము కాదు. నీవు భరతవంశములోఁ బుట్టితివి కావున నిది నీ కనురూపముగనే యున్నది. నీవు పుణ్యాత్ములును, పుణ్యశ్లోకులును, ప్రాతఃస్మరణీయులునగు పాండవులకుఁ బౌత్రుఁడవు. గుణములలో నీవు వారలకనురూపుఁడవే. దీనులను, దుఃఖితులను రక్షించుట మీ వంశములోని రాజులందఱకును ప్రధాన కర్తవ్యముగ నుండినది. నీ పితామహుఁడు బ్రాహ్మణుని గోవును రక్షించుటకై తన పెద్దయన్నతోఁ జేసిన ప్రతిజ్ఞను గూడ భంగము కావించెను. పాండవులు ద్రౌపది విషయములో నొక కట్టడి నేర్పఱచుకొనిరి. ఏ సోదరుఁడు నియమిత సమయమున నేకాంతమున ద్రౌపదితో నుండునో, అప్పుడు వారివద్ద కేసోదరుఁడైన వెళ్లినా ఆతఁడు పండ్రెండు సంవత్సరములు వనవాసము చేయవలెనని వారి నియమము. ఒక దినమున నొకానొక బ్రాహ్మణుని గోవును దస్యులు హరించుకొని పోవుచుండిరి. బ్రాహ్మణుఁడు వచ్చి అర్జునుని సహాయమును వేడుకొనెను. ఆ సమయమున నర్జునుని ధనుస్సు ధర్మరాజు ద్రౌపదు లేకాంతమునన్నచోట నుండెను. మీ తాత గోరక్షణమే ప్రధానమనుకొని నిర్భీకుఁడై యా స్థానమునకుఁ బోయి, శీఘ్రముగఁ దన ధనుస్సునుగొని బ్రాహ్మణుని ఆవును దస్యులనుండి రక్షించి, వారికి యథోచిత దండము నొసంగెను. తదనంతరము తన ప్రతిజ్ఞను సత్యమొనర్చుటకు ఆతఁడు పండ్రెండు సంవత్సరములు వనములలోఁ దిరిగెను. ఏ వంశములో దీనరక్షణమును దత్పరతతోఁ జేయఁబడుచుండునో, ఏ వంశములోనివారికి గోబ్రాహ్మణ ఆశ్రిత

రక్షణమే వ్రతముగనున్నదో అట్టి వంశమందలి చక్రవర్తి యిట్టి అభయదానమొసంగుట యేమంత అసాధారణకార్యము కాదు. మహారాజా! నీ పితామహులు తమ సదాచార సద్గుణములచే జగత్పతి యగు వాసుదేవ భగవానుఁడు వారికి సారథ్య, దౌత్య, భృత్యకార్యము లొనర్చునట్లుగా సంతుష్టుని గావించిరి. నీవు ఆ వంశపుకీర్తిని వృద్ధిపొందించు యశస్వి యగు నరపతివి. నీవు నా కష్టమును దొలఁగించి నీ వంశపరంపరాగతమగు మర్యాద ననుసరించితివి."

పరీక్షిన్మహారాజిట్లనెను:— "వృషభదేవా! నీమాటలు మధురములు. నీతో సంభాషింపవలయునని నాచిత్త మధికముగ నుత్సహించుచున్నది. కోమలమును, సంస్కృతమును, మనోహరమునైన నీవాక్యములచే నామనస్సు మిక్కిలిగ నాకర్షింపఁబడినది. నేను నీతో తర్వాత మాటలాడుదును. ముందుగా నీదుఃఖకారణమేమో నాకు చెప్పుము. నిన్నిట్లు విరూపునిఁగా నెవఁడు చేసినాఁడు? నీయెడల నన్యాయము కావించిన పాపియెవఁడు? నాకు వాని పేరు కావలయును."

వృషభమిట్లనెను:— "మహారాజా! దుఃఖ మొసంగినవాఁడు నిశ్చితుఁడైనచో నేను వానిపేరు చెప్పియుందును. కాని యీ విషయములో గొప్ప మతభేదము కలదు."

ఇది విని మహారాజత్యంతాశ్చర్యముతో నిట్లనెను:— "నీవెట్టి పలుకులు పలుకుచున్నావు? నిన్నెవఁడో కష్టపెట్టినవాఁడెవఁడో నీకు తెలియదనుట విచిత్రముగ నున్నది. ఫలాని వాఁడు కష్టపెట్టెనని నిర్దేశించుము."

వృషభరూపమగు ధర్మ మిట్లనెను:— "రాజా! నా దుఃఖమునకుఁ గారణ మెవరని చెప్పుదును? ఒక మానవుఁడు కత్తితోఁ గొట్టఁబోవుచున్నాఁ డనుకొనుఁడు. మనుష్యుఁడు, కత్తి-వీరిలో మనలను గష్టపెట్టిన దెవరని చెప్పవలెను?"

రాజిట్లనెను:— "ఆమనుష్యుఁడు కష్టపెట్టుచున్నాఁడను సంగతి ప్రత్యక్షప్రమాణమే కదా! కత్తి సాధనము. దుఃఖ పెట్టునది మనుష్యుఁడే."

వృషభ మిట్లనెను:— "అయితే దోషి మానవుని చేయియా, కొట్టినది కనుక? కొట్టుటకు చూచినది కన్ను కనుక కన్నా? కొట్టుట కాధారము బలము కనుక బలమా? లేక దేని సహాయముచే నింద్రియము లన్నియు సావధాన ముగఁ గొట్టుటయను కార్యములోఁ బ్రవృత్తములైనవో అట్టి మనస్సా? లేక దేని అధిష్ఠానముచే సమస్త కార్యములు జరుగుచున్నవో అట్టి ఆత్మయా?"

రాజు దీనిని విని కొంచెము ఆలోచనలోఁబడి, ఆలో చించుకొనినమీఁదట యిట్లనెను:— "ఇది శాస్త్రీయ విష యము. ఋషులు, మునులు, ఆప్తపురుషులు దేనినిఁ గారణ ముగఁ జెప్పిరో, అదియే దుఃఖబీజమని తెలిసికొనవలయును."

వృషభరూపమగు ధర్మ మిట్లనెను:— "రాజా! ఒక్క మునియే యుండి, యీవిషయములో నాతని మత మొక్కటియే యగుచో నేను నీకు నిశ్చితమగు ప్రత్యుత్తరము నీయఁగలుగు దును. జీవుల క్లేశబీజమును గూడ చెప్పఁగలుగుదును; కాని మును లనేకులు. ఈవిషయములో నందఱివి నన్నిమతములు,

భిన్నమతము లేని మునిని ముని యని పిలువఁబడఁడు. ఒకొక్కఁడు సుఖదుఃఖము లాత్మవలననే కలుగుననెను. ఇంకొకఁడు తనకు శత్రువుగాని మిత్రుఁడుగాని లేఁడనెను. ఆత్మకు ఆత్మయే బంధువనియు, ఆత్మకు ఆత్మయే శత్రువనియుఁ బలుకును. ఆతని దృష్టిలో నాత్మ తప్ప వేఱొకటిలేదు. కొందఱ మతము ప్రకారము జన్మకాలమున మానవుఁ డేలగ్నములోఁ బుట్టునో దాని ననుసరించి గ్రహములు వానికి సుఖదుఃఖము లొసఁగుచుండును. రవి, చంద్ర, కుజ, రాహు, గురు, శని, బుధ, కేతు, శుక్రులు శుభస్థానమందున్నప్పుడు మానవునకు సుఖము కలుగును. అశుభస్థానములలో నున్నప్పుడును, క్రూరగ్రహ దృష్టి పడినప్పుడు అవి దుఃఖము నొసంగుచుండును. కావున దైవమే సుఖదుఃఖములకుఁ గారణము.

కొందఱ నిశ్చితమత మేమనఁగా నీదుఃఖములకుఁ గారణము కర్మ యందురు. ఈజన్మలోఁగాని, పూర్వజన్మలలోఁ గాని మనము శుభకర్మలను జేసియుండినచో సుఖప్రాప్తి కలుగును. దుష్కర్మ లొనర్చినచో దుఃఖప్రాప్తి కలుగును. మనుష్యుఁడు కర్మసూత్రముచేఁ గట్టుపడియున్నాఁడు. కర్మ తప్ప ఈశ్వరుఁడు, బ్రహ్మ, పరమాత్మ మొదలగువారెవరును లేరు. కావున వారిమతమందు కర్మయే ప్రధానము.

ఇదంతయు స్వభావవశమున జరుగుచున్నదని కొందఱ మతము. దీనికి ఈశ్వరాదులు అవసరము లేదు. చలి, వేసవి, వర్షాకాలము, ప్రాతఃకాలము, మధ్యాహ్నము, సాయంకాలము, భోజనము, నిద్ర, సంతానోత్పత్తి మొదలగునవన్నియు

స్వభావానుసారముగ నెట్లుజరుగుచున్నవో, అట్లే సుఖదుఃఖములు స్వభావముచే జరుగుచుండును. జడప్రకృతి స్వయముగ నేదియుఁ జేయ సమర్థముకాదని కొందఱందురు. దీనికి నియామకుఁడీశ్వరుఁడు. ఈజగత్తంతయు నీశ్వరేచ్ఛమీఁదనే ఆధారపడియున్నది. క్లేశ, కర్మ, విపాకాశయములు లేనివాఁడొకఁడున్నాఁడు. ఆతనినే ఈశ్వరుఁడందురు. ఆతడే సుఖదుఃఖముల కధిపతి.

కొంద ఱిట్లందురు:— సుఖదుఃఖము లెవనిద్వారా కలుగునో, ఆతఁడు 'అవాఙ్మానసగోచరుఁడు.' అనగా వానిని తర్కముద్వారా కనుఁగొనఁజాలము. నాలుకతో నాతనిని వర్ణింపఁజాలము. అతఁడొకఅచింత్యశక్తి. ఆతనిని సర్వాత్మభావముతో శరణువేఁడిన నీ సుఖదుఃఖప్రవాహ మాగిపోఁగలదు. కావున నోరాజర్షి! ఈ విధముగ నీవిషయములో భిన్నభిన్న మునులకు భిన్నభిన్న మతములు. వీనిలో నీకేది యెక్కువ సత్యముగ గోచరించుచున్నదో, నీహృదయము మిగిలినవాటికంటె బాగుగ గ్రహింపఁగలదో, దానినే జీవులకుఁ గ్లేశబీజముగఁ దెలిసికొనుము. దానిమూలముననే నాకు బాధకలుగుచున్నది. జీవి స్వతః ఎవనికైన సుఖదుఃఖములను బొందింపగలడా? వానికెవరి ప్రేరణయైన నుండియుండవలెను. ఆకారణమున నాప్రేరణచే నెవనికైన సుఖదుఃఖములను గలిగించియుండవలెను. ఆ ప్రేరకుఁడెవఁడో నీవానిర్ణయమును సదసద్వివేకయుక్తమగు సూక్ష్మబుద్ధిచేఁ జేసికొనుము.''

ఇట్లని వృషభరూపమును ధరించిన ధర్మ మూరకుండెను. ఇట్టి సారయుక్తమగు గూఢవాక్కులను విని పరీక్షి

న్న దేంద్రుడు మిక్కిలి యాశ్చర్యపడెను. ఆతడు వెంటనే దీనికి ప్రత్యుత్తర మీయజాలకుండెను. ఏకాగ్రచిత్తముతో నన్నదేవుని వాక్యములనుగూర్చి విచారించుచు గొంచెము సేపు మౌనముగనుండెను.

పరీక్షిన్మహారాజు తన బుద్ధితో విచారించి రహస్యము నంతను గ్రహించెను. అంత ధర్మరూపుడగు ధర్మునితో నిట్లనెను:— "దేవా! నీవు యథార్థమగు వృషభమవు కావు. నీవు సాక్షాత్తుగ ధర్మమవు. నీవీ వృషభరూపమును మాయగ ధరించితివి."

ధర్ము డిట్లడిగెను— "ప్రభూ! నేను ధర్ముడనని నీకెట్లు తెలియును?"

రాజిట్లనెను:— "నీవు పశువయ్యు మనుష్యవాక్యములతో మాటలాడుచున్నావు. అందువలన నీవు సాధారణ వృషభమవు కావనియు, నేదో దేవతవనియు గ్రహించితిని."

ధర్ము డిట్లనెను:— "మహారాజా! ఎద్దురూపమును దేవతలు, అసురులు, రాక్షసులు, భూతప్రేత పిశాచాదులు దాల్పగలరు. అట్టియెడ నే నన్యదేవతనుగాక ధర్మము నేనని నా యే లక్షణమువలన దెలిసికొంటివి?"

రాజిట్లనెను:— "దేవతలు, యక్షులు, రాక్షసులు వీరందరు స్వార్థులు. తమ స్వార్థముకొఱకు వీరు ధర్మమును వీడవచ్చును. అసత్యము పలుకవచ్చును. ఇతరులకు గష్టము కలిగింపవచ్చును; కాని ధర్మ మెన్నడు విపరీతాచరణము చేయదు. అది యెన్నడును దనను బాధపెట్టువారిని నిందిం

పదు. పుణ్యపాపములు రెండును ప్రకటమగుటచే నశించును. నీవు పుణ్యముచేసి దాని నందఱకును జాటించుచుండిన నా పుణ్యము పరలోకములో ఫల మొసంగఁజాలదు. చెప్పుకొనుటచే నది క్షీణించును. ఇదే విధముగఁ బాప మొనర్చిన తర్వాత దాని నందఱముందు చెప్పినచో నా పాపముకూడ చాలభాగము క్షీణించిపోఁగలదు.''

ధర్ముఁ డిట్లనెను:— "కర్మఫలము జరిగితీరును. అట్టి పాపులు పుణ్యులని చెప్పఁబడువారి పాపపుణ్యము లెచ్చటికి పోవును? వాటిని భోగించువారెవరు?''

రాజిట్లనెను:— "ధర్మదేవా! నీ కన్నియుఁ దెలియును. పుణ్యములు చేయువాని పుణ్యములనుగూర్చి ప్రశంసజేయువారును, వాటిని లోకములోఁ బ్రచారము చేయువారును, మనస్సులో సంతోషించువారును పుణ్యాత్ముల పుణ్యములకు భాగస్వాములగుదురు. వాని పుణ్యములోఁ గొంతపుణ్యమును ప్రశంసించువారుగైకొందురు. ఇదేవిధముగఁ బాపులపాపముల నందఱసమ్ముఖమునఁ జెప్పువారును, వానిని నిందించువారును ఆ పాపియొక్క పాపములకు భాగస్వాములగుదురు. పాపులకే నరకము సంభవించునో వారి పాపములను ప్రకటించు నిందకులకు నా నరకమే సంభవించును. కావున సిద్ధాంతము చేయఁబడిన విషయమేమన నితరుల పాప పుణ్యములు నోటితోఁ జెప్పుకొనుటయే కాదు; మనస్సులోనైనఁ జింతింపరాదు. ఒకవేళ నుండలేక స్వభావవశమున నెవని విషయమున నైనఁ జెప్పుకొనకుండఁజాలకున్న, నితరుల పుణ్యములనే చెప్పుకొనవలయును. పుణ్యాత్ముల ప్రశంసనే చేయుచుం

డుము. పాపుల విషయము మనస్సులోనికైనఁ దెచ్చుకొన రాదు. ఒకవేళ మనస్సులోనికి వచ్చిన నితరులకుఁ జెప్పరాదు.

ఇఁక నిప్పుడు జీవుల క్లేశబీజముల విషయమున్నది. దానిని గూర్చియు నేను విచారించితిని. నీవు ఆత్మ, దైవ, కర్మ, స్వభావ, ఈశ్వరాదులు సుఖదుఃఖములకుఁ గారణము లని చెప్పి చివరకొక అచింత్యశక్తియుఁ గారణమంటివి. నా బుద్ధిలో నీవిషయమై పరీక్ష చేయుచున్నాను. పరమేశ్వరుని మాయయొక్క గతి ప్రాణుల మనోవాక్కుల కందనిదని నేను బాగుగా నాలోచించుకొనియే నిర్ణయించుకొంటిని.''

మహారాజు వాక్యములను విని ధర్ముఁడు మిక్కిలి ప్రసన్నుఁడై యిట్లనెను:— ''రాజా! నీవు సత్యమునే పలికితివి. నేను ధర్మమును. అనిర్వచనీయమగు మాయ కతీతమగు తత్త్వమే దుఃఖమునకుఁ గారణమను విషయము నాకు సమ్మతమే. నాయీ మూఁడు పాదముల నెవఁడు నఱకినాఁడో నీవిప్పుడు చెప్పుము.''

పరీక్షిన్మహారా జిట్లనెను.— ''ధర్మదేవా! నేనిప్పుడంతయు గ్రహించితిని. నీకు తప, శౌచ, దయా, సత్యములు నాలుగు నాలుగుపాదములు. కృతయుగములో నీకీ నాలుగు పాదములు స్వస్థములుగ నుండినవి. అందువలన నప్పుడు నీవు సర్వాంగరూపముచే స్వస్థముతోడను, సుఖముగను పృథివి యందు విరాజిల్లితివి. అచింత్యశక్తి ప్రభావముచేఁ గాలకర్మాను సారముగఁ గృతయుగము పోయి, త్రేతాయుగము ప్రారంభమైనప్పుడు, నీకు తపమను పాదము పోయినది. అప్పుడు ధర్మ

మునకు మూఁడుపాదములే కలవు. అందువలన నాయుగము నకుఁ త్రేతాయుగమను పేరు వచ్చినది. త్రేతాయుగమంతమై పోఁగానే నీకు రెండవ పాదమగు శౌచ (పవిత్రత) మను పాదము నశించిపోవుటచే నీకు రెండుకాళ్లే మిగిలెను. కావున త్రేతానంతరమున వచ్చిన కాలమునకు ద్వాపరమందురు. ద్వాపరయుగము పూర్తికాఁగానే అధర్మపరివారములగు గర్వము, ఆసక్తి, మదము మొదలగువాటి ప్రభావము వ్యాపించుటచే, దయయను నీ మూఁడవపాదముకూడ నశించి పోయెను. కలియుగములోని వారందఱు దయాహీను లగు దురు. కలియుగములో నీవు కేవలము సత్యమను వక్క కాలి మీఁద నిలువఁబడెదవు. చివరకదికూడ విఱిగిపోఁగానే నీవు పాదవిహీనుఁడ వగుదువు. అప్పుడు భగవంతుఁడు నీమీఁద దయఁదలచి యవతరించి నీకు యథాప్రకారముగ నాలుగు కాళ్లుండునట్లు చేయును. కావున ఘోరకలియుగము తర్వాత శుద్ధమగు కృతయుగము రాఁగలదు.

మరల నిట్లనెను :— ధర్మరాజా ! నీవు స్వాయ ముగఁ జెప్పుటకు భయపడి, నా చేతఁ జెప్పింపఁదలఁచు చున్నావు. స్వయముగఁ బాపినిగూర్చి చెప్పక నన్నడుగు చున్నావు. అగుఁగాక ! నీ వడుగుచున్నావు కావునఁ జెప్పు చున్నాను. ఈతఁ డధర్మమిత్రుఁడగు కలి. వీఁ డసత్యముచే నింతలావుగా పుష్టిగా బలిసియున్నాఁడు. కలియుగములో నసత్యములేక యింతలావు కాఁజాలఁడు. ఈతఁడు సత్యరూప మగు నీ యా పాదమునుగూడ నాశము చేయఁగలఁడు. చివర

కంతపని చేసితీరును. ఆ యచింత్యశక్తియగు సర్వేశ్వరుఁ డేది చేయఁదలఁచునో, చేయింపఁ దలఁచునో దాని నవశ్యము చేసి తీరును, చేయించి తీరును. దాని నెవఁడును బ్రయత్నించి అన్యథా చేయఁజాలడు."

ధర్ముఁడిట్లనెను:— "మహారాజా! అసలు విషయమిది. కావున నేను మెదలకుంటిని. దినములన్నియు నొక్కరీతిగ నుండవు. ఇవి వానిరోజులు. వీనివలన నేను పీడింపఁబడు చున్నాను. మరల నెప్పటికైన నా రోజులును రాఁగలవు. దుఃఖమును ధైర్యముతో దాఁటవలయును. అధైర్యముచే దుఃఖము పోకుండుటయేగాక ఇంక నభివృద్ధి చెందును. ఇప్పుడీ గోవు ఎవరో చెప్పఁగలవా?"

పరీక్షిన్మహారాజిట్లనెను:— "ఈమెను నే నెఱుఁగుదును. ఈమె శ్యామసుందరుని ప్రేయసియగు భగవతీ భూదేవి. వాసుదేవ భగవానుఁడు దుష్టరాజుల నందఱను జంపి వృద్ధిపొందుచున్న యీమె భారముడిగించెను. ఈమె శ్రీయంగముల మీఁద శ్రీ బృందావనవిహారియొక్క పాదపద్మములు పడినప్పుడును, ఆతని వజ్రాంకుశాది చిహ్నములచే నీమె చిహ్నితమైనప్పుడు ఈమె అపూర్వమగు శోభ చెందెడిది. ఈమె తన సౌభాగ్యమునకు గర్వించెడిది. నేఁడీమె సుకోమలములును, పరమశోభాయుక్తములునగు అరుణచరణములను బాసి దిక్కులేనిదైనది. నేఁడీమె దుఃఖితయై కంటనీరుపెట్టు చున్నది. ధర్మము నశించిన సదాచారులగు రాజులు తనను విడిపోదురని యిప్పుడీమె దుఃఖించుచున్నది. తనమీఁద దస్యు

ధర్మము కలవారును, రాజవేషమును ధరించి బ్రాహ్మణ ద్రోహులై, గోఘాతకులై, పాపులై, అధర్ములై, క్రూరులై రాజ్యము చేయుదురని దుఃఖించుచున్నది.''

ధర్ముఁడిట్లనెను:— ''రాజా! నీవు ధర్మాత్ముఁడవు. పాండవపౌత్రుఁడవు. గర్భములో నుండఁగానే వాసుదేవుని అహైతుకకృపను బొందితివి. నీవు నీ యోగబలముచే సమస్తము నెఱుఁగ సమర్థుఁడవగుదువు. నీవు మమ్ము ముగ్గురను యథార్థముగ గుర్తించితివి. ఇప్పుడు నీ కెట్లుచితమని తోఁచిన నట్లు చేయుము.''

ధర్ముని యీ వచనములను విని పరీక్షిన్మహారాజు ధర్ముని, ధరణిని ఓదార్చుచు నిట్లనెను:— ''మీరిద్దరు కొంచె మైన భయపడకుఁడు. నేనుండఁగా మిమ్మెవరేమియుఁ జేయఁ జాలరు. మీరు సమస్త ప్రాణులనుండి నిర్భయులై యుండ వలయును. నేనిప్పుడు మీయీ శత్రువగు కలియుగమును తీక్ష్ణమగు ఖడ్గముచేఁ జంపుదును. నేఁడు నేను వీని శిరస్సును ద్రుంచి మీయిద్దరను, సాధుపురుషులను సుఖపెట్టెదను. లోకములోఁ గలిని లేకుండఁ జేసెదను. కలియే లేకున్న నధర్మ ప్రచార మెట్లగును? అధర్మ ముండదు. ఎవ్వనికిని దుఃఖ ముండదు. కావున నిప్పుడు వీనిని జంపుట ఉచితము కాఁగలదు.''

ఇట్లని మహారాజా రాజవేషధారియగు శూద్రుని జంపుటకు నిశ్చయించెను.

ఛప్పయ.

హరికీ మాయా అమిత న పహుఁచే మన అరు బానీ।
శౌచ, దయా, తప, పాద బినా తుమ రే మన గ్లానీ॥
గౌరూపీ యేధరని పద్మ పద ప్రభు కే సోచతి।
చరణ చిహ్నా తే రహిత దుఖిత హ్వై అశ్రు విమోచతి॥
ధరహు ధీర ధరణీ! ధరమ! క్షత్రియ హౌఁ శర ధను ధరూఁ॥
నృప లాంఛన కలి క్రూర కో, సిర ధడ తేఁ న్యారో కరూఁ॥

అర్థము

హరి మాయ యనంతమైనది. మనోవాక్కుల కది అందదు. నీవు శౌచ, దయా, తపము లను పాదములను బోఁగొట్టుకొనిన ధర్మమవు. గోరూపమును ధరించిన యీ ధరణి ప్రభు పాదపద్మములోని వజ్రాంకుశాది చిహ్నములు లేక చాల దుఃఖించుచున్నది. కంట నీరుఁ గార్చుచున్నది.

ఓ ధరణీ! ధైర్యమును జెందుము. ఓ ధర్మమా! చింతింపవలదు. నేను నాచేతిలో శరచాపములను ధరించిన క్షత్రియుఁడను. నృపరూపమును ధరించిన యీ కలి శిరస్సును ఖండించెదను.



# పరీక్షిత్తు కలి కభయము మొసంగుట

## ౨౩

శ్లో॥ న వర్తితవ్యం తదధర్మ బంధో
ధర్మేణ సత్యేన చ వర్తితవ్యే।
బహ్మావర్తే యత్ర యజంతి యజ్ఞై
ర్యజ్ఞేశ్వరం యజ్ఞవితాన విజ్ఞాః॥
— శ్రీభాగ. ౧ స్క. ౧౭ అ. 33 శ్లో.

"వ. నీవు పాపబంధుండవు. మదీయ బాహుపాలితంబైన మహీమండలంబున నిలువవలవదు. రాజదేహంబునందు వర్తించు నిన్ను నసత్య లోభ చౌర్య దౌర్జన్య దురాచార మాయ కలహ కపట కలుషా లక్ష్మ్యాద ధర్మేతర సమూహంబు లాశ్రయించు సత్య ధర్మములకు నివాసంబగు బ్రహ్మావర్త దేశంబున యజ్ఞవిస్తార నిపుణులైనవారు యజ్ఞేశ్వరుండైన హరింగూర్చి యాగంబు సేయుచున్నవారు. వారలకు సుఖప్రదానంబు సేయుచు సకల భూతాంతర్యామియై భగవంతుండైన హరి జంగమస్థావరంబులకు నంతరంగ బహిరంగంబుల సంచరించు వాయువు చందంబున నాత్మరూపంబున మనోరథంబులనిచ్చుం గావున నీవిందుండ వలవదు."
— శ్రీమదాంధ్ర భాగవతము.

ఛప్పయ.

మోఁ కహిఁ కేఁ భూపాల తీక్ష్ణ తరవారి వికారీ।
జ్యోఁ ఆగే కూఁ బఢే తురత కలి యుక్తి విచారీ॥

పాపీ పైరని పర్యో కృపా కీ భిక్షా మాంగీ।
ధరీ మ్యాన మేఁ ఖడ్గ దయా దుఖియా లఖి లాగీ॥
కహైఁ క్రూర! యహ కా కరై, కాహే మమ పగ సిర ధరై।
అసి కురువంశీ వీర కీ, నహీఁ శరణాగత పై పరై॥

అర్థము.

ఇట్లని భూపాలుఁడు తీక్ష్ణ ఖడ్గమును లాగి కలిని జంప ముందుకుఁ బోవుచుండఁ గలి వెంటనే యొకయుక్తిని విచారించి, ఆతని పాదములమీఁదఁబడి కృపాభిక్షనడిగెను. అతఁడు దుఃఖితులయెడల దయగలవాఁడు కావున ఖడ్గమును మరల వరలోఁ బెట్టుకొని దయచూపెను.

అప్పుడా పృథివీపతి యిట్లనెను:— "ఓరీ! క్రూరా! ఇదేమిసేఁతరా? నా పాదములమీఁదఁ బడెదవు? కురువంశ వీరులకత్తి శరణాగతులపైఁ బడదు కావున నీవు బ్రతికి పోయితివి."



సత్పాత్రయందు దయఁజూపిన దానికి శుభఫలము కలుగును. కుపాత్రయందు చూపినదయ చివరకు దుఃఖదాయినియే కాఁగలదు. పామునెడల దయఁజూపి పాలనుబెంచిన దానికి విషము వృద్ధిపొందఁగలదు. తేలు నీళ్లఁ దేలుటనుగాంచి బయటవేయఁబోయిన తెగకుట్టి వదలిపెట్టును. మదపుటేనుఁగు గాయములను సవరించిన నది తొండముతోఁ గొట్టితీరును. ఎలుకపై నెనరుకలిగి అన్నము పెట్టిన నది కఱచితీరును. దుష్టులయెడల దయఁజూపి ఆశ్రయ మొసంగిన వాఁడు దుర్మా

ర్గము చేయక మానఁడు. ఏలననఁగా వీరందఱు వారివారి స్వభావమునకు వశులైయున్నారు. ఉపకారము చేసినవానికి గూడ క్రూరుఁడగువాఁడు అపకారము చేయుటకు వశుఁడు కాఁగా, అట్లే ధర్మాత్ముఁడగు దయావంతుఁడు కూడ దయ కలిగియుండుటకు వివశుఁడై తీరును. క్రూరుడెంత గొప్ప యప రాధమును జేసినప్పటికి, వాఁడు దీనభావముతో దయావం తుని శరణు వేఁడినచో నాతఁడు అభయదాన మొసంగి తీరును. ఇఁక నాతనిని గొట్టఁడు.

ఇట్టిదుష్టులు సమయముచిక్కినప్పు డనేకదుష్కార్యము లను మరల చేయుచుందురనువిషయమున ననేకములగు నుదా హరణములు కలవు. ఇది తెలిసియు ధర్మాత్ము లిట్లందురు:— "వాఁడు వాని క్రూరత్వమును విడువలేక మరల వివశుఁడై అట్లే చేయవలసివచ్చుచుండ, మనము మన ధర్మము నెట్లు వదలఁగలము ? ఎవఁడు చేసినది వాఁడనుభవించును. వాఁడు చేసినది వానికి, మనము చేసినది మనకు."

దుష్టుఁడు నిర్బలులపై తన బలపౌరుషమును జూపును. వారిముందు తన ప్రభావమును జూపించును. కాని తనకంటె బలవంతుఁడు వచ్చెనా వాని సమ్ముఖమున దీనుఁడై పోవును. ఆసమయమున వానికి గల దీనత భక్తులకువలె యథార్థమగు దీనత్వము కాదు. అది వానికొక నీతి. స్వార్థసాధన కది ఒక కళ. తాఁబేలువంటి సమాధి. బకధ్యానమువంటి ధ్యానము. అప్పుడు వాని వాక్యములలో గల మాధుర్యము స్నేహ మాధుర్యము కాదు. వ్యాపారి మాటలాడునపుడు చూపు మాధుర్యమువలె — స్వార్థ కార్యసిద్ధికొఱకు మిథ్యా మాధు

ర్యము. స్వార్థసిద్ధియైన తర్వాత నయ్యగారు యథాప్రకార
ముగ మాటలాడి మరలఁ దన వైభవమును జూపును.

పరీక్షిన్మహారాజు ధరణిని, ధర్మముల నోదార్చిన
తర్వాత వారు కొంచెముగఁ బ్రసన్నులైరి. అంతఁ జక్రవర్తియు
వీరశిరోమణియు నగు పరీక్షిన్మహారాజు రాజవేషధారియు
దుష్టుఁడు నగు కలివైపునకుఁ బోయెను. ఆతనికా సమయ
మున వానిపై మిక్కిలి కోపము వచ్చెను. వానిని జంపఁదలఁ
చుటచే వానితో నేమియుఁ బలుకకయే తన తీక్ష్ణ కరవాల
మును దీసి చంపుట కుద్యుక్తుఁడయ్యెను. ధర్మాత్ముఁడగు
రాజు తన్నుఁ జంప నుద్యుక్తుఁడయ్యెననియు, నాతనిముందు
తన వీరత్వము సాగదనియు, నాతని ధర్మయుద్ధములోఁ బరా
జయము నొందింప నసాధ్యమనియుఁ దెలిసికొని కలి యొక
క్రొత్త పన్నాగమును బన్నెను. వెంటనే యాతఁడు తన
బహుమూల్య వస్త్రాభరణములను, గిరీటము మొదలగు రాజ్యా
చిహ్నములను దీసిపాఱవైచెను. నోట గడ్డికఱచి, వస్త్రముచేఁ
దన రెండుచేతులను గట్టుకొని, శీఘ్రముగ నమహారాజు పాద
ముల మీఁదఁబడి దీనతతో నిట్లనెను:— "ధర్మాత్ముఁడవగు
నోరాజా! నేను నిన్ను శరణు వేఁడితిని. నన్ను రక్షింపుము.
నాకు ప్రాణభిక్ష పెట్టుము."

అప్పుడు పరీక్షిన్మహారాజు అసమంజసములోఁ బడెను.
ధరణీ ధర్మములతో నాతఁడు జరిపిన దుర్వ్యవహారమును
గాంచిన నాతనికి మిక్కిలి కోపము వచ్చెను; కాని వాఁడు
తన్ను శరణు వేఁడునప్పటికి తానేమి చేయుటకును దోఁచక
నిలుచుండెను. దీనుఁడై దయాభిక్షను గోరువానిని ధర్మము

నెఱింగిన నేనెట్లు చంపుదును? ఒకవేళ వీనిని జంపకుంటినా మరల నారాజ్యములోఁ బ్రవేశించి యిట్టి అధర్మమునే చేయు నేమో? కావున వీఁడు తన దుష్టకార్యముల నిఁక జరుప కుండునట్లును, శరణాగతపాలనము చేసి వీనిని వధింపకుండు నట్లును జూడవలయును. ఇట్లు యోచించి, తన ఖడ్గమును వఱలోఁ బెట్టి మహారాజు వానితో నిట్లనియెను.

ఆసమయమున మహారాజు క్రోధముద్రను విడిచెను. కలి పాదముల మీఁదఁబడుటను గాంచి యాతఁడు నవ్వుచు నిట్లనెను:— "ఓరీ వృషలా! ఇప్పుడింకను నీవేల వణఁకెదవు? నీవు భరతవంశవీరుని శరణువేఁడిన నింక నీకేల భయము? నేను ధర్మాత్ముఁడగు నభిమన్యుని పుత్రుఁడను. శరణాగత పాలనమందు తత్పరుఁడగు గాండీవ ధనుర్ధారి యర్జునునకుఁ బౌత్రుఁడను. సమస్త శస్త్రాస్త్రములతో శరణు పొందిన వారును, భయభీతులును, పాదములమీఁదఁ బడినవారును, దయాభిక్ష నడుగువారును, వీరందఱు సమ్ముఖమున కుంఠితు లగువారు మావారు. ఇఁక నీవు ప్రాణభయము జెందరాదు. కాని నీవు నాయాజ్ఞను పాలింపవలయును."

కలి గడగడ వణఁకుచు నిట్లడిగెను:— "రాజా! మీ రాజ్ఞాపింపుఁడు. నాకేమి యాదేశము? నేను మీకు శరణా గతుఁడ నయితిని గావున మీ యాజ్ఞల నన్నిటిని నేను అక్షరశః పాలించెదను."

మహారాజు తన కాళ్ల మీఁదఁబడిన కలిని లేవఁదీసెను. ఆతఁడు తలవంచుకొని భయభీతునివలె మహారాజు సమ్ముఖ

వాఁడు చేతులు జోడించుకొని నిలుచుండెను. ఆ భయపడు చున్న దుష్టుని గాంచి మహారాజిట్లనెను:— "ఓరీ! నేను నీ ప్రాణములను దీయను. కాని నీవు నారాజ్యములో మాత్ర ముండరాదు."

కలి దీనముగ నిట్లనెను:- "ఏలప్రభూ! నీవు దీనప్రతి పాలకుఁడవు. ప్రజలందఱు నీఛత్రఛాయయందుండి నిర్భయు లైరి. నన్ను మీరాజ్యమునుండి నిషేధించెదరేల?"

మహారాజిట్లనెను:— "నేనసమరుఁడనై నిన్నుఁ బంపి వేయుటలేదు; కాని నేను నీస్వభావము నెఱుఁగుదును. నీవు అధర్మమునకు నిధివి. అధర్మమునకును ధర్మమునకును వైరము. నారాజ్యములో సర్వత్ర ధర్మప్రచారమే కలదు. మీరిద్దరును గలిసి ధర్మము నణఁపఁ బ్రయత్నించెదరు. మీ ఇద్దరకును సంఘర్షణము జరుగఁ గలదు. కావున నీవు నారాజ్యమునుండి వెడలిపొమ్ము."

కలి యిట్లనెను:— "కాదు మహారాజా! నేనెవరిని ద్వేషింపను. మెదలక ఒకవైపునఁ బడియుండెదను."

కలి వాక్యములను విని వానిని కసరుచు మహారా జిట్లనియె:— "మెదలక యెట్లుండెదవు? నీవింక మెదలకుండుట అసంభవము. ఇంటిలో నిద్దరుండుటచే నెలుకను బిల్లి పట్టుకొొనదనుట వట్టిమాట. నీవు ఉండినచో అందఱపై నీయాధిపత్య మును సాగించెదవు. సాధారణ ప్రజలు నిర్బలులై యుందురు. నాకు భయమంతయు రాజుల విషయములోనే. నీవు రాజు లలోఁ బ్రవేశించితివా, మెల్లమెల్లగా నీప్రభావము సర్వత్ర

వ్యాపింపఁగలదు. ఏలననఁగా 'యథా రాజా తథా ప్రజాః' రాజెట్లో ప్రజలట్టివారుగనే యుందురు."

కలి యిట్లనెను:— "మహారాజా! ఇంత పరాక్రమము గల రాజులెక్కడ? నేనొక్కఁడ నెక్కడ? నేను వారి నేమి చెఱుపఁగలుగుదును?"

పరీక్షిత్తు నవ్వుచు నిట్లనెను:— "ఓరీ! నీసంగతి యంతయు నాకుఁ దెలియును. నీవొక్కఁడవు కాదు. నీపొట్టలో బోలెడంత సేనయున్నది. నీవు వచ్చినచోటకు నీతోఁగూడ లోభ, అసత్య, చోరీ, అనార్యత, స్వధర్మత్యాగము, లక్ష్మికి అక్కయగు దరిద్రత, కపట, కలహ, దంభాదులు ఇవన్నియు బయలుదేరి వచ్చుచుండును. వీనిలో నొక్కొక్కదాని పొట్టలో వేలు లక్షలు సంతానము పుట్టుచుండును. నిన్నొక్కని రానీయకున్నచో నివి యన్నియు లేకపోవును."

అంతఁ గలి యిట్లు పలికెను:— "అయితే, మహారాజా! నే నెక్కడుందును? నాకుఁ గూడ ఆశ్రయమ్ము దొరకవలయును గదా!"

మహారా జిట్లనెను:— "ఇదివఱ కెక్కడ నున్నావో అక్కడే ఉండుము. నాయీ పరమ పుణ్యప్రదేశము గంగా యమునల మధ్యభూమి. దీనినే బ్రహ్మావర్త మందురు. ఇది మహాత్ములుండు ప్రదేశము. అచ్చట పొరపాటుననైనఁ గాలిడకుము. ఏలననఁగా ధర్మవేత్తలగు ఋషులు, మహాత్ములందఱు నీ దేవవందిత పరమపావన ప్రదేశమున నివసించుచుందురు."

ఇది వినఁగానే కలిముఖము వాడిపోయెను. ఆతఁడు దీనముతో భూమివైపునకుఁ జూచుచుండెను.

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను:— "మహాభాగా! సూతా! పరీక్షిన్మహారాజు కలిని ఈ బ్రహ్మావర్తదేశమునుండి వెళ్లిపోవలసినదని యేల చెప్పెను? కలి మొట్టమొదటగా నీ పరమపావన ప్రదేశమందేల ప్రవేశించెను? కలికి యీప్రదేశములోనుండవలెనను పట్టుదల యేల? ఈ ప్రదేశములోఁగల విశేషత యేమి? ఈవిషయమునుగూర్చి మాకు విస్తారముగఁ జెప్పుఁడు. ముందుగా మాయీ శంకకు సమాధాన మొసంగి తర్వాత నీవు చెప్పఁదలఁచిన కథను జెప్పుము."

శౌనకుఁ డిట్లు ప్రశ్నింపఁగా సూతుఁడు మిక్కిలి ప్రసన్నుఁడై, శౌనకుని బ్రశంసించుచు నిట్లనెను:— "శౌనకనందనా! మునిశ్రేష్ఠా! నీయీ ప్రశ్న చాల శ్రేష్ఠమైనది. నేను దీనికిఁ బ్రత్యుత్తర మిచ్చెదను. మునులగు మీరందఱును సావధానముగ శ్రవణము చేయుఁడు.

మునులారా! గంగాయమునల తీరప్రదేశములు పరమపావనములుగ నెన్నఁబడుచున్నవి. ముఖ్యముగ గంగా యమునల మధ్యప్రదేశము మిక్కిలి పుణ్యప్రదమైనది. అనంత పుణ్యము నొసంగినభూమి యీభూమిలో లేదు. కురుక్షేత్రము, హరిద్వారము మొదలుకొని, కాశీ ప్రయాగల వఱకుఁ గల భూమి మహర్షిప్రదేశము, బ్రహ్మావర్తము, పావనప్రదేశము లేక యజ్ఞభూమి యందురు. ప్రపంచములో దీనికి మించిన పవిత్రభూమి లేదు. సమస్తములైన ఋషులు, మహర్షులు,

అవతారములు, మహాపురుషులు ఈ పవిత్రభూమి నాశ్రయిం చిరి. ఇది ధర్మార్జనమునకు విశిష్టస్థానమని పెద్దలు వచించిరి. గంగా యమునల రెండుతటములు పరమపావనము లైనవి. ఈ రెండు నదుల మధ్యభూమి సర్వత్ర పవిత్రమైనది. గంగకు తూర్పునను, యమునకుఁ బశ్చిమమునను ఒక యోజనము వఱకుఁగల భూమికూడ అట్లే పవిత్రమైనది. ఈభూమి యంత టను యజ్ఞయాగాదులను జేయుటచే నక్షయపుణ్యము లభింపఁ గలదు. కొంతభూమి పురములుండుటచేతను, గొంతభూమి ధామములుండుటచేతను పావనమైనది. సప్త మోక్షదాయ కములగు పురములు పరమపావనములు. ఉత్కలదేశములో జగన్నాథపురి పావనమైనది. మగధవంటి కీకట దేశములో గయాపురి పరమపావనమైనది. కొన్నిప్రదేశములు నదుల వలనఁ బరమపావనములగుచున్నవి. దక్షిణమున ననార్య నివాసమగు ప్రదేశములో చంద్రవంశ, తామ్రపర్ణి, అవటోద, కృతమాల, కావేరి, వైణీ, తుంగభద్ర, కృష్ణ, భీమరథీ, గోదావరి, నర్మదాది అమృతోపమ జలసంయుతములగు నదు లుండుటచేఁ బవిత్రములుగ నెన్నఁబడుచున్నవి. ఈ నదీతీరము లందుండి, వాని జలములను పానముఁజేసిన సాధారణముగ భక్తులగుదురు. కావున నీపవిత్ర మహానదుల జలము త్రాగు టకు వీలగుటచే నొక క్రోశమాత్రము ఈనదులనుండి పవిత్ర మైనది. అయినప్పటికి ఈప్రదేశములు బ్రహ్మావర్తమంత పవిత్రములుగ నెన్నఁబడుటలేదు. మగధవంటి దేశముగోని నదులుకూడ పవిత్రములే. ఇతరప్రదేశములలోని పావనత్వము నిమిత్తకృతములు. కాని బ్రహ్మావర్త దేశము సర్వత్ర స్వాయ

ముం॥ బరమపుణ్యప్రదమగు భూమిగ నెన్నఁబడుచున్నది భారతవర్షాంతర్గతమగు సముద్రములలోఁగల ద్వీపోపద్వీపములలో శ్వేతజాతులగు స్త్రీపురుషులు నివసించుచున్నప్పటికిని వర్ణాశ్రమధర్మములు లేకపోయినప్పటికిని కర్మభూమియే. అది వర్ణాశ్రమ ధర్మవిరహితులును ననార్యులునగు దస్యులకు నివాసస్థానము. వర్ణాశ్రమాచారపరు లచ్చట నివసించినను వారు ఆ దస్యులతోడనే పరిగణింపఁబడుచుందురు. అనేకులగు క్షత్రియ రాజులును, తురుష్కులును, ఆభీరులును, కిరాతులును, హూణాదులును అనార్యులజయించి యిచ్చట పరిపాలనఁ జేయుచున్నప్పటికిని, వారినుండికూడ ద్విజులు ఋషుల నేరిరి. ఆర్యులు, అనార్యులు, వర్ణాశ్రములు, అవర్ణాశ్రములు ఎప్పుడు నున్నారు, ఎప్పుడు నుండఁగలరు. వర్ణాశ్రములగు నార్యులీ యార్యావర్తమునే సర్వశ్రేష్ఠముగ నెన్నిరి. ఈ దేశములోఁబుట్టిన బ్రాహ్మణుల వలన నానావిధములగు విద్యల నేర్చుకొనఁబడి సర్వత్ర ప్రచారము లగుచున్నవి. ఈ దేశములోని సదాచారమే సర్వత్ర శ్రేష్ఠముగ నెన్నఁబడినది.''

అంత శౌనకుఁ డిట్లడిగెను:— ''కాశిలో యమున లేదుకదా, నీవు దాని నే ప్రదేశములోఁ గలుపుదువు? ఏల?''

అప్పుడు సూతుఁ డిట్లనెను:— ''మహాభాగా! కాశీ ప్రయాగలు రెండు నొక్కటియే. అదియునుగాక కాశీ సప్త మోక్షదాయక పురములలోఁ జేరినది. భూతనాథుని క్రీడాస్థలము. ఆతని త్రిశూలమున నిలిచి యున్నది. విముక్తి క్షేత్రము. దానిని ప్రయాగకు అన్యమని తలఁపరాదు. భేద

మేమనఁ ప్రయాగ పురుషక్షేత్రము, కాశీ స్త్రీక్షేత్రము. ప్రయాగ మగది, కాశీ ఆఁడుది. ప్రయాగ పెండ్లికొడుకు, కాశీ పెండ్లి కూఁతురు. ప్రయాగ మహారాజు, కాశీ మహారాణి. స్త్రీ పురుషులకు భేదమేమియు నుండఁజాలదు. కావునఁ గాశీ ప్రయాగ లా బ్రహ్మావర్తదేశములోఁ జేరినవియే.

మీా ప్రశ్న యింకొకటి యున్నది. అది ' ఈ ప్రదేశ మింత పవిత్రముగ నేల నెన్నఁబడుచున్న' దని? ఇచ్చట శబ్దమే ప్రమాణము. సదా శాస్త్రకారులు దీనినే అంగీకరించుచు వచ్చిరి. ప్రజాపతియంగములనుగూర్చి చెప్పినప్పుడు ప్రయాగ ఆతని యుపస్థేంద్రియముగఁ జెప్పఁబడినది. భూమి స్త్రీఁగా వర్ణింపఁబడినప్పుడు ప్రయాగ ఆమెకు జఘనముగఁ జెప్పఁబడినది. స్త్రీ పురుషుల కీ యంగములే వారికి ప్రధానచిహ్నములను దెలుపునవై యున్నవి. ఈ యంగముల నుండియే సృష్ట్యుత్పత్తి కలుగుచున్నది. కావున నిది సర్వశ్రేష్ఠములుగఁ జెప్పఁ బడినవి. వ్యాసభగవానుఁడు మాథుర ప్రదేశము మొదలుకొని దానికి ముందునున్న గంగాస్రవంతికి రెండు వైపులనున్న పాంచాలప్రదేశమింకను శ్రేష్ఠముగ నెన్నఁబడినది. పాంచాలము రెండు భాగములు. ఉత్తరపాంచాలమునకు రాజధానియగు అహిచ్ఛత్రపురము గంగకు సమీాపమున నున్నది. పూర్వపాంచాలమునకు రాజధానియగు కాంపిల్యము (కానూప్రు) బ్రహ్మావర్తమునకు సమీాపమున నున్నది. ఋషులయొక్కయు, మునులయొక్కయు నివాస మిచ్చటనే యెక్కువ. ఈ ప్రదేశములోనే రాజసూయ, అశ్వమేధాది

యజ్ఞములు చాల అధికముగ జరిగినవి. మునులారా! ఇప్పుడు మీరు మహాయజ్ఞమును జేయుచు, నావలన నీ శ్రవణము చేయు గోమతీతీర ప్రదేశమగు నైమిశారణ్యము పరమపావనమైనది.

ఇట్టి ఈ ప్రదేశమున మొట్టమొదటగాఁ గలి యేల ప్రవేశించెనని మీరు ప్రశ్నించితిరి. ఈ ప్రదేశమున తన అధికారమును స్థాపించుటకేల కలి యత్యధికముగ నువ్విళ్లూరుచుండెనో, ఆ కారణమునుగూడ చెప్పెదను వినుఁడు. మీరందఱు దీనిని సావధానముగ శ్రవణము చేయవలయును. ఫలవృక్షముకడకే అందఱు నాశతోఁ బోవుదురు. ధనవంతుని దగ్గఱకే అందఱు ధనమునకై చేరుచుందురు. శ్రమచెందిన వారు విశ్రాంతికై ఛాయావృక్షమునే ఆశ్రయింతురు. దప్పికచే బాధపడువారు జలాశయము వద్దకే వెళ్లుచుందురు. తనకులేక నాఁకలిచే నలమటించువాఁడితరుల కేమి పెట్టఁగలఁడు? కుశలుఁడగు వ్యాపారి కొనువారే వస్తువును గావలెనని యడుగనో ఆ వస్తువును జేర్చుట కాతఁడంగీకరింపఁడు. నేలఁబండినవానికి పతనభయము లేదు. భూమికంటె నెత్తునఁ బండినవాఁడే క్రిందపడఁగలఁడు. ప్రపంచములో నే వస్తువునకు నత్యంతాభావ ముండదు. అన్నియు నుండును. అయితే ఒక్కొక్కప్పు డొకదానికి వృద్ధియు, నింకొకదానికి క్షీణము నుండును. కలి యెప్పుడును గలఁడు. అట్లు ముందునుండును. కృతయుగములోఁగూడ నాతఁడున్నాఁడు కాని అప్పుడాతనికి ప్రభావమేమియు లేదు. ఆతఁడెక్కడనో దాఁగియుండి తన సమయముకొఱకు ప్రతీక్షించుచుండును.

అనార్య దేశములలోను, అపుణ్యస్థానములలోను కలి కాలము మొదటినుండియును గలఁడు. ఆతఁడార్య రాజుల ప్రభావమునకు భయపడుచుండెడువాఁడు. కాని యిప్పుడతని సమయము వచ్చునప్పటికి పుణ్యప్రదేశములలోఁగూడ నాతని యాధిపత్యమును స్థాపింపఁగోరెను. పుణ్యవంతులు పతనము కానంతవఱకు వారిలో దంభ, ఛల, కపటాదులు ప్రవేశింపఁ జాలవు. అంతవఱకు కలి బలవంతుఁడు కాఁజాలఁడు. కావున నిచ్చటివారిపై తన పెత్తనమును సాగింపఁ జూచుచుండెను. ముందీ ప్రదేశములో నాతనికి కాలూనుటకు స్థానమును జిక్కించుకొని, అచ్చటి సదాచారులలోఁ దన కుకర్మలను బ్రవేశింపఁజేసిన, వారి నడతనుగాంచి అదే ధర్మమనుకొని ప్రజలందఱు దానినే అవలంబింతురు. అధర్మము అధర్మరూప ములో వచ్చిన ప్రజలు దాని నవలంబింప సందేహింతురు. కాని అది సంస్కారణరూపమున బయలుదేరుచుండును. ఉన్నతిమను పేరఁ దన యధికారమును స్థాపించును. ప్రభావ శాలియగువానినోట నా సంస్కారణ విషయమును బలికించును. అప్పుడది పుష్కలముగఁ బ్రచారము కాఁగలదు.

ఆతఁడు వచ్చి పరీక్షిన్మహారాజుసమ్ముఖమున గోవృష భములను గొట్టు ప్రదర్శనమేల జేసెనని మీరడుగవచ్చును. మునులారా! దీనికి కారణమేమనఁగా రాజాశ్రయము లేనిది ధర్మప్రచారమునుగాదు; అధర్మ, పాషండాది మతప్రచార మునుగాదు. ఇదివఱకువచ్చిన ధర్మప్రచారకులును, ఆచార్యు లును, అధర్మ, పాషండ మతప్రచారకులును, ప్రభావశాలు రగు పురుషులందఱును రాజాశ్రయముననే ప్రచారమును

గావించిరి. రాజాశ్రయమునుబొందిన ప్రచారము యథేచ్ఛగా సాగినది. రాజాశ్రయమును బొందని ప్రచారము కొన్నిదినములు సాగి చివరకు బుస్సున మాయమైపోవును.

ఈ కలియు నట్లైనఁ బరీక్షిన్మహారాజును వలలోఁ బడవేసికొనవలెనని తలఁచుచుండెను. బుద్ధిమంతుఁడగు వానిని వలలోఁ బడవేసికొనుటకు మంచిఉపాయము — ఆతని సమ్ముఖమున సదా నమ్రుఁడై యుండుటయు, బాగుగా సేవచేయుటయు, సదా చేతులుకట్టుకొని నిలుచుండుటయు నై యున్నది. నమ్రతచేతనే శ్రేష్ఠులు వశమగుచుందురు. వారు సేవచేఁ బ్రసన్నులైనప్పుడు ఇష్టమువచ్చిన వరము నడుగవచ్చును. కావున నీ నమ్రత బకధ్యానము వంటిది. మహారాజు ధర్మాత్ముఁడే. కాలప్రభావమున నీతని వలలోఁబడెను. తియ్యని మాటలచే నాతని హృదయము కఱుగుటచే నాతఁడు ప్రవేశించుట కవసరప్రదానము కావించెను.''

అంత శౌనకుఁడిట్లనెను:— ''ఇప్పుడు నా శంకలన్నిటికిని సమాధానము వచ్చినది. కలితో రాజు, బ్రహ్మావర్తమున గొప్పగొప్ప యజ్ఞములు జరుగుచుండును గనుకను, అచ్చటివారి కోరికల నన్నిటిని భగవంతుఁడును, సర్వాంతర్యామియు నగు శ్రీహరి తీర్చుచుండును కావునను నీ వీ పుణ్యభూమిని ప్రవేశింపవలదని పలుకఁగాఁ గలి యేమి చేసెను? అలేఁడు జెండా పీఁకుకొని వెళ్లిపోయెనా?''

సూతుఁడిట్లనెను:— ''ఎట్లు వెళ్లిపోఁగలఁడు? ఆతఁడక్కడ నుండియే తన ప్రచారమును బ్రారంభించవలెను.

యజ్ఞయాగాదుల ప్రచారమును ప్రజాపతులు, మనువు లిచ్చట నుండియే ప్రారంభించిరి. కలియుగ ప్రసారము నిచ్చట నుండియే జరిగినది. ఆతఁడు పరీక్షిన్మహారాజు నెత్తినయెక్కి వానినే తన ప్రచారమునకు ప్రధానపాత్రగఁ జేసికొనఁదలఁచెను. అందువలన నాతని స్థితిని దయనీయమైనదిగఁ జేసెను. ఆ కలి పరీక్షిన్మహారాజు పలికిన యీ వాక్యములను విని, గడగడ వణఁకుచుఁ, దనమీఁద దయపుట్టించుటకై యాతఁడు చాల భయపడినవానివలె నటించెను. ఆతఁడిట్లు భయవిహ్వలుఁడగుటనుగాంచి పరీక్షిన్మహారాజు గద్దించుచు నిట్లనెను:— "నీవు నేను జెప్పినట్లు వినుదువా లేక నిన్నీకత్తితో ఖండించి యమపురి కంపుదునా?"

కలియుగ మిట్లనెను:— "ప్రభూ! అదేటిమాట?"

మహారాజిట్లనెను:— "ఇదే. నీవు నా రాజ్యములో నుండవలదు. ఇచ్చటినుండి యిప్పుడే వెళ్లిపొమ్ము."

భయపడుచుఁ గలి యిట్లనెను:—"శరణాగతవత్సలా! అయితే నన్ను రక్షించిన దేమున్నది? మీరీ సమస్త ప్రపంచమునకును జక్రవర్తులు. ఈ భూమండలములో మీరాజ్యము లేని స్థలమును, మీ యాజ్ఞ పాలింపని స్థలమును లేదుగదా! మీరు బ్రహ్మావర్తమునే పరిపాలించుచున్నను, మీయాజ్ఞను బాలింపని రాజుకాని, దేశముగాని ఈ భూలోకములో లేదు. మీ రాజ్యమును వదలి వెళ్లుదమన్నను వెళ్లఁజాలను. కావున నాకు కొన్ని నిశ్చితస్థానములను జూపింపుఁడు. నే నచ్చటనే మీ యాజ్ఞప్రకారముండెదను. అవి దాటి బయటకుపోను."

కలియుగము తన్నుఁ బ్రశంసించుచుఁ బలికిన యుక్తియుక్తములగు వాక్యములను విని వానికై స్థానములను వెదకుచుండెను. వీని నెచ్చట నుండుమందునని యాలోచించెను.

ఛప్పయ.

ప్రాణ దానతో దేఉఁ కింతు అబహిఁ తుమ జావో।
బ్రహ్మావర్త సుదేశ భూలి ఇత కబహుఁ న ఆవో॥
విప్రకరేఁ ఇత యాగ భాగ దేవని కూఁ దేవేఁ।
సబహీఁ సుఖతేఁ సదా సర్వ పతి శివకూఁ సేవేఁ॥
బోల్యో కలి సర్వత్ర హై, రాజ్య తుమ్హార బసూఁ కహీఁ।
మోకూఁ ఠౌర బతాఇ దేఁ, ఆజ్ఞా మాని రహూఁ తహీఁ॥

అర్థము.

'ఓ కలీ! నీకు ప్రాణదానముచేయుదునుగాని యిప్పుడే నీవిచ్చటినుండి వెళ్లిపొమ్ము. పవిత్రమగు బ్రహ్మావర్తమునకు నీవు పొరపాటుననైన రావలదు. ఇచ్చటి బ్రాహ్మణులు యాగభాగములను దేవతల కొసంగుచుందురు. వీరందఱు సుఖముగ సదా సర్వేశ్వరుఁడగు శివుని సేవింతురు.'

అప్పుడు కలి యిట్లనెను:— 'రాజా! నీ రాజ్యము సర్వత్ర కలదే. ఇంక నెచ్చట నివసింతును? నా కెచ్చటనైన స్థలమును జూపింపుము. మీయజ్ఞప్రకారమచ్చట నుందును.'



# కలియుండు స్థానముల నిర్దేశించుట

౭౬

శ్లో॥ అభ్యర్థిత స్తదా తస్మై స్థానాని కలయే దదౌ ।
ద్యూతం పానం స్త్రియః సూనా యత్రాధర్మ శ్చతుర్విధః॥
పునశ్చ యాచమానాయ జాతరూప మదా త్ప్రభుః ।
తతోఽనృతం మదం కామం రజో వైరం చ పంచమమ్॥
— శ్రీ భాగ. ౧ స్కం. ౧౭ అ. ౩౮, ౩౯ శ్లో.

"వ. నరేంద్రా! నిన్ను నారోపిత శరశరాసను సర్వప్రదేశంబు లందును విలోకించుచున్నవాఁడ. నే నెక్కడ నుండుదు నానతిమ్మనిన రాజన్యశేఖరుండు ప్రాణివధ స్త్రీ ద్యూత పానంబు లనియెడు నాలుగు స్థానంబుల నిచ్చి మఱియు నడిగిన సువర్ణమూలంబగు నసత్య మద కామ హింసా వైరంబు లనియెడు పంచప్రదేశంబుల నొసంగి యితర స్థలంబుల స్పృశియింపకుండ నియమించె."
— శ్రీమదాంధ్ర భాగవతము

ఛ ప్ప య.

బోలే నృప-మమ ద్వార విముఖ యాచక నహిఁ జాహీఁ।
వేశ్యా,హింసా, ద్యూత, మద్య, మహఁ బసహు సదాహీఁ॥
సోచీ భూపతి యహీ చార అతి నిందిత థలహైఁ ।
ఆసక్తి మద, ఝూఠ క్రూరతా కే యే బలహైఁ॥
గిడిగిడాయ పుని కలి కహే, నిందిత అధమ సభీ దయే।
ఏక మనోహర నాథ! దేఁ, తబ రాజా సోచత భయే॥

అర్థము.

పరీక్షిత్తు ఇట్లనెను:— "నా ద్వారము కడకు యాచకులు వచ్చి విముఖులై యెన్నడును పోలేదు. నీవు వేశ్య, హింస, ద్యూత, పాన ములందు వశింపుము. ఈ నాలుగును అతి నిందిత స్థలములనియుఁ, గామ, మద, అసత్య, హింసల కివి యుత్తమబలమొసఁగునవియనియుఁ దలఁచి కలికియొసంగెను."

అంతఁ గలి చీకాకుపడి యిట్లనెను:— "నీవు నిందితము, నధమము నగువాటి నన్నిటిని యొసంగితివి. రాజా! మనోహరమగుదాని నొకదాని నొసంగు"మని యడుగఁగా, రాజు ఆలోచించుచుండెను.



సాహిత్యశాస్త్రములో పాదప్రసరణ న్యాయమనునది ఒకటి కలదు. దీని యభిప్రాయ మేమనఁగా — ముందుగాఁ గూర్చుండుటకు స్థలము దొరికిన మెల్లమెల్లగాఁ బాదములను గూడ జాపుకొనుట కారంభము చేయవలెను. ఒకానొక నదీ తటమున నొక యడవిలో నొకసాధువు సంచారము చేయుచుఁ బోయి, యెక్కడనైన నివసింపవలెనని మొదట నొక పందిరి వేసికొని కూర్చుండెను. అచ్చట నొక యరుగును వేసికొనెను. దానిమీఁద భగవన్మూర్తిని నిలిపి పూజాదులను జరుపుచుండెను. ఆ వేదికకు దూరదూరముగ నొక తులసీవనమును వేసెను. ఆ తులసీరక్షణకు ముళ్ళకంచెలను నాటెను. భగవన్నివేదనమునకు పాలు లేవు. ఒక ఆవు నిమ్మని యాచించఁగా ధర్మాత్ము లొక యావు నొసంగిరి. దాని నచ్చట కట్టివేసెను. ఇంతలో వర్షాకాలము వచ్చెను. కావున పందిరితోఁ బని

జరుగలేదు. అక్కడ కొంచెము, ఇక్కడ కొంచెము గడ్డి గాదమును ప్రోవుచేసి యొక కుటీరమును వేసెను. దానిచుట్టు నింక ననేక పుష్పవృక్షములను వేసెను. వీటి అన్నిటి రక్షణ కొక శిష్యుఁ డేర్పడెను. ఇదివఱకు కుటీరమున్నచోట ఇప్పుడు సుందరమందిరము నిర్మింపబడెను. "జయ జయ సీతారామ!" అను సంకీర్తన అందు చేయబడుచుండెను. ఇదంతయు నొక యాశ్రమమయ్యెను. చూచుచుండఁగనే ఇట్లగుటను గాంచి అందఱాశ్చర్యపడిరి. సంవత్సరముక్రిందట బిచ్చమడుగుకొనిన సాధువు ఇప్పుడు మందిర మహంతు అయ్యెను.

అట్లే కలి కూడ యిట్లు తలఁచెను.— "ఈ ధర్మాత్ముని రాజ్యములో నాకు పాదమిడుటకు కొంచెము స్థలము చిక్కినా తర్వాత మెల్లగా వ్యాపింపవచ్చు" ననుకొనెను. ఈ విధముగ దీనముగఁ గలి స్థానము నడుగఁగా రాజిట్లనెను:— "నీ వధర్మమును ప్రేమింతువు. నారాజ్యములో నీవాందోళనము కావించెదవు. ఆకారణమున నేను నీకు స్థానమును జూపుటకు జంకుచున్నాను."

కలి మిక్కిలి దీనతతో నిట్లనెను:— "కృపానాథా! అందఱు మీ యాశ్రయమునే కోరుకొనుచుందురు. మిమ్ము వీడి యెవఁడైన నెక్కడ ఉండఁగలఁడు? చిన్నలు, పెద్దలు, అందఱు మీ ఛత్రఛాయయందుండి పోషింపఁబడుచున్నారు. సుఖముగఁ గాలమును గడుపుకొనుచున్నారు. మీ యాస్థానమున నిరాశుఁడనై అభాగ్యుడనై పోవువాడను నేనొక్కఁడనే. మీరు నాకు నీచాతినీచస్థానముల నొసంగుఁడు. మీరు నిర్దేశించిన స్థానములనుండి నేను బయట కొకయడుగైన వెట్టను.

కలి మాటిమాటికి దీనతతో నాశ్రయమిమ్మని యాచింపఁగా దయాళువగు మహారాజునకు దయ కలిగెను. కలి యుండుట కీయఁదగిన స్థానము లేమి కలవని యాతఁడాలోచించెను. సచ్చరిత్రుఁడు వీనినుండితప్పించుకొనఁ బ్రయత్నించు నతి నిందితదుర్గుణము లేవి కలవు? ఆలోచింపఁగా నాలోచింపఁగా ఘోరాతిఘోరపాపములు కొన్ని మహారాజుబుద్ధికి తట్టెను. అందులో ముఖ్యమైనది అసత్యము. సత్యమునకు మించిన పరమధర్మము లేదు. అసత్యమునకుమించిన దుష్కర్మ యును లేదు. ఈ యసత్యమెల్లప్పుడు జూదములో నివసించును. జూదరులకు సత్యాసత్య వివేకముండదు. కావున వీనికి జూదమను నొకస్థానము నీయవలెను. కలి భయముచే సత్పురుషులు జూదముజాడకు పోరు. ఆడను ఆడరు. జూదమాడకుండిన జగడమే లేదు. మా తాత జూదమువలననే కదా వనవాసము చేసినది! అదియునుగాక మన కౌరవపక్షీయు లందఱును జూదము కారణముననే యుద్ధమునఁ జచ్చిరి. జూదకారణముననే ప్రపంచమంతటను వ్యాపించిన మహాభారత యుద్ధము జరిగినది. కావున నీ దినమునుండి కలి జూదములో నిత్యనివాసము చేయునుగాక!

ఇంకను మహారాజిట్లాలోచించెను:— మానవునకు నిర్మలమగు సదసద్వివేకబుద్ధి యున్నంతవఱకు పాపకర్మలలోఁ బ్రవృత్తుఁడు కాఁడు. బుద్ధిపై బూడిదపడెనా వానికున్మాదము కలుగును. దానివలన మలినమగు మదమావరించును. అప్పుడు పాపకర్మలు చేయవలెనను ప్రవృత్తి కలుగఁగలదు. బుద్ధిని అధికముగ మలినముకావించునది సురయే. సురాపానము

చేయువాఁడు క్రమక్రమముగ నన్నిపాపములు చేయ ప్రారంభించును. సారాయుపుమత్తులో మానవుఁడు తెలిసి తెలియని వాగుడు వాగును. కామవాసన అధికమగుటచే అగమ్యాగమ్య విచారమును వీడును. సర్వాభిగామి యగును. కావున మదిరయందును గలి నివసించుఁగాక! ఇచ్చట నాతఁడు నివసించుటచే సజ్జనుఁడు దానిని దాఁటుటకైన నిష్టపడఁడు.

ఈ ప్రసంగము సందర్భమున నాతని మనస్సులోనికి ఇంకొకవిషయము వచ్చెను. ఆతఁ డిట్లనుకొనెను:— మానవుఁడు మదించి మిక్కిలి కామియగును. వాని కామవాసన ఉత్తేజితమగును. ఉత్తేజితమైనపుడు వానికి కామినీసంగమేచ్ఛ కలుగును. సతులు, సాధ్వులు, పతిపరాయణలగు స్త్రీలలో వారి పాతివ్రత్య, సత్య, ధర్మ ప్రభావముచే వారి నెవరును ఘర్షింపఁజాలరు; కాని అకులీనులు, కుటిలలు, స్వైరిణులగు స్త్రీలు కాముకులయొక్క కామవాసనలోఁ బడిపోవుదురు. అసలే వారికి యౌవనోన్మాదము కలుగును. అందులో మద్యసేవకూడ చేసెనా శీల, సంకోచ, లజ్జా, కుల, ధర్మాదు లన్నిటికిని దిలాంజలుల నొసంగెదరు. ఇది వ్యసనముగ మారినప్పుడు వారు సదా అతృప్తులుగ యుందురు. ఎనిమిదిజాములు వారా వ్యసనముచేతనే వ్యథితులగుచుందురు; ఇట్టిస్త్రీలు కుటుంబినులగుచోఁ దమ భర్తను మోసగించెదరు. వానిమీఁదఁ గుట్ర పన్నుదురు. కపటవ్యవహారమును జేయుదురు. ఒక్కొక్కప్పుడు తాను ప్రేమించిన పరపురుషునిచే తన భర్తను ఏదో విధమునఁ జంపించుచుందురు. ఒకవేళ వారు స్వచ్ఛందచారిణులు, స్వైరిణులు, పణ్యస్త్రీలే యగునెడల, వారు నిరంత

రము పాపములోనే పాసిపోవుచుందురు. వారిలోఁ గలి నివసించెనా ధర్మాత్ములు దూరముననుండియే వారిని బరిత్యజించెదరు. పాపులే వారిదగ్గఱకు వెళ్లుచుందురు. అప్పుడు పాపులందఱు ఒక్కచోటనే యుందురు. దీనివలన ధర్మలోపమెన్నటికిని గలుగఁజాలదు. ధర్మాత్ములు సర్వథా వారికి దూరముగ నుందురు.

మహారాజు మదిరా, మదిరేక్షణలనుగూర్చి యాలోచించుచుండఁగనే, వానికి జిహ్వేంద్రియవిషయము జ్ఞాపకమునకు వచ్చెను. ఆతఁడిట్లాలోచించెను:— మానవుఁడు కేవలము రెండు ఇంద్రియములమూలముననే అధికపాపము చేయుచుండును. అవి ఉపస్థేంద్రియము, జిహ్వేంద్రియములు. ఈ రెంటిని దనవశము చేసికొనినవాఁడు మూఁడులోకములను జయించినట్లే. ఈ రెండు విషయములలోఁ బడిపోయినవాఁడు ఎనుబదినాల్గులక్షల జీవరాసులనుండి బయటపడుచు మరల దానిలోఁ బడిపోయినట్లే. జిహ్వాచాపల్యమున మానవుఁడు నానాపాపములు చేయుచుండును. మంచిమంచి పదార్థములు తిని పొట్ట నింపుకొనఁగా, వాని ఉత్తేజితరసముచే నుపస్థేంద్రియము కామమును ప్రేరించును. అన్నిటికంటె స్వాదిష్టమైనదియుఁ, గామవాసనను వృద్ధిపొందించుపదార్థము మాంసము. మాంసమునకు మించి జిహ్వకు సుఖముకలిగించు పదార్థ మింకొకటి లేదు. మాంసము హింసచే లభించును. జీవులను వధింపఁగా, వాని మాంసము తినుటకు లభించును. కావున వధకర్మయందు కూడ కలి సదా వసించుఁగాక! దీనిలోఁ గలి ప్రవేశించెనా ధర్మాత్ములు మాంసమనిన నేవగింతురు. వారు మాంసమును

దినకుండిరా వారు దానిమూలమునఁ గలుగు ఇతరపాపముల నుండి రక్షింపఁబడుదురు.

మహారాజిట్లనుకొనెను:— కలి శరణు జొచ్చినాఁడు. కావున వానికి చోటును జూపింపవలయును. వీఁడెక్కడ నుండునో అచ్చట వాని ప్రభావమును జూపించితీరునను సంగతి నిర్వివాదాంశమే. వాని ప్రభావ మందఱిపై నెట్లు చూపింపఁ గలఁడు? రెండు విభాగములు కాఁగలవు — ఒకటి శుద్ధపుణ్యాత్ముల యొక్కయు, మఱియొకటి పాపాత్ములయొక్కయు. కలికి ప్రసాదించిన స్థానములం దాసక్తి చెందిరా వారు పాపాత్ములనియు, వాటికి దూరముగ నుండిరా పుణ్యాత్ములనియుఁ బిలువఁబడుదురు. ఇట్లు చేయుటచే పాపపుణ్యులును, ధర్మాధర్ములును నా రాజ్యములో నిద్దరును వేఱువేఱుగ సుఖముగ నివసింపఁగలరు — అని యిట్లాలోచించి మహారాజు కలితో నిట్లనెను:— "మంచిది. నా దగ్గఱనుండి యాచకుఁ డెవఁడును నిరాశుఁడై పోలేదు. పొమ్ము, నేను నీకు ద్యూత, పానములు, అధర్మపూర్వక స్త్రీప్రసంగము, ప్రాణిహింసనము అను నీనాల్గు స్థానముల నొసంగితిని. నీవు ఈ నాల్గింటియందే యుండవల యును. ఈస్థానములను వదలి ఆవలకుఁ బోయితివా నిన్నుఁ జంపక విడువను."

'అంగుళి నందించిన హస్తమును జిక్కించుకొను' ననియు, 'ఒంటె తలదూర్చిన తనవు నంతటిని దూర్చఁగల' దనియు సామెతలు కలవు. వ్రేలు పట్టుకొనిన బాధలేదను కొనిన నిఁక బోల్తాకొట్టనాఁడనియు వలలోఁబడినాఁడనియు ననుకొనవలయును. మహారాజా కలికి నాల్గుస్థానము లొసంగ

నప్పుడు కలి లోలోన నత్యధికముగ సంతసించెను. ఆతఁ డిట్లనుకొనెను— నేను కపట వినయముచే రాజును మోసగించితిని. కాని లాభముచే లోభ మభివృద్ధి యగును. కలి కింకను వ్యాప్తి చెందలేదు. ఆతని కీనాల్గు స్థానములును సంకుచితములుగఁ దోఁచెను.

అంత శౌనకుఁ డిట్లడిగెను:— "సూతా! ఈనాల్గు స్థానములను మహారాజేల ప్రసాదించినాఁడు? ఈ నాల్గింటిలో మొదటినుండియు నధర్మముండనే యున్నది. అధర్మమెచ్చట గలదో కలి అచ్చటనుండియే తీరును. అట్టియెడఁ గలి యీ నాల్గుస్థానములను బొంది యేల ప్రసన్నుఁడయ్యెను?"

అంత సూతుఁ డిట్లనెను:— "మహాభాగా! ద్యూత, మద్య, స్త్రీ, హింసాదులను ధర్మాత్ము లెల్లప్పుడు నిందింతురనుమాట సత్యమే. అయితే యితర యుగములలో నీ కార్యము లొక్కొక్కప్పుడు సమయానుసారముగ ధర్మముగఁ బరిగణింపఁబడుచుండెడివి. ద్యూతమును గైకొనుఁడు. కొన్ని యవసరములందు పై మూఁడు యుగములలో ద్యూతమాడుట ధర్మముగ నెన్నఁబడుచుండెడిది. వివాహసమయమందును, దీపావళీ మహారాత్రియందును, ఒక రాజు ఇంకొక రాజును యుద్ధమునకువలె ద్యూతమాడఁ బిలిచినప్పుడును జూదమాడుట ధర్మానుసారముగ శ్రేష్ఠముగ నెన్నఁబడుచున్నది. అట్లు కాకుండిన లోభముజాడకే పోనట్టియు, సాక్షాత్తుగ ధర్మావతారుఁడును, అసత్యమునకు దూరముగ నుండువాఁడు నగు యుధిష్ఠిరుఁడీ నింద్య కుత్సితకర్మమం దేల ప్రవృత్తుఁ డయ్యెను! ఆతఁ డెల్లప్పుడును దుర్వాసనలకు దూరముగ

నుండెడువాఁడు. కేవలమది ధర్మమనియే జూదమాడెను. పరీక్షిన్మహారాజు కలిమహారాజుకు ద్యూతమందు నివాస మొసంగఁగానే, ఇఁక దానిలో నిసుమంతైన ధర్మము ఏస్థితి లోనైన లేకుండెను. దానిలో సదా కలి నివసించుటచే, నెట్టి స్థితిలోనైనను, పూర్వ యుగములలోనివారి ననుసరించి పొరపాటుననైన నెన్నడు జూదమాడరాదు.

ఇట్లే మదిరాపానము విషయముననుగూడ. చాల పురాతన కాలమున మదిర నిషిద్ధము కాదు. దుష్టులగు నసురులు బృహస్పతి కుమారుఁడగు కచుని జంపి, కాల్చి, యాబూడిదను సురలోఁగల్పి తమ గురువగు శుక్రాచార్యున కీయఁగా, సర్వసమర్థుఁడును అసురులకు ప్రతాపవంతుఁడగు పురోహితుఁడునగు శుక్రాచార్యుఁడు ద్విజుఁడై మద్యపానము చేయరాదనియు, నట్లు చేయుచో బ్రహ్మహత్యాపాతకము లభించుననియు శాసించెను. దీనినిబట్టి ద్విజులకు మాత్రమే పాపముగాని ద్విజేతరులకుఁ బాపముకాదని తెలుచున్నది. అంత స్మృతికారు లింకఁ గొన్నివిశేష నియమములను జేసిరి. బ్రాహ్మణునకు అన్నిటివలె సురయు నిషిద్ధముగఁ జెప్పఁబడినది. కాని యితరవర్ణములకుఁ గొన్నివిశేష వస్తువులతోఁ జేయఁబడిన వారుణిఁ గొనవచ్చునను అంగీకృతి కలదు. ఇదంతయు వర్ణగతమగు విషయము. కొన్ని విశేషావసరము లందు, ఇతర యుగములందు ధార్మిక క్రియారూపమునఁ గైకొనఁబడినది. "సౌత్రామణీ" యజ్ఞమందు సురాపానము కలదు. అచ్చట అది ధర్మముగనే యెన్నఁబడు చుండెడిది. పరీక్షిన్మహారాజు కలిమహారాజుకు మద్యములో

నుండుమని వరమిచ్చినప్పుడు, అభ్యున్నతినిఁ గోరు ఏవర్ణము వాఁడైనను, ఏ ఆశ్రమము వాఁడైనను, ఏయవసరమందైన, నెట్టి సురనైనను పానముమాట యట్లుంచుఁడు — స్పర్శ కూడ చేయరాదు. అయితే, వైద్యుఁడు రోగమసాధ్యమని చెప్పి, ఆ రోగనివారణ చికిత్సకు ఆసవము తప్ప వేఱుగతి లేదని చెప్పినప్పుడు, జీవితేచ్ఛ ప్రబలముగ నున్నప్పుడు ఆ సమయమునఁ దప్పనిసరి యగునెడల నది వేఱువిషయము. కావునఁ గలియుగములో నందఱు నన్నికాలముల మదమత్తులఁ జేయు మదిరకు చాల దూరమున నుండవలయును. ఏలననఁగా నిందులో నధర్మమిత్రమగు కలహబంధువగు కలి నివసించు చున్నాఁడు.

పూర్వకాలమునఁ బ్రజలకుఁ బెండ్లియాడిన యిల్లాం డ్రుండెడువారు. వారికితోడు అవివాహితలగు నుపపత్నులను గూడ పెట్టుకొనెడువారు. వారన్నివర్ణములలోనివారై యుం డెడువారు. వారికి నియమములు కలవు. సార్వజనికోపయోగ మునకై యేర్పడిన వారాంగనల సంగమముకూడ శాస్త్రకా రులు గొప్పధర్మమనియే చెప్పిరి. వారికిఁగూడ వ్రతోపవాస, దానాది పుణ్యకర్మవిధానము కలదు. కాని పరీక్షిన్మహారాజు స్త్రీసంగమమందు కలికి నివాసమొసంగఁగా అప్పటినుండి ఋతుకాలములోఁ దన ధర్మపత్నినివీడి యేవిధమగు పరసంగ మున్నప్పటికిని అది అధర్మము, పాపము. ధర్మాత్ముఁడగు వానికి పరస్త్రీ సంగము విషయము చెప్పనేల? తన తల్లి, యువతియగు సోదరి, కూఁతురు వీరినైనను ఏకాంతమున స్పర్శింపరాదు. వారిని అకారణముగఁ జూడనురాదు. స్త్రీ

మవయవము లన్నిటను కామము నివసించుచుండును. అయితే విశేషముగఁ గురులయందును, మస్తకమునను, నొసలందును, కన్నులలోను, ఓష్ఠమందును, బుగ్గలయందును, హృదయమందును, నాభి, జంఘులయందును విశేషముగ నివసించును. కావున నున్నతిఁగోరు పురుషుఁడు ఈ స్త్రీయంగములను జూడనురాదు, స్పర్శింపనురాదు. వీటిని దాఁకెనా వెంటనే వాని శిరస్సునఁ గలి తాండవించినాఁ డన్నమాటయే.

కృత, త్రేతా, ద్వాపరయుగములలో యజ్ఞయాగాదులందు చేయఁబడిన వైదిక హింస హింసకాదు. రాఁబోవు కలియుగములో ప్రజలు విశేషముగ దంభులై. పాషండులైయుందురనియు, వారు యజ్ఞములు పేరటను, దేవతల పేరటను జిహ్వాచాపల్యమును దీర్చుకొనుటకును, పొట్టనింపుటకును ఇట్టివి చేయుచుందురనియుఁ బరీక్షిన్మహారాజు యోచించి సమస్త విధములగు హింసలందును గలిని ఉండుమని యాజ్ఞాపించెను. కలియుగములో యజ్ఞములకొఱకైనను - దేవతల నిమిత్తమైనను - జీవులను బలి యొసంగుట నిషేధము. ఫల పుష్పాదుల బలినిచ్చి పని జరుపుకొనవలయును. ఏవిధమగు కార్యమునకైనను హింస జరిగెనా వాని శరీరములోఁ గలి ప్రవేశించి తీరును.

ఈవిధముగఁ బూర్వము నిషిద్ధములైన ఈకార్యములు దేశ, కాల, పాత్ర భేదములచే విహితములుగ నెన్నఁబడుచున్నప్పటికిని పరీక్షిత్తు కలికి వరమిచ్చిన తర్వాత నీకార్యములు సర్వథా నిషిద్ధములైనవి. ఎనిమిదిజాములు కలి వీనిలో

నివసించును. ఆతఁడెవరిని లక్ష్యపెట్టఁడు. వారి మాటలను వినఁడు.

ఈస్థానములలో నుండియుఁ గలి యందఱిమీఁదఁ దన యధికారమును సాగింప లేకుండెను. చాలమంది పుణ్యాత్ముల కీ కార్యమనిన స్వాభావికముగ సేవగింపు కలదు. కావున వ్యాపకమగుటకు వీలగు స్థానమొకటి కావలసి వచ్చినని, అందఱితో వ్యవహారము జరుపునట్లును, ఏదోరూపమున నవి చేయునట్లుండవలయును. వానిలో అనృత, మద, కామ, నిర్దయతలతోఁగూడ కలహ, వైరములు కూడ నుండవలయును. కావున నాతఁడు చేతులు జోడించి వినయముతో మరల మహారాజు నిట్లని ప్రార్థించెను. కలి యిట్లనెను:—

“ధర్మావతారా! మీయాజ్ఞ ప్రకారము మీరు చెప్పిన నాల్గు స్థానములలో నేనుండెదను. కాని శరణాగతవత్సలా! మీరు నాకు చెడ్డస్థానముల నివసింప నొసంగితిరి. వీనిలో మానవులు పడిపోక దూరముగనే ఉందురు. నాకొక మంచి దియు సుందరమైనదియు, స్వచ్ఛమైనదియు, ప్రకాశించు నదియు నగు నొకస్థానము నొసంగుఁడు. నాకీ స్థానములందు మనసు జనించినపుడు అక్కడికి వచ్చి నాయిష్టమువచ్చినట్లు క్రీడింప వీలగునట్లుండవలెను. స్వామీ! ఈ ఒక్కదాని నొసంగుఁడు. మిమ్ముల నంతగా నధికముగఁ గష్టపెట్టను.”

మహారాజు కలి యడిగిననిదాని గూర్చి విచారించెను. బాగుగాఁ బ్రకాశించు వస్తువుల మీఁదకు ఆతని దృష్టి పోయెను. విచారింపఁగా విచారింపఁగా . నీ సువర్ణమే హత్యల కాకరమని ఆతనికిఁ దోఁచెను. బంగారముకొఱకే అన్న

దమ్ములు పరస్పరము శత్రువులగుచుందురు. ('మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమః' అను సామెత కలదు కదా!) ధనలోభముననేగదా మా తాతలు పోరాడుకొనినది. కౌరవులు ధనలోభముచేతనే మా తాతలకు రాజ్య మొసంగ లేదు. సన్న్యాసిదగ్గఱకు ధనము వచ్చినప్పటికిని యాతఁడు పాపకర్మలయందు ప్రవృత్తుఁడు కాఁగలఁడు. కావున నీతనికి సువర్ణమందుకూడ స్థాన మొసంగవలయును.

ఇట్లాలోచించి అట్లు జరుగవలసి యున్నది కావున నప్రయత్నముగ నకస్మాత్తుగ మహారాజు ముఖమునుండి యిట్లు వెడలెను:— "మంచిది. వెళ్లుము. నేను నీకు సువర్ణమందుకూడ స్థాన మొసంగితిని."

ఇది వినఁగానే కలి మిక్కిలి యానందమును జెందెను. ఆతఁడు లోలోన నిట్లనుకొనెను:— "ఇంక ఢంకామీఁద దెబ్బకొట్టితిని. ఇప్పుడీ పాండువంశపురాజును ధర్మాత్ముఁడు నగు పరీక్షిత్తు పూర్తిగా మోసపోయినాఁడు. ఈ తలపై మెఱయుచున్న కిరీటము బంగారుదే. మునుముందుగా వీనిలో దూరి యీతని బుద్ధిని భ్రష్టము కావించెదను. వీనిచే జేయ రాని పనిని జేయించెదను. వీనిపై నా బలపౌరుషములను జూపించెదను. ఈతనిని నాకు మొదటి కబళముగ నొనర్చి కొందును. వీనిని జంపించి యానందించెదను." అని ఆలోచించి వెంటనే యాతఁడు పరీక్షిన్మహారాజు యొక్క సువర్ణ మండిత కిరీటములోఁ బ్రవేశించెను.

ఋషులారా! అప్పటినుండి కలి తన పాదములను జాపఁ బ్రారంభించెను. కావున మానవులు ద్యూత, పాన, స్త్రీ, హింసా, సువర్ణాదులకు సదా దూరముగ నుండవలయును. పరమార్థపథమునఁ బథికుఁడు కాఁగోరువాఁడును, ఔన్నత్యశిఖరమున కెక్కఁదలఁచువాఁడును, సంసారసాగరమును దాటఁగోరువాఁడును, జననమరణ బంధన విముక్తిని జెందఁగోరువాఁడును బొరపాటుననైన నీ యైదు వస్తువులందాసక్తి చెందరాదు. ముఖ్యముగ ప్రజానాయకుఁడు, శాసకుఁడు, ధర్మాచార్యుఁడు, లోకశిక్షకుఁడు వీనికి సర్వదా దూరముగ నుండవలెను.''

శౌనకుఁ డిట్లడిగెను:– ''సూతా! తర్వాత నేమైనది? పరీక్షిన్మహారా జెచ్చటికి వెళ్లెను? కలి తర్వాత నేమి యొనర్చెను? ధర్మ, ధరణీదేవుల గతి యేమైనది? ఈవిషయములను గూర్చి కృపతో నింకను జెప్పవలయును.''

శౌనకుఁ డిట్లు ప్రశ్నింపఁగా సూతుఁడు చింతాపసనస్కుఁడై యిట్లనెను:– ''మహాభాగా! భృగువంశభూషణా! అయిన దేమిటి? ఏమి కావలయునో అదే అయినది. కలి కార్యము నెఱవేరినది. ఆతని కత్యుత్తమోత్తమస్థానము లభించెను. ఆతఁడు పరీక్షిత్తుని కిరీటములోనికి దూరెను. ధర్మ ధరణీదేవతలు గో, వృషభములై అచ్చటనే నిలిచియుండెను. రాజు వారి నాసమయమున నాశ్వాసించెను. వృషభము నా సమయమున నాల్గుపాదములు గలవానినిఁగఁ జేసెను. అనఁగా ధర్మునితో నిట్లనెను:– 'నారాజ్యములో నెవఁడును అసత్య భాషణము, మదిరాపానము, పరస్త్రీగమనము, జీవహింస,

చేయరాదు. అందఱును తప, శౌచ, దయా, సత్యములందు నిలిచి ధర్మకార్యములను జేయుచుండవలయును.' ఈవిధముగ ధర్మ, ధరణీదేవతలకు ధైర్యము చెప్పి, సమస్త సర్వాంసహా చక్రమునఁ దన వీరత్వమును స్థాపించి, దశదిశలను జయించి, పరీక్షిన్మహారాజు హస్తినాపురమునకు వచ్చి ధర్మపూర్వకముగ రాజకార్యము లొనర్చుచుండెను.

మునులారా! ధర్మాత్ముఁడగు పరీక్షిత్తుని రాజ్యకాలమందు కాలమంతయు యజ్ఞములందే గడపిరి. మీ యజ్ఞము యుధిష్ఠిరుని రాజ్యకాలమందు ప్రారంభింపఁబడి, ఆతని మహాప్రస్థానానంతరమునఁ బరీక్షిన్మహారాజు చక్రవర్తి కాఁగా ఆతని రాజ్యకాలమంతయు యజ్ఞము జరుగుచునే యుండెను. ఇప్పుడాతఁడు స్వధామమును జేరినాఁడు. ఆతని శాసనమందు ధర్మమునకు గొప్ప ఉన్నతి కలిగినది. ఎక్కడ చూచినను నల్దిక్కుల యజ్ఞయాగములు జరుగుచుండెను. కాని కరాళకాలకుటిలగతి కారణమున నాతఁడిఁక నిప్పుడు లేఁడు. వ్యాసనందనుఁడగు శ్రీ శుకమహర్షి ఆతనిచే శ్రీమద్భాగవతరూపమగు నమృతమును ద్రావించి అమరునిఁ గావించెను. సుమధుర భగవత్కథారూపమగు నౌకయందుఁ గూర్చుండఁబెట్టి, అపార సంసార సాగరమును నిమిషములో దాఁటించెను. మునులారా! శ్రీమద్భాగవతమే సంసారసముద్రమందు మునిఁగిన జీవులకు ఏకమాత్రావలంబనము. ఆ భాగవతకథను నేను మీ సమ్ముఖమునఁ జెప్పుచున్నాను. మీ రందఱును ప్రభుపాదపద్మములందు దత్తచిత్తులరై సావధానముగ శ్రవణము చేయుఁడు.''

ఛప్పయ.

స్వర్ణ ఏక సంసార మాఁహిఁ హాత్యా కీ జర హై।
స్వజన విజన బినిజాయఁ బైర కో యహ హీ ఘర హై॥
కౌరవ పాండవ లరే నాశ సబ జగ కో కీన్హోఁ।
దోష ఖాని లఖి నృపతి పాఁచవోఁ సోనోఁ దీన్హోఁ॥
సుఖి స్వర్ణ సుని కలి భయో, అతిప్రసన్న హ్వై హాఁసి గయో।
స్వర్ణముకుట నృపసిర నిరఖి, తురత తాహిఁ మహఁధసి గయో॥

అర్థము.

స్వర్ణము పరస్పరము హత్యలకు మూలమైనది. వీరు తనవారు, వీరు పరాయివారను భేదములేక వైరమున కిది ముఖ్య నివాసభూమి. దీనిమూలముననే కౌరవ పాండవులు పోరాడుకొనిరి. ఇదియే సమస్తజగమును నాశముచేసినది. ఈ స్వర్ణము దోషాకరమని తెలిసికొని పరీక్షిన్మహారాజు కలికి అయిదవస్థానముగ నొసంగెను.

స్వర్ణము తనకు చాలసుఖమైనదని కలి తలచి యానందమును జెంది లోలోనవవ్వుకొని, పరీక్షిన్మహారాజునకు స్వర్ణ మకుటముండుటను గాంచి వెంటనే యా మకుటములోనికిఁ బ్రవేశించెను.

—:0:—

# పరీక్షిత్తుని ఉత్తరచరిత్రనుగూర్చిన ప్రశ్న

౭౫

శ్లో॥ తన్నః పరం పుణ్యమసవృతార్థ –
మాఖ్యాన మత్యద్భుత యోగనిష్ఠమ్।
ఆఖ్యాహ్యనంతా చరితోపపన్నం,
పారీక్షితం భాగవతాభిరామమ్॥

— శ్రీభాగ. ౧ స్కం. ౧౭ అ. ౧౪ శ్లో.

'ఆ. పరమభాగవతుఁడు పాండవపౌత్రుండు
శుకుని భాషణముల శుద్ధబుద్ధి
యై విరాజమానుఁడై ముక్తి యగు విష్ణు
పాదమూలమెట్లు వడసె ననఘ.

''వ. మహాత్మా! విచిత్రయోగ నిష్ఠాకలితంబును, విష్ణుచరిత లలితంబును, బరమపుణ్యంబును, సకలకల్యాణగుణగణ్యంబును, భాగవతజనాపేక్షితంబునైన పారీక్షిత భాగవతాఖ్యానంబు వినిపింపుమనిన సూతుండిట్లనియె:—''

— శ్రీమదాంధ్రభాగవతము.

ఛప్పయ.

పూఛ్యో శౌనక– ''సూత! దుష్ట కలి చ్యోఁ నహి మార్యో।
కాహిం న క్రూర కరాల రాజ్య తేఁ షకరి నికార్యో॥''
సూత కహేఁ 'నృప భ్రమర సరిస రసగ్రాహీంబుజు అతి।
సోచ్యో కలి మహఁ లగహిఁ, పాప కరి పుణ్యహోయఁమతి॥
యహ ఖల కలి కాయరని కూఁ, డరపావే వృక కే సరిస।
ధీర వీర హరి భక్త లఖి, డరే కఁపే నహిఁ కరహిఁ రిస॥'

అర్థము.

శౌనకుఁడిట్లనెను:— "సూతా! దుష్టుఁడగు కలి నేలఁ జంపలేదు? ఆకూరుని తనరాజ్యమునుండి పరీక్షిత్తేల పట్టుకొని నెట్టివేయలేదు?" అంత సూతుఁ డిట్లనెను:— "రాజు భ్రమరమువలె రసగ్రహణపారీణుఁడు. కలి తాను జేసిన పాపమును దెలిసికొని పుణ్యుఁడగుననుకొనెను. ఈ క్రూరుఁడగు కలి పిఱికివాఁడు. తోఁడేలువలె భయస్థుఁడు. రాజు ధీరుఁడు, వీరుఁడు. హరిభక్తుఁడగుటచే భయపడలేదు. వణఁకలేదు. వానిమీఁదఁ గోపమును బడలేదు."



ఈ సంసారము గుణదోషములతో నిండియున్నది. ప్రపంచములోఁ గేవలము దోషయుక్తమేఅయి ఒక్కగుణము కూడ లేనివస్తువులేదు. దీనికి విపరీతముగఁ గేవలము గుణములే కలిగియుండి దోషయుక్తము కానిదేదియును లేదు. బుద్ధిమత్త్వము, మూర్ఖత వాటినిగ్రహించుటలో వ్యక్తమగును. బుద్ధిమంతులగువారు సమస్తవస్తువులందు గుణములనే గ్రహించుచుందురు. అవగుణములను బరిత్యజింతురు. వెన్ననుండి నేయిని దీయువాఁడు, అగ్నియందు నవనీతమును గాచి ఘృతమును గ్రహించి, గోదావరిని (నేతిలోని మలమును) బారవైచినట్లును, చెఱకు రసమును దీయువాఁడు రసమును మాత్రము గ్రహించి పిప్పిని బారవేయునట్లును, గానుగాడినఁ దైలమును గ్రహించి పిట్టును బారవేసినట్లును, హంస నీరు కలిసిన పాలలోని పాలను మాత్రము గ్రహించి జలమును వదలినట్లు బుద్ధిమంతుఁడు మంచిగుణములనే గ్రహించును,

దీనికి విపరీతముగ దుష్టులు సుగుణములను వీడి యవగుణము లనే గ్రహింతురు. ఎంతమంచి గుణకారియగు నెఱువును వేసినప్పటికిని అది మామిడిచెట్టు యగునెడల నాయెఱువు నందున్న మధురరసమును గ్రహించి మామిడి పండును దీపిగ నొనర్చును. దానినే వేఁపచెట్టునకు వేసిన నది దాని లోని చేదును గ్రహించి చేదురసమునే ఉత్పన్నము చేయఁ గలదు. పాలను తల్లిచేఁ ద్రావించిన శిశువునకు జీవనదానము చేయు నమృతోపమానమగు పాలుగ మారును; అట్టివి పామునకుఁ బోసిన జంతువును వెంటనే చంపఁగలిగిన ఘోర విషముగ మారును. శరీరమంతయునుఁ జక్కగ నున్నప్పటికిని ఈగ పుండులేచిన చోటను, మలమున్న చోటను వాలు చుండును. అట్లే ఒకానొక మానవుఁ డెంతటి గుణవంతుఁడు, తేజస్వియు, భగవద్భక్తుఁడైనప్పటికిని దుష్టుఁడు వాని ఛిద్ర ములనే అన్వేషించుచుండును. ఆ విషయములో వాఁడు పొరపాటు పడఁడు. ఆదోషముల నాతఁడు గోరంతలను గొండంతలుగఁజేసి ప్రచారము చేయుచుండును; కాని సజ్జను లకు దోషమెవరి దగ్గఱను గనపడనే కనఁబడదు. అవతల వాఁడెంతగ దోషభాండార మైనప్పటికిని, ప్రత్యక్షదోషము లతో నిండియున్నప్పటికిని సజ్జనుఁడు వాటెని ఉపేక్షించును. ఆతనిలో నొక్క గుణమున్నప్పటికిని దాని కతఁడుబ్బిపోవును. ఆ ఒక్కగుణమునకే సంతోషించి వాని నత్యధికముగ నాద రించును. పరీక్షిన్మహారాజు గుణగ్రాహి. ఆతనిపై మమకార మును జెంది ప్రసన్నుఁడై తన రాజ్యములో తావొసంగుటకు అనేక దోషములకును, నానావిధములగు నధర్మములకును

తావగు నీకలిలో నేగుణమును గాంచెను? ఇదంతయు నాలోచించి శౌనకుఁడు సూతుని ఇట్లు ప్రశ్నించెను:— "సూతా! పరీక్షిన్మహారాజు మహాధర్మాత్ముఁడే, దూరదర్శియే. సమస్త విధములగు గుణదోషములను వివేచనచేయఁగల సమర్థుఁడే. అట్టివాఁడు తనరాజ్యములో కలిమహారాజున కేల తావొసంగెను? ఆదుష్టుని తత్క్షణమున నేలఁ జంపలేదు? వానిమీఁదఁ బ్రసన్నుఁడై అయిదు స్థానము లొసంగుటకు ఆతనిలో నే గుణములను గాంచెను? సువర్ణములోఁ గలియుండుటకు స్థానమీయఁగానే ఆతఁడు సర్వవ్యాపి యయ్యెనుగదా! లౌకిక కార్యములన్నియు ధనముతో జరుగవలసినవేకదా! ధనముచే లోభ మభివృద్ధిచెందును. లోభమే పాపమునకు మూలము. పాపములోనే కలి నివాసము. ఇప్పుడు చేసినపని తనచేతి గొడ్డలితో తన కాలు నరుకుకొనినట్లైనది. దీనికి కారణ మేమియో మాకు చెప్పుఁడు."

శౌనకుఁడిట్లు ప్రశ్నింపఁగా సూతుడిట్లనెను:— "మునులారా! కలి దోషములకు తావనియు, గొప్పబలవంతుఁడనియు మీరుచెప్పుమాట నిజమే. గొప్పశూరుఁడు, పరాక్రమవంతుఁ డగువాఁడు ఇతరులబలమును దుచ్ఛముగనెంచును. ఇతరుల బలము తుచ్ఛముగఁ గనబడ నంతటి గర్వాభిమానములు కలిగియుండుటయేకాక తన బలపరాక్రమములమీఁద అంతటి విశ్వాసముండును. ఈక్షుద్ర బలవంతులు నన్నేమిచేయగలరని వాడఁనుకొనుచుండును. భయము నిర్బలులకుండును. బలవంతుఁడు భయపడఁడు. పరీక్షిన్మహారాజు కలికి భయపడ వలసిన పని యేమున్నది? ఆతనికి ధర్మసత్యముల బలము

కలదు. అందువలన నాతఁడు కలిదోషములను జూడక ఆతని గుణములనే గ్రహించెను."

అంత శౌనకుఁడు మరల నిట్లడిగెను:— "సూతా! కలి యందు పరీక్షిత్తు చూచిన గుణములేవియో మేము వినఁగోరుచున్నాము."

సూతుఁడిట్లనెను:— "మునులారా! కంటకవృక్షముల యందలి పూలనుండియు భ్రమరము సుస్వాదు సుందరమధువును గ్రోలినట్లు, దానికంటకములతో దాని కేమియు బ్రయోజనము లేనట్లు, సారగ్రాహియగు పరీక్షిన్మహారాజు కలిని ద్వేషింపలేదు. ఏలననఁగాఁ గలియుగమందు దొక్క గొప్పగుణమున్నది. శుభకర్మలు మానసికముగఁ జేసినప్పటికిని ఫలము లభించును. పాపకర్మలను జేతులారఁ జేసినఁగాని పాపఫలమంటదు. ఇతర యుగములలో మనస్సుతోఁ బాపముచేసినను పాపఫలము ననుభవింపవలసి వచ్చుచున్నది. కృతయుగములో నెవఁడైన పాపమునొనర్చినా రాష్ట్రమంతయు వాని పాపము ననుభవింపవలయును. త్రేతాయుగములో నొకానొకవ్యక్తి చేసినపాపము వాఁడునివసించు నగరవాసు లందఱకును లభించెడిది. ద్వాపరములో నట్టి పాప మొనర్చిన తన కుటుంబపరివారము మాత్రమే అనుభవింపవలెను. కాని కలియుగములో నెవఁడు పాపమునుజేసెనో వానికి మాత్రమే లభించును. పాపకర్మ పొరపాటున మనస్సులోనికి వచ్చిన దానికి ఫలములేదు; కాని పుణ్యకర్మ మనస్సులోనికి వచ్చెనా అది శుభఫలము నొసంగును. అందుకనియే కలిమీఁదఁ బరీక్షిత్తు ప్రసన్నుఁడయ్యెను. కలి దోషనిధి యైనప్పటికిని

ఒక్క గొప్ప గుణము కలదు. అదేదనఁగా నే సాధనయు లేకయే యెవఁడు భగవన్నామ కీర్తనము చేయునో వాఁడు భగవద్ధామమును బొందును.''

ఇది విని శౌనకుఁ డిట్లడిగెను:— "సూతా! పాపుల మనస్సులలోనికి శుభకర్మ సంకల్పము లెట్లు రాఁగలవు? ఉల్లిఁ దినువాని యూవలింపుకూడ ఆ యుల్లివాసనే కొట్టు చుండును. మూలికను తినువాని త్రేపుకూడ ఆవాసనే కొట్టు చుండును. కావున నిరంతరము పాపకర్మలందే ప్రవృత్తి కలవారలగు కలియుగ మానవులు శుభసంకల్పము లెట్లు చేయఁగలుగుదురు?''

సూతుఁడీ విషయమును విని నవ్వుచు నిట్లనెను:— "స్వామీ! అందఱు తమతమ మాన్యత ననుసరించి కార్యము లొనర్చుచుందురు. దొంగ అందఱను దొంగలగనే భావిం చును. వ్యభిచారులకు సచ్చరిత్రముగల వారి విశుద్ధప్రవర్తన ములోఁగూడ కామవాసన కనఁబడును. ధర్మాత్ముఁ డందఱను దనవలె శుద్ధులని భావించి, అట్లే వ్యవహరించుచుండును. బలవంతుఁడు తాను నిర్బలులఁ గాంచి భయపడనటులనే, అందఱును దనవలె నిర్భయులై యుండవలె ననుకొనుచుం డును. పరీక్షిన్మహారాజు బలవంతుఁడు, బుద్ధిమంతుఁడు. ఆతఁ డిట్లనుకొనెను:— 'ఈ కలి జాగ్రత్తలేని మూర్ఖులనే భయ పెట్టుచుండును. ధర్మాత్ముఁడును, ప్రబల పరాక్రమవంతుఁడు నైన వానినిఁ గాంచి, ఆతఁడు స్వయముగ భయపడుచుండును. మంచివారిని వీఁడేమి చేయఁగలఁడు? తోడేలు భయపడు చిన్నపిల్లలమీఁద బడుచుండును. చేతఁ గఱ్ఱపట్టుకొని నిలు

చుండిన నిర్భీకులనుగాంచి యది పారిపోవును. అట్లే సదా సావధానముగనుండి ధర్మకార్యములందు ప్రవృత్తి గలిగి, పాపములజోలికి పోనివారిని కలి యేమిచేయఁగలఁడు?' మహారాజు అందఱను దనవలెనే చూచుకొనును. అందువలన నా దుష్టుని బుద్ధిపూర్వకముగనే తన రాజ్యములో నుండ నిచ్చెను.

కలియుగము ఇదివఱకే వచ్చెను; కాని భగవానుని భయముచే నొకవైపున దాఁగియుండెను. భగవానుఁడు స్వధామమునకుఁ బోఁగానే ఆ దినమునుండియే ఆతఁడు తన కాళ్లు జాప మొదలిడెను. ఆతఁడు పరీక్షిన్మహారాజు రాజ్యమంతటను వ్యాపించెను. పృథ్వియందంతటను ఆతఁడు తన యధికారమును స్థాపించెను. కలి తన ప్రబల ప్రభావమును గొంచెమైనఁ జూపజాలనంతటి ధర్మాత్ముఁడా పరీక్షిన్మహారాజు. ధరణీసుర శాపవశమునఁ దక్షక వ్యాళ దశనమున ధరణీశుఁడు భగవద్ధామమును జేరఁగానే కలి విచ్చలవిడిగ నాడఁజొచ్చెను.

మునులారా! చూడుఁడెంతటి ఆశ్చర్యకరమగు విషయమో? గర్భములో ద్రోణుపుత్రుఁడగు నశ్వత్థామ వేసిన బ్రహ్మాస్త్రముచేఁ జావకుండ నద్భుతకర్ముఁడగు వాసుదేవ భగవానుఁడు తన చక్రముద్వారా గర్భమునఁ బ్రవేశించి యెవనిని రక్షించెనో, అట్టి మహారాజుకూడ ఒక సాధారణ తక్షకునిద్వారా మరణించినాఁడు. మహావిషధరమగు తక్షకునిచేఁ గాటు వేయఁబడినప్పటికిని, ఫలాని దినమునఁ దక్షకునిచేఁ దప్పకఁ గాటువేయఁబడుదునని యేడు దినములకుఁ

బూర్వమే ఆతనికిఁ దెలిసినప్పటికిని ఆతని చిత్తము భగవానుని యందు లగ్నమగుటచే విప్రశాపమువలనఁగాని, తక్షక విష భయముచేఁగాని ఆతఁడు వికలుఁడు కాలేదు. ఆతఁడు గంగా తటమునఁ బరమహంస శిరోమణియగు శుకుని శిష్యత్వమును స్వీకరించి, ఆతనిద్వారా భగవత్స్వరూపజ్ఞానమును బ్రాప్తింపఁ జేసికొని, తన యీ పాంచభౌతిక దేహమును నవ్వుచు నవ్వుచుఁ ద్యజించెను. ఏదినమున నాతఁడు శాపవృత్తాంత మును వినెనో, ఆదినముననే రాజ్య, కోశ, సేననంతను బరిత్య జించి సర్వసంగ వినిర్ముక్తుఁడయ్యెను. ఋషులారా! దీని కాశ్చర్యపడవలసిన దేమియును లేదు. భగవద్భక్తి ప్రభావ మిట్టిది. నిరంతరము వాసుదేవభగవానుని వార్తల నెవరు వినుచుందురో, శ్రవణములద్వారా కమనీయ కథామృతము నెవరు పానము చేయుచుందురో, మనస్సుద్వారా ఆతని చరణకమలముల నిరంతరము చింతన మెవరు చేయుచుందురో వానికి అంత్యకాలమందు అనంత మృత్యువేదన కలిగినప్పటికిని కష్టముండదు. ఆతఁడు నవ్వుచునవ్వుచు సర్పమెట్లు తన కుబుస మును విడుచునో అట్లే యీ నశ్వర శరీరమును ద్యజించును.

మునులారా! మీరు నన్ను పరీక్షిన్మహారాజు చరి త్రము నడిగితిరి. దానిని మీకు ఉన్నదున్నట్లుగఁ జెప్పితిని. ఆతని పూర్వజులను గూర్చి మీకు సంక్షేపముగఁ బరిచయము కావించి, ఆతని పుట్టుట మొదలుకొని గిట్టుటవఱకు కథనంతను మీకు వినిపించితిని. ఇప్పుడు మీరేమి వినఁదలఁచుచున్నారు? మీకిప్పుడేమి కథను జెప్పవలయును? శ్రీకృష్ణ గుణగాథలు, ...న్నకథలే వినవలసినకథలు. సాధారణులకథలు విషయ

వార్తలతో నిండియుండును. భగవద్భక్తుల కథలలో భగవన్మహిమాభివర్ణనమే యుండును. కావున నున్నతిని గోరువారు భక్తులయొక్కయు, భగవానునియొక్కయు కథలను విడిచి, అన్యకథలను బొరపాటుననైన వినకూడదు.''

సూతునియొక్క యీవాక్యములను వినఁగానే మునులందఱకును మిక్కిలి ఆనందము కలిగెను. భక్తునియొక్కయు, భగవంతునియొక్కయు కథలను, వారిమహిమలను వినఁగానే వారికి రోమాంచమయ్యెను. కంఠము గద్గదికమయ్యెను. కన్నులవెంటఁ బ్రేమాశ్రువులు రాలెను. వారు సూతునిఁ బ్రశంసించుచు నందఱు నైక్యకంఠముతో నిట్లనిరి:—''సూతా! మహాభాగా! సౌమ్యా! చిరంజీవివి కమ్ము. వేయి యేండ్లు ఆయువు కలుగుఁగాక! ఆహా! ప్రపంచమున నీకుఁబోలు ఉపకారి యెవఁడుండఁగలఁడు? మరణశీలురగువారి నందఱ నమరులఁజేయు కథలను నీవు మాకు వినిపించుచున్నావు. మరణాసన్నులగువారి నోటఁ గృపతో స్వతః అమృతమును బ్రుమ్మరించుచున్నావు. అనంతకీర్తియగు వాసుదేవభగవానుని నిర్మలకీర్తిగల కథలెన్ని విన్నను దృప్తి కలుగుటలేదు. కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచు ముక్తవైకల్యుండెవ్వఁడు తృప్తుఁడగును? ఏవిధమగు లౌకిక, వైదిక కర్మలచేతను బ్రాప్తింపని శ్రేష్ఠఫలమును నీవు మా కొసంగుచున్నావు.''

చేతులు జోడించి, తలవంచి దీనతతో సూతుఁ డిట్లనెను:— ''మునులారా! మీయాశీర్వాదము నాకు పరమకల్యాణ కారకమైనది. మీరందఱు ఉత్తమఫలము నొసంగునట్టి, అత్యంత విధివిధానముగ మహాయజ్ఞమును జేయు

చున్నారు. నావలనఁ గాదగు నేదో చేతఁగాని సేవ చేయు చున్నాను.''

అంత శౌనకుఁడిట్లనెను:— ''సూతా! ఇది సత్యమే. మేమందఱమును దీర్ఘసత్రములోఁ బ్రవృత్తులమైనాము. కాని దీనిఫలము విషయములో మాకందఱకును సందేహము కలుగు చునే యున్నది. విధి విపరీతమగు నప్పుడు, అచ్చట పేడ బెల్లము ఒక్కటగును. చేసినదంతయు వ్యర్థమగును. ఈవిధి ప్రధాన యజ్ఞములో నడుగడుగునకు సందేహమే. విధిహీన మగు యజ్ఞము నొనర్చినఁ గర్త తత్కాలముననే వినాశముఁ జెందునని శాస్త్రవచనము. కావున నీ మహాయజ్ఞములో నేదైన నిశ్చిత మహాఫలము మాకు లభించెనా అది నీ ముఖ మున శ్యామసుందర కథామృతమును వినుటవలననే లభించు చున్నది మీరు కథను వినుపించుటకాదు; యజ్ఞధూమముచే ధూమ్రావరణము చెందిన మాచెవులను దానపాత్ర కావించి దానిలో నానందకంద శ్రీనందనందనకృష్ణచంద్రుని విశ్వవందిత చరణారవింద మధుర మధువును గుమ్మరించు చున్నావు. దానివలన మాకు నిరంతరము తృప్తికలుగుచున్నది.''

సూతుఁ డిట్లనెను:— ''మహాత్ములారా! మీరంద ఱును వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు, విద్యావృద్ధులు, తపో వృద్ధులు. పూజనీయుఁడగు నాతండ్రికిఁగూడ ఆదరణీయులు, వందనీయులును. నేను చాల కొద్దికాలమునుండియే మీసేవ చేయుచున్నాను. నేను కథను జెప్పి మిమ్ముల నందఱను దృప్తి పఱుపఁజాలను. మీరిన్ని కథలను వినియు నతృప్తులై యున్నారు. ఇంక నెల్లప్పుడును వినఁ గుతూహలపడుచున్నారు.

నేను చెప్పుదానిలో నేదైన దోషముండెనా మీకు మిక్కిలి సంతోషము కలుగదు.''

అంత ఋషులు సూతునితో నిట్లనిరి:— " కాదు, సూతా! అట్లుకాదు. అల్పకాలముచే నేమగును? భగవద్భక్తులైన వారియొక్కయు, శ్రీకృష్ణ చరణారవిందములపై నహైతుక భక్తులయొక్కయు సంగమొక్క క్షణము లభించినను, ఆక్షణకాల సత్సంగసుఖముతో స్వర్గమోక్షసుఖములు కూడ సమానము కాఁజాలవన నీక్షణభంగుర, అనిత్య, నాశవంతములగు మర్త్యలోక సుఖముల లెక్కయేమి? సూతా! భక్త సత్సంగములో నెంతటి సుఖము కలదో, వారి వాక్కులలో నెంతటి మధురము కలదో అది చెప్పదగినది కాదు; అనుభవింపఁ దగినది. ఎక్కడైన భగవద్భక్తుఁడు లభించి, భగవచ్చర్చ చేయునెడల, నచ్చట సత్సంగరూపమగు గంగయొక్క సుందర, స్వచ్ఛ, సుఖకర, సర్వహితకర ప్రవాహము ప్రవహించుచుండును. దానిలో మునిఁగిన సంసారతాప సంతప్తజీవి నిస్తాపుఁడగును.

ఇఁకఁ దృప్తివిషయమున్నది. సూతా! ఎవనికి భగవత్కథారసము కొంచెమైనఁ బ్రాప్తించినదో, ఎవని జిహ్వాచే నా మధురాతి మధుర రసబిందు వొక్కటి పొరపాటుననైనఁ దాఁకెనా, అతఁ డెన్నటికైనఁ గృష్ణకథను విడుచునా? అతని కెన్నటికైనఁ దృప్తి కలుగునా? శేషుఁ డాతని సహస్రఫణములతో భగవత్కథలను నిరంతరము వర్ణనచేయుచుండును. అనేక కల్పజీవులును, చిరంజీవులునగు ఋషులు, మునులు, సిద్ధులు మొదలగువారు సృష్ట్యాదినుండి అంతమువఱకు విను

చుందురు. వారికి తృప్తికలుగదు. ఈ రసమును నిరంతరము పానము చేయుచున్నప్పటికిని వారికాతృష్ణ యింకనెక్కువగఁ బెరుగుచునే యుండును. ఇతరుల విషయమును బోనిండు. భగవంతునకభిన్న స్వరూపులనఁబడు అజరుద్రాదులుకూడ నిర్గుణుఁడగు శ్రీహరిగుణముల పారము కానలేకున్నారు. వారుకూడ భగవద్గుణ వర్ణనలనన్నిటినిఁ జేయఁజాలకున్నారు.

సూతా! నీకు భగవత్కృప కలదు. భగవచ్చరిత్రములందానందము లభించును. నీవాక్కులో రసముకలదు. నీవు భగవత్కథలను జెప్పుచుఁజెప్పుచు గద్గదికుఁడవగుచుందువు. నీ శరీరమందంతటను సమస్త సాత్త్విక వికారము లుదయించుచుండును. నీవు వర్ణించుచుఁ దన్మయుఁడగుచుందువు. సాంసారిక కార్యములు నీకును లేవు, మాకును లేవు. సాంసారికులు మన సాధువులను వ్యర్థులనుచుందురు. అనుకొననిమ్ము. మనమెవరిని బట్టియుఁ బోనవసరము లేదు. ఎవని కెట్టి భావము కలదో వాఁడట్టి భావానుసారముగఁ దలఁచు చుండను. యథార్థమునకు మనము సాంసారికముగ వ్యర్థులమే. మనకున్న యేకైక కార్యము కృష్ణకథాశ్రవణము చేయుటయు, నందఱతోఁగలసి శ్రీకృష్ణకథాకీర్తనము చేయుటయునై యున్నది. నీవు వినిపింప నుత్సాహుఁడవై యున్నావు. మేము వినుటకుఁ దహతహ లాడుచున్నాము. నీకెంత చెప్పినను అలుపురాదు. మాకెంత విన్నను గడుపు నిండదు. ప్రపంచమున నలుదిశలఁ గలియుగము వ్యాపించినది. ఈ కలియుగ జీవులకు లోకాభిరామాయణము విను వ్యసన మలవాటైనది. వారికీ భగవత్కథలు నచ్చవు. వీటిని వినిన వారి కానందము లభింపదు.

కావున నీవు తిరిగి ప్రచారముచేయు వాసనను వీడుము. రమ్ము. మాకు విస్తారముగ మనోహరములును, హృదయమును సరళముగను, సరసముగను నొనర్చు శ్యామసుందర సచ్చరిత్రమును శ్రవణానందముగ వినిపింపుము. లీలాధారియొక్క లీలలను జెప్పుము. ఈవిధముగ మనమందరమును గలిసి కృష్ణకథాకాలక్షేపము చేయుదము. సమయసార్థకత భగవచ్చర్చలోనే కలదు.

నీవు పరీక్షిన్మహారాజుయొక్క ఉత్తరచరిత్రమును అతి సంక్షేపముగఁ జెప్పితివి. కథాకథనమందుఁ బ్రాచీనప్రణాళి మొదట సంక్షేపముగఁ జెప్పుటయును, దర్వాత విస్తారముగఁ జెప్పుటయునని నీవు మొదటనే చెప్పియుంటివి. మేమిప్పుడు పరీక్షిన్మహారాజు యొక్క నిధన సమాచారమును విన నుత్సుకులమై యున్నాము. పరీక్షిన్మహారాజునకు బ్రాహ్మణశాప మేల వచ్చినది? ఆతఁడు రాజ్యమును వదలి గంగాతీరమున కెట్లు వెళ్లెను? ఇంతమంది ఋషులచ్చటికి అంత త్వరగా నెట్లు వచ్చిరి? పరమహంస శిరోమణియు, విరక్తుఁడును, అవధూతయు, వ్యాసనందనుఁడును శ్రీ శుకమహర్షి అచ్చటి కెచ్చటి నుండి వచ్చెను? పరీక్షిన్మహారాజాతని నేమేమి ప్రశ్నించెను. శ్రీ శుకుఁడు వాని కేమి ప్రత్యుత్తర మొసంగెను? పరీక్షిన్మహారాజు గొప్పధర్మాత్ముఁడు, సాధుసేవకుఁడు, గుణవంతుఁడు. అట్టివాఁడు శ్రోత, ప్రశ్నకర్త అయియుండఁగా, అట్లే జ్ఞాన, భక్తి, త్యాగ, వైరాగ్యములకు సాక్షాత్స్వరూపమగు శుకదేవుఁడు వక్తయు, సంశయచ్ఛేత్త అయియుండఁగా, అట్టి వారిద్దరకును జరిగిన సంవాదము అత్యంతాద్భుతముగ నుండఁ

గలదు. దానిలో సర్వత్ర భగవద్భాగవతుల మహిమాభి వర్ణన ముండి యుండవచ్చును. దయయుంచి యీ సమస్త విషయములను నీవు విస్తారముగ మాకు వినిపింపుము. సమయ మల్ప మనుకొనకుము. కాల మనంతము. విస్తారమని యేవిష యమునైనను కొంచవగ వర్ణింపకుము. ఏలననఁగాఁ గొంచతగఁ జెప్పిన విషయములు మనస్సునకుఁ బట్టవు. ఎట్టివారైనను దెలిసికొనఁ గలుగునంత సరళముగఁ జెప్పుము. శాస్త్ర తర్క ములను వదలి సరళ భగవచ్చరిత్రమును సరళముగ వర్ణిం పుము. మహాభాగవతుఁడును, మహాబుద్ధిమంతుఁడును, మహా మహిముఁడు నగు పరీక్షిన్మహారాజే జ్ఞానమును శ్రవణము చేయుటచే గరుడధ్వజ వాసుదేవ భగవానుని చరణకమలము లందు వీలీనుఁడయ్యెనో అట్టి జ్ఞానమును నీవు మాకందఱకును జెప్పుము. పరీక్షిన్మహారాజు యొక్క అద్భుత చరిత్రమును గూడ మాసమ్ముఖమునఁ జెప్పుము.''

ఇట్లు పలికి సమస్త ఋషులును, మునులును సూతుని వైపు ఉత్సాహముతోఁ దదేక భావముతోఁ జూచుచుండిరి.

ఛప్పయ.

శౌనకాది ముని కృష్ణ కథా సుని అతి హర్షాయే।
ఆశిశ దీన్హీఁ డారి హృదయసు తేఁ సూత లగాయే॥
అశ్రు విమోచన కరేఁ సూత తేఁ పూఁచేఁ పునిపుని।
తృప్త నహోవేఁ మధుర సుఖద హరిలీలా సునిసుని॥
సబ ఋషి బోలే- సూతజీ, పుని హరికే గున గాఇయే।
నృపతి పరీక్షిత్ చరిత శుభ, శుక సంవాద సునాఇయే।

అర్థము.

శౌనకాది ఋషులు కృష్ణకథామృతమును విని మిక్కిలి ఆనందించిరి. ఆశీర్వదించి, పరువిడి సూతుని హృదయముతోఁ గౌఁగిలించుకొనిరి. కంట నీరుగార్చుచు సూతుని మాటిమాటికి యిట్లడిగిరి:— "సూతా! మధురమును, సుఖదమునగు హరి లీలలను వినఁగా వినఁగా మాకు తృప్తి కలుగుటలేదు. మరల హరిగుణగానమును గావింపుము. పునీతుఁడగు పరీక్షిచ్చరిత్ర మును, ఆతనికిని శుకునకు జరిగిన సంభాషణమును మాకు వినిపింపుము."

—:0:—

## పరీక్షిత్తు శమీకముని ఆశ్రమములో

౩౬

శ్లో॥ ఏకదా ధనురుద్యమ్య విచరన్ మృగయాం వనే,
మృగా ననుగతః శ్రాంతః క్షుధిత స్తృషితో భృశమ్॥
జలాశయమచక్షాణః ప్రవివేశ తమాశ్రమమ్,
దదర్శ మునిమాసీనం శాంతం మీలితలోచనమ్॥

— శ్రీ భాగ. ౧ స్కం. ౧౮ అ. ౨౪, ౨౫ శ్లో.

వ. ఇట్లు వాటంబయిన వేఁటతమకంబున మృగంబుల వెంటం దగిలి (వెగుచుచుం దిఱుగుటంజేసి) బుభుక్షా పిపాసల వలన మిగులఁ బరిశ్రాంతుండయి ధరణీకాంతుండు చల్లని నీటి కొలంకుం గానక కలంగెడు చిత్తంబుతోఁ జనిచని యొక్క తపోవనంబుఁ గని యందు మెలఁగుట చాలించి

మీలితనేత్రుండై శాంతుఁడై కూర్చుండియున్న మునిని గాంచెను. — శ్రీమదాంధ్రభాగవతము.

ఛప్పయ.

గద్గద హ్వై కేఁ సూత ఋషిని తేఁ బోలే బానీ।
కృష్ణ కృపా కో పాత్ర బన్యో అబ మైఁ నే జానీ॥
కృష్ణ చరిత హైఁ అమిత సభీమతి సరిస సునావేఁ।
నిజ బలకే అనుసార పక్షీ నభ మాహీఁ ఉడావేఁ॥
కీర్తనీయ గుణకర్మ అతి, జినకే పరమ ఉదార హైఁ।
ధని ధని తే నర తినహీఁ జే, సునహీఁ గునహీఁ ధుని తేఁ కహైఁ॥

అర్థము.

గద్గదికుఁడైన సూతుఁడు ఋషులతో నిట్లనెను:— "ఇప్పుడు నేను కృష్ణకృపాపాత్రుఁడనైతిననుకొనుచున్నాను. కృష్ణచరిత్ర మనంతము. కాని నాకుఁ దోఁచినంతవఱకు వినిపించెదను. నభము పెద్దదైనను పక్షి తనబలము ననుసరించియే కదా యెగురునది.

ఎవనియొక్క యతి కమనీయ గుణకర్మలు పరమోదారములో అట్టివానిని వినువారును, జెప్పువారును ధన్యులు కదా!



గుణము తెలియనివాఁడా గుణము కలవానిని బ్రశంసించుచో బుద్ధిమంతుఁ డగువాఁడు దానివలనఁ బ్రసన్నుఁడు కాఁడు. ఇంతే కాదు— అది పరిహాసమనియుఁ దలఁచును;

కాని యూ గుణమర్మజ్ఞుఁడు ప్రశంస చేయు నెడల గుణవంతుఁడు తనకున్న యాగుణము సాఫల్యము తెచ్చెననుకొనును. వాని రోమరోమము ఆనందముచే నుప్పొంగిపోవును. ఆతఁడు తన పరిశ్రమము సార్థకమైన దనుకొనును. మఱియుఁ బ్రశంసచే నత్యంతోత్సాహమును బొంది తన కళను ఇంకను ఉత్తమోత్తమముగఁ బ్రదర్శించును.

ఋషులు సూతుని భగవద్భక్తిని గూర్చియు, నాతని కథాకథన శైలిని గూర్చియు నతిశయముగఁ బ్రశంసింపఁగా సూతుని హృదయము స్నేహముచే నిండిపోయెను. ఆతని కంఠము గద్గదిక మయ్యెను. నేత్రములఁ బ్రేమాశ్రువులు ప్రవహించెను. ఆతఁడు తన ప్రేమ వేగము నాపుకొని, మిక్కిలి కఠినతతో గద్గదస్వరముతో నిట్లనెను. ఆతని శబ్దము స్పష్టముగ వెలువడుట లేదు. ఆతఁ డశ్రువులను దుడిచికొని యిట్లనెను:— "ఋషులారా! నేడు నేను ధన్యుఁడనైతిని. నీచకులములోఁ బుట్టినవాఁడు సజ్జనసభలోఁ గూర్చుండినపుడు తన కులాగత నీచతనుగూర్చి మానసికవ్యథ కలుగుచుండును. కాని నీచుఁడైనను జ్ఞానముగల వృద్ధభగవద్భక్తుల ననువర్తనము కావించుచో, వారితో సత్సంగము కావించిన వాని మానసికవ్యథ దూరమగును. మహాత్ములతోడి సత్సంగము, శ్రద్ధతో వారికి చేసిన సేవ, భగవద్భక్తి యివి సమస్తవిధము లగు నీచత్వమును నాశము కావించును. నా జన్మ విలోమ జాతిలోఁ గలిగినది. బ్రాహ్మణి తల్లియందు క్షత్రియవీర్యముచేఁ బుట్టిన జాతి సూతజాతి. శాస్త్రము ననుసరించి నాకు ద్విజసమ్ముఖమునఁ గూర్చుండు నర్హత లేదు; కాని మీరందఱు

నన్నింతగా నాదర సత్కారము లొనర్చుచున్నారు. ఆచార్యుని, గురువును బూజించునట్లు పూజించుచున్నారు. దీనికి కారణము నేను గాదు, భగవచ్చరిత్రము. గురుదేవుఁడగు శ్రీ శుకమహర్షియొక్క ప్రత్యక్ష కృపాప్రసాద మిది. జ్ఞానవృద్ధులును, గులీనులునగు మీ అందఱకును గథలను వినిపించి నేఁడు నేను గృతార్థుఁడ నైతిని. భక్త సంసర్గముచే శ్వపచుఁడు కూడ పూజ్యుఁడు కాఁగలఁడు. అదియును గాక సాక్షాత్తుగ శ్రీహరి సుమధుర నామకీర్తనము చేయువాని యొక్కయు, నుచ్చస్వరమున గానము చేయువానియొక్కయు సంగతి చెప్పవలసిన దేమున్నది? భగవంతునిలో నెన్ని యనంత గుణములు కలవో అన్నియుఁ ద్రైలోక్యపావనములగు నాతని నామములోఁ గలవు. భగవన్నామమును గూర్చి ప్రత్యక్షముగ వర్ణన మెవరును జేయఁజాలరు. కిముతక న్యాయముచే వాటి మహిమ నూహింపవచ్చును. కిముతక న్యాయమనఁగా లఘువుయొక్క మహత్వ లఘుత్వములను వర్ణించి, దాని లఘుత్వమహత్వములతోఁ బాటు గొప్పదాని మహత్త్వ లఘుత్వములనుగూర్చి గొప్పగఁ జెప్పుట. 'ఉఫ్' అనిన మేరువే యెగిరిపోవుచుండఁగా నిఁక గడ్డిపోఁచ లెక్కయేమి కలదు? సముద్రము నాపోశన పట్టిన అగస్త్యునకు పంచపాత్రజలము లెక్కయా? ఇచ్చట నగస్త్యునిమహత్వము చెప్పవలసి యున్నది. సముద్రము గొప్పది. దానిని ద్రాగుట ఆశ్చర్యకరమగు విషయము. అట్టివానికి చిన్నచిన్న జలాశయములు తుచ్ఛాతుచ్ఛములు. అనఁగా నాతని శక్తి సముద్రముకంటెఁ గూడ మిక్కిలి గొప్పది. భగవన్మహిమను

గూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు, అందఱకంటె నెక్కుడగు లక్ష్మీదేవిని గూర్చి చెప్పవలసియున్నది.

లక్ష్మీదేవి కృపాకటాక్షముతో నొక్కసారి తమ వైపునఁ జూచినఁ జాలునని బ్రహ్మాదిదేవత లెల్లప్పుడు నుపాసనఁ జేయుచుందురు. అట్టి లక్ష్మీదేవి, శ్రీహరి చరణారవిందములను ఆయన వలదనుచున్నను సేవించుచు వీడిపోవదు. అట్టివాని మహాత్మ్యమేమని చెప్పవలెను? ఎవరితోఁ బోల్చవలయును? ఆతని ప్రభావమును వర్ణించు ప్రభావ మెవరికడఁ గలదు?

శ్రీహరియొక్క సమస్త అంగముల కథ నట్లుంచుఁడు. ఆతని పాదపద్మ మకరంద మహాత్మ్య మింతయని చెప్పవీలు లేదు. ఆ పాదపద్మములకుఁ దాఁకిన జలకణము సమస్తలోకములను బావనము చేయు సామర్థ్యము కలిగియున్నది. జగత్పావనము కావించు త్రిపథగామిని భగవతీ భాగీరథి తీసివేసి నదా యేమి? త్రివిక్రమావతారమున బలిని మోసముచేయు సమయమున వామనుఁడు విరాడ్రూపమును ధరించెను. అప్పుడాతఁడు ఆకాశమును గొలుచునపుడు ఆతని శ్రీచరణము సప్తలోకములు దాఁటి బ్రహ్మలోకమునకుఁ బోయెను. అచ్చట మెఱయుచున్న ఆతని చరణాంగుష్ఠ నఖమును బ్రహ్మ తన కమండలువు జలములచేఁ గడిగెను. ఆనీరే జగద్వంద్యమగు దేవనదిగ నిర్మల ప్రవాహమున బయలువెడలెను. అది సమస్త లోకములను బావనము కావించుచు భూమిమీఁదకు దిగునప్పుడు, దానినిఁ బరమ పావనముగ భావించి పశుపతి యగు పరమేశ్వరుఁడు శ్రద్ధాభక్తులతోఁ దన శిరస్సున ధరిం

చెను. ఆయన పాదాంగుష్ఠజలమే యింత ప్రభావము కలిగి యుండఁగాఁ బరమేశ్వరవాచ్యుఁడగు భగవంతుని గూర్చి యింకేమి చెప్పవలయును?

రాజర్షుల గృహములందును, భగవద్భక్తుల గృహము లందు నేమి తక్కువగ నుండఁగలదు? అష్టసిద్ధులు, నవనిధులు చేతులు జోడించుకొని వారి సమ్ముఖమున నిలుచుండును; కాని యెవనియం దనురక్తులై యా ధీరవీరులు ధన, రత్న, దారాపుత్ర రాజ్యములను, సమస్త శారీరక సుఖములను వీడి త్యాగులు, విరాగులు నగుచుందురో, పరమహంస వృత్తిని ధరించి యింటింట బిచ్చమెత్తుకొనుచుందురో, సమస్తవిధముల హింసారహితులై, వాఙ్నిరోధము కావించి మనన శీలురగు ముని యగుచుందురో, అట్టివాని గుణ, సౌందర్య, మహిమ, ప్రభావముల నెవరు వర్ణింపఁగలుగుదురు?''

అంత శౌనకుఁడిట్లనెను:— ''సూతా! మీరిన్ని యుప మానము లొసంగి భగవానుని అవాచ్యునిఁగఁ జేయు చున్నారు. అట్టియెడ భగవత్సంబంధమున నొక్క శబ్దమైనఁ జెప్ప వీలులేదు.''

సూతుఁడు శీఘ్రముగ నిట్లనెను:— ''లేదు, మునివరా! నా యభిప్రాయ మదికాదు. వాస్తవముగ భగవద్గుణము లవాచ్యములే. ఆయన అకథనీయుఁడని చెప్పఁబడినాడు. కాని చెప్పకుండఁజాలము. ఏలననఁగాఁ గథన యోగ్యమైనది ఆతని కమనీయ కీర్తి యొక్కటియే. గుణగానము చేయఁదగినవి గోవింద గీతములే. శ్రవణయోగ్యమైనది పుణ్యశ్లోకుఁడగు

నందనందనుని అనుపమ చరిత్రయే. అందఱు నాతని వర్ణించిరి. అట్టిదాని పారమును బొందఁగలమనికాని దానినిఁ బూర్తి కావింపగలమని వారి కాశలేదు; కాని తమ వాక్కును బవిత్ర మొనర్చుకొనుటకును, తమ జీవితమును సుఖమయ మొనర్చు కొనుటకు నందఱు నాతని గూర్చి చెప్పుకొనుచుందురు. ఆకాశ మనంతము. దాని పారమును గనుఁగొనుట అసంభవము; కాని దానిమీఁదకుఁ గూడ పక్షులెగురును. దానిని దాఁటుటకుఁ గాదు, వాని వృత్తి నెఱపుకొనుటకుఁ దమ సామర్థ్యము కొలఁది యెగురుచుండును. నేనును నాశక్తి ననుసరించి, నాబుద్ధి ననుసరించి, నావాక్కును బవిత్రమొనర్చు కొనుటకు భగవంతునియొక్కయు, భక్తులయొక్కయు చరిత్రలను జెప్పుదును. మీరందఱు సావధానులరై శ్రవణము చేయుఁడు.''

మీరు నన్ను పరీక్షిన్మహారాజుయొక్క ఉత్తర చరిత్రమును గూర్చి ప్రశ్నించితిరి. ఆ కథను మరల నారంభించెదను. మహారాజు దిగ్విజయముచేసి తన రాజధానియగు హస్తినాపురమునకు రాఁగానే ప్రజలందఱు మిక్కిలి ప్రేమోల్లాసములతో నాతనికి స్వాగతము నొసంగిరి. వివాహ సమయమునఁ బెండ్లికూఁతురు అలంకరింపఁబడినట్లును, అత్తవారింటికి పోవు క్రొత్తకోడ లలంకరింపఁ బడినట్లును నగర మలంకరింపఁ బడెను. ఉత్సవములందును, పండుగ సమయములందును దల్లులు తమ పిల్లలకు వివిధములగు నలంకారములు చేయునట్లు సమస్తప్రజలు మహారాజునకు స్వాగతమొసంగుటకు రాజాజ్ఞ లేకయే తమతమ గృహముల నలంకరించిరి. వసంతమున

వివిధపుష్ప సమన్వితమగు వనమునఁ గేసరి ప్రవేశించినట్లు మహారాజు శృంగారింపఁబడిన పట్టణమునఁ బ్రవేశించెను. ఇంద్రుఁ డమరావతిలోఁ బ్రవేశించినట్లు పరీక్షిన్మహారాజు హాస్తినాపురములోఁ బ్రవేశించెను. అత్యంతోత్కంఠతను జెందిన ప్రోషిత భర్తృక చిరకాలము పరదేశమునకుఁ బోయిన తన పతినిఁ బొంది పరమానందము చెందినట్లు, చిరకాలమునకుఁ దమ ప్రభువును గాంచి పరమానందమును జెందిరి. నగరమునఁ బ్రవేశించి రాజు, తన ప్రజలను పరదేశమునుండి వచ్చిన తండ్రి తన పుత్ర పౌత్రుల నాదరించి ప్రేమించి సంతోషపెట్టినట్లు యథాయోగ్యముగ నందఱను సమానభావముగ సంతోషపెట్టెను.

ఈవిధముగఁ బరీక్షిన్మహారాజు తన రాజ్యమునకు వచ్చి సుఖముగ ధర్మముగఁ బరిపాలించుచుండెను. ఆతనికి శత్రువులుగాని, ప్రతిపక్షులుగాని లేరు. ఆతఁడెప్పుడును ధర్మకార్యములందే లగ్నమై యుండెడువాఁడు. ఆతఁడు మనస్సుతోనైనఁ బాపకార్యములను దలఁచెడువాఁడు కాఁడు. రాజు భార్య మహాపతివ్రత. ఆమె స్వయముగ పతినిసేవించుచు, నాతని దన ప్రాణములకంటె నెక్కుడుగఁ జూచుచుండెను. ఆతనికి జనమేజయుఁడు, శ్రుతసేనుఁడు, భీమసేనుఁడు, ఉగ్రసేనుఁడను నల్గురు కొడుకులు కలిగిరి. నలుగురును రూపవంతులు, సుశీలురు, ధర్మాత్ములు, పితృభక్తులు. మహారాజు యొక్క మంత్రులు, అమాత్యులు, సేనాపతులు, కోశాధ్యక్షులు, ఇతర భృత్య దాసదాసీజనము లాతని యాజ్ఞాను

వర్తులై యుందురు. ఈ విధముగ మహారాజునకు సాంసారిక సుఖములన్నియుఁ బ్రాప్తించెను.

పరీక్షిత్తుని భార్యయగు ఇరావతీదేవి చిన్నదై పుట్టినింట నుండఁగా నామెకడ కొక జ్యోతిష్కుఁడు వచ్చెను. రాజకుమారియగు నిరావతి వివాహిత కాకున్నను, తెలివి కలది. పెద్ద, చిన్నలను బాగుగా నెఱుఁగును. ఆమె తల్లి యామె చేతిని జ్యోతిష్కునకుఁ జూపించెను. మునులారా! తల్లికి తన కూతుంబ్ర విషయములో నొక్కటే కోరిక యుండును. అదేమనఁగా నామెకు మంచిసంబంధము కుదుర వలయు ననియు నామె సుఖింపవలయుననియునై యున్నది. ఆర్యసంస్కృతి యెట్టి శీలసంయుక్తమగు సదాచారము! ఏ స్త్రీతో జీవితకాలమంతయు వెళ్లఁబుచ్చవలయునో అట్టి భార్యవిషయమున భర్త యేమియును జేయఁడు. తల్లిదండ్రులు తమ పుత్రికా పుత్రుల సంబంధము కొఱకెంతగా చింతితులై వ్యగ్రతను జెందియుందురో చెప్ప వీలులేదు. వయస్సు వచ్చు సమయములో, యావనావేగమున సంసారచక్రమును లాగుటకుఁ దనకుఁ దగిన వధూవరుల నెన్నుకొనుటకుఁ దగిన వివేకము యువక యువతుల కుండఁజాలదు. ఈ చింత తల్లిదండ్రులకే యెక్కువగ నుండును. పిల్లలు హృదయములో దీనిని గోరుచుందురు; కాని వారిముందు వివాహము సంగతి నెత్తితిమా వారు సిగ్గుపడి కపటకోపము నభినయింతురు. తెలిసినవారందఱు నీకోపము కపటకోపమని తెలిసికొందురు. ఈ కోపములో నొక రహస్య మిమిడియున్నది. మనస్సులోఁ గుతూహలమే కాని పైకి తలయూఁపుదురు. ఇరావతీయొక్క

తల్లి జ్యోతిష్కునకుఁ గూఁతురు చేయి చూపుచు మొట్ట మొదట నిట్లు ప్రశ్నించెను:— "స్వామీ! ఈమె కెట్టి పతి లభించును? సుందర రాజకుమారుఁ డీమెకు పతి కాఁగలఁడా? లేదా? ఈమె మహారాణి కాఁగలదా? కాదా?" చిన్నపిల్ల యగు నిరావతీదేవి లజ్జించెను; కాని తల్లి యామెను గసరి వడిలోఁ గూర్చుండఁబెట్టుకొనెను. జ్యోతిష్కుఁడు చూచు చుండెను. చేతిని జూచుచు జ్యోతిష్కుఁ డిట్లనెను:— "మహా రాణీ! ఈమె చేతిలో చక్రవర్తికి భార్య కాఁగల గీటు కలదు. ఈమె రాజర్షికి భార్య కాగలదు. ఈమెకు లోక ప్రసిద్ధులరై అశ్వమేధయాగములు చేయునట్టి నల్గురు రాజర్షు లగు పుత్రులు కలుగఁగలరు. ఈమె అందఱకు యజమాని కాఁగలదు. అందఱీమె సమ్ముఖమునఁ దలలు వంచెదరు; కాని ఒక్క అశుభ రేఖ కలదు. దానిని జెప్పుట నాకిష్టము లేదు."

మహారాణి హృదయములో శంక కలిగెను. అనిష్ట ముండియు, జ్యోతిష్కులు చెప్పకుండిన నే బాధయు లేదు కాని ఏదో విషయమును వినిన దానిని సరిగా దెలిసికొనుటకు తీవ్రేచ్ఛ అందఱకు జనించును. దాఁచిన వస్తువేదియో తెలిసి కొనవలయునని. ఆత్రతకలుగుట అందఱకును స్వాభావిక మే.

రాణి పట్టుదలతో నిట్లనెను:— "లేదుస్వామీ! మీరు సందేహింపవలదు. ఏదైనఁ జెడ్డరేఖ యున్న యెడలఁ జెప్పుఁడు. దానిని నివారించు నుపాయ మిప్పటినుండియే చూచు కొందుము."

రాణి మాటిమాటికి పట్టుదలగాఁ జెప్పుమని బలవంతము చేయఁగాఁ జివరకు దైవజ్ఞుఁడు సమస్తమును జెప్పవలసి వచ్చెను. జోతిష్కుఁ డిట్లనెను — "మహారాణీ! ఈమె మహారాణి యైనప్పుడు ఈమెకు నల్వురు పుత్రులు కలుగుదురు. అప్పుడొకనాఁ డీమె పతి దక్షిణదిక్కుగా మృగయా వినోదమునకై వెళ్లఁగలఁడు. వేఁటలోఁ జాల జంతువులను జంపఁగలఁడు. ఆసమయమున నొక బలమగు హరిణము వెంటఁబడిపోయి చివరకొక ఋష్యాశ్రమమునకుఁ బోఁగలఁడు. ఆఋషికి కొంత యనిష్టకార్య మొనర్చుటచే నాతనివలన శాపమును బొంది మరణింపఁగలఁడు."

ఈ సమాచారమును వినఁగానే రాణికి మిక్కిలి చింత కలిగెను. కుమారియగు నిరావతి ముఖముకూడ వాడిపోయెను. తన వికలత బయటపడకుండుటకై తల్లినడినుండి లేచిపోయెను. జ్యోతిష్కుఁడుకూడ విచారముతో దాన దక్షిణలను గ్రహింపకయే వెడలిపోయెను.

కాలాంతరమునఁ బరీక్షిన్మహారాజునకును ఇరావతీదేవికిని వివాహము జరిగెను. ఇరావతి అత్యంత సౌందర్యము కలది. ఆ కారణమున మహారాజు తన హృదయమును రాఁగానే ఆమె కర్పించెను. రాజదంపతు లిరువురును శచీపురందరులవలె సమస్త రాజ్యసుఖముల ననుభవించుచు హస్తినాపురములో సుఖముగ నుండిరి. అయితే రాణి మనస్సులో నొక శల్యము కలదు. అది జ్యోతిష్కుని వాక్యము. అది మరతుమన్నను ఆమెకు మరుపునకు వచ్చుటలేదు.

ఒక దినమున నేకాంతమున రాణి తన స్నేహము నంతను మహారాజుమీఁద హృదయకలశమున గ్రుమ్మరించుచు నిట్లనెను:— "ప్రాణనాథా! మీ రింత హృదయపూర్వకముగ నన్నుఁ బ్రేమించుచున్నారు. ఇది చాల సౌభాగ్యకరమగు విషయము. స్వర్గములోని దేవాంగనలకుఁ గూడ దుర్లభమగు భోగములను మీరు నా కొసంగుచున్నారు. అయినప్పటికిని మిమ్ములను నే నొక వరమడుగుచున్నాను. మీరు దాని నిచ్చెదనని మాట యిచ్చునెడల మీకు నివేదించెదను.

తన ప్రియురాలి యిట్టి ప్రేమ వచనములను విని మహారాజు ఆమె కన్నులలోఁ దన ప్రేమదృష్టిని బఱపి, ఆలింగనము చేసికొని యిట్లనెను:— "ప్రియా! నేఁడు నీవెట్టి పలుకులు పలుకుచున్నావు? నేఁడు నీవు నేను వేఱు, నీవు వేఱు అనునట్లుగ మాటలాడుచున్నావు. నీవాఁడనగు నాతో నిట్లు మాట్లాడ వచ్చునా? అభిన్న హృదయుల విషయములో శిష్టాచారమునకు స్థానములేదు. నా సర్వస్వము నీ సుఖము కొఱకే. నన్ను వరదాన మడుగఁదలయునా? ప్రార్థించుట యేమి? నన్నాజ్ఞాపింపుము. నీవు సమస్త ప్రజలకు రాణివే కావు నాహృదయమునకుఁ గూడ రాణివే. నీమనస్సులోఁ బుట్టిన కోరిక నెఱవేఱిన దనుకొనవలెను. నీసేవకున కేయాజ్ఞ నొసంగెదవో చెప్పుము."

రాణి ప్రేమకోపస్వరమున నిట్లనెను:— "మీరు నాతో నిట్టి మాటలు పలుకరాదు. నీకు సేవకుఁడను, దాసుఁడనని నన్ను లజ్జింపఁ జేయుచున్నారు; దీనికే నాకు చాల విచారము కలుగుచున్నది. మీరు హృదయపూర్వకముగ నన్నింతగాఁ

ప్రేమించుచున్నది నాకు తెలియును. నాకు నాసౌభాగ్యము నెడల నందఱికంటె మిగుల గర్వముచెంది యున్నాను. నా యీ సౌభాగ్య సుఖము నక్షుణ్ణము కావింప వలయునని వ్యాకులత చెందియున్నాను. మీరు సుఖముగ నుండవలయు ననియు, నిదేవిధముగ యుగయుగాంతరముల వఱకు నన్ను ప్రేమించుచుండ వలయుననియు నాకు దృఢాభిలాష. మీరు సదా యీ వనశైలపూర్ణమగు సప్తద్వీపయుతమగు వసుంధరను శాసించినట్లు నాహృదయమును గూడ మీరు శాసింప వలయును. ఇదియే సర్వోత్కృష్టమగు నా మనోరథము. ఏకార్యము నొనర్చిన మీకణుమాత్రమైన ననిష్టము కలుగునో, దానిని స్వయముగ నేను స్వప్నములోనైనఁ జేయఁదలఁపను. మిమ్ములను నట్లు చేయనీయను. మీరు పొరపాటుననైన దక్షిణదిశకు వెళ్లవలదని నాప్రార్థన.''

మహారాజు నవ్వుచు నిట్లనెను:— ''అసలు విషయమేమి? చెప్పుము, ఎందుకు వెళ్లకూడదో? నేను చక్రవర్తిని. నేను సర్వదిశలకు వెళ్లవలసియుండును.''

రాణి తన పట్టుదలను జూపుచు నిట్లనెను:— ''మీరు వినరని చెప్పుటలేదు. మీరు హఠమొనర్చుచున్నారు. మీ బాహుబలాభిమానముచే మీరెవ్వరి మాటలను వినరు.''

మహారాజు నవ్వుచుఁ దన మాటలను సమర్థించుకొనుచు నిట్లు పలికెను:— ''అటు పోవలదనుచున్న కారణము కూడ కొంచెముగ నెఱుఁగఁజెప్పిన బాగుండును. ఇది విధిలేని ప్రభ్వాజ్ఞవంటిది.''

రాణి కొంచెము కోపముతో నిట్లనెను:— "మీరు ప్రతివిషయములోను నాతో నెగతాళి పలుకుచున్నారు. నే నేడ్చుట లేదు, నాహృదయము విలపించు చున్నది. నాకు ఆంతరిక దుఃఖము కలుగుచున్నది." ఇట్లనుచు ననుచు రాణి వెక్కి వెక్కి యేడ్వఁ బ్రారంభించెను.

మహారాజామెను దగ్గఱకులాగుకొని తన తొడమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని, కన్నులనీటిని దానే తుడుచుచు నత్యంత ప్రేమభావముతో నిట్లనెను:—"నీవు బాగుగా నేడ్చుట నేర్చుకొనినట్లున్నావు. మాటిమాటికి టపటపమని కన్నుల నీరు గార్చుచుందువు. విషయమేమో చెప్పవు, ఊరక పసి పిల్లలవలె నేడ్చుచున్నావు. సరే, దక్షిణదిశకుఁ బోనులే. ఇఁకఁ జెప్పుము, ఏమి చేయవలయునో? ఆదిక్కుకు శిరస్సు పెట్టి నిద్రింపనైన నిద్రింపను. సమ్మతమే కదా!"

రాణి కన్నుల నీరు తుడుచుకొనుచు నిట్లనెను:— "మహారాజా! నా యభిప్రాయ మది కాదు. అసలు విషయ మేమనఁగా నేను మాపుట్టినింట నున్నప్పుడు ఒక జ్యోతిష్కుఁడు వచ్చి నాహస్తరేఖలను గాంచియు, జన్మకుండలిని బరీక్షించియు, దక్షిణదిశకుఁ బోయిన మీకనిష్టము జరుగగలఁదని చెప్పినాఁడు."

రాజు నవ్వుచు నిట్లనెను:— "అబ్బ! యీస్త్రీల కెప్పుడు ననుమానములే కదా! ఎవఁడేమి చెప్పినను నది నిజ మనుకొని దిగులుపడుచుందురు. దక్షిణదిశకు పోకుండ నెట్లు నాకు జరుగఁగలదు. ప్రతిదినము నేనా దిశకు వెళ్లవలసి

యుండున్నది. నాసభకు నీభవనము ఉత్తరదిశయందున్నది. సభాభవనము దక్షిణమున నున్నది కాఁబట్టి మీరు నా మహాలునుండి దక్షిణముగా వెళ్లకూడదనిన నెట్లు జరుగఁ గలదు? ఇఁక నెప్పుడు నీకెదురుగఁ గూర్చుండి రాజకార్యము లన్నియు మానుకొనవలయు నన్నమాటయే కదా!"

రాణి కోపస్వరమున నిట్లనెను:— "మీతో వాదించి యెవ్వరును గెలువఁజాలరు. మీరు దక్షిణపుదిశకే వెళ్లఁ గూడదని నా యభిప్రాయము కాదు. వెళ్లిన వెళ్లవచ్చును రాజ్యకార్యములు కొఱకై. ఆవైపుకు వేఁటకు వెళ్లవలదు."

మహారాజు శీఘ్రముగ నిట్లనెను:— "ఇదిమాత్ర మెట్లు వీలుకాఁగలదు? అచ్చట సింహవ్యాఘ్రాదులు జనమునకు హాని కలిగించుచుండిన వాటిని జంపుటకు వెళ్లవలదా? అట్టి సమయమున నేను వేయిపనులు వదలియైన వెళ్లితీర వలెను."

రాణి యిట్లనెను:— "మీరా సమయమున వెడల రాదని నేననను. మీరా సమయమున వెళ్లుఁడు, కాని వాటిని జంపి వెంటనే తిరిగి రావలయును. అచ్చట వేఁటకు స్వేచ్ఛగా మఱచియైనఁ బోరాదు. ఒకవేళ వెళ్లవలసివచ్చినను ఋష్యాశ్రమమునకు మాత్రము వెళ్లరాదు. ఒకవేళ వెళ్లినను అక్కడ కూర్చుండరాదు."

రాజిట్లనెను:— "నీవు నాకు చాలమంచి నియమములు పెట్టినావు. ఋష్యాశ్రమమునకు వెళ్లి యాతని యాతిథ్యమును గ్రహింపకుండుట రాజునకు సాధ్యము కాఁగలదా?"

రాణి అత్యంత కుపిత స్వరమున నిట్లనెను:— "మీరు వెంద్రుక చర్మము నొలువఁ జూచుచున్నారు. తర్కవాదము కావించి సత్యము నసత్యముగను, నసత్యమును సత్యముగను జేయవలసినది రాజసభలో. నేను మీతో యథార్థమును బలుకుచున్నాను. ఆ జ్యోతిష్కుఁడు సామాన్యుఁడు కాఁడు. దక్షిణ దిశయందు ఒకానొక ఋషికి అపరాధము చేయుటచే మీకనిష్టము కలుగనున్నదని చెప్పినాఁడు. కావున మీరు దక్షిణదిశకు మఱపుననైన వెళ్లరాదు. వెళ్లినను మనస్సులోనైన వారికవమానమును దలఁపరాదు. ఇంకేవిధమగు నపరాధము నొనర్చుటకును బూనవలదు."

రాజిట్లనెను:— "నేను భంగు ద్రాగువాఁడను కాను. ఇంకేవిధమగు మత్తును సేవింపను. నేను ఋషికి అవమానమేల చేయుదును? బ్రాహ్మణులకును, ఋషులకును, మునులకును నేనెల్లప్పుడును భయపడుచుందును. నీవు నావిషయమున నిశ్చింతగా నుండుము. ఇట్టి యనుచితకార్యము నావలన స్వప్నములోనైనఁ గాఁజాలదు." ఈ యాశ్వాసనమునుబొంది రాణి యానందమును బొందినది. కాని యామె మనస్సులో శంక యుండనే యుండెను. అవకాశము కలిగినప్పుడెల్ల 'మీరు దక్షిణ దిక్కుకు మృగయా వినోదమునకు వెళ్లలేదు కదా!' యని యడుగుచుండెడిది. మహారాజు నవ్వుచు నిట్లనెడువాఁడు:— 'నాకు రెండు శిరస్సు లుండియుండిన మహారాణి యాజ్ఞ నుల్లంఘింప సాహసించి యుందును. నేనిట్టి యపరాధము నెట్లు చేయఁగలను?' రాణి నవ్వియు, గోపించియు నప్పుడప్పు డిట్లనుచుండెడిది:— 'మంచిది, వినకపోయిన

నంతే. నాయాజ్ఞయే యనుకొనుఁడు. మీరు పొరపాటుననైన నాయాజ్ఞ నుల్లంఘించు నెడల...... !'

మహారాజిట్లనెను:— "అవు నవును. చెప్పుము. నిజము చెప్పుచున్నావు. ఆగుచున్నా వెందులకు? ఏమి జరుగును?"

రాణి నిరుత్తరయై యిట్లనెను:— "ఏమిజరుగును? నా వలన నీకు హానికలుగదు."

మహారాజిట్లనెను:—"నీయాజ్ఞ నుల్లఘింపఁజూచు నేనే నీకంటెఁ జెడ్డవాఁడను." ఈవిధముగ నీయొక్క విషయమున మాటిమాటికి వాదవివాదము వారిద్దరిమధ్య జరుగుచుండెడిది. ఎవరి ప్రాణముమీఁద వారికి తీపి యగుటచే నీభయముననను, రాణికి సంతోషము కలుగుటకును రాజు మఱపుననైన దక్షిణ దిక్కునకు వేఁటకు వెళ్లెడువాఁడు కాఁడు.

దిగ్విజయము చేసివచ్చిన తర్వాతఁ గలి యాతని కిరీటములోనికి దూఱెను. ఒకదినమున నాతఁడు తన మంత్రుల తోడను, సేవకులతోడను వేఁటాడ నగరము వెడలిపోయెను. ఆదినమునఁ బ్రారబ్ధవశముననో, లేక కిరీటమునఁ గూర్చుండిన కలి ప్రేరణముననో రాజు మనస్సులో నిట్లు తలఁచెను:— "నారాణి మాటిమాటికి నన్ను దక్షిణదిక్కుగాఁ బోవలదను చుండును. నేఁడిటే వెళ్లవలయును. ఏమి జరుగునో చూడ వలయును. ఆమె ఋషులను, మునులను నవమానము చేయ వలదనుచుండును. అట్లు నేనెన్నఁటికిని జేయను. నేఁడీ దిక్కు నకే వెళ్లవలయును." ఇటు లాలోచించి మహారాజు తన వెంట వచ్చువారి నందఱను, సేవకులను దక్షిణ దిక్కునకే

వెళ్లుఁడని యాజ్ఞాపించెను. అచటికి వెళ్లి మహారాజు చాల సింహ, వ్యాఘ్ర, శూకరాది హింస్రక మృగములను జంపెను. ఇంతలోనే మహారాజు దృష్టి దీర్ఘశృంగములుకల ఒక మృగముపైఁ బడెను. దాని వెంట నాతని గుఱ్ఱమును బరువెత్తించెను. హరిణము కూడ చెంగనాలు త్రొక్కుచు వాయు వేగమునఁ బారిపోవుచుండెను. హరిణము వెంటఁ బడుటచే మహారాజుగారి యనుచరులును, సైనికులును వెనుక నిలిచి పోయిరి. అంగరక్షకుల గుఱ్ఱము లింతవేగముగఁ బరువిడఁ జాలక పోయెను. కావున రాజు ఒంటరివాఁడయ్యెను. ఒక యరణ్యము లోనికి పోఁగానే హరిణమెచ్చట యదృశ్యమైనదో తెలియలేదు.

గుఱ్ఱమును జాలవేగముగఁ బరువెత్తించుటచే మహారాజు మిక్కిలి యలసిపోయెను. ఆతని శరీర మంతయు నొప్పులు చేసెను. ప్రొద్దుటినుండి అల్పాహారమైనఁ జేయక పోవుటచే ఆఁకలి అతిశయముగ నుండెను; దప్పికవలన గొంతంతయు నెండిపోయెను. భోజనము, గంగాజలము వెనుక నిలిచిపోయినవారివద్ద నుండెను. మహారాజు నల్దిక్కులను దృష్టిని సారించి జలాశయము కొఱకు వెదకెను. ఆ ఘోర వనమున నాతనికి జలమెచ్చటను గనఁబడ లేదు. గుఱ్ఱము మీఁద నాతఁడు కొంచెము ముందుకుఁ బోవునప్పటికి ఆతని కొక ఋష్యాశ్రమము కనఁబడెను. మహారాజున కానందము కలిగెను. ఆతఁ డిట్లను కొనెను:— "ఋషి దర్శనమునకు వెళ్లుదము. తన యాశ్రమమునకు చక్రవర్తి వచ్చిన సత్కరింపఁ గలఁడు. అర్ఘ్యపాద్యము లొసంగి, తినుటకు స్వాదిష్ట

ఫలము లొసంగఁగలఁడు; శీతల జలముల నీయఁగలఁడు.'' ఇట్లు తలంచి మహారాజు అచ్చటకు తన గుఱ్ఱమును వదలెను.

అది శమీక మహాముని ఆశ్రమము. ఋషి గొప్ప యోగాభ్యాసి. ఏకాంతమునఁ గూర్చుండి సమాధిద్వారా పరబ్రహ్మధ్యానము చేయుచుండెను. ఆతఁడు సమాధిలోఁ దల్లీనుఁడగునప్పు డాతనికి బాహ్యజగత్తు తోఁచనే తోఁచదు. ప్రపంచ విస్మృతి కలుగును. పరమ ప్రకాశరూపమగు నాత్మ యందు సమస్తవృత్తులు లీనమగును.

మహారాజు గుఱ్ఱమును బయట నొక వృక్షమునకుఁ గట్టివేసి, పాదరక్షలను విడిచి యాశ్రమములోఁ బ్రవేశించెను. ఆశ్రమము ఆవుపేడతో స్వచ్ఛముగ నలుకఁబడియుండెను. ఒక ఏకాంత స్థానమున శమీకమహాముని సమాధిస్థుఁడై కూర్చుండి యుండెను. ఆతఁడు సమాధిలోఁ దల్లీనుఁడగుటచే మహారాజు వచ్చినసంగతి ఆతనికి తెలియనేలేదు. మహారాజు కొంచెముసేపు నిలుచుండెను. ముని ముఖమండలము తేజముచే దేదీప్యమానముగ నుండెను. ఆతఁడు సమస్తేంద్రియములను, ప్రాణములను, మనస్సును, బుద్ధిని నిరుద్ధమొనర్చుటచేఁ బరమశాంతుఁడై దివ్యసుఖానుభవ మనుభవించుచుండెను. ఆతఁడు జాగ్రత్స్వప్న, సుషుప్తు లను నీ మూఁడవస్థలను దాఁటి నిష్క్రియమును దురీయపదము నగు నా బ్రహ్మస్వరూపమం దుండెను.

ముఖమండలము శాంతముగ నుండెను. సువర్ణమువంటి పచ్చని జటాజూట మాతని ముఖమండలమున విఱియఁబడి

యుండెను. గౌరవర్ణముగల పర్వతశిఖరమందు పాముపిల్లలు వ్రేలాడుచున్నట్లు, రక్తవర్ణముకల యాతని ముఖమున జడలు వ్రేలాడుచుండెను. కృష్ణ మృగచర్మము నాతఁడు కప్పుకొని యుండెను. అది ప్రజ్వలితాగ్నిని నుసి కప్పినట్లుండెను. ధర్మాత్ముఁడగు నారాజాతపస్విని జూచుచుండెను. ఆతఁడు ఆఁకలి దప్పులచే వ్యాకులతను చెందుచుండుటచే నిదియంతయు నాతనికి రుచింపలేదు. కొంచెముసేపు నిలుచుండినను ముని కన్నులను దెఱువకపోవునప్పటి కాతఁ డధీరుఁడయ్యెను. ఆతఁడు బిగ్గఱగ నిట్లనెను:— "మునివరా! నేనీ దేశమునకు రాజగుఁ బరీక్షిత్తును. మీ చరణములకుఁ బ్రణామ మొనర్చుచున్నాను. స్వామీ! నేను చాల ఆఁకలి చెందియున్నాను. నాకు దప్పిక కూడ బాగుగా నగుచున్నది. నా సహచరులందఱు వెనుక నెచ్చటో నుండిరి. మీవద్ద నీరుండినఁ ద్రాగుట కిండు."

ముని తురీయావస్థలో నుండెను. ఆతనికి జాగ్రజ్జగద్వ్యాపారమంతయు విలుప్తమయ్యెను. ఇంద్రియ వృత్తులన్నియుఁ బరాత్పరతత్త్వములో విలీనములయ్యెను. ముని మహారాజువాక్యములను విననేలేదు. ఈసమయమునఁ గలి తనప్రభావమును జూపెను. ఆఁకలిదప్పులవలన మానవుఁడు తన వివేకమును బోగొట్టుకొనును. వానికి ధైర్యముండదు. సదసన్నిర్ణయము కావించుట కాతనికి సామర్థ్యముండదు. కర్తవ్యాకర్తవ్యజ్ఞానము లుప్తమగును. ఈసమయమున మహారాజునకుకూడ క్రోధముకలిగెను. ఆతనిమనస్సులో ననేకములగు నాలోచనలు రేగుచుండెను.

ఆతఁ డిట్లనుకొనెను:— "ఈతడు కపటముని. ఈతని యాశ్రమమునకు నేనువచ్చితిని. నిజముగ విచారించిన మొదటి నుండియు నాకు సత్కారము చేయవలసియుండును. కూర్చుం డుట కాసన మొసంగవలెను. ఆసనము లేకపోయిన భూమిని జూపింపవలయును. రాజునని తెలిసికొని యర్ఘ్యమీయవలెను. మృదుమధుర వాక్కులతోఁ గుశలప్రశ్న చేయవలయును. ఇవన్నియుఁ జేయుట అట్లుంచుఁడు. అడిగిన నీరైన నీయఁడే! ఎన్నిసార్లు పిలిచినను బలుకఁడే! ఈతనికి తపోగర్వముకలదు. ఈతఁడు రాజైన నాతనియింటికి రాజు. నేనుమాత్రము తప స్విని గానా? ఈతనికి లేచి సమ్మానముచేయవలెనా?" అని యోచించియుండవచ్చును. ఈవిధముగ ఋషి లేవకపోవుటచే రాజు అది తన కవమానముచేయుటనుగఁ దలంచి ఋషి తన కవజ్ఞ చేసినందులకు బదులుతీర్చుకొనఁ దలఁచుచుండెను.

ఛప్పయ.

మునివర! ఉత్తర చరిత ఉత్తరా సుత కో సునియే।
హై అతి భావీ ప్రబల కరహిఁ అనుభవ సబ మునియే॥
దక్షిణ దిశి కూఁ ఏక దినా నృప ధనుధరి ధాయే।
భూఖ ప్యాస తేఁ దుఃఖిత భయేఁ ముని ఆశ్రమ ఆయే॥
కరహిఁ తపస్యా తహఁ పై ముని శమీక బైఠే అచల।
పానీ మాఁగ్యో ముని నహీఁ, సున్యో భయే నృప అతి వికల॥

అర్థము.

మునివరులాలా! పరీక్షిన్మహారాజుయొక్క తర్వాత చరిత్రమును వినుఁడు. దైవగతి తప్పనిది. అతి ప్రబలమైనది.

ఇది మునులకుఁగూడ అనుభవకరమగు విషయమే. ఒకదిన మున పరీక్షిత్తు దక్షిణదిశకు ధనుర్ధారియై వెడలెను. పాపము చాల ఆఁకలిదప్పులుచెంది మున్యాశ్రమమునకు వచ్చెను.

శమీకమహాముని తన యాశ్రమములోఁ దపస్సుచేసి కొనుచు నచలముగఁ గూర్చుండెను. రాజు దాహమడిగెను. కాని ముని వినలేదు. అంతఁ బరీక్షిత్తు మిగుల వికలతను జెందెను.

—:0:—

## విధి విధాన ప్రాబల్యము

౭౭

శ్లో॥ అలబ్ధ తృణ భూమ్యాది రసం ప్రాప్తార్ఘ్య సూనృతః,
అవజ్ఞాత మివాత్మానం మన్యమానశ్చుకోప హ॥
అభూత పూర్వః సహసా క్షుత్తృడ్భ్యామర్దితాత్మనః,
బ్రాహ్మణం ప్రత్యభూద్బ్రహ్మన్ మత్సరోమన్యు రేవచ॥
— శ్రీభాగ. ౧ స్కం. ౧౮ అ. ౨౮, ౨౯ శ్లో.

ఉ. కన్నులు మూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడుత నున్నవాఁడు చే
సన్నలనైన రమ్మనఁడు సారజలంబులఁ దెచ్చి పోయఁడే
మన్ననసేనఁ జేయఁడు సమగ్ర ఫలంబులు వెట్టఁ డింత సం
పన్నత నొందెనే తన తపశ్చరణాప్రతిమ ప్రభావముల్.

ఆ. వారిఁ గోరుచున్నవారికి శీతల
వారి యిడుట యెట్టివారికయిన
వారితంబుగాని వలసిన ధర్మంబు
వారి యిడఁడు దాహవారి గాఁడు. — శ్రీమదాంధ్రభాగవతము

ఛప్పయ.

ఆయో నృపకూఁ కోహ ద్రోహ మునివర తేఁ కీన్హోఁ ।
మర్యోస్యాఁపు ముని నారి మాఁహి లై పహిఁరా దీన్హోఁ ॥
కబహుఁ న ఐసో కర్యో కాల కీ కైసీ గతి హై ।
హోనోఁ జైసో హోయ్ తబహిఁ తసహోవే మతిహై ॥
విధి విధాన హ్వై కేఁ రహే, కబహుఁ హోయ్ నహిఁవ్యర్థవహ ।
పాండవ నల అరు రామ కే, చరిత బతావేఁ తత్వ యహ ॥

అర్థము.

నృపతికి కోపమువచ్చి మునివరునకు ద్రోహమొనర్చెను. చచ్చిన సర్పమును గొనివచ్చి ముని మెడకు వేసెను. ఆతఁడెన్నఁడు నిట్లు చేయలేదు. అయితే కాలగతి యట్టిది. ఎప్పుడేవిధముగ జరుగవలయునో అప్పుడట్టి బుద్ధికలుగును.

విధివిధానము ప్రకారము జరుగుచుండును. అది యెన్నటికిని వ్యర్థముకాదు. పాండవ, నల, రామచరిత్రలను జెప్పుఁడు. వానితత్త్వ మిదియేకదా!



లోకములోఁ బ్రారబ్ధప్రాబల్యమే లేకయుండిన జ్యోతిష శాస్త్రము వ్యర్థమయ్యెడిదే. భవిష్యద్విషయము చెప్పిన సందిగ్ధమగుచుండెడిదే. మానవుని ఆయువు, సుఖదుఃఖములు, విద్య, సంయోగవియోగములు ఇవన్నియు జన్మకుఁ బూర్వమే నిశ్చితములగునని ప్రారబ్ధవాదులు చెప్పుచుందురు. వాటిని మానవుఁడు తనప్రయత్నముచేఁ దప్పుకొనలేఁడు. క్రియమాణ

కర్మలచే సంచితకర్మలు పెరుగుచుండును; కాని యీ జన్మ ప్రారబ్ధము – తెలిసినమీఁదట నైనను – శరీరముద్వారా అనుభవించిననే క్షయించిపోవును. జ్ఞానికాని, భక్తుఁడుకాని తన జ్ఞాన భక్తిప్రభావముచే వాటిని అనుభవింపఁడు. ఏల ననఁగా వాని వృత్తి సుఖదుఃఖములను దాటిపోవును. అయితే శరీరము ప్రారబ్ధాధీనమగును. ప్రారబ్ధమనుభవించుటకే శరీర మేర్పడినది.

పరీక్షిన్మహారాజు పుట్టినప్పుడు జ్యోతిష్కులు ఆతని నిధనవిధానమును గూర్చి చెప్పిరి. ఇప్పుడాసమయము వచ్చి నది. కలి యాతని సువర్ణమండిత ముకుటమునఁ గూర్చుండెను. ఎన్నిసార్లు పిలిచినను శమీకమహాముని అర్ఘ్యపాద్యాదు లిచ్చుట అట్లుంచి కన్నులు తెఱచి చూడనైనఁ జూడకపోవు నప్పటికి రాజు ఘోరరజోగుణమునకు వశీభూతుఁడయ్యెను. ముని విషయమున రాజు సందేహించుటయే కాదు, ఆతనిఁ బరీక్షించుటకును, ఆతని నవమానించుటకును దృఢనిశ్చయ మొనర్చెను.

అంత శౌనకుఁ డిట్లడిగెను:– "సూతా! నీవేమి పలు కులు పలుకుచున్నావు? రాజు ధర్మాత్ముఁడు. బ్రాహ్మణ భక్తుఁడు. అట్టివాఁ డెన్నఁడైనఁ బొరపాటుననైన నొకానొక తపస్వియు, విద్వాంసుఁడును, బ్రాహ్మణుఁడు నగువాని నవ మానము చేయునా? ఆతఁ డెన్నడును బ్రాహ్మణునకు శారీరక దండన మొసంగఁడు. ఆతఁడెప్పుడును సత్సంగము చేయు చుండెడువాఁడు. ముని సమాధిలోనున్నాఁడను జ్ఞానమాతనికి లేకపోయినదా? ఆతఁడు మునికి అనిష్టము కావించుట కేల

సిద్ధపడినాఁడు? తపస్వియగు ముని యెడల నాతనికి క్రోధ మెట్లు వచ్చినది? ఆసమయమున నాఁకలి దప్పులవలన సద సద్వివేకము నశించినదని నీవనవచ్చును. ఆఁకలి దప్పు లైనప్పుడు తన్నుఁదా మఱచుట కలదు కాని యిట్టి బుద్ధి భ్రమయా? రాణి అనేకసార్లా దిక్కునకు వెళ్లఁగూడదని నిషేధించిన దక్షిణ దిక్కునకే యీ దినమున తెలిసి తెలిసి బుద్ధిపూర్వకముగ వచ్చెను. అవకాశము చిక్కినపుడెల్ల నాయనకుఁ జెప్పుచుండెడిది. ఒకవేళ వచ్చినను బ్రాహ్మణా శ్రమము చూచినప్పుడైనఁ దనభార్య అచ్చటికి వెళ్లవలదనినది కదాయని గ్రహింపవలసియున్నది. ఆసమయమున నాతఁడు తిరిగి రావలసి యున్నది. అట్టియెడ నాతఁడేల క్రుద్ధుఁడు కావలసి వచ్చినది? ఆతని మనస్సులో నీశ్వరతుల్యుఁడగు తపస్వియెడల నీర్ష్య యేల జనింపవలెను?''

ఈప్రశ్నను విని సూతుఁడిట్లనెను:— ''శౌనకా! దీనికి ప్రత్యుత్తర మిప్పుడు నేను మీకింకేమి చెప్పఁగలను? ఇది విధి ప్రాబల్యము కాక వేఱుకాదు. అట్లు జరుగ వలసి యుండెను. అంతకంటెఁ జెప్పవలసిన దేమియును లేదు. ఈ జగత్తంతయు దైవాధీనమై యున్నది. విధి విధానమును దీసి వేయు సామర్థ్యము జీవులకే యుండియుండిన రావణ, కుంభ కర్ణ, హిరణ్యాక్ష, హిరణ్యకశిపు, దిలీప, ప్రియవ్రతాది ప్రబల పరాక్రమముగల రాజులు మరణించకయే యుందురు. రావణుఁడు తనకు మృత్యువు రాకుండుటకై యనేకోపాయము లొనర్చెను. తపస్సుచేసి గొప్పగొప్ప దుర్లభ వరములను బడసెను. ఆతని కాతనిమృత్యువుంగసతి కూడ తెలియును.

బ్రహ్మ చెప్పినాఁడు. కాని యాతని నవహేళనము కావించెను. తనకు మృత్యువు రాదనెను. చివర కాతఁడు విధివిధానము నకుఁ దల నొగ్గవలసి వచ్చెను. జరుగువలసినదాని నెవరును దుడుపఁజాలరనియుఁ, బ్రారబ్ధమునకు అన్యథా కావింప వీలు లేదనియు నాతఁడు తెలిసికొనవలసివచ్చెను. తెలిసి తెలిసి దశరథుని జీవములతో వదలివేసెను.''

ఇదివిని శౌనకుఁడిట్లనెను:— ''సూతా! దశకంఠ దశ రథులకు సమావేశ మెచ్చట? ఆతనిని జంపువాఁ డీతని యింటిలోఁ బుట్టగలడని ఆతనికెట్లు తెలియును? మాకీ కథను జెప్పి తర్వాతవిషయమును వివరింపుఁడు.''

అంత సూతుఁడిట్లనెను:— ''తాపసోత్తముఁడవగు నో శౌనకా! ఈకథ చాలపెద్దది. దానిని విస్తారముగ మీసమ్ముఖమునఁ జెప్పనెడల నీకథాప్రవాహ మాగిపోగలదు. విష యాంతరమును జెప్పను. భగవత్సంబంధమగు చరిత్రలలో విషయాంతర మనునది లేదు. కావున విస్తారముగఁ గాదుకాని సంక్షేపముగ నీ శిక్షాప్రదమగు సారగర్భిత కథానకమును మీసమ్ముఖమునఁ జెప్పఁగలను. మీరందఱును సమాహిత చిత్తులరై శ్రవణము చేయుఁడు.

సూర్యవంశములోఁ ప్రబల పరాక్రముఁడగురాజు రఘువనువాఁడు జనించెను. ఆతని పేరటనే ఆవంశమునకు రఘువంశమని పేరువచ్చినది. ఆతనిపుత్రుఁడు అజమహారాజు. అజమహారాజు కుమారుఁడు దశరథుఁడు. రాజకుమారుడఁగు దశరథుఁడు గొప్పశూరుఁడు, వీరుఁడు. బ్రహ్మణ్యుఁడు. సుశీ

లుఁడు. సకల సద్గుణ సాగరుఁడు. సుశీలుఁడు, యోగ్యుఁడు, జ్ఞానియు నగు పుత్రునిగలిగి మహారాజుపొందిన యానందము నకు మేఱలేదు. ఆతఁడు తనపుత్రుని ప్రాణములకంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండెను. రాజకుమారుఁడు అయోధ్య లోని విస్తృత రాజమహాలునందు తారలవలె వెలుఁగు తన తల్లులమధ్య. శుక్ల పక్ష క్షపాకరునివలె శీతల కిరణములచే నందఱను సంతోషపెట్టుచు దినదిన ప్రవర్ధమానముగఁ బెరుగుచుండెను. రాజకుమారునకు అస్త్ర శస్త్ర విద్యయనిన మిక్కిలి అనురాగము. అల్పకాలముననే అస్త్ర శస్త్ర సంహా రోప సంహారాది విద్యయందుఁ బారంగతుఁడయ్యెను. ఆతఁడు వివాహయోగ్యుఁడగునప్పటికి అజునకుఁ దన పుత్రునకు వివా హము చేయవలెనను సంకల్పము కలిగెను.

మునులారా! ఆకాలమున వరుని పక్షమువారు యోగ్యమగు కన్యనుగాంచి స్వయముగ నామె తండ్రిని యాచించుట ఆచారముగ నుండెడిది. అజమహారాజునకు దశరథుఁడొక్కఁడే కుమారుఁడు. ఆతఁడు నద్వితీయ ధనుర్ధ రుఁడు. పరమసుందరుఁడు, మహాగుణవంతుఁడు. సర్వవిద్యా పారంగతుఁడు. తనపుత్రునికి సర్వగుణసంపన్న యగు కన్నెను దెచ్చి వివాహముచేయవలెనని మహారాజుకోరిక. ఏ కన్య యొక్క యంగములలోఁ గులక్షణము లేవియును లేవో, ఏయమ సుందరియు, సుశీలయు, గులీనవంశములోనిదియు, జ్యోతిష శాస్త్రరీత్యా రేఖలుగలిగియున్నదో, అన్యాంగముల లక్షణ ములు సులక్షణములుగ నున్నవో, అన్నియు ననుకూల గ్రహ ములుకలదియు, శుభస్కరమైనదై యున్నదో అట్టిదానిని జేయ

వలెనని యాతనియూహ. అటులనే ఆతఁడు చాలమంది జ్యోతిష్కులను బిలిపించి, వారిని సత్కరించి యిట్లనెను:— "భూదేవతలారా! మీరు సమస్తశుభాశుభలక్షణముల నెఱిఁగినవారు. జన్మలగ్న కుండలిని జూచియు, హస్తరేఖలను గాంచియు, శరీరములోని యితర పుట్టుమచ్చలను, చక్రాది చిహ్నములను గాంచియు, అంగనిర్మాణమును, అధికాంగ, అల్పాంగ విషయములను గాంచి మీరు భూతభవిష్యత్తుల నెఱుఁగ సమర్థులు. భూమండలమున నెనలేని కన్య నొకదానిని నాపుత్రునికొఱకు వెదకిరండు."

అజమహారాజు అభిప్రాయమును గ్రహించి దైవజ్ఞులగు బ్రాహ్మణులు సమస్త దేశాధిపతులకడకు వెళ్లిరి. ఫలాని రాజుకూఁతురు చక్కనిదని వినఁగానే వారచ్చటకు వెళ్లి కన్యను జూచెడువారు. ఈవిధముగ వారు భూమిమీఁదఁగల రాజులందఱికడకు వెళ్లివచ్చిరి. వారెట్టి శుభలక్షణములు గల కన్యను గావలెనని కోరిరో అట్టిది లభింపలేదు. వారికి కొందఱు సుందరకన్యలు లభ్యపడిరి కాని వారిలోఁ గొందఱకు లక్షణము లశుభములు; కొందఱకు నక్షత్రములు బాగుండలేదు; కొందఱకు గ్రహము లనుకూలములుగ లేవు. కొందఱి కంగములు పెద్దవి, చిన్నవిగ నుండెను. కొంచెము లోపము కనఁబడెనా ఆపిల్లను విడిచివచ్చుచుండెడువారు. ఈ విధముగ వారు భూమండలమంతయును దిరిగి వచ్చినను వారికి తగిన కన్య దొఱకకపోవునప్పటికి వారు చింతతో నయోధ్యాపురికిఁ దిరిగి వచ్చిరి. మొదట వారు ఉత్తరదిశకు వెళ్లి, తర్వాత పడమటిదిక్కునకు వెళ్లి, చివరకు దక్షిణదేశపు రాజుల దగ్గఱకు

వచ్చిరి. దక్షిణదేశములోఁ గూడ వారికి తగిన పిల్ల కుదర లేదు. తర్వాత తూర్పుదేశపు రాజధానులు చూచుకొనుచు సరయూనదీ తీరమున నయోధ్యకు వచ్చుచుండెను. మార్గమునందు వారొక రాజధానిలో విడిసిరి. ఈరాజధాని అయోధ్యలోఁ జేరినదే. ఒక చిన్న మండలీకప్రభువు రాజ్యము చేయుచుండెను. ఆతఁ డయోధ్యాధిపతికి సదా నియతమగు కప్పము కట్టుచుండెను. తమ చక్రవర్తి కడనుండి బ్రాహ్మణులు వచ్చిరను సంగతినిఁ దెలిసికొని యాతఁడు వీరందఱకును గొప్ప స్వాగత సత్కారమును గావించెను. పాదములు కడిగి, విధ్యుక్తముగ నర్ఘ్యము నొసంగి, ధూపదీపాదులచే నా భూసురులను బూజించెను. ఆరాజు బ్రాహ్మణులను బూజించు సమయమున నంతఃపురములో నా రాజపత్నియు నుండెను. రాజుకు పరమ సుందరియగు నొక కూఁతురు కలదు. ఆమె శీలసంకోచముతోఁ దన తండ్రిచేయు పూజాకైంకర్యమున సహాయపడుచుండెను. బ్రాహ్మణుల దృష్టి యా పిల్లపైఁ బడెను. వారిట్లనిరి — "రాజా! ఈమె తమ పుత్రికయేనా?"

చేతులుజోడించి వినయభావముతో రాజిట్లు ప్రత్యుత్తర మొసంగెను:— "స్వామీ! మన పిల్లయే."

బ్రాహ్మణులా పిల్లను లాలించుచు నత్యంతప్రేమతో నిట్లనిరి:— "అమ్మాయీ! ఇటురమ్ము! ఏది నీ చేయి చూడవలయును!" ఇది విని పిల్ల మిక్కిలి సిగ్గుపడుచు, సందేహముతోఁ దన తండ్రి ముఖమువైపు చూచెను. తండ్రి మిక్కిలి ప్రేమతో లాలించుచు నిట్లనెను:— "వెళ్లు తల్లీ!

మహాత్ములు పిలుచుచున్నారు. వెళ్లు! నీచేతిని జూపించుము. బిడియపడుచున్నావేమమ్మా! ఈ బ్రాహ్మణులు మనకు తల్లి దండ్రులు. వీరివద్ద సంకోచమేల?''

తన తండ్రి యాజ్ఞచే సమస్తావయవములను ముడుచుకొనుచు మిగుల లజ్జతో నాపిల్ల తలవంచుకొని బ్రాహ్మణుల వద్దకు పోయెను. ఆమె వెళ్లి సావధానముగ వస్త్రములు సవరించుకొని శిరస్సు భూమిపైనుంచి బ్రాహ్మణులకుఁ బ్రణామము కావించి మెదలక తలవంచుకొని వారి సమ్ముఖమునఁ గూర్చుండెను. ఆ బ్రాహ్మణులలో వృద్ధుఁడును, అనుభవము కలవాఁడు, శుభాశుభలక్షణములను జూచుటలోఁ బరమప్రవీణుఁడు నగువాఁ డామె హస్తమును జూడమొదలిడెను. రాజకుమారి యెంతటిసుందరియో, అంతకుమించిన శుభలక్షణములు కలది. ఆమె యంగములలో నొకదానికిమించి మఱియొకటి శుభస్కరమగు లక్షణములు కలవు. బ్రాహ్మణు లింతటి శుభలక్షణములుగల కన్య నెచ్చటను జూడలేదు. వారు సమస్తాంగములను, హస్తరేఖలను జూచుట పూర్తియైన తర్వాత రాజుతో నిట్లనిరి:— ''రాజా! ఈ పిల్ల జన్మపత్రిక కూడ చూడవలెను.''

ఇది వినఁగానే రాణి శీఘ్రముగ లేచి తన బంగారు పెట్టెనుండి భోజపత్రికకుఁ జుట్టఁబడిన జన్మపత్రికను దీసికొని వచ్చి తనభర్తచేతి కిచ్చెను. రాజు లేచి యా జన్మపత్రికను బ్రాహ్మణుల కిచ్చిరి. రాజకుమారి బ్రాహ్మణులకుఁ బ్రణామము కావించి, తన తల్లివడిలోనికిఁబోయి యొదుగుకొని కూర్చుండెను. ఆ సమయమున నామె హృదయము దడదడ

కొట్టుకొనుచుండెను. చురుకుదనముగల నా బాలిక, ఇది యంతయుఁ దన వివాహముకొఱకేనని గ్రహించెను.

సూతుఁ డిట్లనెను:— "శౌనకా! మీకందఱకును వివాహమును లేదు, సంతానమును లేదు. ఈడువచ్చిన పిల్లకు కులీన ఆర్యసంస్కృతి గల తండ్రి పుత్రికావివాహమునకై యెంత చింత చెందునో తండ్రికానివానికి తెలియఁజాలదు. ఆతఁడందఱకుఁ దల నొగ్గవలయును. తనకుఁ దీసిపోయిన వారి యెదుటఁగూడ దీనత్వమును బ్రకటింపవలయును. పిల్ల హృదయమును గూర్చి అడుగవలసిన పనిలేదు. ఆమె తన వివాహమునకు సంబంధించిన యభిప్రాయమును బొరపాటుననైనఁ దన తల్లిదండ్రులకు చెప్పదు. ఇట్టి చర్చవచ్చినప్పుడు అక్కడ నుండి లేచి, ముఖము దాఁచుకొని, వేఱుప్రసంగములోనికిఁ గొనిపోవును; కాని హృదయములో దడదడ కొట్టుకొను చుండును. ఈత బాగుగా రానివాఁడు నీటిలోమునిఁగి వెళ్లుచు గాళ్లు తడతడ కొట్టుకొనుచు, నేదైన మనుష్యుని జూచియు, నౌకను జూచియు నాశాన్వితుఁడగునట్లుండును. శక్తినంతను వినియోగించి యోవైపునకు మిక్కిలి ఆశతోఁ బోవును. అదియు నిరాశయైనఁ జివరకొక గడ్డిపోఁచ కొఱకు పోవును. ఈడువచ్చిన పిల్ల స్థితియు నిట్లేయుండును. తల్లిదండ్రు లేదైన వరుని గుఱించి మాట్లాడుకొనుచుండిరా చాటున నుండి అన్నియు వినుచుండును. ఆ సంబంధమున ననేకాశలు చెందు చుండును. మఱునాఁ డాసంబంధము కాదని వినును. అప్పుడు నిరాశచెందును. మరల నింకొక సంబంధము విషయము వచ్చును. ఎవరితోనైన ముడిపడనంతవఱకును, ప్రజ్వలి

తాగ్ని చుట్టును పతియుఁ దాను నేడుసార్లు ప్రదక్షిణము చేయనంతవఱకు నామె యా యగాధజలమందు సదా మునుఁగుచుఁ దేలుచుండును.

బ్రాహ్మణులు జన్మపత్రికను జదువుచుండిరి. రాజదంపతులు వారి చేష్టలను గుర్తించుచుండిరి. కన్య తన హృదయసాగరమున బయలుదేఱిన తీవ్ర ప్రవాహములోఁ గొట్టుకొనిపోవుచుండెను. జన్మపత్రికను గాంచి బ్రాహ్మణులు సంతోష శ్వాసలు విడుచుచు నిట్లనిరి:— "రాజా! మేము మీకుమార్తెను అజయమహారాజు కుమారుఁడగు దశరథుని కొఱకు అడుగుచున్నాము."

ఇది వినఁగానే రాజు కన్నులనుండి ప్రేమాశ్రువులు వెలువడెను. రాణి ముఖమండలము ఆనందమున నిండిపోయెను. కన్య లేచి లోపలికిఁ బోయెను. రాజు వాక్కు ఆనందాతిరేకమున గద్గదికమయ్యెను. కొంతకాలమువఱకాతఁడు మాటాడఁజాలకపోయెను. తాను సంబాళించుకొని బ్రాహ్మణులయెడల నత్యంత సమ్మానభావమును బ్రదర్శించుచు నిట్లనెను:— "బ్రాహ్మణోత్తములారా! మీరెట్టి పలుకులు పలుకుచున్నారు? చక్రవర్తి యెక్కడ? ఆతనికి క్షుద్ర సేవకుఁడనగు నేనెక్కడ? భూమిమీఁద కలువ యెక్కడ? ఆకాశమునఁ జంద్రుఁడెక్కడ? సంబంధ మెక్కడ నైన సమానులతో నుండవలయును. నాదగ్గఱ అంతటి [illegible]ము లేదు; సంపత్తి లేదు. అంతటి గొప్ప చక్రవర్తికి [illegible]గతసత్కారము లొసంగుటెట్లు?"

బ్రాహ్మణు లిట్లనిరి:— "మహారాజా! మాకు మీ ధనసంపత్తివలన నేమి ప్రయోజనము? మాకు మీకన్యక కావలయును. భూమియంతటను వెదకివచ్చితిమి కాని యిట్టి శుభలక్షణములుగల కన్యక మాకెచ్చటనులభింప లేదు. మీకు ధనసంపత్తి తఱుగైనచో మహారాజుదగ్గఱనుండి రాఁగలదు."

ఈ చివరవాక్యము వలన మహారాజు హృదయమునకు దెబ్బతగిలెను. ఇది తన కవమానముగ నున్నదని తెలిసికొనెను. ఆతఁడు బ్రాహ్మణులతో నేమియో చెప్పదమను కొనెను. కాని ఆతఁడు వెంటనే సంభాళించుకొనెను. ఆతఁడు తన స్థితిని దెలిసికొని యిట్లనుకొనెను:—" నేను కన్యాదాతను. కన్యాదాత యెన్నియవమానములు సహించియయినను దన ప్రయోజనమును నెఱవేర్చుకొనవలయును." కావున పైకి నమ్రతను బ్రకటించుచు నిట్లనెను:— "మహాత్ములారా! కన్యక మీదియే. మీరే ఆమెకుఁ దల్లిదండ్రులు. నన్నడుగవలసిన పనిలేదు. మీరేమి యివ్వఁదలఁచుకొనిన దాని నిండు. ఇఁక మహారాజుకు స్వాగత సత్కారాదికముల విషయమున్నది. నేను వారికిఁదగినట్లు సత్కారములు జరుపఁజాలను. నా వాఁకిట సరయూనది ప్రవహించుచున్నది. నీటికి లోటు లేదు. మహారాజెంతటి సేనను గొనివచ్చినను సరిపోవునంతటి శాకము కలదు. కావున సేనాయన కోశమునుండి యాచింపవలసిన పనిలేదు."

రాజు అన్యథా తలంచినాఁడని బ్రాహ్మణులు గ్రహించిరి. అందువలన వారామాటలకుఁ బూఁతపెట్టుచు నిట్లనిరి:—

"లేదు, మహారాజా! మీవద్ద ధనసంపత్తికి లోటుకలదని మా యభిప్రాయము కాదు. మీయింటిలో లక్ష్మీదేవికి మించిన కన్య జనించినది. మీయింట అష్టసిద్ధులును, నవనిధులును జేతులుకట్టుకొని నిలుచుండగలవు. ఈ కన్యక యొక్క గ్రహ నక్షత్ర, శుభలక్షణాదులచేతనే మేమందఱము మిక్కిలి సంతుష్టులమైతిమనియే మాఅభిప్రాయము. మాకు చేతనైనంత వఱకీమెను మహారాజుకోడలుగాఁ జేయ బ్రయత్నించెదము. ఈమె గ్రహములను గాంచి, లోకములో ప్రళయపర్యంతము ఈమె ఖ్యాతి వ్యాపించి యుండుననియు, నీమె కడుపున సాక్షాల్లక్ష్మీపతి శ్రీమన్నారాయణుఁడు ప్రాదుర్భావము చెందునను నిశ్చయమునకు వచ్చియున్నాము."

ఇది వినఁగానే అధీరురాలై రాణి యిట్లనెను:— "మహాత్ములారా! మీరే మాకు రక్షకులు, స్వాములు. ఎట్లైనసరియే మాయీ చింతనుండి యుద్ధరింపుఁడు. పిల్లకు ఈడు వచ్చినది. మాకు తెల్లవారులు, ప్రొద్దుక్రుంకులు ఇదియే చింత. మీ యాశీర్వాదమున నీమెకు మంచి మగఁడు లభించెనా మా చింతలన్నియుఁ దీరఁగలవు."

వృద్ధబ్రాహ్మణుఁడు దృఢస్వరముతో నిట్లనెను:— "అమ్మా! మీ కింత చింత యెందులకు? మహారాజు మా మాటను జవదాఁటఁడు. మేము మీకుమార్తెను మహారాజ్ఞిగను, చక్రవర్తినిఁగను, భూమండలమునకు సర్వప్రధానమగు మహిషిగను జేయుదుము. సూర్యచంద్రులున్నంతవఱకు మీ కీర్తి దిగ్దిగంతములవఱకు వ్యాపించుఁగాక! ఈమెకు పరబ్రహ్మ

పరమాత్మకు తల్లియగు నత్యంత దుర్లభమగు పదవి ప్రాప్తించుఁగాక!''

బ్రాహ్మణుల వాక్యములను విని, రాణి వారికి శిరః సాష్టాంగనమస్కారము కావించెను. తలుపుచాటున నిలుచుండి కోసలరాజతనయ అన్నియు వినుచుండెను. ఆమె సంతోషమునకు మేర లేకుండెను. సంతోషాతిశయముచే నామె శరీరమునుండి చెమట బయలుదేరెను. ఆమెకన్నులు తిరుగుచున్నట్లుండఁగా త్వరత్వరగాఁ బోయి తన మంచముమీఁదఁ బరుండెను.

ఆ బ్రాహ్మణులు కోసలరాజుదగ్గఱనుండి బయలుదేఱి అయోధ్యకు చేరిరి. వెళ్లి అజమహారాజుతో నాద్యంత విషయములన్నియు సవిస్తారముగఁ దెలిపిరి. వా రన్నిసంగతులను జెప్పిరి. మే మక్కడకు వెళ్లితిమి, ఇక్కడకు వెళ్లితిమి, మా కక్కడ అట్లు స్వాగతసత్కారములు జరిగినవి. ఇక్కడి రాజు మీ కుశలము నడిగినాఁడు. ఫలాని రాజు ప్రణామములు చెప్పినాఁడు. అక్కడొక కన్యను జూచినాము. సమస్త గుణములున్నవి. కాని ఒకఅశుభలక్షణమున్నది—అని యిట్లు సమస్తవిషయములను జెప్పి యిట్లనిరి:— ''మాకీ భూమండలమున సమస్త శుభలక్షణములు కల కన్యక ఒక్కతె లభించినది. ఆమె నీకు సామంతరాజగు కోసలరాజు పుత్రిక. ఆమెపేరు కౌసల్య. గుణ, రూప, సౌందర్యములకు ధామము. ఆమె అన్నివిధములను దశరథ రాజకుమారునకు భార్య కాఁదగిన కన్యక.''

బ్రాహ్మణ వాక్యములనువిని మహారాజు తన సంతోషమును బ్రకటించుచు నిట్లనెను:— "బ్రాహ్మణోత్తములారా! ఏమియు ఫరవాలేదు. రాజు నాకు దీటుకాకున్నను ఫరవా లేదు. మనకు వారి రాజ్యమువలన నేమిప్రయోజనము? మనకుఁగావలసినది గుణవతియు, సులక్షణవతియునగు కన్యక. మంచిది. కబురు ంపుఁడు. రాజు తన ప్రయత్నము తాను జేసికొనును. ఈ మాసములోనే వివాహము జరుగవలసి యున్నది. జీవితములు శాశ్వతమేమున్నది? నేను శీఘ్రముగ నాకొడుకు, కోడలిని జూచుకొని ఆనందించెదను. రాజుకేమైన ధనము కావలసియుండిన మన రాజకోశమునుండి గ్రహింప వచ్చును."

బ్రాహ్మణు లిట్లనిరి:— "మహారాజా! ఈసంగతి మేమిరాజుకే చెప్పితిమి. కాని అతనికి కొంచెము కష్టము వేసినది. కష్టము వేయునుగూఁడ. సాధారణ గ్రామీణులు ఏగ్రామములోఁ దనపిల్లనిత్తురో ఆయూరిబావి నీరే త్రాగరే, అట్టియెడ నిట్టి రాజు కన్యాధనము నెట్లు గైకొందురు? వారి కేమియును గొదువలేదు. మేము ప్రత్యక్షముగఁ జూచివచ్చినాము. మీయిష్టము వచ్చినట్లు వైభవముగ తరలి వెళ్ల వచ్చును. ఈ నెల శుక్లపక్షమందు మంచిలగ్నము కలదు. దానికే వివాహము చేయవలెను."

ఇట్లు పలికి బ్రాహ్మణులు వెంటనే యోగ్యులగు దూతలద్వారా యీసమాచారమును-కోసలరాజునకుఁ దెలిపిరి. ఈ సమాచారమును వినఁగానే అంతఃపురములో ఆనందసాగరము పొంగి పొరలిపోయెను. రాజకుమారి యగు కౌసల్య

యదృష్టమును స్త్రీపురుషులందఱునువచ్చి ప్రశంసించుచుండిరి. కన్య యిదియంతయు విని, లజ్జించి, లోలోన నుప్పొంగి తన సౌభాగ్యమునకు మురుసుకొనుచుండెను.

లగ్న దినమునకు మూఁడురోజులు ముందే అయోధ్యాపురినుండి పెండ్లివారు మిగులవైభవముతో కోసల రాజధానికి తరలివెళ్లిరి. అజమహారాజు చక్రవర్తి. సమస్త దేశాధిపతులగు రాజులు రాజకుమారుఁడగు దశరథుని వివాహమునకు అయోధ్యకువచ్చిరి. లక్షలకొలఁది వేలకొలది రాజులు, రాజకుమారులు సువర్ణ మండిత రత్న కిరీటములతో నింద్రపురములో దివ్య వస్త్రాభూషణములతో నలంకరించుకొనిన దేవగణమట్లు శోభిల్లిరి. చాలమంది రాజకుమారులు చిరంజీవి దశరథరాజకుమారునకు సమవయస్కులును, మిత్రులును. శౌనకా! యువకులు వృద్ధులతోఁ గూర్చుండుట కిష్టపడరు. వృద్ధులకడ చాల శిష్టాచారముగఁ గూర్చుండవలసియుండును. కూర్మము తన యవయవములను గుంచించుకొనునట్లు శాంతులై సర్వదా జాగ్రత్తగా నుండవలసియుండును. కాని సమవయస్కు లొకచోటకుఁ జేరినప్పుడు మర్మము విడిచి స్వేచ్ఛగ మాట్లాడుకొనుచుందురు. కపట శీల సంకోచము లుండవు. నిర్భయులై నవ్వుచుందురు, ఆడుచుందురు. కావున వృద్ధులు వృద్ధులకడఁ గూర్చుందురు. కుఱ్ఱవాండ్రు కుఱ్ఱవాండ్రకడఁ గూర్చుందురు.

మహారాజు కుమారునితో నిట్లనెను:— "నాయనా! నీకే వాహన మిష్టమో చెప్పుము. రథముమీఁద నెక్కెదవా? పాలకీమీఁద పోయెదవా? ఏనుఁగుపై నెక్కెదవా? లేక నౌకపైఁ బ్రయాణముచేయుదువా?"

రాజకుమారుఁడు సిగ్గుపడుచు నిట్లనెను:— "తండ్రీ! నాకు నౌకాయానమనినఁ జాల యిష్టము. అదియైనను సరిగా ప్రవాహపుదిక్కు-గాఁ బోయిననే. మిగిలిన వాహనములందన్నిటను శరీరము కదులును. అలుపువచ్చుచుండును. కాని నౌకాయానమందు శరీరము కదలదు. అలుపు రాదు. ధూళి రేఁగదు. అతిశయానందమునఁ బకృతిదృశ్యమును జూచుచు వెళ్ళవచ్చును. జలమును జూడఁగానే ప్రాణిమాత్రుల కందఱకును సంతసము కలుగును. ఏలననఁగా నీరు ప్రాణాధారము కావుననే. అందుకనియే స్నానముచేసినను, నీటిలో మునిఁగినను అందఱు నవ్వుదురు. నాకుఁగూడ నీటిలో స్నానము చేయుటయు, నీదుట యనిన మిక్కి-లి యిష్టము. నౌకాయానమనిన నాకు మిక్కి-లి యిష్టము. మీయాజ్ఞ యగునెడల నేను నౌకపైననే వెళ్లెదను."

కోసలనగరము సరయూతీరముననే కలదు. సరయూనది అప్పుడు వరదమీఁద నున్నది. అయినప్పటికిని మహారాజు తన పుత్రుని సంతోషపఱుచుటకు నౌకమీఁద వెళ్లుటకు సమ్మతించెను. ఒక మంచి చక్క-ని దృఢమగు నౌక రాజవైభవముగ ననేకవిధములగు మణులతో, ముత్యములతో నలంకరింపఁబడెను. అది చూచుటకుఁ గుబేర పుష్పకవిమానమువలె నుండెను. పెండ్లికుమారుఁడగు దశరథుఁడు దానిపైఁ జాలమంది స్నేహితులతోఁ గూర్చుండెను. చాలమంది సైనికులును, అంగరక్షకులును జుట్టునుండఁగా మద్య సుహృదులతో సురపతి సురలతోఁ దన విమానమున శోభించినట్లు శోభించుచుండెను. నవ్వుచుఁ బ్రేలుచు, నాడుచుఁ బాడుచు, వివిధము

లగు మనోరంజక కార్యము లొనర్చుచు దశరథకుమారుఁడు అలంకరింపఁబడిన తన నౌకలో నూతనవధువును జింతించు కొనుచు సుఖముగ వివాహముచేసికొనుటకు అత్తవారింటికి వెళ్లుచుండెను.

సరిగా దశరథరాజకుమారుఁడు వివాహమునకు వెళ్లు సమయమున దైవయోగముచే బ్రహ్మదేవుఁ డేదోపనిమీఁద రావణునికడకు లంకకు వచ్చెను. అందఱు నా దుష్టునకు భయ పడుచుండురు. తపస్సుచేసి బ్రహ్మవలన ననేకములగు దుర్లభ వరములను బొందియు నాతనిఁగూడ తన పరాక్రమ మదమున నవహేలనముచేయుచుండెను. ఆయననుగూడ లెక్కచేయఁడు. బ్రహ్మయు నిట్లనుకొనుచుండెడువాఁడు. :— 'ఇవి వీనిరోజులు. వీని యిష్టమువచ్చినట్లు సాగనిండు. వీఁడు క్రుంకుటద్రవేళ్లతోఁ గూడ నాశనమగురోజు రాఁగలదు.' యిట్లనుకొని మొదలకుండ వాఁడు చెప్పినదానికి 'సరే' అనుచుండును.

బ్రహ్మవచ్చుటను గాంచి రావణుఁ డన్యమనస్కతతో నాతని సత్కారము కావించి, గర్వస్వరముతో నిట్లడిగెను:— 'పితామహా! మీరు మీ లోకములోఁ గూర్చుండి యేమి చేయుచుందురు?'

బ్రహ్మ సరళముగా నిట్లనెను:— 'నేను జీవుల వ్రాత వ్రాయుచుందును. వారికి సంయోగ వియోగము మొదలైనవన్నియు వ్రాయుచుందును.'

అవహేళనస్వరముతో రావణుఁ డిట్లనెను:— 'అయి నాకు మృత్యువెట్లువచ్చునో, ఎవనిద్వారా లభించునో గలరా?'

'వీఁడు పరమదుర్మార్గుఁడు. వీనికింకను వీని మృత్యు సమాచారమును జెప్పఁగూడదని బ్రహ్మసందేహించి ప్రసంగ మును మార్చుచు నిట్లనెను:— 'రావణా! నీవింత పరాక్రమ వంతుఁడవయ్యు మృత్యువునకు భయపడుచున్నావే! ఎట్లు జరుగవలసియున్నదో అట్లు జరుగఁగలదు. దానికై యిప్పటి నుండియే భయపడుటెందులకు? మీవారందఱు కుశలముగ నున్నారా?'

కాని రావణుఁడు వినువాఁడా? బలవంతుఁడ ననుకొను వాని పనిపట్టితీరును. రావణుఁడు తనపట్టు నేలవదలును? ఆతఁ డిట్లనెను:— 'భగవాన్! కుశలసమాచారములు తరువాత. ఇప్పుడు మీరు నా మృత్యువృత్తాంతమును జెప్పవలసియుం డును. నేఁడు మీ సత్యాసత్యముల సంగతి కనుఁగొనవల యును. మీ రేదో నెపముపెట్టి తప్పించుకొనఁ జూచు చున్నారు. అంతయు నిజము చెప్పుఁడు.'

వీఁడిఁక వినఁడని బ్రహ్మ గ్రహించి యిట్లనెను:— 'వత్సా! వినకున్నావు. అయితే చెప్పెదను వినుము. రఘు వంశములో అజమహారాజు గొప్పపరాక్రమవంతుఁడగు రాజు. ఆతనిపుత్రుఁడగు దశరథుఁడు కోసలదేశాధీశ్వరునిపుత్రికయగు కౌసల్యను పెండ్లాడఁగలఁడు. ఆతని కడుపున రామచంద్రుఁ డను నొకరాజు పుట్టఁగలఁడు. ఆతఁడు నిన్నుఁ జంపును.'

ఇది విని రావణుఁడు పెద్దగా పకపకనవ్వి యిట్లనెను:— 'పితామహా! వృద్ధులకు బుద్ధి పెడముఖము పట్టునని పెద్దలు చెప్పుచుందురు కాని నేను నేఁడది నిజమని అనుభవపూర్వక

ముగఁ దెలిసికొంటిని. మానవులు నా కాహారము. ఏ మానవుఁడైన నన్నెట్లు చంపఁగలఁడు?'

బ్రహ్మ సరళతతో నిట్లనెను:— 'అబ్బాయీ! నే నట్లే వ్రాసితిని. తర్వాత నేమైనఁ గానిమ్ము.'

గర్వముతో రావణుఁ డిట్లనెను:— 'ఎట్లు జరుగునో చూతము. బ్రహ్మ వ్రాసిన వ్రాలు వ్యర్థము కాదని నే నెప్పుడు వినుచునేయుందును. అయితే కౌసల్యా దశరథులకు ఇప్పటికి వివాహమైనదో కాలేదో చెప్పుఁడు.'

ఈ దుష్టుని వలలోఁ బడితినిరా [illegible]ని బ్రహ్మ భయపడెను. కాని, చేయునదేమి? తప్పించుకొను నుపాయము కనఁబడలేదు. కావున నిట్లనెను:— 'లేదయ్యా! ఇంకను వివాహము కాలేదు.'

రావణుఁ డిట్లడిగెను:— 'ఎప్పుడు జరుగును?'

బ్రహ్మ యిట్లనెను.— 'నేటికి మూఁడవ దినమున జరుగఁగలదు.'

రావణుఁడు నవ్వి యిట్లనెను:— "మంచిది తాతా! మూఁడురోజులకు మీ రెచ్చటికిని బోరుకదా! మీ మాట నిజమో అబద్ధమో పరీక్షించెదను. ఇచ్చట మీ కెదురుగా నున్న యింటిలోఁ గూర్చుండి మీ రేదైన వ్రాసుకొనవలసి యున్నను, జదువుకొనవలసియున్నను నాపని చేసికొనుచుండుఁడు. నే నిప్పుడే వెళ్ళి యిద్దఱను బూర్తిచేసి వచ్చెదను. వారిద్దరే లేకుండిన రామచంద్రుఁ డెట్లు పుట్టఁగలఁడు? అప్పుడు నీవిధానమంతయు వ్యర్థము కాఁగలదు. మీమాట లబద్ధములు

చేసిన తర్వాత మరల విశ్రాంతియీయఁబడును. అప్పుడింకొక రిని బ్రహ్మపదమున నుంచెదను.''

బ్రహ్మ పొరబడిపోయినాఁడు. అయినను ఇట్లనెను:— ''మంచిది. నీయిష్టమువచ్చినట్లు చేసిచూడుఁడు. నామాట లెన్నటికిని అసత్యములు కాఁజాలవు. నే నేర్పఱచిన విధాన మెన్నటికిని వ్యర్థముకాఁజాలదు.''

రావణుఁడవహేళనాస్వరముతోనిట్లనెను:—''మంచిది. సరి! సరి! వెంద్రుక లెన్నియున్నవి? ప్రభువువారు వచ్చుచుఁ బోవుచునే యుందురు. లెక్కించుఁ డెన్నియగునో? మూఁడు దినములలోనే మీ మాట సత్యా సత్యములు తేల్చి వేసెదను.''

ఇట్లని బ్రహ్మను అక్కడనే వదలిపెట్టి రావణుఁడాకాశ మార్గమున నెగిరి యయోధ్యకుఁ జేరెను. అక్కడికి చేరఁగానే నాఁడే దశరథుఁడు నౌకలో వివాహమునకై పోయినాఁడను సంగతి తెలిసికొని, యాతఁడా వేగముతోనే సరయూనదీ తీరమునకుఁ బోయెను. సుందరమగునౌకలో సరయూనదిలోఁ బ్రయాణము చేయుచున్న పెండ్లికుమారుని వేషముననున్న దశరథరాజకుమారుని దుష్టుఁడగు రావణుఁడు దూరమున నుండియే చూచెను. ఆతఁడిట్లనుకొనెను:—''ఈ నౌక నంతను ముక్కలు ముక్కలుచేసి ముంచివేసిన దీనిమీఁద నున్నవారలు మరణింపగలరు.'' ఇట్లాలోచించుకొని యాతఁడు వలె మీఁదకు దుమికి, యొక్కపట్టున నౌకను ముక్కలు ముక్కలు చేసివేసెను. రాజకుమారులందఱును, నావికులును

మునిఁగి మరణించిరి. ఆతని దెబ్బకు నౌక ముక్కలుముక్కలై పోయెను. ఒక్కఁడుకూడ జీవములతో మిగులలేదు. దైవిక ముగ దృఢమగు సువర్ణ ఛత్రము విఱిగి సుమంత దశరథులపైఁ బడెను. అందువలన వారిద్దరును నీటిలోపలికి పోయిరి. వారిద్దరు నొకరినొకరు గట్టిగాఁబట్టుకొనిరి. రావణుఁడు కొంచెము సేపు నిలుచుండెను. నౌక ఖండఖండములై, సమస్త రాజ కుమారులు, సేవకులు మునిఁగి చచ్చిరను సంగతిని దెలిసికొని, కొన్ని మృతకళేబరములు నీటిమీఁద దేలిపోవుటను గాంచి వీరందఱితోఁబాటుగా దశరథుఁడును, ఇతర రాజకుమారు లందఱును జచ్చిరనుకొని సంతోషతరంగముల మునుఁగుచుఁ దేలుచు కోసలనగరము వైపునకుఁ బోయెను.

రావణుఁడు ఘోరపాపి. కావున వాఁడు తనపాపము చేతనే చావఁగలఁడు. కావున భగవంతుఁ డవతరింపవలసిన పనిలేదు. ఆతఁడు వేదజ్ఞుఁడు. నీతిశాస్త్రవిశారదుఁడు. గొప్ప పండితుఁడు. నిర్బలులపై నాతఁ డెన్నఁడును బ్రహారము కావిం పఁడు. బలవంతుఁడననియు, శ్రేష్ఠుఁడననియు, సర్వమా న్యుఁడననియు నెవఁడనుకొనునో వాఁడనిన వీనికి మంట. వాఁడు తనయెదుట నెవనిని బ్రతిస్పర్థియగు శూరుఁడుగఁ, శ్రీమంతుఁడుగ, సమ్మాననీయుఁడుగఁ జూడఁజాలఁడు. ఆతఁ డత్యధిక మహాత్వాకాంక్షి. స్త్రీలపై నెన్నఁడు నస్త్రప్రయో గము కావింపఁడు. కౌసల్యను జంపఁగూడదనియే యాతఁడు నిశ్చయము చేసికొనెను. 'ఆమెను మూఁడుదినములవఱకు సముద్రములో నొకరహస్యస్థలమున నాయధీనమున నుంచు కొందును. బ్రహ్మ చెప్పిన గడువు దాఁటినతర్వాత నామెను

వదలివేయుదును లేదా ఆమె కిష్టమైన నా దగ్గఱ నుంచుకొందును.' ఇట్లాలోచించుకొని యాతఁడు తనవెంట నొక పెద్ద పెట్టెను గొనిపోయెను. ఆ పెట్టెను సముద్రములో ముంచినను దానిలోనికి గాలి ధారాళముగఁ బోఁగలదు. దానిలో స్వేచ్ఛగఁ బరుండఁదగునట్లును, విహారము చేయఁదగినంత పెద్దది. దానిలో నాహారమునకు అనేక ఫలములు, పానీయములు పెట్టబడినవి. కోసలపురికి పోఁగానే రావణుఁడు మునుముందు తనమాయచే గొప్పతుపాను వచ్చునట్లుచేసెను. ఒకరొకరికి కనఁబడనంత వేగముగల తుపాను రేగెను. అంతఃపుర మంతయు ధూళితో నిండిపోయెను. ఆ సమయమున రావణాసురుఁడు పసుపురాచుకొని పెండ్లికూతురు వేషములోనున్న కౌసల్యా భవనములోనికిఁ బోయెను. రావణుఁ డామెను బట్టుకొని యా పెట్టెలోఁ గూర్చుండఁబెట్టి, అంత నా పెట్టెను దీసికొని ఆకాశమార్గమున నాగిరి సముద్రసమీపమున గంగాసాగర సంగమస్థానమునకుఁ జేరెను. అచ్చట నొక గొప్ప తిమింగిలము నివసించుచుండెను. తిమి యనఁగా నొక మత్స్య విశేషము. అది కోసులకొలఁది పొడుగుండును. అది తోఁకతోఁ గొట్టి గొప్పగొప్ప నావలనుగూడ ముంచివేయును. ఇంతటి గొప్ప మత్స్యమునైనను మ్రింగుదానిని తిమింగిల మందురు. అది యొక విధమున నొక చిన్నద్వీపమువలె నుండును. అది సముద్రములోఁ బచ్చినపుడు దానిమీఁద ద్వీప మేర్పడును. ఇట్టి తిమింగల మొకటి అచ్చట నుండెను. దానికిని రావణునకును స్నేహము. రావణుఁడు దానితో నిట్లనెను:— "మత్స్యరాజా! ఇది నాకొక తాకట్టువస్తువు. ఈ పెట్టెను నీవు చాల

జాగ్రత్తగ నీ నోటిలో నీటిలోపల నుంచుకొనవలెను. దీనిలోని యేవస్తువును నష్టము కానీయఁగూడదు. నా కిష్టము వచ్చి నప్పుడు దీనిని దీసికొనిపోయెదను. దీని కేదైనఁ బొరపాటు వచ్చెనా వెంటనే నిన్నుఁ జంపివేసెదను.''

ఆ మహామత్స్యమునకు రావణునిసంగతి తెలియును. ఆతఁడు వినయముతో నిట్లనెను:— ''రాక్షసేంద్రా! మీరేమి మాట్లాడుచున్నారు? మీరు నన్ను నమ్మండి. నేనీవస్తువును సర్వదా నా నోటిలోనే యుంచుకొందును. దానిని దెఱచి చూచిన నాకేమి ప్రయోజనము? మీరడిగినప్పుడు దీనిని మరల మీకు యథాప్రకారముగ నొప్పగించెదను.''

మహామత్స్యము పలికిన పలుకులు విని రావణుఁడు మిక్కిలి సంతోషించి, యాపేటికను దాని కొప్పగించి ఆనందముతోఁ దన లంకకుఁ బోయెను. ''నేఁడు నా ప్రతాపముచే బ్రహ్మవ్రాలును మార్చివేసినాను. భవితవ్యమును వ్యర్థము కావించితిని. నొసటను వ్రాయు బ్రహ్మనుగూడ పొరపాటుగు నట్లు చేసితి'' నని రావణుఁడు ఆనందముచేఁ బొంగిపోవు చుండెను.

ఇచ్చట నీటిలోమునిగి పరస్పరము పట్టుకొని కూర్చుండిన దశరథ సుమంత్రులు పైకి తేలిరి. తేలినచోట నొకలో విఱిగిన రెండు గట్టిచెక్కలు కనఁబడెను. అవి రెండును నౌకల వలెనే తేలిపోవుచుండెను. వీరిద్దరు వాటిపైఁ గూర్చుండిరి. అవి వీరి బరువుకు నీటిలో మునుగలేదు. నౌకమీఁదవలె నీదుచుఁ బోవుచుండిరి. సూర్యాస్తమయమయ్యెను. కావున

నిద్దరును సరయూనదీ ప్రబలప్రవాహమునఁ గొట్టుకొనిపోవు చుండిరి. సుమంతుఁ డిట్లనెను:— 'కుమారా! కేక వేయుచుఁ బోవుదము. ఎవఁడైనఁ బడవనడుపువాఁడు దొఱకినచో మన మీఁద దయఁదలఁచి రక్షింపఁగలఁడు.'

అంత రాజకుమారుఁడగు దశరథుఁ డిట్లనెను:— 'సుమంతా! మన యదృష్ట మెట్లున్నదో అట్లు జరుగును. రాజకుమారియగు కౌసల్య గుణములను వినఁగానే నా మన స్సామెపై నాసక్తము చెందినది. ఆమె నాకు లభింపక, ఆమెకుఁగూడ నిట్టి యనిష్టమే జరిగియుండిన యెడల నాజీవితము వ్యర్థమే. పోని యీ ప్రవాహము మనల నెచ్చటికుఁ గొని పోవునో! ప్రారబ్ధానువశముగ జరుగును. భగవంతుఁ డేమి చేయునో?' రాజకుమారుని వాక్యములను విని సుమంతుఁ డూరకుండెను. వీరు తేలియాడుచున్న చెక్కలు కాక యింకను మూఁడు నాలుగు కూడా సరయూ ప్రవాహవేగమున వీరితో వచ్చుచుండెను. ఇవన్నియు సముద్రమువైపునకుఁ బోవుచుం డెను. సరయూనది కొంతదూరము పోఁగానే భాగీరథీనదిలోఁ గలియును. ఇప్పుడు వీరిద్దరు సరయూనదినుండి గంగా ప్రవా హములోనికిఁ బోయిరి. ఆ నౌకా శకలములమీఁదనే ద్రుత గతిని సముద్రమునకుఁ బోవు గంగాతరంగిణిలోఁ దరంగముల నూగులాడుచుఁ గొట్టుకొనిపోవుచుండిరి. మఱునాఁడు రాత్రికి వారు గంగా సాగర సంగమస్థానమునకుఁ జేరుకొనిరి. వా రెక్కిన భగ్న నౌకాఖండములు గంగా సాగర సంగమము దగ్గఱ నొక దిబ్బకు తట్టుకొనెను. సుమంతుఁ డిట్లనెను:— 'కుమారా! మన మిప్పుడు సముద్రమునకుఁ జేరితిమి. ఇక్కడ

నేల తగిలినది. మనము సముద్రములోనికిఁ బోకుండ చూడ వలయును. దిగుము. ఈ పచ్చని నేలమీఁదకు దిగుము.' దశరథకుమారునికిఁగూడ అదే ఆలోచన తోఁచెను. వారిద్ద రా భూమిపైఁ దిగిరి. అచ్చట చాల ఆటవిక ఫలవృక్షములు కలవు. భూమి సుందరమైనది. దానిపైఁ బచ్చనిగడ్డి కలదు. చాల యెండుకట్టెలుకూడ కలవు. వారిద్ద రా రాత్రి అచ్చటనే గడిపిరి. ప్రాతఃకాలమున వారు గంగాసంగమముదగ్గఱ గొప్ప తరంగములు గల సముద్రమును నవ్వుచున్న నాయకునివలెఁ గాంచి అచ్చటిప్రకృతిసౌందర్యమునుచూచి యిద్దరానందపడిరి.

ఇచ్చట నా మహామత్స్య తిమింగిలముతోఁ బోరాడుటకు మఱియొక తిమింగిలము వచ్చెను. రావణమిత్రమగు తిమింగిల మిట్లు యోజించెను:— "పోరాటములో నీ పెట్టె పగిలిపోయెనా రావణుఁడు నన్నుఁ బ్రాణములతో విడువఁడు. వెంటనే చంపివేయును. కావున దీని నీ దిబ్బమీఁద నుంచెదను." అని యిట్లాలోచించుకొని ఒడ్డునకువచ్చి అది ఆ పెట్టె నచ్చటనుంచి తన శత్రువగు రెండవ తిమింగిలముతో యుద్ధమొనర్పఁ బోయెను.

దశరథ రాకుమారుఁడును, మంత్రిపుత్రుఁడగు సుమంతుఁడును దిరిగి తిరిగి అచ్చటకుఁజేరిరి. అంతటి గొప్పపెట్టె యేకాంతమున నచ్చట పెట్టఁబడియుండుటను గాంచఁగానే వారికి మిగులఁ గుతూహలము కలిగెను. దీనిలో నేమున్నదో తెలిసికొందమని దానిని దెఱచుటకుఁ బ్రయత్నించిరి. ఇంతలోనే ఆపెట్టె దానికదియే తెఱచుకొనెను. దానిలోఁ బసుపు వస్త్రములను ధరించి, అగ్నిశిఖవలె, సువర్ణకాంతినిగూడ

తిరస్కరించుచు, నత్యంత మనోహరమగు బొమ్మవలె నలంక రింపఁబడిన నూతన వధువు కనఁబడెను. ఆమె సౌందర్యమును గాంచి రాజకుమారుఁడు నిర్ఘాంతపడెను. ఆతఁ డింతవఱకిట్టి సౌందర్యరాశిని జూడలేదు. విచారింపఁగా గోసలరాజ తనూజ కౌసల్య యీమెయేనని తెలిసెను. ఆతఁడా క్షణముననే తన మనోప్రాణములను, సర్వస్వమును నాయనుపమ సుందరికి అర్పించెను. ఆతఁడు సుమంతునితో నిట్లనెను:— "రావోయి సుమంతా! మనముకూడ యీ పెట్టెలోఁ గూర్చుండుదము. ఈమె కేగతి పట్టునో మనకు నదియే గతి పట్టఁగలదు."

సుమంతుఁ డిట్లనెను:— "మహారాజా! నేను కూర్చుం డను. ఒకానొక స్త్రీతో నేకాంతమున దగ్గఱ కూర్చుండుట శాస్త్రవిరుద్ధ కార్యము."

కుమారుఁడు మిక్కిలి దీనతతో నిట్లనెను:— "సోదరా! ఆపత్కాలమున నియమము లేదు. నేనీమెను వీడి యెక్కడికిని బోఁజాలను. ఆమె కేగతియో నాకు నదియే గతి కాఁగలదు. నీవు నామాటను వినుము. ఆలస్యము చేయకుము."

సుమంతుఁ డిట్లనెను:— "మహారాజా! ఒక్క ఉపాయ మున్నది. నీ వివాహమున కిదియే లగ్నము. మీరిద్ద రిచ్చటనే ధర్మముగ వివాహము చేసికొనుఁడు. అప్పుడీమె ధర్మము ననుసరించి తల్లియగును. తల్లిదండ్రుల కడ కూర్చుండుట ధర్మవిరుద్ధము కాదు."

కుమారుఁ డిట్లనెను:— "మంచిది. అట్లే చేయుదము. రెండుపుల్లలు ప్రోవుచేసి అగ్నిని వెలిఁగించుము. అగ్నిసాక్షిగ మేమిద్దరము ధర్మపూర్వకముగ భార్యాభర్తలమయ్యెదము."

సుమంతుఁ డట్లే చేసెను. అగ్నిని వెలిఁగించెను. దశరథుఁడు త్రైలోక్య సుందరియగు కౌసల్యను శాస్త్రవిధిచే పాణిగ్రహణము కావించెను. అంత వారు ముగ్గురును వెళ్లి యాపెట్టెలోఁ గూర్చుండిరి. పెట్టె పెద్దది. ముగ్గురు ఆనంద ముగ దానిలోఁ బ్రవేశించిరి. దానికి లోపల తాళముకూడ కలదు. బయటను గలదు. ముగ్గురు కూర్చుండిన తర్వాత నా పెట్టె మూసుకొనిపోయినది.

ఇంతలోనే ఆతిమింగిలము శత్రువును జంపి తీరమునకు వచ్చెను. పెట్టె అక్కడనే యున్నది. దానిని మరల దాని నోటిలోఁ బెట్టుకొనెను. ఇంత గొప్ప జంతువున కొక్కరెంతో ముగ్గురు నంతే బరువు. దాని కది బరువుగఁ దోఁచలేదు. దాని నోటిలో నాపెట్టె ఆవగింజవలె నున్నది.

మూఁడురోజులు దాఁటిపోఁగానే రావణుఁడు నవ్వుచు బ్రహ్మతో నిట్లనెను:— "అయ్యా! బ్రహ్మగారు! కౌసల్యా దశరథులకు వివాహమైనదా?"

బ్రహ్మ సరళముగ నిట్లనెను:— "అవును. అయినది. ఆలగ్నమునకే విధిపూర్వకముగ భార్యాభర్తలైరి."

ఇదివిని రావణుఁ డిట్లనెను:— "కాకపోయినచో?"

బ్రహ్మ యిట్లనెను:— "అయితే యేమున్నది? కాక పోయినచో నేను నా బ్రహ్మపదమును వదలెదను."

రావణున కాశ్చర్యమును గలిగెను, నవ్వును వచ్చెను. ఆశ్చర్యమెందుకనఁగా బ్రహ్మ గట్టిగాఁ జెప్పుచున్నాఁడు, పప్పులో నడుగు వేయలేదుగద? నవ్వు యేలననఁగా "నేను దశరథుని జంపివచ్చితిని. అయినను నియమ సమయమునకు

వివాహమైనదను చున్నాఁడు.'' ఇట్లాలోచించి యాతఁ డిట్లనెను:— "మంచిది, ప్రభూ! మీరిక్కడే కూర్చుండుఁడు. నేను మీకిప్పుడు ప్రత్యక్షముగఁ జూపించెదను."

ఇట్లనుచు నాతడాకాశమున కెగిరి తిమింగిలము సమీపమునకుఁ బోయెను. అక్కడికివెళ్లి తనపెట్టె నడిగెను. అది చాల జాగ్రత్తగ పెట్టెను ఆతనికి ఒప్పగించెను. దానిని దీసికొని రావణుఁడు లంకకువచ్చి నవ్వుచు బ్రహ్మతో నిట్లనెను:—"పితామహా! మీరు కౌసల్యా దశరథులకు వివాహమైనదని చెప్పుచున్నారు. కౌసల్య మూఁడుదినములనుండి యిందులో నున్నది."

వృద్ధపితామహుఁడు గంభీరతాస్వరముతో నిట్లనెను:— "వత్సా! దీనిని దెఱచి చూడుము. ఇందులో నేమున్నదో?"

రావణుఁడు తెఱచి చూచునప్పటికి పూతఁబొమ్మల వలె నూతన వధూవరు లందు గలరు. దగ్గఱనే సుమంతుఁడు కూర్చుండి యుండెను. ఆతని ఆశ్చర్యమునకు మేఱలేకుండెను. పితామహుని యిట్లడిగెను:— "మహారాజా! వీరెవరు?"

అంత బ్రహ్మ యిట్లనెను:— "ఓరీ! పిచ్చివాఁడా! ఈతఁడే అజమహారాజు కుమారుఁడు మహాభాగుఁడగు దశరథుఁడు. ఈతనికే మర్యాదాపురుషోత్తమునకుఁ దండ్రి కావలసిన మహాభాగ్యము పట్టనున్నది."

అంత రావణుఁడు మిగుల కుపితుఁడై తన ఖడ్గమును దూసి దశరథుని శిరస్సు ఛేదించుట కుద్యుక్తుడయ్యెను. ఆతఁ డిట్లనెను:— "నేనిప్పుడే వీనిశిరస్సును దెగవేయుదును. చెట్టు సమూలముగ నశించిన ఫలమెట్లు పుట్టగలదు? వేరు మొక్కే లేకున్న పిల్లనగ్రోవి యెట్లేర్పడఁగలదు?"

అంత బ్రహ్మ వానిని వారించుచు నిట్లనెను:—"వత్సా! అంతగా తొందర పడవలదు. ప్రారబ్ధము నెవఁడును దప్పింప లేఁడు. విధివిధానము వ్యర్థముకాదు. వివాహ విఘ్నము కావిం చుటకు నీవనేక ప్రయత్నములు చేసితివి. అన్నియు వ్యర్థము లైనవి. ఒకవేళ నీనిని నీవు చంపినను జావఁడు. ఒకవేళఁ జచ్చు నెడల నిప్పుడే ఆతనిరక్తముచే రామచంద్రుఁడు పుట్టి నిన్నుఁ జంపఁగలఁడు. కావున నీవకాలమునఁ గాలకబళితుఁడ వేల నయ్యెదవు? మెదలకుండ వీని నయోధ్యాపురి సమీపమున విడిచిరమ్ము. లేకున్న నీకు క్షేమము లేదు. ఈ క్షణముననే నీ యైశ్వర్యమంతయు విలీనము కాఁగలదు."

ఈ మాటలచే రావణుఁడు భయపడెను. పాపిహృదయ మెంతకైన వెనుదీయదు. ఆతఁ డిట్లనుకొనెను:— "ఈతఁడు నిజమే పలుకుచున్నాఁడు. నా ప్రయత్నము లన్నియు విఫలము లైనవి. ఇప్పుడు నేను బుద్ధిపూర్వకముగ నా మృత్యువును నేనేలఁ బిలుచుకొనవలెను?" ఇదంతయు నాలోచించుకొని, ఆతఁడప్పుడే యాపెట్టెను గైకొని ఎగిరిపోయి అయోధ్య సమీపమున నుంచి లంకకు వచ్చెను. బ్రహ్మ తన లోకము నకు వెళ్లిపోయెను. అమిత వ్యాకులముతోనున్న అజమహా రాజు, కొడుకు కోడండ్రను గాంచి పరమానందభరితుఁడై యనేకవిధములగు దానధర్మము లొనర్చెను.

కావున శౌనకా! విధివిధానము చాల ప్రబలమైన ప్రారబ్ధము నెవఁడును దుడిచి పెట్టఁ జాలఁడు. పరీక్షిన్న రాజు ధర్మాత్ముఁడు. ఆతని భార్యకంతయుఁ దెలిసి గావుననే ఆతనిని మాటిమాటికి వలదనుచుండెడిది. రా

యెన్నఁడును బొరపాటుననైన బ్రాహ్మణులపై నలుగఁడు. మనస్సుతోనైనఁ దపస్వులఁ దిరస్కరింపఁడు. కాని యా దినము ప్రారబ్ధవశమున హఠాత్తుగ నభూతపూర్వసంఘటనము కలిగెను. రాజునకుఁ గోపము వచ్చెను. ఆతనికి సమాధిలోనున్న శమీకమహాముని పై నీర్ష్యా, మత్సరములు కలిగెను. ఆతఁడు తన యవమానమునకు బదులు కసితీర్చుకొనఁ దలఁచి, ఋషి సమాధిని అవహేళనము చేయుచు నాతనిఁ బరీక్షింపఁదలఁచెను. దగ్గఱనే చచ్చిపడియున్న నొకమృతసర్పమును ఋషిమెడలోవైచి, యీతఁడు నిజముగ సమాధిస్థుఁడయ్యెనా లేక తనను జూచి యిదియొక నటనగఁ జేయుచున్నాఁడా యని పరీక్షింపఁదలఁచెను. ''

ఇదివిని శౌనకునకు చాలదుఃఖము కలిగి యిట్లడిగెను:— 'సూతా! ధర్మాత్ముఁడగురాజుకు బుద్ధి యిట్లు భ్రష్ట మేల యైనది?' సూతుఁ డిట్లనెను:— 'మహాభాగా! నేనంతయుఁ జెప్పెదను. కొంచెముసేపు నేను వాసుదేవభగవానుని ధ్యానింపవలయును.' అని సూతుఁడు క్షణకాలము మొదలక ఊరకుండెను.

ఛప్పయ.

రావణజైసో శూర వీర బల కో గరబీలో ।
పురుషారథ లఖి వ్యర్థ భయో చింఛిత అతిఢీలో ॥
దసరథ హోఁ వర వధూ కుమరి కౌశల్యా వరిహైఁ ।
తినతేఁ హోఁవేఁ రామ వహీ తోకూఁ రణ మరిహైఁ ॥
బ్రహ్మాదేవ తేఁ సునీ అస, కుమర డుబాయే కుమరి లే ।
లంకా ఆయో తడ భయో, బ్యాహ దేఖి ఖల కర మలే ॥

అ ర్థ ము.

రావణునివంటి శూరవీరుఁడు బలగర్వముచే పురుష ప్రయత్నమే బలమనుకొని చివరకు వ్యర్థమని గ్రహించి చింతించెను. దశరథుఁడు పెండ్లికొడుకయ్యెను. కౌసల్య పెండ్లికూతురయ్యెను. వీరిద్దరకుఁ గలుగు కుమారుఁడు రామునివలన రణమునఁ జత్తువని బ్రహ్మ చెప్పఁగా విని దశరథుని నీటముంచి, కౌసల్యను దెచ్చి దాఁచెను. అట్టివారు మరల దైవయోగముచే వివాహమాడిరి. ఇది చూచి వాఁడు చేతులు నలుపుకొనెను.

—:0:—

## మునికంఠమున మృతసర్పమును వైచుట.

౭౮

శ్లో॥ ఏష కిం నిభృతాశేష కరణో మీలితేక్షణః ।
మృషా సమాధిరాహోస్విత్ కిం ను స్యాత్ క్షత్రబంధుభిః ॥
స తు బ్రహ్మఋషేరంసే గతాసుమురగం రుషా ।
వినిర్గచ్ఛన్ ధనుష్కోట్యా నిధాయ పురమాగమత్ ॥

— శ్రీ భాగ. ౧ స్కం. ౧౮ అ. ౩౧ - ౩౦ శ్లో.

వ. ఇట్లుతండు ప్రత్యాహృత బాహ్యాంతరింద్రియుండగుట నిమీలితలోచనుండు గానోపునో యట్లుగాక గతాగతులగు క్షత్రబంధులచే నేమి యని మృషాసమాధి నిష్ఠుండు గానోపునో యని వితర్కించుచు, వృథారోషదర్పంబున ముని మూఁపున గతాసువయిన సర్పంబునిడి నరేశ్వరుండు తన పురంబునకుం జనియె.

— శ్రీమదాంధ్ర భాగవతము

ఛప్పయ.

హోనహార నహిం హోయ్ అన్యథా కాహూ విధి తేం।
మృత్యుటరే నహిం జోగ జజ్ఞ జపతప రిధి సిధి తేం॥
నృప సోచేం — "ముని నేత్ర మూంది కా ధ్యాన లగావే?
అథవా దేఖత మోఇ అకడి కేం ఢోంగ్ బనావే?॥
లైన పరీక్షా ముని గరే," మృత అహి డర్యో కుపిత అతి।
ఆశ్రమ తేం నికసే తురత, పహుంచే నిజపుర మహం నృపతి॥

అర్థము.

కావలసిన విధి అన్యథా యెన్నటికిని గాఁజాలదు. యోగ, యజ్ఞ, జప, తప, బుద్ధి, సిద్ధులెన్నిటిని జేసినప్పటికిని మృత్యువు నెవరును దప్పించుకొనఁ జాలరు. రాజిట్లను కొనెను:— "ముని కన్నులు మూసికొని ధ్యానము చేయుచున్నాఁడా? లేక నన్నుఁజూచి కపటనాటకమాడుచున్నాఁడా? ఈసంగతిని మునిని బరీక్షింపవలయు"నని అతికోపమును జెంది మృతసర్పమును మునిమెడలో వైచి, వెంటనే ఆశ్రమమును విడిచి నిజపురమునకుఁ జేరెను.



ఎన్నఁడు స్వప్నములోనైన జరుగదనుకొను విషయము దైవయోగముచే నొకానొకనివలన జరుగుచో దుష్టులు తమ దుష్టతావశమున నాతనిని నోరారఁ దిట్టుదురు. కాని విధివిధానమిట్టిదని సజ్జనులనుకొందురు. ప్రారబ్ధమునకు వశుడై యిట్లు చేసెనని వారనుకొనుచుందురు. జరుగవలసియున్నది జరిగినది. ఇట్లు యోచించి, బాగుగా స్వస్థుఁడై సూతుఁడు తనంతటతానే చెప్పఁ బ్రారంభించెను. "మునులారా! సమ

యము ననుసరించి వర్షముండును. వసంతము రాఁగానే స్వతః వృక్షముల ఆఁకులు రాలి, ఆ స్థానములో నవనవలాడు లేత ఆఁకులు బయలుదేరుచుండును. వర్షాకాలము పూర్తికాఁగానే గాలి దానికదియే చల్లఁబడిపోవును. వేసవికాలము పోఁగానే చలి బయలుదేరును. యువావస్థలోఁ బ్రవేశింపఁగనే బాల బాలికలకు విశిష్టాంగములు వాటికవియే యౌవనావస్థ సూచనను గలిగించును. దేనికైన సమయము కలదు. సంయోగమంతయు నిశ్చితము. ఎట్లు జరుగవలసియున్నదో అట్టి వేషమేర్పడును. జీవికి మృత్యు వెచ్చట నుండునో అచ్చటికి తన కిష్టములేకున్నను వెళ్లితీరును. ఈ విషయమున నేను మీకొక మహాత్వపూర్ణమగు నితిహాసమును జెప్పెదను. మీరందఱు సమాహితచిత్తులరై వినుఁడు.

ఒకానొక దినమున విష్ణుభగవానుఁడు గరుడునిమీఁద నెక్కి లక్ష్మీదేవిని వెంటఁబెట్టుకొని తిరిగితిరిగి విశ్వేశ్వరుని పురి యగు కాశీకి వచ్చెను. విశ్వేశ్వరుని దర్శించుటకు గరుడుని వాఁకిట నుంచి లోపలికి వెళ్లెను. ఇంతలోనే తన దున్నపోతుపై నెక్కి దండపాణియగు యమధర్మరాజుకూడ వచ్చెను. ద్వారములో నున్న గరుడునిగాంచి యముడు ప్రణామము గావించి నవ్వుచుఁ గుశలక్షేమము నడుగుచు నిట్లనెను:— 'గరుడా! నీవేల నిచ్చట నిలుచున్నావు?' గరుడుఁ డిట్లనెను:— 'భగవానుఁడు లోపలికి దర్శనార్థము వెళ్లియున్నారు. నేనిక్కడ నిలుచుండి వారికొఱకై ప్రతీక్షించుచున్నాను.'

యమధర్మరా జిట్లనెను:— 'మంచిది, భగవానుఁడు వచ్చినాఁడా? నేనుగూడ దర్శించివచ్చెదను.' అని పలికి దీర్ఘ

శృంగములు కలిగి కాలాంజన పర్వతమువలె నల్లగనున్న మహిషరాజమును ద్వారముకడ నిలిపి లోపలికిఁ బోయెను. యముఁడు మందిరద్వారమును దాఁటి లోపలికిఁ బ్రవేశించుచున్నప్పు డచ్చట నొక చక్కని పావురము ఆనందముతోఁ గూయుచుఁ గనఁబడెను. తన గొంతు నుబ్బించి తన వెంటి పావురముతో సుఖముగఁ గ్రీడించుచుండెను. దానిని జూచి యముఁడునవ్వి, తీక్షణదృష్టితో దానివైపు చూచుచు లోపలికిఁబోయెను. యముడెవ్వనినిఁ జూచి కనుబొమ్మలు ముడి వేయునో, ఎవనినిఁజూచి శుష్కహాసము కావించునో దానికి పోఁగాలము దాఁపురించినదని గ్రహింపవలయును. ఇదిచూడఁగానే పావురముయొక్క ఆనందమంతయు విలీనమయ్యెను. భయముచే నది గడగడ వణకుచుండెను. దాని ముఖము మ్లానమయ్యెను. ఇంద్రియములు శిథిలములయ్యెను. అటునిటు దిరుగుచు గరుడుఁడుకూడ ద్వారముకడకు వచ్చెను. గరుడుఁడు పక్షులన్నిటికిని రాజు. పావురమీవిధముగ దుఃఖించుటగాంచి దయావశమున నాతఁడు దానితో నిట్లనెను:— "కపోతరాజా! నీవింత దుఃఖము చెందనేల? నీవిచార కారణము నాకు చెప్పుము. నీవు నాప్రజలలోఁ జేరినదానవు. నేను చక్రపాణికి వాహనముగ నున్నాను. నేను సర్వసమర్థుఁడను. నీదుఃఖమును నేను సర్వవిధములఁ బోగొట్ట సమర్థుఁడను. నీచింత యేమిటో చెప్పుము. నీకు నేనేమి ప్రియకార్యము చేయవలసియుండును?"

పావురము గడగడవణఁకుచు నిట్లనెను:— "పక్షిరాజా! దీనబంధో! యమరాజిప్పుడే నన్నుఁ గాంచి కనుబొమ్మలు

ముడిచి తీక్షణదృష్టితోఁ జూచి శుష్కహాసము చేసిపోయెను. నా కంత్యకాలము దాఁపురించినదని నేను గ్రహించినాను.''

గరుడుఁ డిది విని మిక్కిలి దృఢముగ నిట్లనెను:—''ఓరీ! దీనికింతగాఁ జింతింపనేల? రమ్ము, నావీపుపైఁ గూర్చుండుము. నేనిప్పుడే లోకాలోక పర్వతముమీఁదకుఁ జేర్చెదను. అక్కడేజీవికి భయము లేదు.''

''చావఁబోవు వాఁడేమి చేయఁడు?'' పావురము ఆలోచింపకయే గరుడుని వీపుపై నెక్కి కూర్చుండెను. గరుడుఁడు వాయువేగ మనోవేగముతో నెగిరి, ఒక ముహూర్తములో నీ భూమండలమునుదాటి లోకాలోక పర్వతమునకుఁ జేరెను. ఆ పావురము నచ్చట దించి తిరిగి వచ్చునప్పటికింకను భగవానుఁడు రాలేదు. గరుడుఁ డతివేగమున నెగురుటచే గరుడుని శరీరమునుండి చెమట క్రక్కుచుండెను. త్వరత్వరగా శ్వాసలు తీసికొనుచు రొప్పుచుండెను. ఇంతలోనే యముఁడు విశ్వనాథుని దర్శించి ప్రణామము కావించి బయటకు వచ్చెన; గరుడుని యీ స్థితిని గాంచి యాతఁ డిట్లడిగెను:— ''మః భాగా! గరుడా! నీవింతగా రొప్పుచున్నావేల? ఇంతః ముందుగా నీవానందముతో నిలుచుంటివే? అల్పకాలమున నీశరీరమంతయు నేల చెమటచేఁ దడిసిపోయినది? నీవు చా అలసినట్లున్నావు. కారణమేమి?''

మిక్కిలి యుపేక్షతో గరుడుఁ డిట్లనియె:— ''ఏ చెప్పుదును యమధర్మరాజా! నీ వందరిని బాధించుచుంద నీ వైఖరి చూచియే అందఱు భయభీతు లగుచుందుర దర్శన మందఱకును భయానకముగనే యుండును. నీ

కూడా విషాక్తమగు ఖడ్గమువలె నుండును. నీ నవ్వుమూల మున నింతగా బాధపడవలసివచ్చినది.''

అన్నియుఁ దెలిసియుఁ గపటవ్యగ్రతను జూపించుచు యమధర్మరాజిట్లనెను:—''విషయమేమిటో చెప్పుఁడు. నీసమ్ముఖ మున నేనేమి చేయఁగలను? నీవు నా స్వామియగు విష్ణువును గూడ కొనిపోవువాఁడవు. నీ నాలుకమీఁద నిరంతరము భగవన్నామముండును. కావున నీకు నావలన భయముండరాదే?''

గరుడుఁడునవ్వుచు నిట్లనెను:— ''నాకు నీ వలన నేమి భయము? నేను నా ప్రభువునామముచే నిన్నుఁగూడ భయపెట్టఁ గలను; కాని నీవు వెళ్లునప్పుడాపావురమును జూచి నవ్వితివి. అందులకది చాల భయపడినది. దానిని నిర్భయమొనర్చుట కిప్పుడే ఏజీవజంతువును లేని లోకాలోకపర్వతముమీఁద దించి వచ్చితిని. దానినిజూచి యేలనవ్వితివో నాకిప్పుడు చెప్పుము.''

ఇదివినఁగానే యముఁడు అట్టహాసముచేయుచు నింకను బిగ్గఱగ నవ్వుచు నిట్లనెను:— ''గరుడా! నేను విధివిధానము నకు నవ్వితిని. నేను స్వయముగఁ జంపఁజాలనను సంగతి మీకు తెలిసినదే. బ్రహ్మదేవుఁడు నిర్ణయించిన ప్రకారము, ఏస్థానమున నెవనిద్వారా నే జీవికి మృత్యువు నిశ్చయమైనదో, నా మంత్రియగు మృత్యువు ఆ కాలమున నక్కడనుండి యా జీవిని దీసికొనివచ్చును. ఈ పావురమునకు మృత్యువు రెండు ముహూర్తములైన తర్వాత లోకాలోక పర్వతముమీఁద నుండు నొకమార్జాలముచే రావలసియున్నది. రెండు ముహూ ర్తములలో లోకాలోకపర్వతమున దీనికి మృత్యువు ఒక పిల్లి వలనఁ గలుగునని నవ్వితిని. ఇదియే అచ్చటికి దాని తెక్క

లతో నెగురవలెనని వేయి వత్సరములకైన నచ్చటికి చేరఁ గొనఁజాలదు, పోనిండాపిల్లి యిక్కడికివచ్చి దీనినిఁ జంపుట కర్బుదవర్షములకైన స్వయముగ రాఁజాలదు. మృత్యువు దీనికి రెండుగడియలలోఁ గలదు. ఎట్లు జరుగఁగలదు? కావున నో గరుడా! నీవు దానిని మృత్యుద్వారమున డించివచ్చితివి. ఆ పిల్లి ఆఁకలి చెందియున్నది. నేఁడు దానికాహారము లేదు. కావునఁ జచ్చిపోవును. ఇప్పుడా పావురమునుదిని యది బ్రదికినది. పావురము నా లోకమునకు వచ్చినది కూడ."

ఇది విని గరుడుఁడు నవ్వి యిట్లనెను:— "విధివిధాన మిట్లు తొలఁగనిది. దానిని అన్యథాచేయుట కెవ్వరికిని శక్తి లేదు. ఆ విధానమునకు వశీభూతుఁడనై అహంకారవశమున నేనుదానిని లోకాలోక పర్వతముమీఁద వదలి వచ్చితిని." ఇదివిని నవ్వుచు యముఁడు తనలోకమునకుఁ బోయెను. గరుడుఁడు భగవంతుని వైకుంఠమునకుఁ దీసికొనిపోయెను.

కావున శౌనకా! పరీక్షిన్మహారాజును ఆతని విధివిధాన మట్లు లాగుకొనిపోయినది. ఒక ఘడియపు తర్వాత మహారాజాశ్రమమునకు వచ్చియుండిన నీ సంఘటనము జరిగియుండెడిది కాదు. ముని సమాధినుండి లేచియే యుండెడివాఁడు. రాజర్షి యగు పరీక్షిత్తుకు స్వాగత మొసంగి వాని కర్ఘ్య, పాద్య, ఫల మూలాదుల నొసంగి, సత్కృతుని, సంతుష్టుని జేసియుండెడు వాఁడే; కాని యే సంఘటన మే కాలమున జరుగవలసి యున్నదో, అది ఆ కాలమున సంఘటించును."

అంత శౌనకుఁ డిట్లడిగెను:— "సూతా! రాజు చచ్చి పామును మునికంఠమున నేలవేసెను? ఆతని కేదైన నివిష్టము

చేయఁ దలపున్నచో జీవితసర్పమును వేయరాదా? అదియును గాక ఋషి అహింసావ్రతము గలవాఁడు. ఆతని యాశ్రమములో స్వాభావిక వైరముగల జంతువులుకూడ తమ నైసర్గిక వైరమును ద్యజించును. అట్టియెడ నచ్చటకు మృతసర్పమెచ్చటినుండి వచ్చినది? ఋషియొక్క పవిత్రాశ్రమములోఁ బామును జంపెడువా రెవరు?''

ఇది విని సూతుఁడు నవ్వుచు నిట్లనెను:—''మునులారా! కాలమే సమస్తమును జేయునని నేసదివఱకే చెప్పియుంటిని. తక్షకపరివారమును గాల్చుటకు వీతిహోత్రుడు మిగుల నుత్సహించియున్నాఁడు. కాని ఖాండవవనమును దగులఁబెట్టినపుడు సంయోగవశమునఁ దక్షకుఁడు కురుక్షేత్రమునకుఁ బోయెను. కావున వాఁడు రక్షింపఁబడెను. కాని యాతని భార్యను, దాని నోటిలోఁ దన కొడుకగు నశ్వసేనుని గఱచుకొనిపోవుచుండ అర్జునుఁడు చంపెను. కాని అశ్వసేనుఁడు జీవములతోడనే తప్పించుకొనిపోయెను. అర్జునుఁడు తన తల్లిని జంపినాఁడను క్రోధమును లోపలఁ బెట్టుకొని కర్ణార్జున యుద్ధకాలమున నర్జునుని జంపుటకుఁ జాల ప్రయత్నించెను. ఆతఁడు కర్ణుని దగ్గఱకుఁబోయి యిట్లనెను:— 'నీవు నన్ను బాణమున సంధించి అర్జునునిమీఁదకు వదలుము. నేను వానిని జంపుదును.' కాని కర్ణుఁడు వీరుఁడు, స్వాభిమాని. ఆతఁడు దీని కంగీకరింపలేదు. ఆతఁడు గర్వముతో నిట్లనెను:— 'కర్ణుఁ డితరుని బలము నాధారముచేసికొని యుద్ధమొనర్పఁడు. నేను నీ యీ యనుచిత ప్రస్తావము నంగీకరింపను. నీ కిష్టమున్నచోటకు వెడలిపొమ్ము.' కాని యా దుష్టుఁ డెట్లైన నర్జునుని ప్రాణములు

తీయఁదలఁచెను. ఒకసారి ఆతఁడు రహస్యముగఁ గర్ణుని బాణముమీఁద గూర్చుండి యర్జునుని జంపఁబోయెను. కాని యెవని రథముమీఁద శ్యామసుందరుఁడు స్వయముగ రక్షించుటకుఁ గూర్చుండియుండెనో, అట్టివానిని ఇట్టి నాగులు కోటి వచ్చినను జంపలేవు. శ్రీకృష్ణుఁడు కర్ణునిబాణముమీఁద వచ్చు నాగునుగాంచి గుఱ్ఱములఁ బరుండజేసెను. గుఱి తప్పిపోయెను. రెండవసారి కర్ణుఁడాతనిని దిట్టఁగా, నాతఁ డొంటరిగానే అర్జునునిఁ జంపఁబోయెను. ఆ యశ్వసేనుఁ డర్జునుని బాణములచేఁ దెగి నేలపైఁబడెను. దీనికి తక్షకుఁ డింకను గోపముచెందెను. పాండవుల నాతఁడేమియుఁ జేయఁజాలకపోయెను; కాని యిప్పుడాతని వంశజుఁడగుఁ బరీక్షిత్తుమీఁదఁ గసిఁ దీర్చుకొనఁ దలఁచెను. శౌనకా! వాని విచారమేమి? వాఁడు కసిదీర్చుకొనుట యేమి? అతనిమృత్యువా తక్షకునిచే జరుగవలయునని వ్రాయఁబడియున్నది. కావున నాసర్పమే అచ్చట చచ్చినట్లు పడియుండెను. కాకపోయిన, ఋష్యాశ్రమములో మృతసర్ప ముండుటకుఁ గారణమేమి? ఇఁక జీవితసర్పము నేల వేయఁగూడదను విషయమున్నది. రాజు మునిప్రాణములను దీయఁదలఁపలేదు. ఆఁకలిదప్పులచే నా మునిమెడల నీర్ష్య కలిగినది. కేవలము పరీక్షకొఱ కాతఁడు మృతసర్పమును వేసెను. ఒకవేళ నది కపటపుసమాధి యగుచో సర్పము మెత్తగఁదాఁకఁగనే అదిరి పడుననుకొనెను. అప్పుడు తానిట్లనవచ్చును:—'ఏమి? దొంగ మునీ! నీ సమాధి యిప్పుడెచ్చటికి పోయినది?'

మృతసర్పమును వేసినతర్వాత నావిషయము మరఁ జ్ఞాపకమే లేదు. ఆతఁ డాశ్రమముదాటి బయటకు వచ్చెను.

ఆతని యనుచరులు కూడ గుఱ్ఱపు టడుగులను గుర్తించుచు నచ్చటికివచ్చి చేరిరి. మహారాజు త్వరగా జలములను గొని, కాలాతీతమైనదని తెలిసికొని యామృతసర్పమును ముని మెడనుండి తొలఁగింపకయే తన నగరమునకుఁ బోయెను.''

ఛప్పయ.

పూఁచేఁ శౌనక – సూత! సర్పకానేఁ తహఁ డర్యో।
ముని ఆశ్రమ అతి శాంత జీవ కిహి అహి కూఁ మార్యో॥
సభీ భాగ్యవశ కరహిఁ, సూత సమఝా వహి పునిపుని।
మారే కినకూఁ కౌన – కౌన జీవన దేవే ముని॥
అజీ, కహా పూఁఛహిఁ ప్రభో! విధి విధాన అతి వికట హై।
బనే బుద్ధి కైసీ వహీఁ, మృత్యు జహాఁ జిహ నికట హై॥

అర్థము.

శౌనకుఁ డిట్లనెను:— 'సూతా! ముని ఆశ్రమము అతి శాంతమయమైనది. అచ్చట సర్పమునకు భయపడువా రెవ్వరు? ఆ పామును జంపినవా రెవ్వరు?' అనఁగా సూతుఁ డనేకవిధముల మరల మరలఁ జెప్పెను. 'అంతయు నదృష్ట విధివిధానమునుబట్టి జరుగును. చంపువాఁ డెవఁడు? బ్రదికించు వాఁ డెవఁడు? మునులారా! విధి విధాన మతి వికటమైనది. మృత్యు వెచ్చట నేవిధముగఁ జెందవలసియున్నదో ఆవిధముగ నట్లప్పటి కా బుద్ధి పుట్టి అది లభించును.'

శ్రీకృష్ణ! గోవింద! హరే! మురారే!
హేనాథ! నారాయణ! వాసుదేవ!

—*—

పిబంతు వాఙ్మయసుధామ్.                    తరంతుభవ సాగరమ్.

అద్వైతరస పిపాసువులకు అపూర్వావకాశము

# ★ శంకర గ్రంథ రత్నావళి ★

300 పేజీలు (ప్రథమ సంపుటము రు. 3-0-0) పోస్టేజి 0-12-0

అనువాదకులు : శ్రీ నిర్వికల్పానంద స్వామి

శ్రీ శంకరాచార్యులవారి ఉపదేశ ప్రకరణ గ్రంథములు నలుబది, మూలానువాదముతో సులలితమగు భాషలో, ఆబాల గోపాలమునకు అందుబాటులో నుండునట్లు అనువదింపబడి తయారై సిద్ధముగ నున్నది. శ్రీ శంకరులవారి గ్రంథముల నన్నియు భాష్యములతోసహా మూలానువాదముతో 24 సంపుటములుగ వెలువరించబడును. మా మండలిలో సభ్యులుగా జేరి మా యీ కృషిని ప్రోత్సహింపుడు.

"... అక్షరజ్ఞానంగల ప్రతివారు చదివి అర్థం చేసుకోగల గ్రంథం ఇది. ప్రతి వ్యక్తి తెలుసుకోవలసిన వాదం ఇది. ప్రతి యింటావుండవలసిన సంపుటి ఇది"

— ఆంధ్రప్రభ

రెండవసంపుటము : తయారగుచున్నది.

ఇందు ౧ అజ్ఞానబోధిని, ౨ ఆత్మజ్ఞానోపదేశవిధి, ౩ ఆత్మానాత్మ వివేకము, ౪ తత్త్వబోధ, ౫ పఞ్చీకరణము, అను వచన గ్రంథములును, ౬ పఞ్చీకరణ-వార్తికము, ౭ అపరోక్షానుభూతి, (సురేశ్వరులు) ౮ ప్రబోధ సుధాకరమ్, ౯ శతశ్లోకీ, ౧౦ స్వాత్మనిరూపణఅను శ్లోకగ్రంథములు గలవు.

మూడవ సంపుటము : ౭౫ స్తోత్రములు

శ్రీ శంకరాచార్యులవారి రచనలు :

ఉపదేశప్రకరణగ్రంథములు ౫౨ స్తోత్రములు ౭౫ భాష్యములు.

---

సాధన గ్రంథమండలి, తెనాలి.

# అధ్యాత్మిక పత్రికలు

౧. యథార్థభారతి : ఇది ౨౭ ఏండ్లనుండి, ఆబాల గోపాలమునకు వేదాంతతత్త్వము అర్థమగునట్లు ప్రచారము చేయుచున్న మాసపత్రిక. వ్యాసాశ్రమం, ఏర్పేడు. సం. చం. రు 4-0-0.

౨. యోగవాసిష్ఠము : ౩౨ వేల శ్లోకములు. శ్లోకతాత్పర్య సహితముగా, సంపూర్ణముగ, నాలుగు సంపుటములలో వెలువరింపబడినది. ఆధ్యాత్మికాసక్తి గల ప్రతి ఆంధ్రుడును చదివితీరవలయును. అనువాదకులు, శ్రీ నిర్వికల్పానందస్వామివారు. వెల రు ౫౦-౦-౦ లు.

వ్యాసాశ్రమం, ఏర్పేడు.

3. శాంతి : ఓంకారస్వామివారిచే ౧౨ ఏండ్లనుండి, శాంతి ప్రచారార్థము శాంతి ఆశ్రమం వాల్తేరునుండి ప్రకటింపబడుచున్నది.

సం. చం. రు 3-౦-౦ లు.

౪. రామదర్శనం : గుంటూరు జిల్లా, పిడుగురాళ్ళ, రామతీర్థ సేవాశ్రమము నుండి, శ్రీ కేశవతీర్థులవారిచే రామతీర్థ భావప్రచారార్థము ౫ ఏండ్లనుండి ప్రకటింపబడుచున్నది. సం. చం. రు 3-౦-౦ లు.

౫. ముముక్షువు : కృష్ణాజిల్లా, పెదముత్తేవి, శ్రీ కృష్ణాశ్రమము నుండి ఉదయవరులచే, ౪ ఏండ్లనుండి, వైష్ణవభక్తిని ఉదారభావ పూరితముగ ప్రచారము చేయుచున్నది. సం. చం. రు ౫-౦-౦ లు.

౬. గీతావాణి : కర్నూలు జిల్లా, ఆళ్ళగడ్డ, గీతాసాహిత్య సేవాసమితి పక్షమున స్వామి రామకృష్ణగారిచే ౪ ఏండ్లనుండి, కేవల భగవద్గీతా ప్రచారార్థము ప్రకటింపబడుచున్నది. సం. చం. రు ౪-౦-౦ లు.

# గీతాకదంబము

## అనువాదకులు : శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

మహాపురాణ ఉపపురాణములలో 'గీతలు' అను పేర కొన్ని ఘట్టములు గ్రథితములై యున్నవి. అవి సనందనాది బ్రహ్మపుత్రులు, లేక వసిష్ఠవామదేవాది మహర్షులు, లేక నారాయణ నారదులు, మరీచ్యాదులకు, దేవగణములకు, మహర్షులకు, లేక సాక్షాద్భగవానుడే స్వభక్త శిష్యగణములకు బోధించి యుండిరి. ఇహపరకల్యాణమును బడయుటకు గీతాధ్యాపముకన్న సులభమార్గ మింకొకటిలేదు. ఆ గీతలన్నియు శ్లోక తాత్పర్యముతో గీతాకదంబ సంపుటములలో దళములుగా, వరుసగ సాధక పాఠకలోకముల కరకమలాంజలుల కందజేయగలము.

ప్రథమదళము: రు 1-4-0. ఇందు, ౧ గోపికాగీత, ౨ భ్రమరగీత, 3 హంసగీత, ౪ భిక్షుగీత, ౫ అవధూతగీత.

ద్వితీయదళము: రు 1-4-0. ఇందు, ౬ ఐలగీత, ౭ శ్రుతిగీత, ౮ శ్రీరామగీత, ౯ యమగీత, ౧౦ వేణుగీత, ౧౧ యుగళగీత.

పరా:— రెండు భాగములు తీసికొనిన రు 2/- లు మా(

## బదరీయాత్ర (సచిత్రము - తృతీయముద్రణము) రు 1-0

"వివిధ క్షేత్రాలను సందర్శింప దలచిన యాత్రికులు గమనించ విధులు, అనుసరింపదలచిన ఆచారాలను చక్కగ ఇందులో వివరించు యాత్రికులకు అత్యంతము ఉపయుక్తమైన గ్రంథం." — ఆంధ్ర (

"—పుణ్యక్షేత్ర తీర్థాటనాదులు ముక్తి మార్గ సోపానములుగాన పుస్తకము జిజ్ఞాసువులకు, యాత్రికులకు ధన్యతనర్థించువారికి పరమోపకార"

— శ్రీ వేటూరి ప్రభాకర

"అసమర్థుల మెయున్న అస్మదాదులకు తత్తత్క్షేత్రసందర్శన కలిగించియున్నారు." —శతావధాని, శ్రీ చెళ్ల

# సాధన గ్రంథ మండలి ప్రచురణలు

| | |
|---|---|
| అష్టాదశ శ్లోకగీత | 0_12_0 |
| అర్థపంచకము | 0_12_0 |
| ♦ ఆశ్వీన మాహాత్మ్యము | 2_ 0_0 |
| ఈశ్వర సాక్షాత్కారము | 0_ 3_0 |
| ఉపాసనీబాబా జీవితము | 1_ 8_0 |
| కల్యాణకుంజము | 1_ 4_0 |
| గురుశిష్యులు (శ్రీరామకృష్ణవివేకానందులు) | 1_ 0_0 |
| గీతాప్రతిభ (2వ కూర్పు) | 0_12_0 |
| గీతాకదంబము ౧వ దళము | 1_ 4_0 |
| ,, ౨వ దళము | 1_ 4_0 |
| గోవిందదామోదరస్తోత్రము | 0_ 8_0 |
| జడభరతుడు | 0_12_0 |
| * నరసదాసు కీర్తనలు | 0_10_0 |
| పరమసాధన (2వ కూర్పు) | 0_12_0 |
| పరమార్థతత్త్వము | 0_12_0 |
| పద్మపురాణము(ఆదిమఖండం) | 1_ 8_0 |
| ,, (భూమిఖండము) | 2_ 0_0 |
| ,, (బ్రహ్మఖండము) | 1_ 0_0 |
| బదరీయాత్ర (3వ కూర్పు) | 1_ 0_0 |
| భగవత్ప్రాప్తి–ఉపాయములు | 0_ 4_0 |
| భక్తితత్త్వము | 0_12_0 |
| భక్తిరసాయనము | 2_ 0_ |
| భారతీయ తత్త్వశాస్త్రము | 2_ 0_ |
| ♦ భాగవతకథ | 2_ 0_ |
| భారతీయదర్శనము (ప్ర.ఖం.) | 1_ 8_ |
| * మానవధర్మము | 1_ 0_ |
| * ముక్తిగీత | 0_ 6_ |
| రాధారహస్యము (40 గ్రంథములసారము) | 1_ 4_ |
| శంకరగ్రంథరత్నావళి(300 పే) (ఉపదేశప్రకరణగ్రంథములు 40) | 3_0_ |
| * శ్రీరామపూజా విధానము | 0_ 4_ |
| శ్రీకాళహస్తీశ్వరశతకము | 0_ 8_ |
| * శ్రీసీతారామ శతకము | 0_ 2_ |
| * శ్రీత్యాగరాజ చరిత్ర | 0_ 4_ |
| * శ్రీరామనామ ప్రభావము | 0_ 6_ |
| శ్రీశుకుడు | 0_12_ |
| శ్రీత్రిపురాంతకేశ్వరశతకము | 0_ 4_ |
| * సప్తమహావ్రతములు | 0_ 6_ |
| సిద్ధాంత కల్పవల్లి | 1_ 0_ |
| సంకీర్తన మీమాంస | 1_ 0_ |
| హరినామ మహిమ శతకము | 0_ 4_ |
| * హిందూకోడ్ బిల్ సమీక్ష | 1_ 0_ |

గమనిక:– రు 1 కు లోపు వి. పి. లేదు. రు 5/_లకు మించిన ఆర్డరుకు రు 1 కి 0_3_0, రు 25/- లకు రు 1 కి 0_4_0 లు, రు 100/- లకు రు 33/- లు కమీషను యివ్వబడును. సమర్థులగు ప్రచారకులు కావలయును.

☞ పై గ్రంథములన్నియు ఒకేసారి తీసుకొనిన రు. 100 కి రు. 33 లు కమీషను. ఈ అవకాశము కొలదిరోజులే.

మీ ఆర్డరు యిచ్చునప్పటికి ఉన్న గ్రంథములే పంపబడును. వి. పి [illegible] ప్రార్థన.

శ్రీ రామ శరణ్

# కుందుర్తి వేంకటనరసయ్యగారి

## ప్రచురణలు

| | |
|---|---|
| శ్రీరామ మంత్రానుష్ఠానము | 2-8-0 |
| భాగవతకథ 1, 2, 3, 4 భా॥ భా 1కి | 2-0-0 |
| నవవిధ భక్తులు | 1-8-0 |
| కలిసంతరణోపనిషత్తు (వ్యాఖ్యానము) | 1-0-0 |
| సంకీర్తన మీమాంస | 1-0-0 |
| భారతీయ దర్శనము | 1-8-0 |
| పరమార్థ తత్త్వము | 0-12-0 |
| అర్థ పంచకము | 0-10-0 |
| నరసదాసు సంకీర్తనలు | 0-10-0 |
| ధ్యానపద్ధతి | 0-8-0 |
| ప్రణవ ప్రభావము | 0-6-0 |
| శ్రీరామనామ ప్రభావము | 0-6-0 |
| బ్రహ్మచర్యము | 0-6-0 |
| ఆధ్యాత్మిక సాధనక్రమము (1 [illegible] | [illegible] |
| అనుష్ఠాన క్రమము | [illegible] |
| భగవన్నామ ప్రభావము | [illegible] |
| శ్రీరామపటలము | [illegible] |
| తత్త్వత్రయము | [illegible] |
| గురుపూజా విధానము | [illegible] |
| శ్రీరామ పూజావిధానము | [illegible] |
| ప్రశ్నోత్తరి | [illegible] |

ప్రాప్తిస్థానం:

**శ్రీరామశరణమందిరం**

బుద్ధాం, కర్లపాలెం పో

(గుంటూరు జిల్లా)



# భాగవతకథ

"భగవద్దర్శన ముఖ్యసాధనభూతమగు నీ భాగవతదర్శనము నాంధ్రు లెల్లరును పఠించి ధన్యులగుదురు గాక." — శ్రీ చిరంతనానందస్వామి

"... మీరు భక్తలోకమునకు దీనిద్వారా మహోపకారం చేసినారు. భగవంతుడు సర్వధా మీకు శ్రేయః ప్రదాత యగుగాక."

— శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

"... ఈ గ్రంథము ఎట్టి కఠిన హృదయులనైనను మనోభావముల మార్చి శ్రీకృష్ణభక్తి పరవశులఁ జేయఁజాలును. ..."

— మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులవారు.

"ఈ గ్రంథము ... చదివిన కొలది చవులూర మృదుమధుర భావ, భాషా, కథావిలసితమై మూల భాగవతమునకు సంపూర్ణముగా న్యాయము చేయుచున్నది." — శ్రీ జటావల్లభుల పురుషోత్తము.

"ఈ గ్రంథ మొక విశ్వదర్పణము, ఇం దన్నియు నుండును. ... ఈ గ్రంథము ప్రతిగృహమున ఉండతగినది. ప్రతి వీధిలో నిది ప్రతిధ్వనింప వలయును" — జమ్ములమడక మాధవరామశర్మ.

"శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు భాగవతమునందలి మనోహరము ...గు ఘట్టముల నత్యద్భుతముగ ప్రత్యక్షముగ నేత్రములకు గోచరించునట్లు ...ించిరి."

— విశ్వమీమాంస.